# నివేదిక

**ఆళ్వార్కళ్ వాళ్ అరుళిచ్చెయల్ వాళ్**
**తాళ్వాదు మిల్ కురవర్తామ్ వాళ్- ఏళ్ పారు**
**ముయ్య అవర్కళురైత్త వైకళ్ తామ్ వాళ్**
**శెయ్య మఱై తన్నుడనే శేర్న్దు** (ఉపదేశరత్తినమాలై-3)

(ఆళ్వార్లకు మంగళం. వారి శ్రీసూక్తులకు మంగళం. ఏ దోషం లేని పూర్వా చార్యులకు మంగళం. ఏడు లోకాలు ఉజ్జీవించేటట్లు వారు చేసిన వ్యాఖ్యలకు ఋజువైన వేదంతో పాటుగా మంగళం.)

ఆళ్వార్లు అని, దివ్యసూరులని కీర్తింపబడే భగవద్భక్తులు వెలయించిన, లక్ష్మీనారాయణపారమ్యాన్ని ప్రతిపాదించే తమిళసాహిత్యమే నాలాయిరదివ్య ప్రబంధం. ఇంచుమించు నాల్గు వేల పాశురాలను కల్గి ఉన్నందున ఈ సాహిత్యానికి ఈ పేరు వచ్చింది. సంస్కృతవేదంలో తెలుపబడే తత్త్వాలను ఆళ్వార్లు తమ ప్రబంధాలలో సుస్పష్టంగా, సుమధురంగా తెలిపినందువల్ల నాలాయిరదివ్య ప్రబంధ వాఙ్మయం శ్రీవైష్ణవ సంప్రదాయంలో ద్రావిడవేదంగా ప్రసిద్ధిచెందింది. ముదలాళ్వార్ల ప్రబంధాలతో ప్రారంభమైన ఈ సాహిత్యం చివరివారైన తిరుమఙ్గై ఆళ్వార్ల ప్రబంధాలతో పూర్ణరూపాన్ని సంతరించు కొన్నది. ఈ నాలాయిరదివ్యప్రబంధవాఙ్మయంలో మొత్తం 24 ప్రబంధా లున్నాయి. ఈ ప్రబంధాలు నాల్గు ఆయిరాలు (వేలు) గా వర్గీకరింపబడ్డ వివరం ఈ విధంగా ఉన్నది.

**మొదటి ఆయిరం** (ముదలాయిరమ్)

1. పల్లాణ్డు- పెరియాళ్వార్లు
2. పెరియాళ్వార్ తిరుమొళి - పెరియాళ్వార్లు
3. తిరుప్పావై - ఆణ్డాళ్
4. నాచ్చియార్ తిరుమొళి - ఆణ్డాళ్
5. పెరుమాళ్ తిరుమొళి- కులశేఖరాళ్వార్

6. తిరుచ్చన్దవిరుత్తమ్ - తిరుమழிశైప్పిరాన్
7. తిరుమాలై - తొణ్డరడిప్పొడి ఆழ்వార్లు
8. తిరుప్పళ్ళిఎழுచ్చి - తొణ్డరడిప్పొడి ఆழ்వార్లు
9. అమలనాదిపిరాన్- తిరుప్పాణ్ ఆழ்వార్లు
10. కణ్ణినుణ్ శిఱుత్తాम్బు- మధురకవి ఆழ்వార్లు

2. రెండవ ఆయిరం- పెరియ తిరుమొழி

11. పెరియతిరుమొழி - తిరుమఙ్గై ఆழ்వార్లు
12. తిరుక్కుఱున్దాణ్డకమ్ - తిరుమఙ్గై ఆழ்వార్లు
13. తిరునెడున్దాణ్డకమ్ - తిరుమఙ్గై ఆழ்వార్లు

3. మూడవ ఆయిరం- ఇయఱ్పా

14. ముదల్ తిరువన్దాది- పొయ్‌గై ఆழ்వార్లు
15. ఇరణ్డామ్ తిరువన్దాది- పూదత్తాழ்వార్లు
16. మూన్ఱామ్ తిరువన్దాది- పేయాழ்వార్లు
17. నాన్ముకన్ తిరువన్దాది- తిరుమழிశైప్పిరాన్
18. తిరువిరుత్తమ్ - నమ్మాழ்వార్లు
19. తిరువాశిరియమ్ - నమ్మాழ்వార్లు
20. పెరియ తిరువన్దాది - నమ్మాழ்వార్లు
21. తిరువెழுకూఱ్ఱిరుక్కై - తిరుమఙ్గై ఆழ்వార్లు
22. శిఱియ తిరుమడల్ - తిరుమఙ్గై ఆழ்వార్లు
23. పెరియతిరుమడల్ - తిరుమఙ్గై ఆழ்వార్లు

4. నాల్గవ ఆయిరం -

24. తిరువాయ్‌మొழி - నమ్మాழ்వార్లు

ఈ రీతిలో 24 ప్రబంధాలను నాల్గు ఆయిరాలుగా విభాగించి, కూర్చిన వారు నాథమునులు. ఈ కూర్పులో ఒక సాంప్రదాయికమైన క్రమం పాటింపబడింది - అనేది గమనించదగిన విషయం. దీనిని శ్రీపిళ్ళైలోకమ్‌జీయర్. **"వాయ్‌త్త తిరుమన్దిరత్తిన్"** అనే ఉపదేశరత్తినమాలై పాశుర (26) వ్యాఖ్యలో-



"వేదానికి ప్రణవం ఆది అయినట్లే, ప్రణవార్థాన్ని ప్రతిపాదించే పల్లాణ్డునుండి అమలనాదిపిరాన్‌వరకు గల ప్రబంధాలు ప్రణవార్థాన్ని ప్రతిపాదిస్తున్నాయని, కణ్ణినుణ్ శిఱుత్తాम్బు నమశ్శబ్దార్థ ప్రతిపాదకమని, ఆ తరువాత రెండవ ఆయిరంలోని పెరియతిరుమొழிనుండి మూడవ ఆయిరం అయిన ఇయఱ్పాలో చివరలో గల శిఱియ తిరుమడల్‌వరకు గల ప్రబంధాలు నారాయణ శబ్దార్థంగా, కైంకర్యత్వసూచకం అయిన చతుర్థీవిభక్త్యర్థంగా అనుసంధింప వచ్చుకదా" అని వివరించారు. తిరువాయ్‌మొழி ద్వయార్థప్రతి పాదకం. ఈవిధంగా ఈ ఇరవై నాల్గు ప్రబంధాల కూర్పులో అష్టాక్షరి, ద్వయ మంత్రార్థాత్మకం అయిన ఒక క్రమం పాటింపబడిందన్న విషయం సాంప్రదాయికమైన అంశం.

ఈ విషయం పెరియతిరుమొழி ప్రబంధానికి పెరియవాచ్చాన్‌పిళ్ళై అనుగ్రహించి వ్యాఖ్యానానికి పూర్వాచార్యులు రచించిన అరుంబదం (కఠినపద వివరణం)లోకూడా- **"ఇవై ఇత్తనైయాలుమ్ తిరుమంత్రత్తిల్ ప్రణవ నమస్సుక్కళిల్ అర్థఙ్గళ్ ప్రాధాన్యేన ప్రతిపాదిక్కప్పడుకైయాలే, తత్ స్థానీయమాన ముదలాయిరత్తై త్తిరువుళ్ళత్తిల్ వైత్తుక్కొణ్డు, తృతీయపదస్థానే యాన తిరుమొழிక్కు"** అని తెలుపబడింది. ఈ ఇరవైనాల్గు ప్రబంధాలతో పాటు, భగవద్రామానుజుల వైభవాన్ని కీర్తిస్తూ తిరువరఙ్గత్తముదనార్ ప్రసాదించిన ఇరామానుశ నూఱ్ఱన్దాది ప్రబంధం శ్రీరంగనాథుని ఆజ్ఞతో, భగవద్రామానుజుల అనుజ్ఞతో ఇయఱ్పా - అనే మూడవ ఆయిరం చివరలో చేర్చబడింది. అయితే, దీనిని పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానించకపోవడం గమనార్హం.

ఇది ఆర్థికమైన పౌర్వాపర్యం. ఇక, కాలాన్ని బట్టి చూస్తే పౌర్వాపర్యం వేఱు విధంగా కన్పిస్తుంది. ముదలాழ்వార్లుగా చెప్పబడే సరోయోగి, భూతయోగి, మహాయోగి, తిరుమழிశైప్పిరాన్- అనే నల్గురు ద్వాపర యుగాంతంలో ఆవిర్భవించగా, మిగిలినవారు అందఱు కలియుగంలో అవతరించారు. అందువల్ల కాలాన్ని అనుసరించి ముదలాழ்వార్ల ప్రబంధాలు మొదటి స్థానాన్ని

అలంకరిస్తాయి. ఈ అంశాన్ని శ్రీమద్వరవరమునులు ఉపదేశరత్తినమాలై ప్రబంధంలో "మఱ్ఱుళ్ళ ఆఴ్వార్కళుక్కు మున్నే వన్దుదిత్తు నఱ్ఱమిఴాల్ నూల్ శెయ్దు నాట్టై ఉయ్త్త- పెఱ్ఱిమైయోర్ ఎన్ఱు ముదలాఴ్వార్కళ్ ఎన్నుమ్ పెయర్ ఇవర్క్కు నిన్నదులకత్తే నికఴ్న్దు" అనే పాశురంలో తెలుపగా, శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ దీనిని "ఆఴ్వార్కళ్ పదిన్ మరిల్ వైత్తుక్కొణ్డు తాజ్గళ్ మూవరుమ్ ప్రణవమ్బోలే యాయ్త్తు ప్రధానరాయిరుప్పతు. ఇవర్కళ్తానే ద్వాపరయుగాంతత్తుక్కుమ్, కలియుగా దిక్కుమ్ నడువుణ్డాన సంధియిలే యాయ్త్తు అవతీర్ణరానదు. అత్తై ప్పఱ్ఱ 'మున్నే' ఎన్ఱు ప్రథమ రాకప్పేశుకిఱతు...... "శెఞ్జొల్క్క వికాళ్" ఎన్ఱుమ్, "శెన్దమిఴ్ పాడువార్" ఎన్ఱుమ్, "ఇన్కవిపాడుమ్ పరమకవికళాల్" ఎన్ఱుమ్ కొణ్డాడుమ్బడి యిటే ఇతిన్ నన్మై యిరుప్పదు...... ఇత్తాల్- ఇవర్కళుడైయ "జన్మనా విద్యయా చ" ఎన్గిఱదాన ప్రాథమ్యమానదు ప్రకాశిప్పిక్కప్పట్టదాయ్త్తు" అని వ్యాఖ్యానించారు. చరిత్రకారుల, సాహిత్య పరిశోధకుల దృష్టిలో అయితే ఈ ముదలాఴ్వార్లు క్రీ.శ. 4-5 శతాబ్దం మధ్యకాలానికి చెందినవారు. చివరి ఆఴ్వార్లు తిరుమజ్గై ఆఴ్వార్లు 7-8 శతాబ్దాల కాలానికి చెందినవారు. అందువల్ల చారిత్రకుల, సాహిత్యవిమర్శకుల అభిప్రాయానుసారం ఈ నాలాయిరదివ్యప్రబంధ వాఙ్మయం రూపుదిద్దుకోవడానికి సుమారు అయిదు, ఆఱువందల సంవత్సరాలకాలం పట్టింది. ఈ పౌర్వాపర్యాన్ని భాషాదృష్టిలో, శైలిదృష్టిలో కూడా గమనింపవచ్చు. ముదలాఴ్వార్ల ప్రబంధాలు అన్నీ అంతాదులై ఉండడం, వాటిలో శబ్దాడంబరంకంటే, అర్థగాంభీర్యానికే ప్రాధాన్యం ఇవ్వబడడం, నైసర్గికాలైన ఉపమాద్యలంకారాల ప్రయోగం, అతిసులభమైన వెణ్బాఛందస్సులో రచింపబడడం- వంటి కారణాలను ఈ విషయంగా చూపవచ్చు. చివరివారైన తిరుమజ్గై ఆఴ్వార్ల ప్రబంధాలలో శబ్దాడంబరం ప్రచురంగా కన్పించడం సుస్పష్టం. సంస్కృతసాహిత్యంలో కూడా వాల్మీకి, వ్యాస, కాళిదాస, భాసాది పూర్వకవుల శైలికి, మాఘుడు, భార్గవి మొదలైన తదనంతర కాలిక కవుల శైలికి మధ్య చాలా తారతమ్యం ఉన్నది కదా! అని సాహిత్య విమర్శకుల భావన. ఇక, ఈ మూడు ప్రబంధాల మధ్యగల సామ్యాలు అనేకం, అవతారాలలో



త్రివిక్రమావతారానికి ప్రాధాన్యం, యశోదాదేవి వాత్సల్యాన్ని ప్రశంసించడం, దివ్యదేశాలలో వేంకటాచలానికి ప్రాధాన్యం- ఇత్యాదులు వాటిలో కొన్ని.

ఈ పౌర్వాపర్యాన్ని దృష్టిలో ఉంచుకొని ముందుగా మూడు ముదలాఴ్వార్ల ప్రబంధాలు క్లుప్తమైన వివరణంతో సహృదయప్రపన్న లోకానికి సమర్పింపబడుతున్నాయి. ఈ ప్రబంధాలకు పెరియ వాచ్చాన్‌పిళ్ళై అనుగ్రహించిన నాతివిస్తృతమైన గంభీరవ్యాఖ్య, మణవాళమహామునుల శిష్యులు అప్పిళ్ళై అనుగ్రహించిన ప్రతిపదార్థవివరణాత్మకం అయిన ఉరై ఉన్నాయి. ఇటీవలికాలంలో చెన్నైనుండి వెలువడే "గీతాచార్యన్" అనే శ్రీవైష్ణవ సాంప్రదాయిక తమిళమాసపత్రికలో నమ్బిళ్ళై కర్తృకంగా ఈడువ్యాఖ్య ఒకటి ముదల్ తిరువన్దాదికి ప్రచురింపబడింది. ఈ మాసపత్రికా సంపాదకులు శ్రీమాన్. ప్రొ. ఎం. వేంకటకృష్ణన్ స్వామివారు దీనినిగూర్చి తెలుపుతూ, ఇది ఇంతకాలం వెలుగు చూడకుండా మద్రాస్ ప్రాచ్యలిఖిత భాండాగారంలో ఉన్నట్లు, దానిని తాము ప్రప్రథమంగా ముద్రిస్తున్నట్లు, ఈ రీతిలోనే మిగిలిన రెండు అందాది ప్రబంధాలకు కూడా ఇంతవరకు ముద్రింపబడని నమ్బిళ్ళై ఈడువ్యాఖ్య ఉన్నట్లు తెలియజేశారు.

ఈ ముదలాఴ్వార్ల మూడు ప్రబంధాలలో కన్పించే కొన్ని విశేషాలు **"ముదలాఴ్వార్ల సూక్తి వైభవమ్"** అనే వ్యాసంలో సంగ్రహంగా విన్నపింపబడ్డాయి. రత్నాకరాలవంటి ఈ ప్రబంధాలలోని అమూల్యాలైన విశేషాలను సంపూర్ణంగా తెలిపే శక్తి, సామర్థ్యాలు అభిజ్ఞులు, మహనీయులైన పూర్వాచార్యులకు తప్ప ఇంకెవరికి సాధ్యం? అయినా, **"యావానర్థ ఉదపానే"** అనే రీతిలో యథాశక్తి విన్నపింపబడ్డాయి. సహృదయులు వాత్సల్యంతో స్వీకరిస్తారని నమ్ముతున్నాను.

## పొయ్‌కై ఆఴ్వార్లు - తనియన్

1. **తులాయాం శ్రవణే జాతం కాంచ్యాం కాంచనవారిజాత్ ।**
**ద్వాపరే పాంచజన్యాంశం సరోయోగిన మాశ్రయే ॥**

(ద్వాపరయుగంలో శ్రవణానక్షత్రంలో కంచికి సమీపంలోని తిరువెంంికా అనే దివ్యక్షేత్రంలో స్వర్ణకమలంలోనుండి భగవానుని పాంచజన్యమనబడే శంఖం యొక్క అంశం వల్ల అవతరించిన పొయ్‌కై ఆఴ్వార్లను ఆశ్రయిస్తున్నాను.)

2. **కాంచ్యాం సరసి హేమాబ్జే జాతం కాసారయోగినమ్ ।**
**కలయే యః శ్రియఃపత్యై రవిం దీప మకల్పయత్ ॥**

(కాంచీనగరంలోని సరస్సులో బంగారు తామరలో జన్మించి, శ్రీమన్నారాయణునకు సూర్యుని దీపంగా వెల్గించిన పొయ్‌కై ఆఴ్వార్లను ధ్యానిస్తున్నాను.)

3. **ముకుందస్య ముఖోల్లాసమూలవాగ్జాల మూర్జితమ్ ।**
**మునిముఖ్యం సరోజాతం ముక్తిమూల ముపాస్మహే ॥**

(ముకుందునకు ముఖోల్లాసాన్ని కల్గించే గొప్ప పాశురాలను పాడినవారు, ఆఴ్వార్లలో ముఖ్యులు (మొదటివారు), తామరపూవునుండి ఉద్భవించినవారు, ప్రపన్నుల ముక్తికి మూలకారణం అయినవారైన పొయ్‌కై ఆఴ్వార్లను ఉపాసిస్తున్నాను.

### వాఴి త్తిరునామమ్ (మంగళాశాసన పాశురం)

శెయ్య తులావోణత్తిల్ శెకత్తుదిత్తాన్ వాఴియే
తిరుకచ్చి మానకరమ్ శెఴిక్కవన్దోన్ వాఴియే
వైయమ్ తకళి నూఱుమ్ వకుత్తురైత్తాన్ వాఴియే
వనశమలర్ క్కరువదనిల్ వన్దమైన్దాన్ వాఴియే
వెయ్య కదిరోన్‌తన్నై విళక్కిట్టాన్ వాఴియే
వేఙ్గడవర్ తిరుమలైయై విరుమ్బువన్ వాఴియే
పొయ్‌కైముని వడివఴకుమ్ పొఱ్పదముమ్ వాఴియే
పొన్ ముడివుమ్ తిరుముకముమ్ పూదలత్తిల్ వాఴియే



(అందమైన తులామాసం శ్రవణా నక్షత్రంలో ఈ జగత్తులో ఉదయించిన వారికి మంగళం. కాంచీనగరం ప్రకాశించేటట్లు అవతరించినవారికి మంగళం. **“వైయమ్ తకళి”** అని ప్రారంభించి నూఱు పాశురాలను అనుగ్రహించినవారికి మంగళం. తామర పూవు అనే తల్లి గర్భంలో ఉన్నవారికి మంగళం. భగవానునకు వేడి కిరణాలను కల సూర్యుని దీపంగా చేసినవారికి మంగళం. శ్రీ వేంకటేశ్వరుని వేంకటాచలాన్ని విశేషంగా ఆదరించేవారికి మంగళం. పొయ్‌కై ఆఴ్వార్ల రూపసౌందర్యానికి, బంగారంవలె అందమైన వారి శ్రీచరణాలకు మంగళం. వారి బంగారు కిరీటానికి, తిరుముఖానికి ఈ లోకంలో మంగళం.)

### పూదత్తాఴ్వార్లు- తనియన్

1. **తులాధనిష్ఠాసంభూతం భూతం కల్లోలమాలినః ।**
**తీరే పుల్లోత్పలే మల్లపుర్యా మీడే గదాంశజమ్ ॥**

(తులామాసంలో ధనిష్ఠా నక్షత్రంలో సముద్ర తీరంలో ఉండే తిరుక్కడల్ మల్లై అనే దివ్యదేశంలో పూచిన నల్లకలువలోనుండి భగవానుని కౌమోదకి అనే గదయొక్క అంశతో అవతరించిన పూదత్తాఴ్వార్లను స్తుతిస్తున్నాను.)

2. **మల్లాపురపురాధీశం మాధవీకుసుమోద్భవమ్ ।**
**భూతం నమామి యో విష్ణోః జ్ఞానదీప మకల్పయత్ ॥**

(పరమపురుషునకు జ్ఞానాన్ని దీపంగా వెలిగించినవారు, తిరుక్కడల్ మల్లై అనే దివ్యక్షేత్రంలో అవతరించినవారైన పూదత్తాఴ్వార్లను నమస్కరిస్తున్నాను.)

### వాఴిత్తిరునామమ్ (మంగళాశాసన పాశురం)

“అన్బే తకళి” నూఱుమ్ అరుళినాన్ వాఴియే
ఐప్పశియిల్ అవిట్టత్తిల్ అవతరిత్తాన్ వాఴియే
నన్‌పుకఴ్ శేర్ కురుక్కత్తి నాణ్ మలరోన్ వాఴియే
నల్ల తిరుక్కడన్‌మల్లై నాదనార్ వాఴియే
ఇన్బురుకు శిన్దై తిరి ఇట్ట పిరాన్ వాఴియే
ఎఴిల్ ఞానచ్చుడర్ విళక్కై ఏఱ్ఱినాన్ వాఴియే

పొన్ పుఱైయుమ్ తిరువరజ్గర్ పుకౘ్యురైప్పోన్ వాౘ్యియే
పూదత్తార్ తాళిణై ఇప్పూదలత్తిల్ వాౘ్యియే

("అన్బే తకళి" అని ప్రారంభమయే నూఱు పాశురాలను అనుగ్రహించిన వారికి మంగళం. అల్పిశి (ఆశ్వయుజ) మాసంలో ధనిష్ఠానక్షత్రంలో అవతరించినవారికి మంగళం. గొప్ప కీర్తిని కల వారికి, మాధవీ పుష్పంలో అవతరించిన వారికి మంగళం. "ఇన్బురుకు (భగవానుని కల్యాణ గుణాల భోగ్యత వల్ల ద్రవించే మనస్సును) శిన్దై"ను వత్తిగా చేసిన స్వామికి మంగళం. ప్రకాశించే జ్ఞానదీపాన్ని వెల్గించినవారికి మంగళం. శ్రీరంగనాథుని కీర్తిని పాడినవారికి మంగళం. పూదత్తాౘ్వార్ల శ్రీచరణాలకు రెండిటికి ఈలోకంలో మంగళం.)

పేయాౘ్వార్ల తనియన్

1. తులాశతభిషగ్జాతం మయూరపురి కైరవాత్ ।
మహాంతం మహదాఖ్యాతం వందే శ్రీనందకాంశజమ్ ॥

(అల్పిశి (ఆశ్వయుజ) మాసంలో శతభిషక్ నక్షత్రంలో ఒక బావిలోని ఎఱ్ఱ తామర పూవునుండి మయూరపురిలో భగవానుని నందకం- అనే ఖడ్గంయొక్క అంశతో అవతరించిన పేయాౘ్వార్లను నమస్కరిస్తున్నాను)

2. దృష్ట్వా హృష్టం తదా విష్ణుం రమయా మయిలాధిపమ్ ।
కూపే రక్తోత్పలే జాతం మహాయోగిన మాశ్రయే ॥

(లక్ష్మితో కూడి ఉండే నారాయణుని దర్శించి పరమానందాన్ని పొందినవారు, బావిలోని ఎఱ్ఱ తామరపూవునుండి ఉద్భవించినవారైన మహా యోగిని ఆశ్రయిస్తున్నాను.)

వాౘ్యి త్తిరునామమ్ (మంగళాశాసన పాశురం)

"తిరు క్కణ్డేన్" ఎన్ఱుమ్ నూఱుమ్ శెప్పినాన్ వాౘ్యియే
శిఱన్ద ఐప్పశియిల్ శతయమ్ శెనిత్త వళ్ళల్ వాౘ్యియే
మరు క్కమౘ్యుమ్ మయిలైనకర్ వాౘ్య వన్దోన్ వాౘ్యియే
మలర్క్కరియ నెయ్తల్తనిల్ వన్దుదిత్తాన్ వాౘ్యియే



నెరుక్కిడవే ఇడై కౘ్యియిల్ నిన్ఱ శెల్వన్ వాౘ్యియే
నేమిచ్చజ్గన్ వడివౘ్యకై నెజ్జిల్ వైప్పోన్ వాౘ్యియే
పెరుక్కముడన్ తిరుమౘ్యిశైప్పిరాన్ తొౘ్యువోన్ వాౘ్యియే
పేయాౘ్వార్ తాళిణై ఇప్పెరునిలత్తిల్ వాౘ్యియే

"తిరు క్కణ్డేన్" అనే నూఱు పాశురాలను పాడినవారికి మంగళం. గొప్ప అల్పిశిమాసంలో శతభిషక్ నక్షత్రంలో అవతరించినవారికి మంగళం. పరిమళం గుబాళించే మయిలాపురి ఉజ్జీవించేటట్లు అవతరించినవారికి మంగళం. ఎఱ్ఱ తామరపూవులో అవతరించినవారికి మంగళం. తిరుక్కోవలూర్‌లోని ఇంటివసారాలో భగవానునిచేత సంమర్దం కల్గించబడ్డ భాగ్యవంతునకు మంగళం. శ్రీసుదర్శన శ్రీపాంచజన్యధారి అయిన భగవానుని సౌందర్యాన్ని మనస్సులో స్మరించేవారికి మంగళం. భక్తితో తిరుమౘ్యిశై ప్పిరాన్‌చే సేవింప బడేవారికి మంగళం. ఈ విశాలమైన భూలోకంలో పేయాౘ్వార్ల శ్రీచరణాలు రెండిటికి మంగళం.



# ముదలాఴ్వార్ల వైభవం

అయోనిజులై అవతరించిన పొయ్‌కై ఆఴ్వార్లు, పూదత్తాఴ్వార్లు, పేయాఴ్వార్లు అనే ముదలాఴ్వార్లు ముగ్గురు భగవానుని నిర్హేతుక కటాక్షంవల్ల భ్రమవిప్రలంభాది దోషరహితమైన జ్ఞానాన్ని పూర్ణంగా పొందినవారై, భగవత్కైంకర్యంలో అభినివేశాన్ని కల్గినవారయ్యారు. పరిపూర్ణ జ్ఞానభక్తి వైరాగ్యాల్ని కల్గిన వీరు తమకు ధారకపోషక భోగ్యాలన్నీ భగవద్గుణానుభవమే అని భావించి వర్తించేవారై, లౌకిక భోగాల పట్ల ఆసక్తిని కల లోకులతో సంబంధాన్ని వీడి, గ్రామైకరాత్రంగా ఒక్కొక్కదినం ఒక్కొక్కచోటకు ప్రయాణం చేస్తూ దేశ సంచారాన్ని చేశారు. వీరు ముగ్గురు చిరకాలం ఒకొకరికొకరు తెలియకుండా భగవదనుభవంతో కాలం గడుపుతుండగా, వీరిని ముగ్గురిని కలిపి, వీరిద్వారా మూడు దివ్యప్రబంధాలను అవతరింపజేసి, లోకాన్ని ఉజ్జీవింపజేయదలచాడు, భగవానుడు. తదనుసారంగా ఒకనాడు తిరుక్కోవలూర్ అనే దివ్యక్షేత్రంలో వీరు ముగ్గురు పరస్పరం కలసికొనే సందర్భం తటస్థపడింది. ఒకనాడు మొదటగా ఆ క్షేత్రానికి వచ్చిన సరోయోగి అక్కడ ఉండే మృకండుముని  ఆశ్రమంలోని చావిడిలో రాత్రివేళ వర్షం కారణంగా విశ్రమించి శయనించారు. కొంతసేపటికి అక్కడికి భూతయోగి వచ్చి, తమకు కూడా అక్కడ విశ్రమించడానికి చోటు ఇమ్మని సరోయోగిని అడిగాడు. "ఇక్కడ ఒకరు పరుండవచ్చు, ఇద్దరు కూర్చుండవచ్చు'' అని అంటూ సరయోగి భూతయోగిని లోపలకు ఆహ్వానించారు. వారిద్దరు అక్కడ కూర్చొని భగద్గుణానుభవంతో కాలక్షేపం చేస్తుండగా, మరికొంత సేపటికి మహాయోగి అక్కడికివచ్చారు. తమకు కూడా తలదాచుకోవడానికి చోటు ఇమ్మని మహా యోగి అడుగగా, సరోయోగి, భూతయోగి "ఇక్కడ ఒకరు శయనించవచ్చు, ఇద్దరు కూర్చుండ వచ్చు; ముగ్గురు నిలబడి ఉండవచ్చు; లోపలికి రండి'' అని మహాయోగిని ఆశ్రమంలోకి ఆహ్వానించారు. ఈవిధంగా ముదలాఴ్వార్ల ముగ్గురు పరస్పరం కలసికొని, భగవానుని గుణాలను గూర్చి పల్కుతూ కాలక్షేపం చేయసాగారు.

మహాజ్ఞాననిధులైన వీరితో దేహసంబంధాన్ని పొందగోరిన భగవానుడైన శ్రీమన్నారాయణుడు వారి మధ్యలో ప్రవేశించి సమ్మర్దాన్ని కలిగించాడు. ఈ విధంగా తమకు సమ్మర్దాన్ని కలుగజేసిన వ్యక్తి ఎవరో తెలిసికోదలచిన



పొయ్‌గైఆఴ్వార్లు **"వైయమ్ తగళియా వార్‌కడలే నెయ్యాక వెయ్య కదిరోన్ విళక్కాక"** (భూమిని ప్రమిదగా, విశాలమైన సముద్రాన్ని నేయిగా, వేడి కిరణాలు కల సూర్యుని దీపంగా చేసి) అని అంటూ ఆరంభించి తమ ప్రబంధమైన ముదల్ తిరువన్దాదిని  పాడి, బాహ్య దీపాన్ని వెలిగించారు.  తరువాత రెండవ ఆఴ్వార్లు అయిన పూదత్తాఴ్వార్లు, వేదార్థాలను అందమైన ద్రావిడభాషలో కూర్చి, **"అన్బే తకళియా ఆర్వమే నెయ్యాక ఇన్బురుకు శిన్దై యిడు తిరియా, నన్బురుకి ఞానచ్చుడర్ విళక్కేఱ్ఱినేన్ నారణఱ్కు"** అని అంటూ ఆరంభించి తమ ప్రబంధమైన ఇరణ్డామ్ తిరువన్దాది పాడి, భగవానున్ని దర్శించడానికి అడ్డుగా ఉండే హృదయంలోని అంధకారాన్ని  తరిమికొట్టారు. ఈవిధంగా సరోయోగి, భూతయోగి వెలిగించిన రెండు దివ్యదీపాల వెలుగులో శ్రీమన్నారాయణుని దర్శించిన మహాయోగిని, **"తిరు క్కణ్డేన్ పొన్‌మేని కణ్డేన్"** అని అంటూ ప్రారంభించి మూన్డామ్ తిరువన్దాది అనే తమ ప్రబంధాన్ని పాడి దివ్యదంపతు లను తాము దర్శించడమే కాక, ఇతరులను కూడా దర్శింపజేశారు. సరోయోగి ఈ వృత్తాంతాన్ని తమ ప్రబంధాన్ని **"నీయుమ్ తిరుమకళుమ్ నిన్డాయాల్"** (86) అనే పాశురంలో ఈ వృత్తాంతాన్ని ప్రస్తావించారు. ఈ విధంగా ముదఴ్వార్లు ముగ్గురు లోకోజ్జీవనం కలిగేటట్లుగా మూడు అన్దాది ప్రబంధాలను లోకానికి అందించి, సర్వేశ్వరుడైన శ్రీమన్నారాయణుని స్వరూప రూప గుణవిభూతులను తాము దర్శించడమే కాక, లోకానికి దర్శింపజేసిన మహో దారులు.

ఆ తర్వాత ఈ ఆఴ్వార్లు ముగ్గురు తిరుక్కోవలూర్ క్షేత్రంలోని స్వామి అయిన దేహళీశుని అనుజ్ఞతో చిరకాలం పలుచోట్లకు యాత్రచేసి, తిరుమఴిశై క్షేత్రాన్ని చేరారు. అక్కడ తిరుమఴిశై ప్పిరాన్‌ను కలిసారు. తర్వాత కొంతకాలం అక్కడ యోగానుష్ఠానాన్ని చేసి, యోగబలంవల్ల చిరకాలం జీవించారు. చివరగా తిరుక్కోవలూర్‌ను చేరి అక్కడే పరమపదప్రాప్తిని పొందారు. మిగిలిన ఆఴ్వార్లు అందరికంటే ముందుగా అవతరించి, వారికి మార్గ దర్శకులై, దివ్యప్రబంధాలను మునుముందుగా పల్కిన మహిమవల్ల వీరికి ముగ్గురికి ముదలాఴ్వార్లు అనే పేరు ప్రసిద్ధమైనది - అని శ్రీవరవరమునులు ఉపదేశ రత్తినమాలై అనే ప్రబంధంలో తెలియజేశారు.

ఇక, వీరి ప్రబంధాలలోని వైలక్షణ్యం ప్రత్యేకంగా వివరింపబడుతున్నది.

# ముదలాళ్వార్ల ప్రబంధ సూక్తివైభవము

భగవానుడైన శ్రీమన్నారాయణుని పరిపూర్ణానుగ్రహమునకు పాత్రులై, **"మయఱ్వఱ మదినలమ్"** అను రీతిలో ఎట్టి భ్రమ, విప్రలంభాది దోషములు లేని భక్తిరూపాపన్న జ్ఞానమును పొందిన దివ్యసూరులలో **"ముదలావార్ మూవర్"** అనునట్లు వారి కాలమునుబట్టి, ప్రబంధవైలక్షణ్యమునుబట్టియు, భాషా, శైలిని బట్టియు మొదటివారుగా కీర్తింపబడు సూరిత్రయమునందు సరోయోగి మొదటివారు; భూతయోగి రెండవారు, మహాయోగి మూడవవారు. వీరికే సంప్రదాయమునందు పొయ్‌కై ఆళ్వార్లు, పూదత్తాళ్వార్లు, పేయాళ్వార్లు- అని పేరు. సరోయోగి- కాంచీపురమున పాంచజన్యాంశముతో తులామాసము శ్రవణానక్షత్రములో, భూతయోగి- తిరుక్కడల్ మల్లై (మహాబలిపురము)లో కౌమోదకి అను భగవానుని గదయొక్క అంశతో, ఆ మాసముననే ధనిష్ఠా నక్షత్రములో, మహాయోగి- ఇప్పటి మద్రాస్ నగరములోని మయిలాపురిలో అదే మాసమున శతభిషఙ్నక్షత్రములో అవతరించిరి. ఈ ముగ్గురును ద్వాపర యుగాంతమున అవతరించిన సమకాలీనులు - అని సంప్రదాయ చరిత్ర గ్రంథములు పేర్కొనగా, తమిళసాహిత్య చరిత్ర క్రీ.శ.4-5 శతాబ్దాలకు చెందిన వారని పేర్కొనుచున్నది. సరోయోగి ముదల్ తిరువన్దాదిని, భూతయోగి ఇరణ్డామ్ తిరువన్దాదిని, మహాయోగి మూన్ఱామ్ తిరువన్దాదిని అనుగ్రహించిరి. ఇవి ఒక్కొక్కటి నూఱు వెణ్బావృత్తనిబద్ధములైన, మధురములైన పాశురములను కల్గినవై, నాలాయిర దివ్యప్రబంధములో **"ఇయఱ్పా"** అనబడు తృతీయ సహస్రమునందు అంతర్భవించు చున్నవి. ఈ మూడు దివ్యప్రబంధములందు శ్రీవైష్ణవ సిద్ధాంతమునకు సంబంధించిన పలు తత్త్వములు మధురమైన శైలిలో ప్రతిపాదింపబడినవనుటను పూర్వాచార్యులు తమ వ్యాఖ్యాన సూక్తుల ద్వారా నిరూపించిరి. వీరికి పిమ్మట అవతరించిన నమ్మాళ్వార్లు **"శెఞ్జొఱ్కవికాళ్"** అని, **"ఓడి త్తిరియుమ్ యోగికళ్"** అని, పరకాలసూరి **"శెన్దమిళ్ పాడువార్"** అనియు వీరిని స్మరించుచు, పొగడిరి. తమ దివ్యప్రబంధములతో వీరు చూపిన మార్గమును మిగిలిన దివ్యసూరులు అనుసరించుటవలన కూడ వీరికి ముదలాళ్వార్లు అను పేరు కల్గెనని పెద్దలందురు. అందువలననే దివ్యసూరు లందఱును శ్రీవైష్ణవసిద్ధాంత తత్త్వములను **"పేశిన్ఱే పేశలల్లాల్"** అను రీతిలో



ఏకగ్రీవముగా పల్కిరని చెప్పబడుచున్నది. ముదలాళ్వార్లు ముగ్గురు తమ యోగాభ్యాస బలముతో పలు సంవత్సరముల కాలము ఈ లీలావిభూతిలో వేంచేసియుండి, **"మణ్ణుయ్య మణ్ణులకిల్ మనిశరుయ్య, వన్ పెరు వానకముయ్య"** అనునట్లు, ఉభయ విభూతులు ఉజ్జీవించునట్లు శ్రీవైష్ణవ ధర్మమును ప్రచారము చేయుచు, ఒకరికొకరు తెలియకనే **"ఓడిత్తిరియుమ్ యోగికళ్"** అని కీర్తింపబడ్డ రీతిలో దేశసంచారమును చేయుచుండిరి. ఒకనాడు రాత్రి వర్షము కారణముగా వారు ముగ్గురు తిరుక్కోవలూర్ అనబడు దివ్యదేశములో ఒక ఇంటి అరుగుపై యాదృచ్ఛికముగా కలిసికొనిరి. భగవానుడు వారి ముగ్గురితో ఒకచోట కలసి కొనుటకు తగిన సమయమును అదియేనని తలచి, లక్ష్మీసహితుడై వారి మధ్యలో ప్రవేశించెను. ఆ చీకటి సమయమున తమ ముగ్గురికంటె వేఱెవ్వరో తమమధ్య ప్రవేశించిరని గమనించిన ముదలాళ్వార్లు, అట్లు తమ మధ్యకు వచ్చినవాడు సాక్షాత్తు పరమాత్మయగు శ్రీమన్నారాయణుడేనని గుర్తించి, ఆ స్వామియొక్క దివ్యరూప గుణలీలలను దర్శించి, ఆనందించి, తాము పొందిన ఆనందాను భవములను వ్యక్తీకరించుట ద్వారా పరతత్త్వనిర్ణయమును చేయుచు మూడు భక్తిరసపుంజములన దగిన దివ్యప్రబంధములను అనుగ్రహించిరి. ఇవి తదనంతర కాలమున ఉద్భవించిన ఆళ్వార్లకు, ఆచార్యులకును కరదీపికలై విలసిల్లుచున్నవి. భట్టనాథుల తిరుప్పల్లాణ్డు దివ్యప్రబంధమువలె భగవానుడు సాక్షాత్కరించిన సమయమున కీర్తించిన వైలక్షణ్యము కూడా ఈ మూడింటికిని కలదు.

**"ముదలాళ్వార్‌క్కు జ్ఞానమ్ పిఱన్దపడి శొల్లిన్ఱు; ఇరువరావార్‌క్కు జ్ఞానమ్ ముఱ్ఱి భక్తియానపడి శొల్లిన్ఱు, మూవరావార్‌క్కు భక్తియుడైయ రాయ్, అవనై యొళ్ళియచ్చెల్లాదవర్‌కళుడైయ సాక్షాత్కారమ్ పిఱన్దపడి శొల్లిన్ఱు"** అనుచు పెరియవాచ్చాన్ పిళ్ళై ముదల్‌తిరువన్దాది వ్యాఖ్యాన ప్రవేశములో ప్రసాదించుటనుబట్టి ముదలాళ్వార్ల తిరువన్దాది ప్రబంధములు మూడింటిలో **"ఇన్ కవి పాడుమ్ పరమ కవికళ్"** అని, వరుసగా జ్ఞాన, భక్తి, సాక్షాత్కార దశలు ప్రతిపాదింపబడినవని తెలియుచున్నది. ముదల్ తిరువన్దాదిలో సరోయోగి **"వైయమ్ తకళియా"** ఇత్యాదిగా భగవానుడు నిత్యవిభూతి, లీలావిభూతులకు స్వామి అని, దివ్యమంగళవిగ్రహ విశిష్టుడని, కల్యాణగుణ సంపన్నుడని, దివ్యాయుధ గుణోపేతుడని మొదటి పాశురములో ప్రతిపాదించి,

దానిని ప్రధానముగా మిగిలిన ప్రబంధములో వివరించుటనుబట్టి ఉభయ విభూత్యాది యుక్తుడే పరబ్రహ్మమను జ్ఞానము ఈ ప్రబంధమున ప్రధాన ప్రతిపాద్యము. భూతయోగి రెండవ తిరువన్దాదిలో **“అన్బే తకళియా”** అని ప్రారంభించి, **“ఞానచ్చుడర్ విళక్కు ఏ*ర్ఱి*నేన్”** అనుచు సరోయోగి కీర్తించిన ఉభయవిభూతులకు స్వామి నారాయణుడేనని విశేషపర్యవసానము చేసి, ఆ స్వామిని **“అన్బు”** పదవాచ్యమైన భక్తితో అనుసంధించి, చివరలో **“ఎన్దళవన్దాల్ యానుడైయ వన్బు”** (నా పరిమితికి మించినది నా భక్తి) అనుచు ప్రబంధములను ముగించుటచే, అందు భక్తి ప్రతిపాదితము. మూడవ తిరువన్దాదిలో మహాయోగి **“తిరుక్కణ్డేన్ పొన్మేని కణ్డేన్”** (లక్ష్మీదేవిని దర్శించితిని. బంగారపు వన్నెగల స్వామి దేహమును దర్శించితిని) అనుచు భగవానుడగు నారాయణుని నిత్యమైన లక్ష్మీసంబంధమును ప్రబంధప్రారంభమున అనుసంధించి, పిమ్మట **“ఇన్ఱే క*ఴ*ల్ కణ్డేన్”** అని ప్రారంభములో, **“కాణ్ కాణెన విరుమ్బుమెన్ కణ్గళ్”** అని నడుమ, **“కణ్ణా! నిన్ మేని మలర్న్దు మరకతకమే కాట్టుమ్”** అని చివరలో జ్ఞాన, భక్తుల పరిణామదశ అగు సాక్షాత్కారమును తాము పొందుటను తెలిపిరి. ఇట్లు ముదలా*ఴ్వా*ర్ల మూడు ప్రబంధములలో వరుసగా జ్ఞాన, భక్తి, సాక్షాత్కారములు మూడు వర్ణింపబడినవి.

ఈ జ్ఞాన, భక్తి, సాక్షాత్కారములు మూడును ముదలా*ఴ్వా*ర్లు ముగ్గురికిని ఉన్నను, **“ప్రాధాన్యేన వ్యపదేశాః భవంతి”** అను న్యాయమున ప్రాధాన్యమునుబట్టి జ్ఞానదశ సరోయోగికి, భక్తిదశ భూతయోగికి, సాక్షాత్కారదశ మహాయోగికి కల్గినని చెప్పబడినది. జ్ఞానపరిణామ దశయగు భక్తియొక్క ప్రారంభదశను (పరభక్తిని) సరోయోగి, ఆ భక్తి ముదిరి, ఫలించిన దశను (పరజ్ఞానమును) భూతయోగి, భక్తి మఱింత పరిణమించినపుడు కల్గు సాక్షాత్కారమును (పరమభక్తిని) మహాయోగి పొందిరని తాత్పర్యము. పెరియవాచ్చాన్ పిళ్ళై రెండవ తిరువన్దాది వ్యాఖ్యలో **“అవర్క్కిన్ద భక్తి యిల్లైయో? ఎన్నిల్, ఉణ్డు. కార్యకారణరూపమాన అవస్థానభేదమే యుళ్ళదు. ఉభయవిభూతియైయుమ్ అనుసంధిత్తు ప్పిఱన్ద జ్ఞాన మవరతు; అదు పక్వమాయ్, భక్తిరూపాపన్న మానపడి ఇవరతు. ఆ*ఴ్వా*ర్కళ్. ఒరుత్త ర్కొరుత్తర్ భావజ్ఞరాయితే పరిమాఱువదు”** (వారికి అనగా-సరోయోగికి ఈ భక్తి దశ లేదా? అనినచో, ఉన్నది. ఇక భేదము ఏమి? అనగా, కార్యకారణరూపమైన స్థితిభేదము వీరిద్దరి మధ్య కలదు. ఎట్లనగా - ఉభయవిభూతులను అనుసంధించి నందున కల్గిన జ్ఞానము సరోయోగిది; ఆ జ్ఞానము పక్వమై, భక్తిదశను చేరిన స్థితి భూతయోగిది. ముద*ఴ్వా*ర్లు ఒకరి మనసును వేఱొకరు తెలిసి, ఒకరినొకరు సంభావించుకొందురు కదా) అని నుడువుటచే ముందు ఆ*ఴ్వా*ర్ల దశ కారణదశ. తరువాతి ఆ*ఴ్వా*ర్ల దశ కార్యదశ. వీరి ప్రబంధములనుగూర్చి పెరియవాచ్చాన్ పిళ్ళై- **“ఇమ్మూవర్క్కుమ్ అర్థ మొన్ఱే. మూన్ఱు ఋషికళ్కూడి ఒరు వ్యాకరణత్తుక్కు కర్తావానాప్పోలే, వక్తృ భేదముణ్డేయారిలుమ్, అర్థశరీరమ్ ఒన్ఱు. “త్రిముని వ్యాకరణమ్” ఎన్నుమాపోలే** (ఈ ముగ్గురు ఆ*ఴ్వా*ర్లును సాయించు అర్థము ఒక్కటియే. పాణిని- కాత్యాయన పతంజలులను ముగ్గురు మునులు ఒకే శాస్త్రమగు వ్యాకరణమునకు కర్తలైనట్లే, వీరు ముగ్గురు వేర్వేరు వ్యక్తులైనను, వీరు తెల్పు అర్థము ఒకే విధమైనది) అని అనుగ్రహించుటచే వీరి అన్యోన్య భావజ్ఞత స్పష్టమగుచున్నది. వీరు ముగ్గురు ఒకే విధమైన తత్త్వములను ఆవిష్కరించిరనుటయు వీరి ప్రబంధానుశీలనమువలన స్పష్టపడును కూడ.

ముదలా*ఴ్వా*ర్ల ప్రనబంధములు మూడింటిలో వరుసగా పరభక్తి- పరజ్ఞాన- పరమ భక్తులను దశలు ప్రతిపాదింపబడినవి- అను వేఱొక నిర్వాహముకూడ కలదు. భగవత్స్వరూపాదులను ప్రత్యక్షముగా దర్శింపవలెనను ఆశయే పరభక్తి. అట్లు ఆశించిన విధముగా వానిని దర్శించుట పరజ్ఞానము; దర్శించినవానిని మరల మరల మరింతగా దర్శింపవలెనను గొప్ప అభినివేశము పరమభక్తి- అని వీని లక్షణము తెలుపబడినది. భగవానుని సంశ్లేషమున ఆనందమును విశ్లేషమున దుఃఖమును పొందు దశ పరభక్తి. **“అన్దమిల్ పేరిన్బత్తు అడియరోడు ఇరున్దమై”** అనునట్లు పరమపదములోవలె పరిపూర్ణముగా దర్శించుట పరజ్ఞానము; భగవానుని దర్శింపలేకపోయినచో **“జలాన్మత్స్యావివోద్ధృతౌ”** అను రీతిలో నీటినుండి వేఱుపడిన మత్స్యమువలె జీవింపలేకపోవుట పరమభక్తి- అని వీనిని గూర్చిన వేఱొక లక్షణము శాస్త్రములందు చెప్పబడినది. లోతుగా పరిశీలించినచో ఈ రెండు నిర్వచనములు ఒకే అర్థమును తెలుపుచున్నవి - అను విషయము స్పష్టపడును. ఈ మూడు దశలు వస్తుతః ముక్తిదశలో జీవునకు కల్గును. భ్రమవిప్రలంభాది దోషములు లేని జ్ఞానమును కల దివ్యసూరులకు ఇవి ఈ లీలావిభూతిలోనే భగవత్కృపవలన సిద్ధించినవి. సర్వజ్ఞులగు మన పూర్వాచార్య

లకు **“పరభక్తి పరజ్ఞానపరమభక్తియుక్తం మాం కురుష్వ”** అని భగవానుని ప్రార్థించుటద్వారా లభించినవి. పరభక్తి-పరజ్ఞాన-పరమభక్తులు శాస్త్రములలో జ్ఞాన-దర్శన-ప్రాప్తి పదములతో నిర్దేశింపబడుట గమనింపదగినది. **“జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరం తప”** అని గీతలో, **“సంజ్ఞాయతే ... సందృశ్యతే వాఽ ప్యధిగమ్యతే వా”** అని శ్రీవిష్ణుపురాణములో ఇవి తెలుపబడినవి.

ఈమూడు దశలు ముదలాఴ్వార్ల విషయమున కల్గిన రీతిని కొంచెము గమనించెదము. ఉభయవిభూతులకు నాథుడై, సర్వస్మాత్ పరుడైన భగవానుడు తన స్వరూపగుణ విభూత్యాదులను నిర్హేతుకకృపతో అనుగ్రహింపగా, పరభక్తి అనబడు జ్ఞానవిశేషదశలో సరోయోగి దర్శించి, వానిని అనుభవించి, ఆ అనుభవ పరీవాహ రూపముగా తమ ప్రబంధమగు ముదల్ తిరువన్దాదిని **“వైయుమ్ తకళియా”** అనుచు ప్రారంభించి అనుగ్రహించిరి. ఆ ప్రబంధములో **“వాయవనై యల్లదు వాఴ్త్తాదు”** (నాలుక అతనిని తప్ప వేఱొకరిని కీర్తింపదు) అని, **“తిరుమాలై యల్లదు దెయ్వ మెన్టేఱ్ఱేన్”** (శ్రియఃపతినితప్ప వేఱెవరిని దైవముగా కీర్తింపను) అనియు గల పలు సూక్తులలో జీవుని అనన్యార్హశేషత్వస్వరూపమును, **“ఊఴియాన్ పాదమ్ మరువాతార్క్కు ముణ్డామో వాన్”** (ప్రళయమునందును ఉన్న భగవానుని పాదములను నమస్కరింపని వారికి పరమపదము లభించునా?) అని, **“ఒరడియుమ్ శాడుదైత్త”** (త్రివిక్రమస్వామి శ్రీపాదమును, శకటమును తన్నిన శ్రీకృష్ణుని పాదమును) అను మొదలగు సూక్తులద్వారా సర్వస్వామియైన శ్రియఃపతి పాదములందు చేయు నిత్యకైంకర్యమే జీవుని అనన్యార్హశేషత్వ స్వరూపమునకు తగిన ప్రాప్యమని, **“నెఱి వాశల్ తానేయాయ్ నిన్ఱానై”** (ప్రాప్యప్రాపకములు రెండును తానే అయినవానిని) ఇత్యాదిగా ఆ ప్రాప్యమును జీవునకు కలుగజేయు నది, జీవుని అత్యంతపారతంత్ర్యస్వరూపమునకు అర్హమైనది అగు ఉపాయము ఆ పరమాత్మయే (పాదములే)నని సిద్ధాంతీకరించుచు, తత్త్వ-హిత-పురుషార్థ నిర్ణయమును చేసిరి.

పిమ్మట భూతయోగి, అంతకు ముందు సరోయోగి తమ ప్రబంధములో ప్రతిపాదించిన భగవానుని స్వరూపరూపగుణ విభూతులను విశదముగా దర్శించి, వానిని విశేషముగా అనుభవించి, భగవన్నిర్హేతుకకృపవలన తమ పరభక్తి దశ పరజ్ఞానదశను చేరునట్లు వృద్ధి చెందగా, ఆ పరజ్ఞానమనబడు భగవదనురాగముతో



పరిపూర్ణాను భవమును పొంది, ఆ ఆనందమును లోకములోని వారందఱును అనుభవించు రీతిలో రెండవ తిరువన్దాదిని కృపచేసిరి.

తదనంతరము మహాయోగికి, భగవానుని నిర్హేతుకకటాక్షమువలన క్రమముగా పరభక్తి- పరజ్ఞానము కల్గినది. పిమ్మట సరోయోగి, భూతయోగుల కృపవలన, వారి ప్రబంధములను అనుభవించుటవలన మహాయోగి పరజ్ఞానదశ పరమభక్తిదశను పొందిరి. ఆ దశలో తమకు కల్గిన భగవదనుభవమును వ్యక్తీకరించుచు వారు **“తిరు క్కణ్డేన్ పొన్ మేని కణ్డేన్”** అనుచు తమ ప్రబంధమును ప్రారంభించిరి. సముద్రమును దర్శించినవాడు అందలి ముత్యములు, మాణిక్యములు, మొదలగు అమూల్య వస్తువులను వేర్వేరుగా చూచి ఆనందపడునట్లు, లక్ష్మీదేవికి, పాంచజన్యమునకు, కౌస్తుభరత్నమునకును స్థానమైన సముద్రమువలె, అత్యద్భుతమైన, ఆకర్షణీయమైన రూపసౌందర్యము మొదలగు గుణములను కల్గినవాడగు భగవానుని తాము సేవించి, ఆనంద పరవశులై, అపుడు తమకు కల్గిన మధురమైన అనుభూతిని మూన్ఱామ్ తిరువన్దాదిలో ప్రకటించిరి. ఈ విధముగా ముదలాఴ్వార్ల పూర్వపూర్వ ప్రబంధములు ఉత్తరోత్తర ప్రబంధముల అవతరణమునకు హేతువులైనవి.

ఈ విషయము ముదలాఴ్వార్లు పల్కిన మూడు ప్రబంధములలోని మొదటి పాశురములను గమనించుట వలన వ్యక్తమగుచున్నది. **“వరుత్తుమ్ పుఱ ఇరుళ్ మాఱ్ఱ ఎన్ పొయ్కైప్పిరాన్”** అనుచు అముదనార్ ఇరామానుశనూఱ్ఱన్దాదిలో పల్కినట్లు, పరమపురుషుని సొత్తు అగు ఈ జగత్తు ఎవ్వరికిని శేషము కాదని కాని, వేఱొకరికి శేషమని కాని భావించు భ్రమాత్మకమైన బాహ్యవిషయక అజ్ఞానము అనెడి చీకటి అంతరించునట్లు, భూమి మొదలగు పంచభూతాత్మకములైన లోకములోని వస్తువులను ప్రమిదగా, నేయిగా, దీపముగా రూపించుచు సరోయోగి పల్కిరి. ఆత్మయొక్క భగవద్భక్తి దశలగు అన్బు (భక్తి), ఆర్వము (అభినివేశము), పరజ్ఞానము మొదలగువానిని ప్రమిదగా, నేయిగా, దీపముగా రూపణము చేయుచు భూతయోగి భగవద్విషయమును మరింత లోతుగా అనుభవించి, **“ఇఱైవనై క్కాణుమ్ ఇదయత్తిరుళ్ కెడ ఞానమెన్నుమ్ నిఱైవిళక్కేఱ్ఱియ పూదత్తిరువడి”** అని అముదనార్ నుడివిన రీతిలో మనస్సు అను ఆంతర నేత్రమునకు సంబంధించిన తిమిరము నశించునట్లు, స్వస్మై స్వయంభాస

మానములగు ఆత్మ-పరమాత్మల స్వరూప స్వభావముల విషయమున ఏర్పడు సంశయవిపర్యయాది దోషములు పోవునట్లు తమ ప్రబంధమును పల్కిన, ఎట్లు వీరిరువురు రెండు దివ్యదీపములను వెలిగించి బాహ్యాంతర తమస్సులను **"తమోబాహ్యం వినశ్యేత్తు పావకాదిత్యసన్నిధౌ, బాహ్య మాభ్యంతరం చైవ విష్ణుభక్త్యార్క సన్నిధౌ"** అనను రీతిలో పోగొట్టగా, ఆ రెండు దీపములవలన కల్గిన జ్ఞానప్రకాశములో భగవానుని సాక్షాత్కారమును పరిపూర్ణముగా పొందిన మహాయోగి **"తిరు క్కణ్డేన్"** అనుచు మొదలిడి, తమ అనుభూతిని వ్యక్తీకరించిరి. ఇట్లు ఈ మూడు ప్రబంధములు ఒకదానితో వేఱొకటి అన్వయమును కల్గిన ఏకశాస్త్రమనుట స్పష్టము.

ఇక, ఇపుడు, ముదల్ తిరువన్దాది ప్రబంధములోని మొదటి పాశురము నందలి సూక్తిమాధుర్యమును, ప్రతిపాద్యవైశిష్ట్యమును సంగ్రహముగా అనుసంధించెదము. అందలి మొదటి పాశురము ఇది.

**వైయుమ్ తకళియా వార్కడలే నెయ్యాక**
**వెయ్య కదిరోన్ విళక్కాక- శెయ్య**
**శుడరాழியా నడిక్కే శూట్టినేన్ శొన్మాలై**
**యిడరాழி నీఙ్గుకవే యెన్ఱు**

భూమిని ప్రమిదగా, ఆ భూమిని చుట్టియున్న సముద్రమును నేయిగా, ఉష్ణకిరణములను కల సూర్యుని దీపముగా చేసి, ఎఱ్ఱని కాంతిని గల చక్రాయుధమును ధరించిన భగవానుని శ్రీ పాదములందు, ఈ లోకములోని దుఃఖసముద్రమును దాటవలెనని, నా సూక్తులనెడి మాలను సమర్పించితిని- అని ఈ పాశుర భావము.

ఆழ்వార్లు ఇందు సమస్తవస్తువులకు ఆధారమగు భూమిని నేతికి, వత్తికి, దీపమునకు ఆధారమగు ప్రమిదగా, ద్రవించు స్వభావమును కల నీటితో నిండియున్న సముద్రమును అట్టి స్వభావమునే కల నేయిగా, తాను ప్రకాశించుచు, అన్య పదార్థములను ప్రకాశింపజేయు స్వభావమును కల సూర్యుని అట్టి స్వభావమునే కల దీపముగా, తమ సూక్తిని పూలమాలగా రూపించుటలోని స్వారస్యము, అందము సహృదయహృదయైకవేద్యముకదా ! ఇట్లు అలంకారిక



దృష్టిలోనే కాక, వేదాంత శాస్త్రదృష్టిలో కూడ ఈ పాశురమునందలి వైశిష్ట్యము గమనింపతగినది. ఈ లోకము, ప్రమిదవలె సావయవము, కావున కార్యము. సావయవమైనది కార్యమైయుండును కదా! **"ఇదం జగత్ కార్యం, సావయవత్వాత్, ఘటవత్"** అనునది ఇచటి అనుమానశరీరము. సావయవములగు ఘటాది పదార్థములన్నియు కార్యములనుట లోకసిద్ధమే కదా! ప్రతికార్యమునకు కర్త ఒకడు ఉండి తీరవలెను. కావున, కార్యరూపమైన జగత్తునకును కర్తయగువాడొకడు ఉండి యుండవలెనని ఏర్పడుచున్నది. భూమిని చుట్టియుండి, ద్రవించు స్వభావమును కల్గియున్న సముద్రము నదులలోని నీరు ప్రవహించుటచేతనే నిండి, లేనిచో ఎండిపోవునట్టిది కాదు. భూమికంటె ఉన్నతముగా నున్నను, ఆ భూమిని తన నీటితో మునుగునట్లు చేయుటలేదు. సముద్రము ఇట్లుండుటకు కారణముగా ఎవ్వరో ఉండి యుండవలెను. అట్లే, ఉష్ణకిరణములను కల్గిన, తేజోద్రవ్యరూపుడైన సూర్యుడు **"భీషోదేతి సూర్యః"** అనునట్లు సకాలమున ఉదయించి, అస్తమించు చుండుటకును కారణభూతుడెవ్వడో ఉండి ఉండవలెను. ఈ విధముగా జగత్తులోని పదార్థములన్నియుకూడ పరమాత్మ సత్తను చెప్పుచున్నవి. ఈ విధమైన చిత్రవిచిత్రమైన సృష్టిని చేయువానికి జ్ఞాన, శక్త్యాదిగుణములు ఉండియుండవలెను. **'ఆழியాన్'** అను పదము భగవానుడు చక్రధారి అనుటను తెలుపుచున్నది. సుదర్శనము భగవానుని సంకల్పరూప శక్తికి సంకేతము. సుదర్శనముచే పాంచజన్యముకూడ లక్షింపబడినది. తెల్లని పాంచజన్యము జ్ఞానమునకు సంకేతము. ఇట్లు ఇచట భగవానుడు జ్ఞానశక్త్యాది కళ్యాణగుణోపేతుడనుట సూచింపబడినది. అట్టి జగత్కారణమైన వాడెవ్వడు? అను ప్రశ్నకు ప్రకృత పాశురములోని **"శెయ్య శుడరాழியాన్"** అను ప్రయోగము సమాధానము పల్కుచున్నది. అతడు ఎవరో కాదు, చక్రధారి యగు శ్రీమన్నా రాయణుడే ననుటను ఈ సూక్తి నిర్ధారించుచున్నది. **"కారణం తు ధ్యేయః "** అను వేదాంత ప్రక్రియను అనుసరించి, జగత్కారణభూతుడే ధ్యానింప తగినవాడని ఏర్పడుచున్నది. ఇచట ధ్యానము సకలవిధకైంకర్యములకు ఉపలక్షణము. కావున శంఖచక్రధారియగు శ్రీమన్నారాయణునకే జీవుడు సకలకైంకర్యములను చేయవలెనని అర్థమగుచున్నది. ఈ పరమార్థమును **"శెయ్య శుడరాழியానడిక్కే శూట్టినేన్ శొన్మాలై"** అను ప్రకృత పాశురములోని సూక్తి ప్రబోధించుచున్నది.

ఇచట ప్రాసంగికముగా ఒక సందేహము కలుగవచ్చును. **"శాస్త్రయోనిత్వాత్"** అను సూత్రముద్వారా బ్రహ్మసూత్రకారులు అనుమానముద్వారా భగవానుని సత్తను నిర్ణయించుటను దూషించిరికదా! కాని, ఇచట ఆఴ్వార్లు అనుమానము ద్వారా భగవానుని అస్తిత్వమును సాధించునట్లు కన్పడుచున్నదే! ఇది ఎట్లు తగును? అనినచో, **"ఆర్షం ధర్మోపదేశం చ వేదశాస్త్రావిరోధినా, యస్తర్కేణాను సంధత్తే స ధర్మో వేద నేతరః"** అని మనుధర్మశాస్త్రములో పల్కిన రీతిలో వేదరూపశాస్త్రమునకు విరుద్ధములైన తర్కములను ఉపయోగింపరాదు కాని, అనుకూలతర్కములను ప్రయోగింపవచ్చును. అంతియే కాని, అసలు తర్కమునే ప్రయోగింపరాదని అర్థము కాదు. సూత్రకారుల ఉద్దేశ్యముకూడ అదియే. ఆఴ్వార్లు ప్రస్తుతమునను శాస్త్రానుకూల తర్కమును అనుసరించి, సాయించుట వలన పైన సందేహించిన రీతిలో బ్రహ్మసూత్రవిరోధము లేదు. అనుకూల్యమే కలదు- అని తెలియుచున్నది. భగవద్రామానుజులును శ్రీభాష్య ప్రారంభములో **"న్యాయానుగృహీతవాక్యస్య అర్థ నిశ్చాయకత్వాత్"** అని నుడువుటయే గాక, **"జన్మాద్యస్య యతః"** అను సూత్రవ్యాఖ్యలో తర్కము నిర్విశేష వస్తువును సాధించుటలో ప్రమాణము కాబోదు అనుటను - **"తర్క శ్చ సాధ్యధర్మావ్యభిచారి సాధనధర్మాన్వితవస్తువిషయత్వాత్ న నిర్విశేషవస్తుని ప్రమాణమ్"** అని తెలియపఱచిరి.

ఈ పాశురములో **"వైయుమ్, వార్ కడల్, కదిరోన్"** -అను పదములు లీలావిభూతికి ఉపలక్షకములు. నిత్యసూరులలో ఒకరగు శ్రీసుదర్శనుని నిర్దేశించు **"శుడరాఴి'** అను పదము సమస్తనిత్యవిభూతికి ఉపలక్షకము. భగవానుని పాదములను తెలుపు **"అడిక్కే"** - అను పదము భగవద్దివ్యమంగళ విగ్రహమును ఉపలక్షించుచున్నది. పూర్వోక్తదిశలో ఈ పాశురమున భగవానుని జ్ఞానశక్త్యాది కల్యాణగుణములు వ్యక్తములగుచున్నవి. ఈ విధముగా సరోయోగి మొదటి పాశురము ద్వారా భగవానుడు ఉభయవిభూతినాథుడని, దివ్యమంగళవిగ్రహుడని, సమస్తకల్యాణగుణాకరుడని తెలిపిరి. మఱియు, **"ఆఴియాన్"** అను పదము ద్వారా సమస్తదివ్యాయుధములు సూచింపబడుటచే, దివ్యాయుధములకు ఆభరణత్వముకూడ **"స్రగ్వస్త్రాభరణైః యుక్తం స్వానురూపై రనూపమైః, చిన్మయైః స్వప్రకాశై శ్చాన్యోన్యరుచిరంజకైః"** ఇత్యాది పలు ప్రమాణములవలన,



**"పొన్నాఴిక్కై యార్క్కు"** అను మొదలగు దివ్యసూరి సూక్తులవలన తెలియు చుండుటచే భగవానుడు సర్వదివ్యాయుధ దివ్యభూషణాలంకృతుడని వ్యక్తమగుచున్నది. **"శుడరాఴి యానడిక్కే శూట్టినేన్ శొన్మాలై"** అనుచు ఆఴ్వార్లు అట్టి స్వామికే సర్వవిధకైంకర్యములు చేయుట జీవుని స్వరూపానురూపమైన ప్రాప్యమని తెలిపిరి. **"శూట్టినేన్"** అను ఉత్తమపురుషక్రియా రూపముద్వారా వ్యక్తమగు ఉత్తమపురుషసర్వనామ పదము జీవుని భగవదనన్యార్హశేషత్వ-పారతంత్ర్యరూపమైన స్వరూపమును బోధించుచున్నది. **"ఇడరాఴి నీఙ్గుకవే యెన్ఱు"** అను పాశురసూక్తి అనిష్టనివృత్తినే కాక, ఇష్టప్రాప్తినికూడ తెలుపుచు భగవానుని రక్షకత్వపూర్తిని సూచించుచున్నది. **"శుడరాఴియాన్ అడి"** అను సూక్తిద్వారా భగవానుని పాదములే ఉపాయమనియు స్ఫుటమగుచున్నది. ఇట్లు ఈ పాశురములో సరోయోగి తత్త్వ- హిత- పురుషార్థనిర్ణయమును కావించిరి.

ఇందు ఆఴ్వార్ తమ సిద్ధాంతమును స్థాపించుటయే కాక, పరమత నిరసనమును చేసిన తీరుకూడ గమనింపతగినది. భగవానుడు నిత్యలీలా విభూతి నాయకుడనుటద్వారా **"సర్వం శూన్యమ్"** అను బౌద్ధుల వాదము, **"ప్రత్యక్ష మేకం చార్వాకాః"** అని నిర్దేశింపబడు చార్వాకవాదమును నిరసింపబడినవి. భగవానుడు శ్రీసుదర్శనాద్యాయుధ విశిష్టుడనుటచే శూలాద్యాయుధ విశిష్టులైన దేవతాంతరములు పరదైవములు కావని సూచించి, తద్ద్వారా శైవ- శాక్తేయాది మతములను తిరస్కరించిరి. **"శూట్టినేన్"** అనుచు జీవుని కర్తృత్వమును ప్రతిపాదించుటద్వారా ప్రకృతికి మాత్రమే కర్తృత్వమును అంగీకరించి, **"పురుషః పుష్కరపలాశవన్నిర్లేపః"** అనుచు పురుషునకు కర్తృత్వము లేదని వాదించు సాంఖ్యుల వాదమును నిరసించిరి. భగవానుడు దివ్యమంగళ విగ్రహుడని, కల్యాణగుణాకరుడని తెలుపుట ద్వారా **"నిర్విశేషచిన్మాత్రమ్ బ్రహ్మైవ సత్యమ్, అన్యత్ సర్వమ్ మిథ్యా"** అను అద్వైతుల మతము నిరాకరింప బడినది. పూర్వము వివరింపబడినట్లు ఈ పాశురములో భగవానుడగు శ్రీమన్నారాయణుని జగత్కారణత్వము, అట్లే, పలు మతములను నిరసించుటద్వారా అబాధ్యత్వము, భగవానుని ప్రాప్యప్రాపకత్వములును ప్రతిపాదింపబడుటచే, **"కారణత్వ మబాధ్యత్వ ముపాయత్వ ముపేయతా"** అను క్రమమున బ్రహ్మసూత్రములలోని నాల్గు అధ్యాయములలో ప్రతిపాదింపబడిన ప్రధానాంశములు నాల్గును ఇందు

కలవని స్పష్టమగుచున్నది. ఇట్లు ముదలాఴ్వార్లు ముగ్గురిలో మొదటివారగు సరోయోగి అనుగ్రహించిన ముదల్ తిరువన్దాదిలోని మొదటి పాశురము విశిష్టాద్వైతసిద్ధాంతసార సంగ్రహమని చెప్పతగియున్నది.

సరోయోగి తమ ప్రబంధములో నిర్ణయించిన పలు తత్త్వములను మిగిలిన ఇద్దఱు ఆఴ్వార్లును అనువదించిరి. సరోయోగి **"అరన్ నారణన్"** (హరుడు నారాయణుడు) అని, **"ముదలావార్ మూవరే అమ్మూవరుళ్ళుమ్ ముదలావాన్ మూరినీర్ వణ్ణన్"** (బ్రహ్మ- విష్ణు- పరమేశ్వరులను ముగ్గురే ముఖ్యమైనవారు. ఆ ముగ్గురిలో విస్తరించిన సముద్రముయొక్క వర్ణమువంటి వర్ణమును కలవాడు జగత్ కారణభూతుడు) అని, **"మా మదిళ్ మూన్టెయ్‌ద ఇఱైయాన్ నిన్టాకత్తిఱై"** (గొప్ప కోటలను కల త్రిపురములను బాణముతో కూల్చినవాడు, తనను ఈశ్వరునిగా అభిమానించువాడును అగు రుద్రుడు నీ దివ్యదేహములో ఒక మూలనుండువాడు) అని, **"తిరుమాలై యల్లదు దెయ్‌వ మెన్టేత్తేన్'** (శ్రియఃపతిని తప్ప వేఱొకరిని దైవముగా పొగడను) అని, **"ఏఱ్ఱాన్ పుళ్ళూర్‌న్దాన్... కాప్పు"** (ఎద్దును వాహనముగా కలవాడు, వేదమును శరీరముగా కల గరుత్మంతుని వాహనముగా కలవాడు ... రక్షకుడు) అని, **"పొన్ తికఴుం మేని'** (బంగారమువలె ప్రకాశించు మేనిని) అని ఈవిధముగా పలు సూక్తులద్వారా శ్రీమన్నారాయణుని పరత్వమును నిర్ణయింపగా, దానిని భూతయోగి **"కణ్ణుదలోన్టే తొఴున్దకైయార్"** (ఫాలమునందు నేత్రమును కలవాడు భగవానుని నమస్కరించు స్వభావమును కలవాడు) అని, **"పిఱై యిరున్ద శెఞ్జడైయాన్.... మాలై క్కూఱై యిరన్దు"** (చంద్రకళను కల, ఎఱ్ఱని జటలను కల రుద్రుడు.... భగవానుని వద్ద తనకు ఏర్పడిన బ్రహ్మహత్యాదోషమును కొఱతను పోగొట్టుమని ప్రార్థించి) అని, **"మాకడల్ నఞ్జుణ్డాన్ తనక్కుమ్ ఇఱైయావాన్ ఎఙ్గన్ పిరాన్"** (మహా సముద్రములోని గరళమును గ్రహించిన ఈశ్వరునకును స్వామియై యున్నవాడు మాకు స్వామి) అని మొదలగు సూక్తులయందు, మహాయోగి **"మామలరాన్ వార్ శడైయాన్ ఎన్టివర్‌క్కు ఎణ్ణత్తానామో ఇమై?"** (పద్మవుడగు బ్రహ్మ, వేలాడు జటలను కల శివుడు- అను వీరికి కొంచెమైనను భగవానునిగూర్చి మనస్సులో నైనను భావింప సాధ్యమా?) అను మొదలగు సూక్తులయందును అనుసంధించిరి. ఈ విధముగానే తత్త్వ-హిత- పురుషార్థములకు చెందిన అంశములలో వీరికి గల ఏకగ్రీవత్వమును



తెలుపు సూక్తులు అనేకములున్నను వానిని ఇచట విస్తరభీతిచే ప్రస్తుతించుట లేదు. ముదలాఴ్వార్లకు సమకాలీనులై, వీరిని అనుసరించుచు, తమ ప్రబంధములో శ్రీమన్నారాయణ పరతత్త్వమును అవిచాల్యముగా సిద్ధాంతీకరించి, **"ఉఱైయిలిడాదవర్"** అని ప్రసిద్ధిగాంచిన తిరుమఴిశైయాఴ్వార్లకే గాక, మిగిలిన ఆఴ్వార్లకు ఆ ముదలాఴ్వార్లే మార్గదర్శకులని పూర్వాచార్యుల అభిప్రాయము.

ఇందులకొక ఉదాహరణముమాత్రము దిఙ్మాత్రముగా నివేదింపబడు చున్నది. సరోయోగి **"వైయమ్ తకళియా"** అనుచు సర్వేశ్వరుడు ఉభయ విభూతులకు స్వామి అని తెలిపిరి. **"ఞానచ్చుడర్ విళక్కేఱ్ఱినేన్ నారణఱ్కు"** అనుచు భూతయోగి ఆ ఉభయ విభూతినాథుడు నారాయణుడేనని నారాయణశబ్దప్రయోగముద్వారా పరత్వ నిర్ణయమును చేసిరి. పిమ్మట మహాయోగి **"తిరు క్కణ్డేన్"** అనుచు మొదలిడి నారాయణునకు గల నిత్యమైన లక్ష్మీసంబంధమును తెలిపి, శ్రీమన్నారాయణుడే పరతత్త్వమని సిద్ధాంతీకరించిరి. ఈ క్రమమును అనుసరించుచు వీరికి పిమ్మట అవతరించిన శ్రీశఠకోపులు తిరువాయ్‌మొఴి ప్రబంధములోని మొదటిదశకమగు **'ఉయర్వఱ'** లో భగవానుడు ఉభయవిభూతివిశిష్టుడని, రెండవ దశకమగు **"వీడుమిన్"**లో **"వణ్ పుకఴ్ నారణన్"** అనుచు నారాయణశబ్దప్రయోగములను చేసి, ఆ ఉభయ విభూతివిశిష్టుడు నారాయణుడేనని నిర్ణయించిరి. మూడవ దశకమగు **"పత్తుడై యడియవర్‌క్కు"** లో **"తిరువుడై యడికళ్"** అనుచు ఆస్వామియొక్క నిత్యమగు లక్ష్మీసంబంధమును ప్రస్తావించి, శ్రీమన్నారాయణుడే పరతత్త్వమనుటను స్థిరీకరించిరి. ఇట్టి సూక్తిసామ్యములు అనేకములున్నవి.

ముదలాఴ్వార్లు ముగ్గురును భగవానుని పరత్వములో మిక్కిలి ప్రావణ్యమును కలవారు. **'ముదలాఴ్వార్‌కళ్ మూవరుమ్ పరత్వత్తిలే మణ్డియిరుప్పర్ కళ్"** అని పూర్వాచార్యశ్రీసూక్తి. అయిననూ, వాత్సల్యసౌలభ్య పరాకాష్ఠ అయిన అర్చావతారము నందు వీరికి గల అభినివేశము స్పష్టముగా వీరి సూక్తులలో గోచరించును. ప్రత్యేకించి, వేంకటాచలక్షేత్రమునందు, అచట వేంచేసియున్న శ్రీవేంకటేశ్వరునియందు వీరికి గల భక్తి ప్రపత్తులు పలు పాశురములలో వ్యక్తీకరింపబడినవి. మిగిలిన ఏ దివ్యదేశమును వీరు అన్ని మార్లు

అంతగా కీర్తింపకుండుట ఇందులకొక తార్కాణము. నమ్మాఴ్వార్లు, భట్టనాథులు, కులశేఖరులు, పరకాల సూరియు తమ ప్రబంధములలో తమను నాయికగా, తల్లిగా, చెలికత్తెగా భావించుచు, భగవానుని పట్ల గల భక్తిని వ్యక్తీకరించుట సుప్రసిద్ధము. ఇట్టి భావనకు మూలము మహాయోగి ప్రణీతమైన మూన్ఱామ్ తిరువన్దాదిలోని **"వెఱ్పెన్ఱు వేఙ్గడమ్ పాడుమ్" (69)** అను పాశురమేనని చెప్పనగును. ఇందు నాయికా- మాతృ- సఖీభావనలు మూడును కలవు. దీనికి వ్యాఖ్యానము అనుగ్రహించు పెరియవాచ్చాన్‌పిళ్ళై- **"ఆఴ్వారాన అవస్థై పోయ్, ఒరు పిరాట్టి అవస్థైయై భజిత్తు, అవళుడైయ దశైయై తాయాయ్ శొల్లుకిఱాళ్"** అని, అప్పిళ్ళై అను ఆచార్యవర్యులు **"తామాన తన్మై యఴిన్దు, ఒరు పిరాట్టి దశైయై ప్రాప్తరాయ్, అవళుడైయ ఉక్తివృత్తికళై త్తిరుత్తాయారాక అనువదిత్తుక్కొణ్డు పేశుకిఱార్"** అనియు వివరించుటచే ఈ పాశురములోని నాయికా, మాతృ భావనలు కూడ స్పష్టము. తల్లి తన కుమార్తెకు సంబంధించిన, గోప్యమైన విషయమును ఆప్తులకు మాత్రమేతమ కుమార్తెను గూర్చి సఖితో పల్కుచున్నదని చెప్పనగును. కావున సఖీభావనయు ఇచట అర్థాత్ సిద్ధము. ఈ రీతిలోనే ఒకే ఉక్తిలో భావనాత్రయమును నమ్మాఴ్వార్లు తిరువాయ్‌మొఴిలో **"కడల్ ఞానమ్" (5-6)** అను దశకములో అనుసంధించుటను గమనింపవచ్చును. ఇందులకు పూర్వోదాహృతమగు మూన్ఱామ్ తిరువన్దాది పాశురము మూలమనుటలో విప్రతిపత్తి లేదు కదా ! మఱియు, ఆఴ్వార్ల ఈ భావన వేంకటాచల స్వామిని గూర్చి అగుటయు గమనింపతగినది.

ముదలాఴ్వార్ల శ్రీసూక్తులలో అపూర్వములైన, పురాణేతిహాసాదులలో సైతము కన్పించని వృత్తాంతములు కొన్ని పేర్కొనబడినవి. ఉదాహరణకు- రావణుడు మాఱు వేషమున బ్రహ్మనుండి వరమును పొందు సమయమున, భగవానుడు చిన్నశిశువై బ్రహ్మ ఒడిలోనుండి ఆ రావణుని పది తలలను లెక్కించి, చూపి అతని స్వరూపమును ఎఱుక పఱచిన వృత్తాంతము ముదల్ తిరువన్దాది **(45)**, మూన్ఱామ్ తిరువన్దాది **(45)** పాశురములలో ప్రస్తుతింపబడినది. ఇది ఏ పురాణములోను, ఇతిహాసములోను కన్పించదు. మహర్షులకు సైతము అందని ఈ గాథను తమ దివ్యదృష్టిలో దివ్యసూరులు దర్శించిరని, ఇది కల్పాంతరములో సంభవించినదై ఉండవచ్చునని అభిజ్ఞులైన పూర్వాచార్యుల అభిప్రాయము. ఇదే



విధముగ, కురున్దవృక్షభంజనము సైతము పురాణాదులలో కన్పింపదు. సాహిత్య పరిశోధకులు ఇది జానపద వాఙ్మయమునుండి దివ్యప్రబంధములలో చోటుచేసికొన్నదని అందురు. నప్పిన్నై వృత్తాంత విషయములో కూడ భిన్నాభిప్రాయములున్నవి. ఇట్టి విషయములు విస్తృతముగా పరిశీలింపదగినవి. కనుక వీనిని గూర్చి ప్రస్తుతమున వివరముగా ప్రస్తుతించుటలేదు.

ఆలంకారిక దృష్టిలో, శైలీ, శబ్దమాధుర్యముల దృష్టిలోకూడ ముదలాఴ్వార్ల ప్రబంధములు అత్యున్నతములు. ఇందలి అలంకారములు నైసర్గికములు, సహృదయ హృదయావర్జకములనుటకు ఇందలి మొదటి పాశురములే సాక్షి. చిన్నచిన్న పదములతో శబ్దాడంబరములేని శైలిలో తత్త్వావిష్కరణను స్పష్టముగా చేయు రీతి వీరికి వెన్నతో పెట్టిన విద్య. ముదలియాణ్డాన్ పొయ్‌కై ఆఴ్వార్లను **"కవిఞర్ పోరేఱు"** అని కీర్తించగా, పూదత్తాఴ్వార్లు తమను స్వయంగా **"పెరున్తమిఴన్"** అని ప్రశంసించుకొన్నారు. వీరిని ముగ్గురిని తిరుమఙ్గైమన్నన్ **"శెన్దమిఴ్ పాడువార్"** (అందమైన ద్రావిడాన్ని పాడేవారు) అని కొనియాడారు. తమిళసాహిత్య విమర్శకులు సైతం ముదలాఴ్వార్ల సాహిత్యాన్ని అత్యుత్తమ-సాహిత్య లక్షణాలను కల్గినదని ముక్తకంఠంగా అంగీకరిస్తున్నారు. ఈ మహనీయులైన ఈ ముదలాఴ్వార్ల పరమగంభీరాలైన శ్రీసూక్తులలోని విశేషాలు ఇక్కడ దిఙ్మాత్రంగా మాత్రమే విన్నపింపబడ్డాయి. ఇంకా మఱిన్ని వివరాలను అభిజ్ఞులైన పెద్దల సన్నిధిలో సహృదయులు గ్రహించగలరు.

**మనోజ్ఞభావబంధురా గభీరతత్త్వభాసురాః**
**హరేః పరత్వసాధికా రసజ్ఞచిత్తరంజనీః ।**
**సరోమునేః మహామునే శ్చ భూతయోగినో గిరాం**
**సుధాఝరీః సదా ముదా పిబంతు సాదరం బుధాః ॥**

## పొయ్‌కైయా*ఴ్వా*ర్ అనుగ్రహించిన

# ముదల్ తిరువన్దాది

## ముదలియాణ్డాన్ అనుగ్రహించిన

### తనియన్

కై తై శేర్ పూమ్బొ*ఴి*ల్ శూ*ఴ్* కచ్చినగర్ వన్దుతిత్త
పొయ్‌కై ప్పిరాన్ కవిఞర్ పోరేఱు- వైయ
త్తడియవర్‌కళ్ వా*ఴ* వరున్దమి*ఴ్* నూ*ఱ్ఱ*న్దాది
పడి విళఙ్గ చ్చెయ్‌తాన్ పరిన్దు

కై తై శేర్ = మొగలి పొదలు దట్టంగా ఉండే, పూమ్ పొ*ఴి*ల్ శూ*ఴ్* = అందమైన పూ పొదలు చుట్టి ఉండే, కచ్చి నకర్ = కాంచీపురంలో, వన్దు ఉదిత్త= అవతరించిన, పొయ్‌కై ప్పిరాన్ = పొయ్‌కై ఆ*ఴ్వా*ర్లు అనే, కవిఞర్ పోర్ ఏఱు = కవివృషభులు (గొప్ప కవులు), వైయత్తు = ఈ భూలోకంలో ఉండే, అడియవర్‌కళ్ = దాసులైన శ్రీవైష్ణవులు, వా*ఴ* = ఉజ్జీవించేటట్లుగా, అరుమ్ తమి*ఴ్* నూ*ఱ్ఱు* అన్దాది = (అర్థనిర్ణయం చేసిన) అరుదైన ద్రావిడ అన్దాది ప్రబంధాన్ని, పరిన్దు = వాత్సల్యాన్ని కలవారై, పడి = భూమిలో, విళఙ్గ చ్చెయ్‌దాన్ = ప్రకాశించేటట్లుగా చేశారు.

ఈ తనియన్‌ను భగవద్రామానుజుల ముఖ్యశిష్యులలో ఒకరైన ముదలియాణ్డాన్ అనుగ్రహించారు.

''''''''''

అవ:- విచిత్రమైన ఈ జగత్తుకు కారణమైనవాడు- విచిత్రజ్ఞానశక్తులను కలవాడు, శంఖచక్రదివ్యాయుధరుడైన సర్వేశ్వరుడే అయి ఉండాలి - అనే అనుమానంతో జగత్కారణవస్తువును నిర్ణయిస్తూ, సర్వశేషి అయిన సర్వేశ్వరుని

**గమనిక :** ద్రావిడ వర్ణమాలలోని '*ఴ*' అనే అక్షరాన్ని తెలుగులోని 'ళ' అక్షరంతో సమానంగా, '*ఱ్ఱ*' అనే సంయుక్తాక్షరాన్ని 'ట్ర' అనే సంయుక్తాక్షరంతో సమానంగా, '*ఱ*' అనే అక్షరాన్ని 'ఱ' అనే అక్షరంతో సమానంగా ఉచ్చరించవచ్చును.



శ్రీపాదాలలో స్వరూపానురూపంగా వాచికకైంకర్యాన్ని చేయగలిగానుకదా !- అని ఆ*ఴ్వా*ర్లు ఇందులో కృతార్థులవుతున్నారు.

1. వైయమ్ తకళియా వార్ కడలే నెయ్యాక
   వెయ్య కతిరోన్ విళక్కాక - శెయ్య
   శుడరా*ఴి* యానడిక్కే శూట్టినేన్ శొల్‌మాలై
   ఇడరా*ఴి* నీఙ్గుకవే యెన్ఱు

వైయమ్ తకళియా = భూమి ప్రమిదగా, వార్ కడలే నెయ్ ఆక = దానిని చుట్టి ఉండే సముద్రం నేయిగా, వెయ్య కదిరోన్ = వేడి కిరణాలను కల సూర్యుడు, విళక్కు ఆక = దీపంగా, శెయ్య శుడర్ ఆ*ఴి*యాన్ = ఎఱ్ఱని కాంతిని కల చక్రాయుధాన్ని కల్గిన భగవానుని, అడిక్కే = శ్రీచరణాలలో, ఇడర్ ఆ*ఴి* నీఙ్గుక ఎన్ఱు = ఈ లోకంలో ఉండే దుఃఖసముద్రం తొలగిపోవాలి- అని, శొల్ మాలై = వాక్కులనే పాశురమాలను, శూట్టినేన్ = (చుట్టాను) అలంకరించాను. (ఈ పాశురంలో- విచిత్రమైన లోకాన్ని సృష్టించగల జ్ఞానం, శక్తి మొదలైన కల్యాణగుణాల వైభవాన్ని కలవాడై, విరోధినిరసనాన్ని చేయగల శంఖచక్రాలను ధరించినవాడైన సర్వేశ్వరుడే జగత్కారణుడై ఉండాలి- అనే అనుమానంతో జగత్కారణవస్తు నిష్కర్షను ఆ*ఴ్వా*ర్లు చేశారు.)

అవ :- ఈ విధంగా అనుమానప్రమాణంతో చాలా క్లేశపడి అతని పరత్వాన్ని నిర్ణయించాలా? అతడు లోకాలను సృష్టించి, ఆరగించి, మళ్ళీ వెలువరించడంవంటి కార్యాలు అతని పరత్వాన్ని నిర్ణయించడానికి చాలవా?- అని ఇందులో అంటున్నారు.

2. ఎన్ఱు కడల్ కడైన్దతు ఎవ్వులకమ్ నీరే*ఱ్ఱ*తు
   ఒన్ఱు మతనై యుణరేన్ నాన్ - అన్ఱ
   తడైత్తుడైత్తు క్కణ్‌పడుత్త వా*ఴి* ఇతు నీ
   పడైత్తిడన్దుణ్డుమి*ఴ్*న్ద పార్

కడల్ కడైన్దదు = క్షీరాబ్ధిని చిలికినది, ఎన్ఱు = ఏనాడు? (ఇపుడే కదా అని భావం) నీర్ ఏ*ఱ్ఱ*తు = మహాబలి వద్ద దానజలాన్ని గ్రహించినది, ఎవ్వులకమ్=

ఏ లోకం కోసం? (ఈలోకం కోసమే కదా! అని భావం) అదనై=దానిని, (ఆ లోకాలను), ఒన్టుమ్ = కొంచెం కూడా, నాన్ ఉణరేన్ = నేను తెలియలేను, అదు = ఆ సముద్రం, (ఎటువంటిది అంటే) అన్టు = శ్రీరామావతారకాలంలో, అడైత్తు = ఆనకట్టను కట్టి, ఉడైత్తు= (రావణ వధానంతరం) కూలగొట్టి, కణ్ పడుత్త = సదా నిద్రించే, ఆழி = సముద్రం, ఇదు = మహాబలిదగ్గర జలధారాపూర్వకంగా దానంగా పొందిన ఈ లోకం, నీ పడైత్తు = నీవు సృష్టించి, ఇడన్దు = వరాహరూపివై గుచ్చి ఎత్తి, ఉణ్డు = ప్రళయకాలంలో భుజించి, ఉమిழ்న్ద = తరువాత వ్యక్తం చేసిన, పార్ = భూమి.

అవ :- **"ఎవ్వులకమ్ నీరేழ்ఱతు"** అని కీర్తించిన లోకాలను కొలిచిన స్వామి దివ్యచేష్టితంలో దివ్యసూరి మనస్సు లగ్నమైనది, దానిని అనుభవించాలని ఆழ்వార్లు ప్రయత్నించి, పూర్తిగా అనుభవించలేక అందులోనే పడి కొట్టు మిట్టాడుతున్నారు.

**3. పారళవు మోరడి వైత్తు ఓరడియుమ్ పారుడుత్త**
**నీరళవుమ్ శెల్ల నిమిర్న్దతే- శూరురువిన్**
**పేయళవు కణ్డ పెరుమాన్ ! అఱికిలేన్**
**నీ యళవు కణ్డ నెఱి**

ఓర్ అడి = అద్వితీయం అయిన శ్రీచరణాన్ని, పార్ అళవుమ్ వైత్తు = భూమి ఉన్నంతవరకు పెట్టగా, ఓర్ అడియుమ్ = వేఱొక శ్రీపాదాన్ని, పార్ ఉడుత్త = బ్రహ్మాండాన్ని చుట్టి ఉండే, నీర్ అళవుమ్ = ఆవరణజలంవరకు, శెల్ల = వెళ్ళేటట్లుగా, నిమిర్న్దదు = పెరిగింది, శూర్ ఉరువిన్ పేయ్ = దైవకాంత అయిన యశోదయొక్క రూపాన్ని ధరించి వచ్చిన పిశాచి పూతనయొక్క, అళవు కణ్డ = ఆయుస్సు అంతాన్ని చూచిన, పెరుమానే = ఓ స్వామీ! నీ అళవు కణ్డ నెఱి = నీవు చేసి ముగించిన లీలలను, అఱికిలేన్ = ఇదమిత్థంగా పరిచ్ఛేదించి తెలియలేను.

భగవానుడు ఎవరినైనా పరిచ్ఛేదించదలిస్తే అతనికి ఆ పనిలో ఏ క్లేశం ఉండదు. కాని, కొందఱు అతనిని పరిచ్ఛేదించాలని ప్రయత్నిస్తే మాత్రం వారు పూతన నశించినట్లు నశిస్తారు- అన్నది ఈ పాశురసారం.



అవ :- మీరు తెలిసికోలేకపోతే పోనివ్వండి. సర్వజ్ఞుడనబడేవాడు, దక్షిణా మూర్తి రూపంలో ఇతరులకు ఉపదేశించేవాడైన శివుడైనా భగవానుని తెలియలేడా?- అని అంటే, పరమపురుషుని అనుగ్రహంతో కల్గిన జ్ఞానవైశద్యం వల్ల ఏ కొఱత లేకుండా ఉండే నేనుకూడా అతని వైభవసముద్రంలో తలమునకలను వేస్తూ, తీరాన్ని చేరలేనివాడనై తత్తరపడుతూ ఉంటూ, తన ప్రయత్నంతో తపస్సును చేసి పొందిన జ్ఞానశక్తులను చాలా గొప్పగా భావించి, తాను తెలిసికొన్నానని శివుడు అనుకోవడమా! ఇతరులకు బోధించడానికి సిద్ధపడడమా! ఇదేమి జ్ఞానహైన్యం! అని అంటూ రుద్రుడు ఆచార్యకత్వాన్ని తనపై ఆరోపించుకొన్న విషయాన్ని క్షేపోక్తితో పల్కుతున్నారు.

పూర్వం ఒకానొక సమయంలో మఱ్ఱిచెట్టునీడలో అగస్త్య- పులస్త్య- దక్ష- కాశ్యపులనే నల్గురికి ధర్మాన్ని ఉపదేశించినవాడు, విషాన్ని గ్రహించిన కంఠాన్ని కలవాడు అయిన శివుడు అయిదు జ్ఞానేంద్రియాల ద్వారాలలో ఉన్నవి, అడ్డగించడానికి వీలు కానివి అయిన తలుపులను మూసి, ఉపాయం- ఉపేయం కూడా తానే అయిన భగవానుని తెలిసి కోగలడా! (తెలిసికోలేడని భావం)

**4. నెఱి వాశల్ తానేయాయ్ నిన్ఱానై ఐన్దు**
**పొఱి వాశల్ పోర్క్కతవమ్ శాత్తి- అఱివానామ్**
**ఆలమరనీழల్ అఱమ్ నాల్ వర్క్కన్టురైత్త**
**ఆలమమర్ కణ్డత్తరన్**

అన్టు = పూర్వం ఒకానొక సమయంలో, ఆల మర నీழల్ = మఱ్ఱిచెట్టు నీడలో, నాల్వర్క్కు = అగస్త్య-దక్ష-పులస్త్య- కశ్యపులనే నల్గురికి, అఱమ్ ఉరైత్త = ధర్మాన్ని ఉపదేశించినవాడు, ఆలమ్ అమర్ కణ్డత్తు = విషాన్ని గ్రహించిన కంఠాన్ని కలవాడైన, అరన్ = శివుడు, ఐన్దు పొఱి వాశల్ = అయిదు జ్ఞానేంద్రియాల ద్వారాలలో ఉండే, పోర్ క్కదవమ్ = మూయడానికి సాధ్యం కాని పోరాడే తలుపులను, శాత్తి = మూసి, నెఱి వాశల్ తానే ఆయ్ నిన్ఱానై = ఉపాయం, ఉపేయం తానే అయిన భగవానుని, అఱివానామ్ = తెలిసికొన గలిగాడా ? (తెలిసికోలేకపోయాడని భావం.)

భగవదనుగ్రహం వల్ల విషధారణ శక్తిని, సంహార శక్తిని కల్గి ఉన్నంత మాత్రంతో, ఆ స్వామిని గ్రహించడం శివునకు సాధ్యం కాదని సారం.

అవ :- "లోకం అంతా రుద్రుడే సర్వాధికుడని నిర్ణయించి, అతని కాలికి మొక్కి స్తుతిస్తున్నదే! మీరు మాత్రం అతని జ్ఞానహైన్యాన్నిగూర్చి ప్రస్తావిస్తున్నారు. ఇదేమి ?"- అని కొందఱు ప్రశ్నించగా, రుద్రుడు పరతత్త్వం కాదనే విషయం ఆ ఇద్దఱి పేర్లు, వాహనాలు మొదలైనవాని స్వభావాలనుబట్టే నిర్ణయించ వచ్చునే!" అని ఇందులో అంటున్నారు. ఒకరి పేరు హరుడు- ఇంకొకరి పేరు నారాయణుడు. ఒకరి వాహనం జ్ఞానహీనం అయిన ఎద్దు- ఇంకొకని వాహనం వేదాత్మగా చెప్పబడే గరుడుడు. ఒకరిని తెలిపే ప్రమాణం పౌరుషేయాలైన ఆగమాలు- ఇంకొకనిని తెలిపే ప్రమాణం అపౌరుషేయం అయిన వేదం . ఒకరు నివసించే చోటు కఠినమైన పర్వతం- ఇంకొకరు నివసించే చోటు చల్లని సముద్రం. ఒకరి వృత్తి లయం- ఇంకొరి వృత్తి రక్షణం. ఒకరి ఆయుధం వేలాయుధం- ఇంకొకరి ఆయుధం శ్రీసుదర్శనం. ఒకరి రూపం తాపకరం అయిన అగ్నివర్ణం- ఇంకొకరి రూపం తాపహరం అయిన మేఘంతో పోలినది.

5. ఆరన్ నారణన్ నామమ్ ఆన్‌విడై పుళ్ళూర్తి
ఉరై నూల్ మఱై యుఱైయుమ్ కోయిల్ -వరై నీర్
కరుమ మ*ழ்*ిప్పళిప్పు క్కైయతు వేల్ నేమి
ఉరువ మెరి కార్ మేని యొన్ఱు

నామమ్ = (ఒకని) పేరు, అరన్ = హరుడని, నారణన్ = ఇంకొకని పేరు నారాయణుడని, ఊర్‌ది = ఒకని వాహనం, ఆన్ విడై = జ్ఞానహీనం అయిన పశువు (ఎద్దు), పుళ్ = (ఇంకొకని వాహనం) వేదాత్మకుడైన పక్షి (ప్రభువు), ఉరై = (ఒకనిని నిరూపించే ప్రమాణం) నూల్ = పౌరుషేయం అయిన శైవాగమం, మఱై = (ఇంకొకని ప్రమాణం) అపౌరుషేయం అయిన వేదం, ఉఱైయుమ్ కోయిల్ = (ఒకడు) నివసించే నివాసం, వరై = కఠినం అయిన పర్వతం, నీర్= (ఇంకొకడు నివసించే చోటు) చల్లని సముద్రం, కరుమమ్ = (ఒకని) వ్యాపారం, అ*ழ்*ిప్పు = సంహారం, అళిప్పు = (ఇంకొకనికి) రక్షణం, కైయదు = (ఒకనికి) చేతిలో ఉండే ఆయుధం, వేల్ = వేలాయుధం, నేమి = (ఇంకొకనికి) దయాపూర్ణం అయిన శ్రీసుదర్శనం, ఉరువమ్ = (ఒకని) రూపం, ఎరి = మండే నిప్పు వంటిది, కార్ = (ఇంకొకని రూపం) మేఘంవంటిది,



(కాని) ఒన్ఱు మేని = ఒకడు- అంటే- శివుడు ఇంకొకనికి- అంటే- భగవానునకు శరీరం.

అవ:- "హరుడు తెలిసికొన్నాడా?" అని అంటూ రుద్రుని హేళన చేస్తున్నారే ! అయితే, మఱి మీరు భగవానుని తెలిసికొని ఇతరులకు ఏ విధంగా ఉపదే శించారు? అని ప్రశ్నించగా, సత్త్వగుణం అధికం అయినపుడు తన ప్రయత్నంతో సర్వేశ్వరుని గొప్పతనంలో కొంచెం తెలిసికొన్నవాడు, రజస్తమో గుణాలను ప్రకోపించినపుడు "నేనే ఈశ్వరుణ్ణి" అని తలచి, ఎదిరించే రుద్రునివంటి వాడనా నేను! నాదగ్గర సాధనకోటిలోనికి చేరినది ఏమీ లేక పోవడాన్ని గమనించి, దానినే హేతువుగా గ్రహించి భగవానుడు స్వయంగా తన దయతో తనను దర్శింపచేసినందువల్ల నేను దర్శించ గలిగాను, కనుక, నాకు ఏ సమయంలో అయినా భగవానుని విస్మరించే అవకాశం లేదు- అని ఆ*ழ்*వార్లు ఇందులో అంటున్నారు.

6. ఒన్ఱు మఱన్దఱియేన్ ఓతనీర్ వణ్ణనై నాన్
ఇన్ఱు మఱప్పనో వే*ழ்*ైకాళ్- అన్ఱు
కరువజ్గత్తుళ్ కిడన్దు కై తొ*ழ்*ుతేన్ కణ్డేన్
తిరువరజ్గ మేయాన్ తిశై

అన్ఱు = అపుడు, కరు అరజ్గత్తుళ్ కిడన్దు = గర్భవాసంలో పడి ఉండి, తిరు అరజ్గమ్ మేయాన్ = శ్రీరంగంలో పరుండి ఉన్న స్వామియొక్క, తిశై = స్వభావాలను అన్నిటినీ, కణ్డేన్ = దర్శించాను, కై తొ*ழ்*ుతేన్ = చేతులను జోడించాను, ఒన్ఱుమ్ = అతని స్వరూపరూప గుణవిభూతులలో దేనినీ కొంచెం కూడా, మఱన్దఱియేన్ = మఱచి ఎఱుగను, ఏ*ழ்*ైకాళ్ = భగవద్విషయం అనే సంపదను కోల్పోయిన భాగ్యహీనులారా! నాన్ = దాసుణ్ణి అయిన నేను, ఓద నీర్ వణ్ణనై = సముద్రవర్ణుడైన భగవానుని, ఇన్ఱు= (అతనిచే అనుగ్రహింపబడ్డ జ్ఞానాన్ని కలవాడనై ఉండే) ఇపుడు, మఱప్పనో = మఱచిపోతానా! (మఱచిపోను)

అవ :- ఈ విధంగా అతడు సులభుడైతే, లోకం అంతా భగవానుని కాదని, కన్పించిన ఇతరదేవతల కాళ్ళలో పడి మొక్కడం ఎందుకు? అని, ప్రశ్నించగా, "తనపట్ల భక్తి లేనివారు తనను ఆశ్రయించకుండా ఉండడం

కోసం అతడు చేసిన మాయాజాలమే సుమా, ఈ ప్రపంచం అంతా''- అని ఇందులో అంటున్నారు.

7. తిశైయుమ్ తిశై యుఱు తెయ్‌వముమ్ తెయ్‌వ
త్తిశైయుమ్ కరుమఙ్గళెల్లామ్- అశై విల్ శీర్
క్కణ్ణన్ నెడుమాల్ కడల్ కడైన్ద కారోత
వణ్ణన్ పడైత్త మయక్కు

తిశైయుమ్ = దిక్కులతో కూడిన లోకాలు, తిశై ఉఱు తెయ్‌వమ్ = ఆ దిక్కులలో ఉండే దేవతలు, తెయ్‌వత్తు ఇశైయుమ్ కరుమఙ్గళ్ = ఆ యా దేవతలకు తగిన (సృష్ట్యాది) కార్యాలు, ఎల్లామ్ = అనే ఇవి అన్నీ, ఇశైవు ఇల్ శీర్ = నాశం లేని (సహజమైన) కల్యాణగుణాలను కల్గిన, కణ్ణన్ = శ్రీకృష్ణుడై అవతరించినవాడు, నెడు మాల్ = దాసులపట్ల అంతులేని భక్తవాత్సల్యాన్ని కలవాడు, కడల్ కడైన్ద = దేవతల అపేక్షనే హేతువుగా గ్రహించి, తన దివ్యదేహాన్ని సైతం శ్రమింపజేసికొని క్షీరాబ్ధిని చిలికినవాడు, కార్ ఓద వణ్ణన్= మేఘంవంటివాడు, సముద్రంవంటి వర్ణాన్ని కలవాడు అయిన భగవానుడు, పడైత్త = సృష్టించిన, మయక్కు= మోహాన్ని కల్గించే వస్తువులు.

**"నైవాసురప్రకృతయః ప్రభవంతి బోద్ధుమ్", "తవ పరిబ్రఢిమస్వభావం మాయాబలేన భవతాఽపి నిగూహ్యమానం పశ్యంతి కేచిదనిశం త్వదనన్యభావాః"** అనే స్తోత్రరత్న శ్లోకాలకు ఈ పాశురం మూలం.

అవ :- ఈ రీతిలో తనను ఆశ్రయించనివారినే మోహింపజేస్తున్నాడు. తనను ఆశ్రయించిన భక్తుల విషయంలో అయితే సత్యసంకల్పత్వమనే తన మహిమను తగ్గించుకొని, వారిపట్ల పక్షపాతాన్ని ప్రదర్శిస్తూ రక్షిస్తాడని ఇందులో అంటున్నారు.

8. మయఙ్గ వలమ్బురి వాయ్ వైత్తు వాన
త్తియఙ్గు మెఱికతిరోన్ తన్నై- ముయఙ్గ మరుళ్
తేరాழియాల్ మఱైత్తతు ఎన్ నీ తిరుమాలే !
పోరాழి క్కైయాల్ పొరుతు



తిరుమాలే = శ్రియఃపతీ!, నీ = సత్యసంకల్పుడవైన నీవు, మయఙ్గ, అమరుళ్=(సైన్యం) నిండిన మహాభారతయుద్ధభూమిలో, పోర్ ఆழி కైయాల్= యుద్ధం చేయడానికి సాధనం అయిన చక్రాన్ని కల శ్రీహస్తంతో, పొరుదు = (భీష్మునితో) యుద్ధం చేసి, మయఙ్గ = (అనుకూలురు, ప్రతికూలురు అందఱూ) మోహించే రీతిలో, వలమ్ పురి = (దక్షిణావర్త శంఖం అయిన) శ్రీపాంచజన్యాన్ని, వాయ్ వైత్తు = నోటిలో పెట్టుకొని ఊది, వానత్తు ఇయఙ్గుమ్= ఆకాశంలో సంచరించే, ఎఱి కదిరోన్‌తన్నై = కిరణాలను వెదజల్లే సూర్యుని, తేర్ ఆழியాల్ = చక్రంతో, మఱైత్తతు= ఆచ్ఛాదించి నది, ఎన్ = ఎందుకోసం?

ఈవిధంగా చేయడం భగవానుని సత్యసంకల్పత్వానికి అనుగుణమా? అని అంటే, అనుగుణమే. భగవానుని సంకల్పం ఏదీ వ్యర్థం కాదు - అన్నది సామాన్యసంకల్పం. ఏది ఏమయినా ఏం చేసినా భగవద్భక్తులను రక్షిస్తాను- అన్నది స్వామి విశేషసంకల్పం. ఇది వ్యర్థం కాకుండా ఉండడంకోసం సామాన్య సంకల్పాన్ని మార్చుకోవడం సత్యసంకల్పత్వానికి శోభను కల్గిస్తుందే తప్ప, అపకర్షను కల్గించదు. "ఆయుధం ఎత్తను'' అని సంకల్పించాడు శ్రీకృష్ణుడు. భగవానుని ఆయుధం ఎత్తేటట్లు చేస్తానని సంకల్పించాడు భక్తుడైన భీష్ముడు. భక్తసంకల్పసిద్ధికోసం తన సంకల్పాన్ని మార్చుకొని, విశేషసంకల్పాన్ని సఫలం శ్రీకృష్ణుడు చేశాడు.

అవ :- "ఈ విధంగా భక్తులనే రక్షిస్తాడా! మిగిలినవారు ఇక నశించి పోవలసిందేనా మఱి?'' అని అంటే, ఆ విధంగా కాదు; అందఱికి ఆపద వచ్చి నపుడు, "దాసులు, దాసులు కానివారు'' అనే వ్యత్యాసం ఏమీ లేకుండా, సత్తను కల అందఱినీ తన గొప్పతనానికి తగని పనులను సైతం చేసి అయినా రక్షించే స్వభావాన్ని కలవాడు- అని ఇందులో అంటున్నారు. మహాబలివల్ల, ప్రళయం వల్ల- రెండు రీతులలో లోకాలకు ఆపదలు వచ్చినపుడు తాను యాచకుడై, మానం లేని వరాహమై తన మహిమకు తగని రీతిలో వేంచేసి రక్షించినవాడితడే- అని ఇందులో సదృష్టాంతంగా ఆழ்వార్లు పల్కుతున్నారు.

9. పారు కోట్టోరేనమాయ్ ప్పుక్కిడన్దాయ్‌క్కు అన్ఱు
ఒరు కోట్టిన్ మేల్ కిడన్దతన్ఱే- విరితోట్ట

**శేవడియై నీట్టి త్తిశై నడుఙ్గ విణ్ తుళఙ్గ**
**మావడివిల్ నీ యళన్ద మణ్**

విరి తోట్ట శే అడియై = విరిసిన రేకులను కల తామరవంటి ఎఱ్ఱని శ్రీపాదాన్ని; నీట్టి = పెంచి, తిశై నడుఙ్గ = ఏ దిశలో ఉన్నవారు అయినా జంకేటట్లుగా, విణ్ తుళఙ్గ = పైలోకంలో ఉండేవారు భయపడేటట్లుగా, మా వడివిన్ = త్రివిక్రముడ వైన గొప్ప రూపంతో, నీ అళన్ద = నీవు కొలిచిన, మణ్ = భూమి, పొరు కోట్టు= పోరాడే దంతాలను కల, ఓర్ ఏనమ్ ఆయ్ = సాటి లేని వరాహమై, పుక్కు ఇడన్దాయ్క్కు = ప్రళయజలంలో మునిగి ఎత్తిన నీకు, అన్ఱు = ఆ కాలంలో, ఉన్ =నీయొక్క, ఒరు కోట్టిన్ మేల్ = ఒక దంతం అగ్రంలో, కిడన్దదు అన్ఱే = అణగి ఉన్నది కదా!

ఆపద వచ్చినపుడు జీవుల అప్రతిషేధాన్నే ఆధారంగా చేసికొని, వరాహావతారంలో వలె శిరస్సుపై ధరించి రక్షిస్తాడు. త్రివిక్రమావతారంలోవలె తలపై కాలును పెట్టి రక్షిస్తాడు. రక్షించేటపుడు చిన్నరూపం ఎత్తాలి, పెద్దరూపం ఎత్తాలి- అనే నిర్బంధం ఏమీ స్వామికి లేదు- అని వీటిద్వారా సూచింపబడింది.

అవ :- గడచిన పాశురంలో చెప్పిన రీతిలోనే గొప్ప వరాహరూపాన్ని ధరించి, తన దంతాగ్రానికి కూడా చాలని భూమిని ధరించే అనాయాసమైన లీలను చేసి రక్షించడం మాత్రమే కాకుండా, చిన్న మఱ్ఱి చిగురుటాకుపై చాలా చిన్న శిశువురూపాన్ని ధరించి అన్ని లోకాలను మింగివేయడమనే గొప్ప లీలను చేసి ఇతడు రక్షించిన లీలకూడా ఒకటి ఉన్నది సుమా - అని అంటున్నారు. ఆ విధంగా రక్షించేటపుడు ఇటువంటి ఈ లీలనే చేసి రక్షిస్తావనే నియమం లేదు. అరుదైన లీలను చేసికూడా రక్షించేవాడవు నీవేకదా! - అని ఇందులో అంటున్నారు.

**10. మణ్ణుమ్ మలైయుమ్ మఱి కడలుమ్ మారుతముమ్**
**విణ్ణుమ్ వి*ళు*ఙ్గియతు మెయ్యేన్బర్- ఎణ్ణిల్**
**అలకళవు కణ్డ శీరా*ళి*యాయ్క్కు అన్ఱి-**
**వ్వులకళవు ముణ్డో వున్ వాయ్**

మణ్ణుమ్ = భూమి, మలైయుమ్ = పర్వతాలు, మఱి కడలుమ్ = అలలు లేచే సముద్రాలు, మరుతమ్ = గాలి, విణ్ణుమ్ = ఆకాశం- అనే వీటిని అన్నిటినీ, వి*ళు*ఙ్గియతు = ఆరగించినది, మెయ్ ఎన్బర్ = నిజం - అని ఋషులు అంటున్నారు, ఎణ్ణిల్ = దీనిని లెక్కిస్తే, అలకు అళవు కణ్డ శీర్ ఆ*ళి*యాయ్క్కు = లెక్కకు మించిన కల్యాణగుణాలను, శ్రీసుదర్శనాన్ని కల నీకు, అన్ఱు =అపుడు, ఉన్ వాయ్= నీ నోరు, ఇవ్వులకు అళవుమ్ ఉణ్డో = ఈలోకాల పరిమితికి చాలిన విస్తృతిని కల్గినదై ఉన్నదా ఏమి !

అవ :- ఈ విధంగా గడచిన పది పాశురాలలో భగవానుని అతిశయాలను అనుభవిస్తూ తమకు అతనిపట్ల ఉండే గొప్ప భక్తినిగూర్చి పలికారు. ఇపుడు, ఇక కరణాలను కల్గిన తమకంటే తమ కరణాలకు అతనిపట్ల భక్తి అతిశయించి ఉండే తీరునుగూర్చి పల్కుతున్నారు. తిరువాయ్మొ*ళి*లోని **"ముడియానే"** **(3-8)** అనే దశకంలో నమ్మా*ళ్వా*ర్లకు కల్గిన స్థితివంటి స్థితి పొయ్కైయా*ళ్వా*ర్లకు కల్గిందనే అంశాన్ని ఈ పాశురం తెలుపుతున్నది.

**11. వాయవనై యల్లతు వా*ళ్*త్తాతు కై యులకమ్**
**తావనై యల్లతు తాన్ తొ*ళా* - పేయ్ములై న**
**ఞ్జాణాక వుణ్డాన్ ఉరువొడు పేరల్లాల్**
**కాణా కణ్ కేళా శెవి**

వాయ్= నా వాక్కు, అవనై అల్లదు = ఆ భగవానుని తప్ప ఇంకెవ్వరినీ, వా*ళ్*త్తాదు= కీర్తించదు, కై తామ్ = ఇక శ్రీహస్తాలు అయితే, ఉలకమ్ తాయవనై అల్లదు = లోకాలను అన్నిటినీ తడవి కొలిచిన త్రివిక్రముని తప్ప ఇంకొకరిని, తొ*ళా*= నమస్కరించదు, పేయ్ ములై నఞ్జు = పిశాచి అయిన పూతనస్తన్యంలో ఉండే విషాన్ని, ఊణ్ ఆక ఉణ్డాన్ = (ధారకంగా) భోగ్యంగా తలచి ఆరగించిన భగవానుని, ఉరు వొడు పేరల్లాల్ = రూపాన్ని, నామాన్ని తప్ప (ఇంక దేనినీ), కణ్ కాణా శెవి కేళా = కన్నులు చూడవు, చెవులు వినవు.

హృషీకేశుడు కనుక ఈ రీతిలో అన్ని ఇంద్రియాలు స్వామి అధీనాలయ్యాయి అని భావం.

అవ :- గడచిన పాశురంలో పొందదగినవాడుగా (ప్రాప్యస్వరూపుడుగా) చెప్పబడ్డ భగవానుని ఆశ్రయించేటపుడు, అతనిని పొందించదగిన సాధనం భక్తి - అని ఇందులో అంటున్నారు. లేక, తమ సాధ్యభక్తినిగూర్చి ఆఴ్వార్లు తెలిపారనికూడా చెప్పవచ్చు. భగవానుడే ఉపాయంగాను, ఉపేయంగాను ఉండగా, కొందఱు భక్తిని ఇతనిని పొందే ఉపాయంగా గ్రహిస్తున్నారే! - అని అంటున్నారనికూడా చెప్పవచ్చు.

**12. శెవి వాయ్ కణ్ మూక్కు ఉడలెన్దైమ్బులనుమ్ శెన్దీ**
**పువికాల్ నీర్ విణ్ పూత మైన్దుమ్- అవియాత**
**ఞానముమ్ వేళ్వియుమ్ నల్లఱము మెన్బరే**
**ఏనమాయ్ నిన్ఱార్క్కియల్వు**

శెవి వాయ్ కణ్ మూక్కు ఉడల్ ఎన్ఱు ఐమ్ పులనుమ్ = చెవులు, జిహ్వ, కన్నులు, ముక్కు, త్వక్కు- అనే అయిదు జ్ఞానేంద్రియాలు. శెమ్ తీ పువి కాల్ నీర్ విణ్ పూదమ్ ఐన్దుమ్ = అగ్ని, భూమి, గాలి, జలం, ఆకాశం - అనే అయిదు పంచభూతాలవల్ల ఏర్పడ్డ దేహం, అవియాద ఞానముమ్ = నాశం లేని భక్తిరూపాపన్న జ్ఞానం, వేళ్వియుమ్ = (ఈ భక్తికి సాధనం అయిన) అగ్నిహోత్రం మొదలైన కర్మలు, నల్ అఱముమ్ = భక్తిని కలుగజేసే వివేకం, విమోకం - మొదలైన ఆత్మగుణాలు, ఏనమ్ ఆయ్ నిన్ఱార్క్కు = (అపేక్షను ఎదురుచూడకుండా తానే రక్షించే) వరాహమూర్తి అయిన భగవానుని పొందడానికి, ఇయల్వు ఎన్బరే = సాధనం అని అంటున్నారే! (ఏమి లోకుల జ్ఞానహీనత !).

అవ :- భగవానుని యథాతథంగా తెలిసికొని అనుభవించడానికి యోగ్యతను కలవారు నిత్యసూరులే. ఈవిధంగా ఉన్నా, సంసారులైన మనవంటివారుకూడా ఆశ్రయించేటట్లుగా అతడు తనను సులభునిగా చేసికొంటాడు- అని ఇందులో అంటున్నారు.

**13. ఇయల్వాక ఈన్తుఴాయానడిక్కే శెల్ల**
**ముయల్వార్ ఇయలమరర్ మున్నమ్- ఇయల్వాక**
**నీతియా లోతి నియమఙ్గళాల్ పరవ**
**అతియాయ్ నిన్ఱారవర్**

మున్నమ్ = అనాదికాలంగా, ఇయల్ అమరర్ = యోగ్యతను కల్గినవారైన నిత్యసూరులు, ఈన్ తుఴాయాన్ అడిక్కే శెల్ల = అందమైన తులసిని అలంకరించుకొన్న పురుషోత్తముని శ్రీపాదాలలో చేరడానికి, ఇయల్వు ఆక = తగినట్లు, ముయల్‌వార్ = ప్రయత్నాన్ని చేసేవారు, ఇయల్వు ఆక = మిగిలినవారికికూడా తగిన రీతిలో, నీదియాల్ ఓది = క్రమానుసారంగా తిరునామాలను అనుసంధించి, నియమఙ్గళాల్ పరవ = శాస్త్రనియమాలతో పొగడే రీతిలో, అవర్ = ఆ స్వామి, ఆది ఆయ్ నిన్ఱార్ = చేతనుని విషయీకరించడంలో ముందంజ వేస్తాడు.

"పూర్వో యో దేవేభ్యో జాతః" అని, "మహాపురుష! పూర్వజ!" అనే రీతిలో భగవానుడు తానే ముందుగా జీవులను ఉద్ధరించడంకోసం ఎన్నెన్నో అవతారాలు ఎత్తి, పడరాని పాట్లు పడి, వీరికి ప్రథమసుకృతాన్ని కల్గించి, తన విషయంలో రుచిని కల్గించి, తనను అనుభవించడానికి కరణాలను ఇచ్చి, ఉపాయంగా నిలచి, ఫలాన్ని ఇస్తాడు. అందువల్ల ఆశ్రయించడంలో లోటు లేదు.

అవ :- "ఈ విధంగా రుచిని కల్గించడం దగ్గరనుండి సకలప్రయత్నాలను చేసి, జీవుని శ్రేయస్సుకోసం పాటుపడే సర్వేశ్వరుని విడచి, సంసారులు కన్పించిన దేవతలందఱి కాళ్ళలో మొక్కుతూ తిరుగుతున్నారే!'' అని అంటే, "జ్ఞానహీనులైనవారు ఆ విధంగా చేసినా, వారిచే ఆశ్రయింపబడే దేవతలచేత ఆశ్రయింపబడేవాడితడే సుమా!'' - అని ఇందులో అంటున్నారు.

**14. అవరవర్ తాన్దామ్ అఱిన్దవాఱేత్తి**
**ఇవరివ రెమ్బెరుమా నెన్ఱు- శువర్ మిశై**
**చ్చార్త్తియుమ్ వైత్తుమ్ తొఴువర్ ఉలకళన్ద**
**మూర్త్తి యురువే ముతల్**

అవర్ అవర్=రజోగుణాన్ని, తమోగుణాన్ని కల కొందఱు, తామ్ తామ్ అఱిన్ద వాఱు = తమ తమ గుణాలకు తగినట్లుగా తాము తెలిసిన రీతిలో, ఇవర్ ఇవర్ ఎమ్బెరుమాన్ ఎన్ఱు ఏత్తి = వీరు వీరు మనకు స్వాములు- అని

(కొందఱు దేవతలను ఉద్దేశించి) పొగడి, శువర్ మిశై చ్చార్త్తియుమ్ = గోడలపై వారి చిత్తరువులను వ్రాసి, వైత్తుమ్ = విగ్రహాలుగా ప్రతిష్ఠను చేసి, తొఴువర్= కొలుస్తారు. (అయితే) ఉలకు అళన్ద = (ఆవిధంగా కొలిచేవారి తలలపైకూడా తన శ్రీపాదాన్ని పెట్టిన) లోకాలను అన్నిటినీ కొలిచిన, మూర్త్తి ఉరువే = త్రివిక్రమమూర్తిరూపమే, ముదల్ = ప్రధానమైనది.

**"ఏకః ప్రాసీసరత్ పాద మేకః ప్రాచిక్షళన్ముదా, అపరోఽభ్యధరన్మూర్ధ్నా కోఽధిక స్తేషు గణ్యతామ్"** అనే శ్లోకార్థం ప్రకృతంలో భావ్యం.

అవ :- "మీరు శ్రీమన్నారాయణుడు ప్రధానుడని అంటున్నారు. కాని, లోకంలో ఇంకా కొందఱు ఆశ్రయించేవారుగా, కొందఱు ఆశ్రయింపబడేవారుగా కన్పిస్తున్నారుకదా!'' అని అంటే, "అది అంతా వ్యర్థం'' అని ఇందులో అంటున్నారు.

**15.** **ముతలావార్ మూవరే అమ్మూవరుళ్ళుమ్**
**ముతలావాన్ మూరినీర్ వణ్ణన్- ముతలాయ**
**నల్లా నరుళల్లాల్ నామనీర్ వైయకత్తు**
**పల్లా రరుళుమ్ పఴుతు**

మూవరే = బ్రహ్మ, విష్ణు, శివులనే ఈ ముగ్గురే, ముదలావార్ = ముఖ్యమైనవారు, అమ్మూవరుళ్ళుమ్ = ఆ ముగ్గురు మూర్తులలో, మూరి నీర్ వణ్ణన్ = విస్తరించిన సముద్రంవంటి వర్ణాన్ని, స్వభావాన్ని కలవాడైన భగవానుడే (శ్రీన్నారాయణుడే), ముదలావాన్ = కారణభూతుడు, ముదలాయ = సర్వకారణ భూతుడైన, నల్లాన్ = ఉపకారకుడైన అతనియొక్క, అరుళ్ అల్లాల్= కృపతప్ప, నామ నీర్ వైయకత్తు = ప్రసిద్ధమైన సముద్రం చుట్టి ఉండే భూలోకంలో, పల్లార్ = మిగిలిన పలువురి, అరుళుమ్ =కృపకూడా, పఴుదు= వ్యర్థమైనది.

రజస్సు, తమస్సు కలిగినవారి కృపవల్ల కలిగే ఫలం, వారిని ఆశ్రయించిన వారిని ఇంకా ఇంకా సంసారంలోకి తోసివేస్తుంది. అల్పంగా, అస్థిరంగా ఉంటుంది. అందువల్ల వారి కృప వ్యర్థం. శ్రీమన్నారాయణుని కృపే సఫలం- అని భావం.



అవ :- ఇతరదేవతలను ఆశ్రయించి, భగవదాశ్రయణాన్ని కోల్పోయిన లోకుల నష్టాన్ని పరత్వనిష్కర్షను చేయడంద్వారా గడచిన పాశురంలో పరిహరించిన ఆఴ్వార్లు తాము అనాదికాలంగా ఇతర దేవతలను, ఇతర సాధనాలను ఆశ్రయించి, భగవద్విషయాన్ని విడిచి, దూరమై, పరిభ్రమించి, దుఃఖాన్ని అనుభవించడాన్ని తలచి ఇందులో చాలా ఖేదపడుతున్నారు.

**16.** **పఴుతే పల పకలుమ్ పోయిన వెన్ఱు అఞ్జి**
**అఴుతేన్ అరవణైమేల్ కణ్డు- తొఴుతేన్**
**కడలోతమ్ కాలలైప్ప క్కణ్వళరుమ్ శెఙ్గణ్**
**అడలోతవణ్ణరడి**

కడల్ ఓదమ్ = క్షీరాబ్దిలోని కెఱటాలు, కాల్ అలైప్ప = తన శ్రీచరణాలను సంవాహనం చేయగా, కణ్ వళరుమ్ = (దానివల్ల సుఖంగా) నిద్రించేవాడై, శెమ్ కణ్ = ఎఱ్ఱని అందమైన నేత్రాలను కలవాడై, అడల్ ఓద వణ్ణర్ = నిబిడమైన అలలవంటి వర్ణాన్ని కలవాడైన భగవానునియొక్క, అడి = శ్రీపాదాలను, అరవు అణైమేల్ కణ్డు = ఆదిశేషులనే పడుకపై చూచి, తొఴుదేన్= ఇపుడు నమస్కరించాను. పల పకలుమ్ = (గడచిన) అనాదికాలం సైతం, పఴుదే పోయిన ఎన్ఱు = వ్యర్థంగా గడచిపోయింది - అని, అఞ్జి అఴుదేన్= భయపడి రోదించాను.

**"యన్ముహూర్తం క్షణం వాఽపి వాసుదేవో న చింత్యతే, సా హానిః తన్మహ చ్ఛిద్రం సా భ్రాంతిః సా చ విక్రియా"** అనే సూక్త్యర్థం స్మరణీయం.

అవ :- సముద్రవర్ణుడైన క్షీరాబ్ధిశాయి శ్రీచరణాలను సేవించకుండా వ్యర్థంగా పలు దినాలు గడచిపోయాయి - అని ఏడ్చాను - అని గత పాశురంలో అన్నారు. "ఆ భగవానుడు శయనించిన క్షీరాబ్ధి చాలా దూరంలో ఉన్నందున కోల్పోతే కోల్పోవచ్చు. కాని, అతడే స్వయంగా అందఱి తలలపై శ్రీపాదాలను పెట్టి, తన శ్రీచరణరేణు అందఱికి దానాన్ని చేసిన త్రివిక్రమావతార సమయాన్నికూడా నేను కోల్పోయానే! ఎంత పాపిని! అయ్యో!'' అని - ఇందులో అంటున్నారు.

17. అడియుమ్ పడి కడప్ప త్తోళ్ తిశైమేల్ శెల్ల
ముడియుమ్ విశుమ్బుళన్ద తెన్బర్- వడి యుకిరాల్
ఈర్న్దాన్ ఇరణియన తాకమ్ ఇరుఞ్జిఱైప్పుళ్
ఊర్న్దాన్ ఉలకళన్ద నాన్ఱు

వడి ఉకిరాల్ = పదునైన గోళ్ళతో, ఇరణియనదు ఆకమ్ = హిరణ్యకశిపుని వక్షస్సును, ఈర్న్దాన్ = చీల్చినవాడై, ఇరుమ్ శిఱై పుళ్ = పెద్ద రెక్కలను కల పక్షి అయిన గరుడుని, ఊర్న్దాన్ =నడపినవాడైన భగవానుడు, ఉలకు అళన్ద నాన్ఱు = లోకాలను కొలిచినపుడు, అడియుమ్ = (అతని) శ్రీపాదం, పడి కడప్ప = భూమిని కొలువగా, తోళ్ = భుజాలు, తిశై మేల్ శెల్ల = దిక్కులకు పైన వ్యాపించగా, ముడియుమ్ = కిరీటంకూడా, విశుమ్బు = ఆకాశాన్ని, అళన్దదు = వ్యాపించింది, ఎన్బర్ = అని (జ్ఞానులు) అంటారు.

అవ :- భగవానుడు కడలిలో శయనించినపుడు, అక్కడినుండి వచ్చి భూమి పైన సంచరించి నపుడుకూడా నేను అవకాశాన్ని కోల్పోవడమేకాదు! కుడి చేయి, ఎడమ చేయి ఏదో తెలియనివారుకూడా ఉజ్జీవించేటట్లుగా అతడు గోకులంలోకి వచ్చి పుట్టినపుడు సైతం కోల్పోయానే అయ్యో? అని ఇందులో శోకిస్తున్నారు.

18. నాన్ఱ ములైత్తలై నఞ్జుణ్డు ఉఱి వెణ్ణెయ్
తోన్ఱ ఉణ్డాన్ వెన్ఱి శూழ் కళిఱ్ఱై- ఊన్ఱి
పొరుతుడైవు కణ్డానుమ్ పుళ్ళిన్ వాయ్ కీణ్డానుమ్
మరుతిడై పోయ్ మణ్ణళన్ద మాల్

నాన్ఱ ములై తలై = (పూతనయొక్క) వేలాడే స్తనాలలో ఉండే, నఞ్జు ఉణ్డు= విషాన్ని ఆరగించి, ఉఱి = ఉట్లలో పెట్టిన, వెణ్ణెయ్ = వెన్నను, తోన్ఱ ఉణ్డాన్ = ఆ దొంగతనాన్ని అందఱు గ్రహించేటట్లుగా ఆరగించినవాడు, వెన్ఱి శూழ் కళిఱ్ఱై = జయాన్ని, ఉపాయాన్ని కల గజం అయిన కువలయాపీడాన్ని, ఊన్ఱి పొరుదు = సమీపించి, పోరాడి, అడైవు కణ్డానుమ్= నశింపజేసినవాడు, పుళ్ళిన్ వాయ్ = బకరూపంలో వచ్చిన అసురుని నోటిని, కీణ్డానుమ్ = చీల్చినవాడు, మరుదు ఇడై పోయ్ = జంటగా ఉండే మద్దిచెట్ల నడుమ



దోగాడుతూ పోయి, మణ్ అళన్ద = లోకాలను (భూమిని) కొలిచినవాడు, మాల్= సర్వాధికుడైన భగవానుడే.

పాశురంలో అంతా శ్రీకృష్ణలీలలను కీర్తిస్తూ చివరలో- "మణ్ణళన్ద మాల్" అని త్రివిక్రమస్మరణ చేయడం. తగునా? అని అంటే, ఉన్నత - అధమ భేదం లేకుండా అందఱినీ దగ్గరకు చేర్చుకోవడం, అందాన్ని కల్గి ఉండడం, అతిమానుషలీలలను చేయడం, దాసుల విషయంలో వాత్సల్యం, తనను మార్చుకొని అయినా, శ్రమపెట్టుకొని అయినా భక్తులకు సహాయపడడం - ఇత్యాది గుణాలు త్రివిక్రమ - శ్రీకృష్ణావతారాలనే ఈ రెండు అవతారాలలో సమానాలు కనుక, వీరిని కలిపి ఆழ்వార్లు అనుసంధించారు.

అవ :- "నేను ఏ కాలంలోనూ భగవానుని స్పర్శసుఖానుభవాన్ని పొందలేక కన్నీటిని విడుస్తున్నాను. ఈ భూమి అయితే మన్నును కొలిచిన ఒక సందర్భంలో స్పర్శసుఖాన్ని అనుభవించింది. కాని, అతనిని నీ ఒడిలో పరుండబెట్టుకొని, ఎప్పుడూ దర్శించి తాకుతూ ఉండే నీవు ఏం తపస్సు చేశావో కదా!'' అని సముద్రంతో ఆழ்వార్లు అంటున్నారు.

19. మాలుమ్ కరుఙ్గడలే! ఎన్నోఱ్ఱాయ్? వైయకము
ణ్డాలినిలై త్తుయిన్ఱ వాழிయాన్ - కోల
క్కరుమేని చ్చెఙ్గణ్ మాల్ కణ్పడైయుళ్ ఎన్ఱుమ్
తిరుమేని నీ తీణ్డప్పెఱ్ఱు

వైయకమ్ ఉణ్డు = లోకాలను ఆరగించి, ఆలిన్ ఇలై = మఱ్ఱి చెట్టు ఆకుపై, తుయిన్ఱ = నిద్రించేవాడు, ఆழிయాన్ = సముద్రశాయియై ఉండేవాడు, కోల కరు మేని = అందమైన, నల్లని తిరుమేనిని, శెమ్ కణ్ = ఎఱ్ఱని నేత్రాలను కలవాడు, మాల్ = దాసులపట్ల వాత్సల్యాన్ని కలవాడు అయిన భగవానుడు, కణ్ పడైయుళ్ = నిద్రించేటపుడు, ఎన్ఱుమ్ = ఏ కాలంలో అయినా, తిరుమేని= (అతని) దివ్యమంగళ విగ్రహాన్ని, తీణ్డ పెఱ్ఱు = స్పృశించగల్గి, మాలుమ్ = ఆ ఆనందంతో మోహించే, కరుమ్ కడలే = నల్లని సముద్రమా! నీ, ఎన్ నోఱ్ఱాయ్ = నీవేమి నోము నోచావో కదా!

దానిని తెలిపితే నేను కూడా నోచి ఆ ఫలాన్ని పొందుతాను కదా! అని దివ్యసూరి హార్దభావం.

అవ :- "సముద్రం భగవానుని స్పృశించ గల్గి, మోహించడం మాత్రమేనా! ఆ పడుకను విడిచి, వచ్చి అవతరించినపుడుకూడా కొందఱు సంసారులకు, దేవతాంతరాలకు తనను అనుభవించే భాగ్యాన్ని అనుగ్రహించాడుకదా! కాని, నేను ఒక్కడనే కోల్పోయానే! అయ్యో!" అని దీనిలో ఆళ్వార్లు అంటున్నారు.

**20. పెఱ్ఱార్ తళై కళల ప్పేర్న్దోర్ కుఱళురువాయ్**
**చ్చెఱ్ఱార్ పడి కడన్ద శెఙ్గణ్‌మాల్ - నఱ్ఱా-**
**మరై మలర్ చ్చేవడియై వానవర్ కై కూప్పి**
**నిరై మలర్ కొణ్డు ఏత్తువరాల్ నిన్ఱు**

పెఱ్ఱార్ = తల్లిదండ్రులైన దేవకీవసుదేవుల, తళై కళల = కాలి సంకెళ్ళు తొలగే రీతిలో, పేర్న్దు = పాలసముద్రంనుండి లేచి వచ్చి, ఓర్ = సాటి లేని, కుఱళ్ ఉరు ఆయ్ =వామనరూపాన్ని ధరించినవాడై, శెఱ్ఱార్ పడి = ఆశ్రితుడైన ఇంద్రునకు విరోధి అయిన మహాబలి "తనది" అని అభిమానించిన లోకాన్ని, కడన్ద = కొలిచినవాడు, శెమ్ కణ్ మాల్ = ఎఱ్ఱని తిరునేత్రాలను కలవాడైన ఆశ్రితవ్యాముగ్ధుని, నల్ తామరై మలర్ శే అడియై= అందమైన కమలంవలె ఉండే ఎఱ్ఱని శ్రీపాదాన్ని, వానవర్ = దేవతలు, కై కూప్పి నిన్ఱు = అంజలిని చేస్తూ ఉన్నవారై, ఏత్తువర్ = కీర్తిస్తారు, ఆల్ = అయ్యో!

నాకు అటువంటి భాగ్యం దక్కలేదే! అని భావం. లేక, నావలె మనస్సు శిథిలం కాకుండా, కాళ్ళు చేతులు తడబడకుండా, స్థిరంగా ఉండి వారు కీర్తిస్తున్నారే! ఏమి భాగ్యం! అని ఆశ్చర్యపడుతున్నారని కూడా చెప్పవచ్చు.

అవ :- "భగవానుని మహిమను చూచి వెనుకంజ వేయకుండా, భక్తులతో కలసి ఉండడమే స్వభావంగా కలవాడని తెలిసి, అతని శ్రీపాదాలను ఆశ్రయించాలని చూడు, ఓ నా మనసా!" అని ఆళ్వార్లు ఇందులో తమ మనస్సును ఆళ్వార్లు ఇందులో ఉద్బోధిస్తున్నారు.



**21. నిన్ఱు నిలమఙ్గై నీరేఱ్ఱు మూవడియాల్**
**శెన్ఱు తిశై యళన్ద శెఙ్గణ్ మాఱ్కు- ఎన్ఱుమ్**
**పడై యాళి పుళ్ళూర్తి పామ్బణైయాన్ పాదమ్**
**అడై యాళి నెఞ్జే! యఱి**

నిన్ఱు = మహాబలిదగ్గరకు వెళ్ళి నిలచి, నిలమ్ = భూమిని, అమ్ కై = అందమైన చేతిలో, నీర్ ఏఱ్ఱు = దానజలధారాగ్రహణ పూర్వకంగా పరిగ్రహించి, మూ అడియాల్ =మూడు శ్రీపాదాలతో, శెన్ఱు తిశై అళన్ద = నడచిన రీతిలో వెడలి దిక్కులను అన్నిటినీ కొలిచిన, శెమ్ కణ్ మాఱ్కు = ఎఱ్ఱని కన్నులను కల సర్వాధికునకు, ఎన్ఱుమ్ = అన్ని కాలాలలోను, పడై = ఆయుధం, ఆళి = చక్రం, పుళ్ = గరుడాళ్వాన్, ఊర్ది = వాహనం, ఆళి నెఞ్జే= గంభీరం అయిన ఓ మనసా!, అఱి = దానిని తెలిసికో, పామ్బు అణైయాన్= ఆదిశేషుని పడుకగా కల్గిన భగవానుని, పాదమ్ = శ్రీపాదాలను, అడై = ఆశ్రయించు.

భగవానుడు దాసులకోసం తన స్వరూపాన్ని చెడగొట్టుకొనేవాడు, భక్తులతో ఏ తేడాలేకుండా కలవడం స్వభావంగా కలవాడు- అనే విషయాన్ని గ్రహిస్తే నీవు నీ నైచ్యాన్ని భావించి, వెనుకకు తగ్గకుండా అతనిని ఆశ్రయించ వచ్చు- అని భావం.

అవ :- "భక్తులతో కలవడమే స్వభావంగా కలవాడు" అని మీరు నన్ను ఏ విధంగా తెలిసికొన్నారు? - అని భగవానుడు ప్రశ్నించగా, "నేనొక్కడనే నా తెలిసికొన్నాను? నీ కిణాలను చూచి లోకం అంతా తెలిసికొన్నదికదా స్వామీ!" అని ఇందులో అంటున్నారు.

**22. అఱియు ములకెల్లామ్ యానేయు మల్లేన్**
**పొఱికొళ్ శిఱై యువణ మూర్న్దాయ్- వెఱి కమళుమ్**
**కామ్బేయ్ మెన్ తోళి కడై వెణ్ణె యుణ్డాయై**
**త్తామ్బే కొణ్డార్త్త తళుమ్బు**

పొఱి కొళ్ శిఱై = పలు రంగులను కల రెక్కలను కల్గిన, ఉవణమ్ = గరుడాళ్వాన్‌ను, ఊర్న్దాయ్ = అధిరోహించి, నడిపేవాడవై, వెఱి కమళుమ్=

పరిమళం గుబాళించే, కామ్బు ఏయ్ మెన్ తోళి = వెదుళ్ళవంటి సుకుమారం అయిన బాహువులను కల యశోదాదేవిచేత, కడై వెణ్ణెయ్ = చిలుకబడ్డ వెన్నను, ఉణ్డాయై = ఆరగించిన నిన్ను, తామ్బే కొణ్డు = ఒక చిన్న దారంతో, ఆర్‌త్త = కట్టినందువల్ల ఏర్పడ్డ, తழும்బు = కిణాన్ని, యానేయుమ్ అల్లేన్= నేను ఒక్కడనే కాదు తెలిసికొన్నది, ఉలకు ఎల్లామ్ అఱియుమ్ =లోకానికి అంతా తెలుసుసుమా!

భక్తిని కల నాకు మాత్రమే కాదు, ద్వేషాన్ని కల శిశుపాలాదులకు కూడా తెలుసు. **"దామోదరుడు"** అనే పేరు జగత్ప్రసిద్ధం కదా! అందువల్ల నీవు భక్తులతో కలిసే స్వభావాన్ని కలవాడవని లోకానికి అంతటికీ తెలిసిన విషయ మని భావం.

అవ :- "సర్వేశ్వరుణ్ణి అయిన నేను ఒక వనితకు భయపడడమా! ఆమెచేత కట్టుబడడమా! దానిని లోకం అంతా తెలిసికోవడమా! ఇదంతా ఏమి?'' అని పల్కుతూ శరీరంలోని కిణాన్ని (కాయవంటి గట్టిపడిన భాగాన్ని) మాటతోను, వస్త్రంతోను మఱుగుపఱచాలని భగవానుడు ప్రయత్నించాడు. అపుడు "ఒక కిణం మాత్రమే అయితే మఱుగు పఱచుకో వచ్చు. నీ శరీరం అంతా భక్తుల కార్యాలను చేసినపుడు ఏర్పడిన కిణాలేకదా ఉన్నాయి. స్వామీ! ఇందులో దేనిని మఱచిపోతావు? దేనిని మఱుగుపరుస్తావు?'' అని ఈ పాశురంలో ఆழ்వార్లు అంటున్నారు.

**23.** తழும்బిరున్ద శార్‌ఙ్గనాణ్ తోయ్‌న్దవా మழை
తழும்బిరున్ద తాళ్ శకడమ్ శాడి- తழும்బిరున్ద
పూఙ్గోతైయాళ్ వెరువ ప్పొన్ పెయరోన్ మార్బిడన్ద
వీఙ్గోతవణ్ణర్ విరల్

అమ్ కై = (నీ)అందమైన శ్రీహస్తంలో, శార్‌ఙ్గ నాణ్ = శార్‌ఙ్గమనే వింటి నారి, తోయ్‌న్ద = తగిలినందువల్ల ఏర్పడిన, తழும்బు = కిణం, ఇరున్ద ఆమ్= ఉన్నదట, తాళ్ =(నీ)శ్రీపాదాలలో, శకడమ్ శాడి = శకటాసురుని తన్నినందువల్ల ఏర్పడిన, తழும்బు ఇరున్ద = గుర్తు ఉన్నదట, పూమ్ కోదైయాళ్= అందమైన కేశభారాన్ని కల పెరియ పిరాట్టి, వెరువ = లోకానికి ఏం జరుగబోతున్నదో! ఏమో! అని భయపడే రీతిలో, పొన్ పెయరోన్ = హిరణ్యుడనే పేరును కల అసురునియొక్క, మార్బు ఇడన్ద = వక్షఃస్థలాన్ని చీల్చిన, వీఙ్గు ఓద వణ్ణర్ = పెరిగే అలలను కల సముద్రంవంటి వర్ణాన్ని కల స్వామియొక్క, విరల్ = వేళ్ళలో, తழும்బు ఇరున్ద = కిణాలు ఏర్పడ్డాయట.



నీవు ఆశ్రితపక్షపాతివి అనే దానికి నీ తిరుమేనిలో ఇన్ని గుర్తులుండగా, ఇక నీవు దానిని ఏ విధంగా కాదనగలవు? - అని హార్దభావం.

అవ :- "నా గొప్పతనాన్ని తెలిపే ఈ కిణాలు ఉంటే ఉండనివ్వండి. వెన్నను దొంగిలించిన నిన్ను దారంతో కట్టినపుడు ఏర్పడిన కిణాన్ని లోకం అంతా గ్రహించింది'' - అని (22) అంటూ "నేను వెన్నను దొంగిలించేటపుడు పట్టుబడినట్లుగా చెప్పారు కదా! - ఇదేమి?'' అని భగవానుని మనస్సులోని భావనగా తలచిన ఆழ்వార్లు "వెన్నను దొంగిలించి, కట్టుబడిన విషయాన్ని నీవు తెలియవా? ఏమి స్వామీ! నీ మాట?'' అని దీనిలో అడుగుతున్నారు.

**24.** విరలొడు వాయ్ తోయ్‌న్ద వెణ్ణెయ్ కణ్డు ఆయ్‌చ్చి
ఉరలోడుఉఱ్పిణిత్త నాన్ఱు - కురలోవా
దేఙ్గి నినైన్దు అయలార్ కాణ విరున్దిలైయే
ఓఙ్గోత వణ్ణా! వురై

విరలొడు వాయ్ తోయ్‌న్ద = నీ వేళ్ళలో, నోటిలో ఉండే, వెణ్ణెయ్ = వెన్నను, ఆయ్‌చ్చి = గోపిక అయిన యశోద, కణ్డు = చూచి, ఉరలోడు = రోటితో, ఉఱ ప్పిణిత్త నాన్ఱు = బాగా గట్టిగా బిగించి కట్టినపుడు, కురల్ ఓవాదు = ఏడ్చే గొంతు తగ్గకుండా, ఏఙ్గి = వెక్కిళ్ళు పెడుతూ, నినైత్తు = (అపుడు కూడా) వెన్నను దొంగిలించే విషయాన్నే తలుస్తూ, అయలార్ = మిగిలినవారంతా, కాణ = వేడుక చూచేటట్లుగా, ఇరున్దిలైయో = లేవా! (ఉన్నావుకదా !), ఓఙ్గు ఓద వణ్ణా = విజృంభించి పైకి ఎగసి పడే అలలను కల సముద్రంవంటి తిరుమేనిని కల స్వామీ!, ఉరై = నీవే నిజాన్ని పల్కు.

అపుడు నీ తిరుమేని అందం ఏవిధంగా ఉన్నదన్న విషయం ఒక విధంగా దర్శించాను. అపుడు నీవాక్ సౌందర్యం ఏవిధంగా ఉన్నదన్నది తెలిసేటట్లు ఒక మాట పల్కు- అని కూడా ఇక్కడ హార్దభావాన్ని చెప్పవచ్చు.

అవ :- అతడు విడువకుండా వెక్కుతూ ఏడ్చిన రీతిని చూచి, అభినివేశాన్ని పొంది, వీరు (ఆళ్వార్లు) కూడా విడువకుండా తాము అతనిని స్తుతించిన రీతినిగూర్చి ఇందులో పల్కుతున్నారు.

**25. ఉరై మేత్కొణ్డు ఎన్నుళ్ళ మోవాతు ఎప్పోదుమ్**
**వరైమేల్ మరతగమే పోల-తిరైమేల్**
**కిడన్దానై క్కీణ్డానై క్కేళలాయ్ ప్పూమి**
**యిడన్దానై యేత్తి యెళుమ్**

వరై మేల్ = పర్వతంపైన, మరకతమే పోల = మరకతమణి పొదిగిన రీతిలో, తిరైమేల్ = క్షీరాబ్ధిపై, కిడన్దానై = పరుండి ఉన్నవాడు, కేళలాయ్ = వరాహరూపియై, పూమి = లోకాన్ని, కీణ్డానై = అండభిత్తినుండి తీసి, విడిపించి, ఇడన్దానై = ఎత్తిన స్వామిని, ఎన్ ఉళ్ళమ్ = నా మనస్సు, ఓవాదు = విడువకుండా, ఎప్పోదుమ్ = అన్ని లోకాలలోను, ఉరై మేల్ కొణ్డు = వివరించాలని అభినివేశాన్ని పొంది, ఏర్‌ఱ్రి = అతని కల్యాణగుణాలనే పొగడి, ఎళుమ్ = ఉజ్జీవిస్తుంది.

"ముడియానే" (3-8) అనే తిరువాయ్‌మొళి దశకంలో వలె చేతనసమాధితో నా మనస్సు నాకంటే ముందుండి ఉజ్జీవించిందని నమ్మాళ్వార్లు అన్నట్లే ఈ ఆళ్వార్లు అంటున్నారు.

అవ :- వరాహ-నృసింహావతారాలకు వెనుకబడినవారి కొఱతను పోగొట్టడంకోసం తిరుమలైకు వచ్చి, స్వామి అందఱికీ సమీపంలో నిలచి ఉన్నాడని దీనిలో పొయ్‌కై ఆళ్వార్లు అంటున్నారు.

**26. ఎళువార్ విడై కొళ్వార్ ఈన్తుళాయానై**
**వళువా వకై నినైన్దు వైకల్- తొళువార్**
**వినైచ్చుడరై నన్దువిక్కుమ్ వేఙ్గడమే వానోర్**
**మనచ్చుడరై త్తూణ్డుమ్ మలై**

ఎళువార్ = ఇహలోకైశ్వర్యాన్ని వరంగా పొంది భగవానుని విడచిలేచి వెళ్ళిపోయే ఐశ్వర్యార్థులు, విడై కొళ్‌వార్ = కైవల్యాన్ని వరంగా పొంది భగవానుని విడచి నిత్యంగా విశ్లేషించిపోయే కైవల్యార్థులు, ఈన్ తుళాయానై = తీయని తులసీమాలను కల భగవానుని, వళువా వకై నినైన్దు = విశ్లేషించకుండా ఉండే రీతిని తలచి, వైకల్ = ప్రతిదినం, తొళువార్ = సేవించి, నమస్కరించేవారైన భగవత్ప్రాప్తికాములు - అనే ఈ ముగ్గురియొక్క, వినై చ్చుడరై = (వారి వారి ప్రాప్యానికి విరోధులైన) పాపాగ్నిని, నన్దువిక్కుమ్ = ఆర్పి వేసే, వేఙ్గడమే = వేంకటాచలమే, వానోర్ = నిత్యసూరుల, మన చ్చుడరై = మనస్సు అనే దీపాన్ని, తూణ్డుమ్ మలై = ప్రజ్వలింపజేసే పర్వతం.

పరమపదంలో ఉన్నపుడు భగవానుని సౌశీల్య సౌలభ్యాదిగుణాలు పగటి దీపంవలె వెలవెల పోతాయి- వాటిని అనుభవించేవారు అక్కడ లేనందువల్ల. ఈ లోకంలో అవి చీకటిగదిలోని దీపంవలె గొప్పగా ప్రకాశిస్తాయి. కనుక, ఆ గుణాలను విశేషంగా అనుభవింప జేయడంద్వారా వేంకటాచలం నిత్యసూరుల మనస్సును ప్రజ్వలింపచేస్తున్నది.

అవ :- తిరుమలైలో వేంచేసి ఉండే శ్రీవేంకటేశ్వరుని బాహువుల అలసటను చూడగానే ఆయా అవతారాలలో శత్రువర్గాన్ని చూర్ణం చేసిన అతని వీర కృత్యాలు అన్నిటినీ స్వామిలో దర్శించేటట్లుంటుంది - అని ఇందులో అంటున్నారు.

**27. మలైయాల్ కుడై కవిత్తు మా వాయ్ పిళన్దు**
**శిలైయాల్ మరామర మేళ్ శెఱ్ఱు- కొలైయానై**
**ప్పోర్క్కోడొశిత్తనవుమ్ పూఙ్గురున్దమ్ శాయ్‌త్తనవుమ్**
**కార్‌క్కోడు పఱ్ఱియాన్ కై**

మలైయాల్ = గోవర్ధనగిరితో, కుడై కవిత్తు = గొడుగుగా విస్తరింపజేసి, మా వాయ్ పిళన్దు = అశ్వరూపంలో వచ్చిన కేశి అనే అసురుని నోటిని చీల్చి, శిలైయాల్ = వింటితో, మరామరమ్ ఏళ్ శెఱ్ఱు = ఏడు మద్దిచెట్లను తొలిచి, కొలై యానై = (తనను) చంపడంకోసం నిలిపిన కువలయాపీడం - అనే ఏనుగుయొక్క, పోర్ కోడు ఒశిత్తనవుమ్= పోరాడే దంతాలను విఱిచినవాడు, పూమ్ కురున్దమ్ శాయ్‌త్తనవుమ్= పూచిన గురువిందచెట్టును కూల్చినవాడు, కార్ కోడు = మేఘంవలె ధ్వనించే శంఖాన్ని, పఱ్ఱియాన్ = పట్టినవానియొక్క, కై = శ్రీహస్తమే.

పాంచజన్యాన్ని పట్టుకొన్న కందిపోయే సుకుమారం అయిన ఈ శ్రీహస్తంతోనే సుమా! ఈ అరుదైన లీలలను చేశాడు- అని హార్దభావం.

అవ :- తిరుమలైలో వేంచేసి ఉండే వేంకటేశ్వరుని తిరుమేనిలో అందం, ఐశ్వర్యం, శీలం- మొదలైన గుణాలు తేజస్సును వెదజల్లుతూ ప్రకాశిస్తున్నాయి- అని ఇందులో అంటున్నారు.

**28.** **కైయ వలమ్బురియుమ్ నేమియుమ్ కార్‌వణ్ణ**
**త్తైయ! మలర్‌మకళ్ నిన్నాకత్తాళ్ - శెయ్య**
**మఱైయాన్ నిన్నున్దియాన్ మామతిళ్ మూన్ఱెయ్‌త**
**ఇఱైయాన్ నిన్నాక త్తిఱై**

కార్ = మేఘంవంటి, వణ్ణత్తు = వర్ణాన్ని, స్వభావాన్ని కల, ఐయ = స్వామీ!, వలమ్ పురియుమ్ = దక్షిణావర్త శంఖం అయిన శ్రీపాంచజన్యం, నేమియుమ్= శ్రీసుదర్శనం, కైయ = నీచేతిలో ఉన్నాయి, మలర్ మకళ్ = పూవులో అవతరించిన లక్ష్మీదేవి, నిన్ = నీయొక్క, ఆకత్తాళ్ = వక్షఃస్థలంలో ఉన్నది, శెయ్య మఱైయాన్ = నీ స్వరూప-రూప-గుణ- విభూతులను దర్శింప జేయడమనే ఋజుత్వాన్ని కల వేదాన్ని అధ్యయనం చేసే చతుర్ముఖుడు, నిన్= నీయొక్క, ఉన్దియాన్ = బొడ్డులోని తామరపూవులో పుట్టినవాడు, మా మదిళ్= గొప్ప కోటలను కల, మూన్ఱు = త్రిపురాలను, ఎయ్‌ద = బాణం ప్రయోగించి నశింపజేసిన, ఇఱైయాన్ = తనను ఈశ్వరునిగా అభిమానించే రుద్రుడు, నిన్ ఆకత్తు = నీ శరీరంలోని, ఇఱై = ఒక మూలను ఆశ్రయించి ఉన్నాడు.

బ్రహ్మ రుద్రాదులు కూడా భగవానుని తిరుమేనిని ఆశ్రయించి సత్తను పొందుతున్నారని అనడంవల్ల వేంకటేశ్వరుని ఐశ్వర్యం, శీలగుణం తెలుప బడ్డాయి.

అవ :- గడచిన పాశురంలో భగవానుని ఐశ్వర్యాన్ని అనుసంధించగానే ఆఴ్వార్ల మనస్సు వెనుకంజవేయగా, "మనసా ! ఉభయవిభూతినాథుడై ఉండే అతని మహిమను తలచి వెనుకకు జంకకు. అతడు భక్తులకు పరతంత్రుడు కదా! దీనిని బాగా తెలిసికో'' అని దీనిలో మనస్సుతో అంటున్నారు.



**29.** **ఇఱైయుమ్ నిలనుమ్ ఇరు విశుమ్బుమ్ కాఱ్ఱుమ్**
**అఱై పునలుమ్ శెన్దీయు మావాన్ -పిఱై మరుప్పిల్**
**పైఙ్గణ్మాల్ యానై పడు తుయరమ్ కాత్తళిత్త**
**శెఙ్గణ్ మాల్ కణ్డాయ్ తెళి**

ఇఱైయుమ్ = (భగవానుడు) పరమపదనాథుడుగాను, నిలైనుమ్ = భూమిగా, ఇరు విశుమ్బుమ్ = వ్యాపించిన విశాలమైన ఆకాశంగా, కాఱ్ఱుమ్= వాయువుగా, అఱై పులనుమ్ = శబ్దం చేసే జలంగా, శెమ్ తీయుమ్ = ఎఱ్ఱని అగ్నిగాను, ఆవాన్ = పరిణమిస్తున్నవాడు, పిఱై మరుప్పిల్ = బాలచంద్రునివంటి దంతాన్ని, పైయ కణ్ = అందమైన కళ్ళను కల్గిన, మాల్ యానై = బలిసిన ఏనుగుయొక్క(గజేంద్రుని), పడు తుయరమ్ = గొప్ప క్లేశాన్ని, కాత్తు = తీర్చి, అళిత్త = రక్షించిన, శెమ్ కణ్ మాల్ కణ్డాయ్ = ఎఱ్ఱ తామరలవంటి కన్నులను కల్గిన పరమపురుషుడే కదా!, తెళి = మనసా!, దీనిని చక్కగా తెలిసికో.

**"మాల్"** అనే పదం ద్వారా స్వామి గజేంద్రరక్షణ కోసం వేగంగా రావడం సూచింప బడింది. ఈ ధ్వన్యర్థాన్ని భట్టర్ **"యం పశ్యన్"** ఇత్యాది శ్లోకాలలో సరసంగా తెలిపారు.

అవ :- గత పాశురంలో భగవత్పరత్వాన్ని భావించి వెనుకకు తగ్గిన తమ మనస్సుకు ఆఴ్వార్లు ఉపదేశించి దానిని సంస్కరించారు. ఈ పాశురంలో మిగిలిన లౌకికవిషయాలలో ఆసక్తం కాని రీతిలో మనస్సును సంస్కరించి, స్వామి శ్రీపాదాలతో తమకు ఉండే సంబంధాన్ని తెలిసినవారియొక్క మనస్సు "భగవానుడే స్వయంగా తానే వస్తాడు'' అని వేచి ఉండకుండా, తానే తొందరపడి గొప్ప ప్రేమతో అతని దరి చేరుతుంది - అని అంటున్నారు.

**30.** **తెళితాక ఉళ్ళత్తై చ్చెన్నిఱీఇ ఞాన**
**త్తెళితాక నన్గుణర్ వార్ శిన్దై - ఎళితాక**
**త్తాయ్‌నాడు కన్ఱేపోల్ తణ్డుఴాయానడిక్కే**
**పోయ్ నాడి క్కొళ్ళుమ్ పురిన్దు**

తెళితాక = (మనస్సులో) కలత తీరి స్వచ్ఛత కలిగేటట్లుగా, ఉళ్ళత్తై = మనస్సును, శెమ్ నెఱీఇ = చక్కగా నిలిపి, ఞానత్తు= జ్ఞానంతో, ఎళితాక =

సులభంగా, నన్గు ఉణర్‌వార్ = చక్కగా తెలిసినవారియొక్క, శిన్దై = మనస్సు, ఎళితాక =సులభంగా, తాయ్ నాడు = (పశుసమూహం మధ్యలో ఉండే తన) తల్లిని వెదకి చేరే, కన్రేపోల్ = లేగదూడవలె, తణ్ తుழாయాన్ అడిక్కే =చల్లని తులసీమాలను కల సర్వేశ్వరుని శ్రీపాదాలనే, పురిన్దు = (భావించి) ఆశించి, పోయ్ = ఆశ్రయించి, నాడి క్కొళ్ళుమ్ = తానే పొందుతుంది. (ఇది నిశ్చయం)

అవ :- గత పాశురంలో "అడిక్కే" అని ఏకారంతో తమ మనస్సు భగవానుని శ్రీపాదాలను తప్ప ఇక దేనినీ భావించదని అన్నారు. దాసుల విషయంలో అతనికి ఉండే పారతంత్ర్య - వాత్సల్యాలను తలిస్తే, వేఱొక విషయాన్ని క్షణకాలం అయినా భావించడానికి సాధ్యమా! అని అంటున్నారు ఈ పాశురంలో.

31. పురి యొరు కైపఱ్ఱి ఓర్ పొన్నాழி యేన్ది
అరియురువు మాళురువు మాకి- ఎరియురువ
వణ్ణత్తాన్ మార్బిడన్ద మాలడియైయల్లాల్ మ-
ఱ్ఱెణ్ణత్తానామో విమై

పురి =దక్షిణావర్త (కుడివైపు పురులను కల) శంఖాన్ని, ఒరు కై పఱ్ఱి = ఒక చేతిలో పట్టుకొని, ఓర్ పొన్ ఆழி ఏన్ది = (ఇంకొక శ్రీహస్తంలో) సాటి లేనిది, అందమైనది అయిన చక్రాన్ని ధరించి, అరి ఉరువమ్ ఆళ్ ఉరువమ్ ఆకి = సింహరూపాన్ని, నరరూపాన్ని ధరించిన నరసింహరూపియై, ఎరి ఉరువ వణ్ణత్తాన్ = అగ్నిరూపంవంటి రూపాన్ని కల హిరణ్యునియొక్క, మార్బు ఇడన్ద= వక్షఃస్థలాన్ని చీల్చిన, మాల్ = ఆశ్రితపక్షపాతి అయిన భగవానుని, అడియై అల్లాల్ = శ్రీపాదాలు తప్ప, మఱ్ఱు = వేఱొక విషయాన్ని, ఇమై = క్షణకాలం (ఱెప్పపాటు కాలం) అయినా, ఎణ్ణత్తాన్ ఆమో = భావించడానికి వీలవుతుందా! (కాదు)

"ఇమై" అనే పదాన్ని, 'చూడు' అనే అర్థాన్ని ఇచ్చే క్రియగా అన్వయించి, ఓ మనసా! భగవానుని భక్తపారతంత్ర్య, వాత్సల్యాలను అనుసంధిస్తే ఇంకొక విషయాన్ని ఆలోచించే వీలుందా! ఆలోచించి చూడు-అనే అర్థాన్ని చెప్పవచ్చు.



అవ :- శాస్త్రాలలో చెప్పబడే కర్మజ్ఞానభక్తులనే సాధనానుష్ఠానాలలో అన్వయం లేకపోయినా, శేషశేషిభావం-అనే సంబంధమాత్రం తెలిసినవారైతే పరమ పదాన్ని తప్పక చేరవచ్చునని ఈ పాశురంలో అంటున్నారు.

32. ఇమైయాత కణ్ణాల్ ఇరుళకల నోక్కి
అమైయా ప్పొఱి పులన్గళైన్దుమ్- నమైయామల్
అకత్తణైప్పార్ అణైవరే అయిరవాయ్
నాకత్తణైయాన్ నకర్

ఇమైయాద కణ్ణాల్ = జ్ఞానసంకోచాన్ని లేని అంతరనేత్రమైన మనస్సుతో, ఇరుళ్ అకల = అజ్ఞానం అనే చీకటి పోయేటట్లు, నోక్కి = స్వరూపస్వభావాలను దర్శించి, అమైయా = అణచడానికి సాధ్యం కాని, పొఱి పులన్‌కళ్ = కన్ను మొదలైన అయిదు బాహ్యేంద్రియాలను, నమైయామల్ = నియంత్రించకుండా ఉన్నా, ఆకత్తు అణైప్పార్ = (అతడు నిర్హేతుకకృపతో తమపై వ్యామోహ పడినపుడు- అత్యాదరాన్ని చూపినపుడు), అతనిని మనస్సుతో భావించేవారు, ఆయిర వాయ్ నాకత్తు అణైయాన్ = వేయి నోళ్ళను కల ఆదిశేషుని పడుకగా కల్గిన స్వామియొక్క, నకర్ = నగరం అనే శ్రీవైకుంఠాన్ని, అణైవరే = తప్పక పొందుతారు.

"ఆకమ్" అనే పదానికి రూపమనే అర్థాన్ని చెప్పి, కామినుల రూపాలను ఆలింగనం చేసికొనేవారు పరమపదాన్ని పొందుతారా !- అనే అర్థాన్ని చెప్పవచ్చు. అపుడు పాశురం చివరలో గల ఏకారం వ్యతిరేకార్థకం.

అవ :- భగవానుని పరమోద్దేశ్యంగా చేసికోకుండా అనుష్ఠించే సంధ్యా వందనాది కర్మానుష్ఠానాలన్నీ నిష్ప్రయోజనాలు సుమా - అని దీనిలో అంటున్నారు.

33. నకర మరుళ్ పురిన్దు నాన్ ముకఱ్కు పూమేల్
పకర మఱై పయన్ద పణ్బన్- పెయరినైయే
పున్దియాల్ శిన్దియాదు ఓతి యురు వెణ్ణుమ్
అన్దియాలామ్ పయనఙ్గెన్

పూ మేల్ = ఉదయించిన తామరపూవుపై (తిరునాభీ కమలంలో), నాన్ ముకఱ్కు = చతుర్ముఖునకు, నకరమ్ అరుళ్ పురిన్దు = వాసస్థానాన్ని అనుగ్రహించి, పకర = ఇతరులకు (అధ్యయనం చేసేటట్లుగా) మఱై పయన్ద= వేదాన్ని ఉపదేశించిన, పణ్బన్=ఋజుత్వాన్ని కల స్వామియొక్క, పెయరినైయే= తిరునామాలనే, పున్దియాల్ శిన్దియాదు = మనస్సుతో భావించకుండా, ఓది ఉరు ఎణ్ణుమ్ = (మంత్రాలను) జపించి లెక్కను లెక్కించడమనే, అన్దియాల్= సంధ్యావందనంతో, అఱ్ఱు ఆమ్ పయన్ ఎన్? = కలుగబోయే ప్రయోజనం ఏమి? (ఏమీ ఉండదు)

భగవదారాధనాంగంగా కాకుండా చేసే కర్మానుష్ఠానాలన్నీ వ్యర్థాలని భావం.

అవ :- పరమపురుషునిపట్ల సహజమైన, గొప్పదైన భక్తిని కల్గినది, ఆ స్వామిని అనుభవించగల్గినది యశోదాదేవి ఒక్కతె మాత్రమే కదా! - అని ఇందులో అంటున్నారు.

**34.** **ఎన్నొరువర్ మెయ్యెన్బర్ ఏழ్ఱులకుణ్డు ఆలిలైయిల్**
**మున్నొరువనాయ ముకిల్‌వణ్ణా! - నిన్నురుకి**
**ప్పేయ్‌త్తాయ్ ములై తన్దాళ్ పేర్‌న్దిలళాల్ పేరమర్ క్కణ్**
**ఆయ్ త్తాయ్ ములై తన్ద వాఱు**

ఏழ్ ఉలకు ఉణ్డు = ఏడు లోకాలను ఉదరంలో పెట్టుకొని, ఆల్ ఇలైమేల్= ఒక మఱ్ఱి ఆకుపై, మున్ = పూర్వం ఒకానొక సమయంలో, ఒరువనాయ్ = ఏ సహాయం లేని ఒంటరివాడవై నిద్రించే, ముకిల్ వణ్ణా = మేఘవర్ణా!, ములై తన్దాళ్ = స్తన్యాన్ని ఇచ్చిన, పేయ్ తాయ్ = తల్లి రూపంలో వచ్చిన పిశాచి పూతన, పేర్‌త్తిలళ్ ఆల్ = కదలకుండా చచ్చిపడింది, ఆశ్చర్యం! పేర్ అమర్ కణ్ = ఒకదానితో ఇంకొకటి పోటీ పడి యుద్ధం చేసేటట్లుగా ఉండే పెద్ద పెద్ద నేత్రాలను కల, ఆయ్ త్తాయ్ = గొల్లవనిత రూపంలోని తల్లి అయిన యశోద, నిన్ ఉరుకి = నీపట్ల గొప్ప వాత్సల్యాన్ని కల్గి, ములై తన్ద ఆఱు = ఆమె నీకు స్తన్యాన్ని ఇచ్చిన రీతిని, ఒరువర్ = సాటి లేని మేటి జ్ఞానులైన ఋషులు, మెయ్ ఎన్బర్ = వాస్తవం అని అంటారు, ఎన్ = ఇది ఏ విధంగా పొసగుతుంది! (ఆశ్చర్యం !)



యశోద ప్రేమ లోకంలో కన్పించే ప్రేమవంటిది అయితే నిజం అనుకోవచ్చు. అసత్య ప్రేమే నిండిన ఈ లోకంలో మనకు ఈ ప్రేమ నిజంగా తోచ లేదే! అని భావం. ఏడు లోకాలను ఆరగించి, మఱ్ఱి చిగురులో తూగి, శిశువై ఉన్నపుడే పూతనను వధించిన నీ అఘటితఘటనాసామర్థ్యానికి ఏం కీడు మూడుతుందో! అనే భయంతో, స్తన్యాన్ని ఇచ్చిన యశోద ప్రేమకూడా ఒక సామాన్యమైన ప్రేమా! - అని విస్మితులవు తున్నారు. అనికూడా భావం.

అవ :- యశోదాదేవి ప్రేమను అనుసంధించగానే మనబోటివారి ప్రేమ విరోధంతో సాటిగా తోచడంవల్ల "ఈ అసత్యమైన మా ప్రేమను సహించాలి స్వామీ!" అని ఇందులో భగవానుని ప్రార్థిస్తున్నారు.

**35.** **ఆఱియ వన్బిల్ అడియార్‌తమార్వత్తాల్**
**కూఱియ కుత్తమా క్కొళ్ళల్ నీ- తేఱి**
**నెడియో యడి అడైతఱ్కన్ఱే ఈరైన్దు**
**ముడియాన్ పడైత్త మురణ్**

ఆఱియ అన్బు ఇల్ = అస్థానే భయశంకను కల్గించే, పొంగి పొరలే గొప్ప భక్తిని లేని, అడియార్ = దాసులు, తమ్ ఆర్వత్తాల్ =తమ సాధారణ స్నేహంతో, కూఱియ = పల్కిన మాటలను, నీ కుఱ్ఱమా క్కొళ్ళల్ = నీవు తప్పుగా గ్రహించకూడదు, ఈర్ ఐన్దు ముడియాన్ = పది శిరస్సులను కల రావణుడు, పడైత్త = చేసిన, మురణ్ = విరోధం (వైరం), తేఱి = క్రమంగా తేటపడి, నెడియోయ్ అడి =గొప్ప ఆశ్రిత వ్యాముగ్ధుడవైన నీయొక్క శ్రీచరణాలను, అడైదఱ్కు అన్ఱే = పొందడానికి కారణమైనదికదా!

**"తేఱి కుఱ్ఱమా క్కొళ్ళల్"** అనే అన్వయించి, నీ గొప్పతనాన్ని చూచి, మా నైచ్యాన్ని చూచి విచారించి, మా హీనోక్తులను దోషంగా గ్రహించవద్దు - అనే భావాన్ని చెప్పవచ్చు.

అవ :- **"కూఱియ కుఱ్ఱమా క్కొళ్ళల్"** అని మేము ప్రార్థించాలా? "నీవే నీ గొప్పతనానికి తగినట్లు యాచకుడవై వచ్చి దేవకార్యాన్ని సఫలం చేయడం- ఆ లీలతో మా వైరాన్ని పోగొట్టి, మమ్ములను నీవశం చేసికోవడం కోసమే కదా!" - అని దీనిలో అంటున్నారు.

**36.** ముర౯ై వలి తొలైైతఱ్కా మన్ఱే మున్నమ్
తరణి తనదాక త్తానే- ఇరణియనై
ప్పుణ్ణిరన్ద వళ్ళుకిరాల్ పొన్నాళ్ళిక్కైయాల్ నీ
మణ్ణిరన్దు కొణ్డ వకై

మున్నమ్ = పూర్వం ఒకానొక సమయంలో, తరణి తనదు ఆక తానే = భూమిని తన స్వంతంగా అభిమానించిన, ఇరణియనై = హిరణ్యకశిపుని, పుణ్ నిరన్ద = పుండు పడేటట్లుగా చీల్చిన, వళ్ ఉకిరాల్ = పదునైన గోళ్ళతో, పొన్ = అందంగా వెలిగే, ఆళ్ళి కైయాల్ = చక్రాన్ని కల్గిన శ్రీహస్తంతో, నీ = నీవు, మణ్ ఇరన్దు కొణ్డ వకై = భూమిని యాచించి పొందిన తీరు, ముర౯ై వలి తొలైదఱ్కు ఆమ్ అన్ఱే = మావంటి సంసారుల అహంకారమమకారాలను పోగొట్టడంకోసమే కదా!

భూమిని తనది అని అభిమానించడంలో హిరణ్యునకు, మహాబలికి తేడా లేకపోయినా, మహాబలిని హిరణ్యునివలె వధించకుండా క్షమించి విడువడానికి కారణం- అతడు హిరణ్యునివలె ద్వేషం లేనివాడు కావడంవల్ల, భాగతాపచరాన్ని చేయనందువల్ల, దాతృత్వమనే గుణాన్ని కల్గి ఉండడంవల్ల -హిరణ్యుని వధించిన చేతితోనే మహాబలిదగ్గర స్వామి యాచించాడు. ఏమి ఈ స్వామి గుణపక్షపాతిత్వం!- అని ఆశ్చర్యపడుతున్నారు.

అవ :- భగవానుడు మహాబలివద్దకు యాచకుడై వచ్చిన వృత్తాంతాన్ని ఆళ్ళ్వార్లు గత పాశురంలో ప్రస్తావించారు. ఆ రీతిలోనే తమపట్ల, తమతో మాత్రమే కాకుండా, అన్నికాలాలలో ఉండే చేతనులందఱిపట్ల "నన్ను గ్రహించ కూడదా'' అని తన అర్థిత్వం స్ఫురించేటట్లుగా వచ్చి, అందరు తనను ఆశ్రయించి, వినియోగించుకొనే రీతిలో సమీపంలోనే తిరుమలైలోనికి వచ్చి నిలచి ఉన్నాడని ఇందులో అంటున్నారు.

**37.** వకై యఱు నుణ్ కేళ్వి వాయ్‌వార్‌కళ్ నాళుమ్
పుకై విళక్కుమ్ పూమ్పునలు మేన్ది- తిశై తిశైయిన్
వేతియర్ కళ్ శెన్ఱిఱైఞ్జుమ్ వేఙ్గడమే వెణ్ శఙ్గమ్
ఊతియ వాయ్ మాలుకన్ద వూర్



వకై అఱు = అన్యదైవాలు, అన్యఫలాలు- (దేవతాంతరాలు, ప్రయోజనాంతరాలు) అనే ప్రకారాలను ఖండించేటట్లుగా, నుణ్ కేళ్వి వాయ్‌వార్‌కళ్ = సూక్ష్మమైన కర్మజ్ఞానాన్ని కలవారైన, వేదియర్‌కళ్ = విప్రులు, నాళుమ్ = ప్రతిదినం, పుకై విళక్కుమ్ = ధూపదీపాలను, పూమ్ పునలుమ్ = పూలబుట్టతో పాటు జలాన్ని, ఏన్ది = ధరించి తీసికొని వచ్చి, తిశై తిశైయిల్ = అన్ని దిక్కులనుండి, శెన్ఱు = (తిరుమలైకు) వచ్చి చేరి, ఇఱైఞ్జుమ్ = అంజలిని చేసే రీతిలో ఉండే, వేఙ్గడమే = వేంకటాద్రియే, వెణ్ శఙ్గమ్ = తెల్లని, పాంచజన్యమనే శంఖాన్ని, ఊదియ వాయ్ = ఊదిన పెదవిని కల, మాల్ = స్వామి, ఉకన్ద = అభిమానించి వేంచేసి ఉండే, ఊర్ = దివ్యదేశం.

ఆశ్రిత రక్షణానికి ఏకాంతమైన దేశం - అని స్వామి అభిమానించే దివ్యదేశం తిరుమల.

అవ :- ఈ విధంగా పరమపదనిలయుడు తిరుమలలో ఎంతో ఆదరంతో నిత్యవాసం చేస్తున్నందున, అతనితో సంబంధాన్ని పొందిన ఆ కొండపై ఉండే సర్పాలు, కోయలు, పైరును మేసే ఏనుగులు, వాటిని తఱిమే సాధనాలైన మణులు, పాములు దూరే పుట్టలు - మొదలైన వస్తువులను అన్నిటినీ ఆ స్వామినివలెనే, పరమపదంలో ఉండే వారివలె పరమోద్దేశ్యభూతులుగా ఆళ్ళ్వార్లు తలచి ఈ పాశురంలో అభిమానించి, ఆనందిస్తున్నారు.

**38.** ఊరుమ్ వరి యరవమ్ ఒణ్‌కుఱవర్ మాల్ యానై
పేర వెఱిన్ద పెరు మణియై - కారుడైయ
మిన్నెన్ఱు పుఱ్ఱుడైయుమ్ వేఙ్గడమే మేలశురర్
ఎమ్మెన్నుమాలతిడమ్

ఊరుమ్ = పాకుతూ సంచరించే, వరి అరవమ్ = ఒంటిపై గీతలను (రేఖలను) కల పాములు, ఒణ్ కుఱవర్ = (తిరుమలైలో నిత్యవాసాన్ని చేసే భాగ్యాన్ని కల) గొప్ప కోయలు, మాల్ యానై (క్కీడాక) = గొప్ప ఏనుగుకు తగినట్లుగా, (అది పారిపోవడం కోసం), ఎఱిన్ద పెరు మణియై = (కోయలు) విసరిన గొప్ప మాణిక్యాన్ని, కార్ ఉడైయ మిన్ ఎన్ఱు = మేఘంలో ఉండే మెఱుపు

అని తలచి, పుగ్ర్రు అడైయుమ్ వేజ్గడమ్ = (మెఱుపు తర్వాత పిడుగు పడుతుంది కనుక, పిడుగుకు భయపడి) పుట్టలోనికి దూరేటట్లుగా ఉండే తిరుమలైయే, మేల్ అశురర్ = గొప్ప దేవతలైన నిత్యసూరులు, ఎమ్ ఎన్నుమ్= మాది అని అభిమానించే, మాలదు ఇడమ్ = భగవానుని దివ్యదేశం.

నిత్య సూరులు "మాకు ప్రాప్యుడు" అని ఆరాధించే స్వామికి ప్రాప్యమైన దేశం- అనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు. పాశురం మొదటి సగంలో **"మాల్"** అనే పదం అభిమానాన్ని, రెండవ సగంలోని "మాల్" అనే పదం సర్వాధికుడైన సర్వేశ్వరుని తెలుపుతుంది. **"ఎమ్మెన్నుమ్ మాలదిడమ్"** అనే పాఠం ఉన్నది. అర్థభేదం లేదు.

అవ :- మిగిలిన దివ్యదేశాలకంటే తిరుమలైను ఎక్కువగా నిత్యసూరులు అభిమానించే ఇంతటి అతిశయం దీనికి ఏమి ఉన్నది? - అని అంటే, "ఆ దివ్యదేశాలన్నీ ఒక ఎత్తు. ఈ తిరుమల ఒక ఎత్తు"- అనే రీతిలో అతడు అభిమానించిన దివ్యదేశంకదా ఇది!- అని దీనిలో అంటున్నారు.

**39. ఇడన్దతు పూమి యెడుత్తతు కున్ఱమ్**
**కడన్దతు కఞ్జనై మున్నఞ్జ- కిడన్దతువుమ్**
**నీరోత మాకడలే నిన్ఱతువుమ్ వేజ్గడమే**
**పేరోత వణ్ణర్ పెరితు**

పేర్ ఓదమ్ వణ్ణర్ = గొప్ప సముద్రంవంటి వర్ణాన్ని కల స్వామి, మున్= పూర్వకాలంలో, ఇడన్దదు = (వరాహరూపిగా) గుచ్చి ఎత్తినది, పూమి = భూమిని, ఎడుత్తదు = గొడుగుగా ఎత్తినది, కున్ఱమ్ = గోవర్ధనపర్వతాన్ని, అఞ్జ కడన్దదు= భయపడి నశించేటట్లుగా చేసినది, కఞ్జనై = కంసుని, కిడన్దదువుమ్ = నిద్రించినది కూడా, నీర్ ఓదమ్ మా కడల్ = నీరు నిండినది, అలలు ఎగసి పడేది అయిన గొప్ప సముద్రంలో, పెరితు నిన్ఱదువుమ్ = ఎల్లప్పుడు నిలచి ఉన్నది, వేజ్గడమే= వేంకటాచలమే.

అన్ని అవతారాలలోని గుణవిశేషాలను, లీలలను అన్ని కాలాలలో దర్శించి అందఱూ ఆనందించే దివ్యదేశం తిరుమలయే - అని భావం.



అవ :- దాసుల (భక్తుల) విరోధులను నశింపజేసి, ఆనందించడమేకదా ఈ తిరుమలలో నిత్యవాసానికి పరమప్రయోజనంగా భగవానుడు భావిస్తున్నాడు - అని ఇందులో అంటున్నారు.

**40. పెరువిల్ పకழ్జి క్కుఱవర్ కై చ్చెన్దీ**
**వెరువి పునమ్ తుఱన్ద వేழమ్- ఇరు విశుమ్బిల్**
**మీన్ వీழ క్కణ్డఞ్జుమ్ వేజ్గడమే మేలశురర్**
**కోన్ వీழ క్కణ్డుకన్దాన్ కున్ఱు**

పెరు విల్ = గొప్ప వింటిని, పకழ్జి = బాణాలను కల, కుఱవర్ = వేటగాళ్ళు, కై = చేతిలో పట్టుకొన్న, శెమ్ తీ = ఎఱ్ఱని కొఱివి కట్టెలకు (నిప్పుకు), వెరువి = భయపడి, పునమ్ తుఱన్ద = పొలాన్ని వదలి పారిపోయిన, వేழమ్ = ఏనుగు, ఇరు విశుమ్బిల్ = విశాలమైన ఆకాశంలో ఉండే, మీన్ వీழ = నక్షత్రాలు కిందకు రాలగా, కణ్డు = వానిని చూచి, అఞ్జుమ్ = (కోయలు విసరికొట్టిన కొఱివి కట్టెలు అని) భయపడే, వేజ్గడమే =తిరుమలైయే, మేల్ = పూర్వం, అశురర్ కోన్ వీழ = అసురనాయకుడైన హిరణ్యుడు నశించేటట్లుగా చేసి, కణ్డు = దానిని చూచి, ఉకన్దాన్ = ఆనందించిన వాని, కున్ఱు = కొండ.

ఆశ్రిత విరోధి నశించడాన్ని చూచి ఆనందించినవాడు మిగిలిన ఆశ్రిత విరోధులను కూడా నశింపజేయాలని తలచి అందుకోసం నిత్యవాసం చేసే కొండ ఇది. అందువల్ల అస్థానేభయ శంక తప్ప ఏనుగుకు భయం ఏర్పడే అవకాశం ఏదీ లేదని భావం.

అవ:- ఈ విధంగా భగవానుడు భక్తుల విరోధులను పోగొట్టడమే స్వభావంగా కలవాడైనా, దోషాలే మూర్తీభవించినట్లున్న మాకు అతని దరి చేరడం సాధ్యమా! - అని ఆழ్వార్లు మనస్సు భయపడగా, "నీకు అతనిపట్ల అభినివేశం మాత్రమే ఉన్నా చాలు; అతడు మన దోషాలను అన్నిటినీ గుణాలుగానే గ్రహిస్తాడు భయపడవద్దు సుమా!" అని తమ మనస్సుతో అంటున్నారు.

**41. కున్ఱనైయ కుగ్ర్రమ్ శెయినుమ్ కుణఙ్గొళ్ళుమ్**
**ఇన్ఱు ముతలాక ఎన్నెఞ్జే !- ఎన్ఱుమ్**

పుఱనురైయే యాయినుమ్ పొన్నాழிక్కైయాన్
తిఱనురైయే శిన్దిత్తిరు

ఎన్ = నా, నెఞ్జే = మనసా!, ఇన్రు ముదలాక = ఈ సమయంనుండి, ప్రారంభించి, ఎన్రుమ్ =ఎప్పుడూ, పుఱన్ ఉరైయే ఆయినుమ్ = బయటకు పలికే మాటగానే ఉన్నా, పొన్ అழி కైయాన్ తిఱన్ ఉరైయే = అందమైన చక్రాన్ని శ్రీహస్తంలో కల్గిన భగవానుని విషయంలోని మాటలనే, శిన్దిత్తు ఇరు= తలుస్తూ ఉండు, ఆ విధంగా ఉన్నట్లయితే, కున్రు అనైయ = కొండలంత, కుற్றమ్ శెయినుమ్ = పాపాలను చేసినా, కుణమ్ కొళ్ళుమ్ = వాటిని చూడకుండా భగవానుడు గుణాలనే మనస్సులో పెట్టుకొంటాడు.

కొండలంత పాపాలను చేసినా వానిని గమనించకుండా ఆవగింజంత గుణమున్నా, దానినే గ్రహిస్తాడని చెప్పవచ్చు.

అవ :- స్వతంత్రుడైనా, సర్వేశ్వరుడు ఈ విధంగా దోషాలను గుణంగా గ్రహించవచ్చునా? అని అంటే, **"పాపానాం వా శుభానాం వా వధార్హాణాం ప్లవంగమ!, కార్యం కరుణ మార్యేణ న కశ్చిన్నాపరాధ్యతి"** (వానరా! పాపులైనా, పుణ్యాశాలులైనా, చంపదగినవారైనా, వారి విషయంలో సత్పురుషుడు కరుణను చూపాలి. దోషాలు చేయనివారెవరు లేరు) అని చెప్పే దేవేరులు ముగ్గురు అతనితో కూడి ఉండడంచేత అతడు భక్తుల దోషాలను గుణంగా గ్రహించడం తగును- అని అంటున్నారు.

**42.** తిరుమకళుమ్ మణ్మకళుమ్ ఆయ్మకళుమ్ శేర్న్దాల్
తిరుమకట్కే తీర్న్ద వాఱెన్‌కొల్ - తిరుమకళ్‌మేల్
పాలోతమ్ శిన్ద పడనాకణై క్కిడన్ద
మాలోతవణ్ణర్ మనమ్

పాల్ ఓదమ్ శిన్ద = పాలకడలిలోని చిన్న చిన్న కణాలు చెదఱి చింది పడేటట్లుగా, పడమ్ నాకణై కిడన్ద = పడగలతో కూడిన ఆదిశేషుడనే పడుకలో పరుండి ఉండే, మాల్ ఓదమ్ వణ్ణర్ = గొప్ప సముద్రంవంటి తిరుమేనిని కల భగవానుని, తిరు మకళ్ మేల్ మనమ్ = లక్ష్మీదేవిపై (ప్రేమను కల) మనస్సు, తిరు మకళుమ్ మణ్ మకళుమ్ ఆయ్ మకళుమ్ శేర్న్దాల్ = శ్రీదేవి, భూదేవి, నీళాదేవి భగవానునితో కలసి పరిచరించేటపుడు, తిరుమకట్కే తీర్న్ద ఆఱు ఎన్ కొల్ = లక్ష్మీదేవి విషయంలోనే విధేయంగా ఉండడం ఏమి ఆశ్చర్యం?

పరాశరభట్టర్ రచించిన శ్రీగుణరత్నకోశంలోని -**"భోగ్యా వామపి... దేవి! త్వామను నీళయా సహ మహీదేవ్యః సహస్రం తథా యాభి స్త్వం స్తనబాహు దృష్టిభి రివ స్వాభిః ప్రియం శ్లాఘసే"** అనే సూక్తికి ఈ పాశురం మూలం.

అవ :- సంసారుల అజ్ఞానం, కర్మ, రుచి, వాసన- మొదలైనవి భగవానుని పట్ల ప్రేమను కల్గి ఉండే అవకాశాన్ని కల్గిస్తాయా? - అని అంటే, గత పాశురంలో చెప్పిన రీతిలోనే దేవేరులు భగవానునితో చేరి ఉండడంవల్ల ఇతడు (జీవుడు) తన దోషాలను తలచి జంకనవసరం లేదు. తన స్వరూపానికి అనుగుణంగా ఇతడు భగవత్కైంకర్యంలో అన్వయించినట్లయితే ఆ దోషాలు ఇతనికి అడ్డుపడకపోవడమే కాకుండా, తామే ఇతనిని విడచి తొలగిపోతాయి- అని ఇందులో అంటున్నారు.

**43.** మనమాశు తీరుమ్ అరు వినైయుమ్ శారా
తనమాయ తానే కైకూడుమ్- పున మేయ
పూన్దుழாయా నడిక్కే పోదొడు నీరేన్ది
తామ్ తొழா నిఱ్పార్ తమర్

పునమ్ మేయ పూమ్ తుழாయాన్ = స్వస్థలంలో ఉన్నట్లుగా ఏపుగా పెరిగి ప్రకాశించే తులసిని అలంకరించుకొన్న భగవానునియొక్క, అడిక్కే = శ్రీపాదాలకే, పోదొడు నీర్ ఏన్ది = పూలతో పాటు తీర్థాన్ని తీసికొనివచ్చి, తమర్= దాసులు, తామ్ = తామే, తొழா నిఱ్పార్ = నమస్కరిస్తారు (నమస్కరించగానే), మనమ్ మాశు తీరుమ్ = (వారి) మనస్సులో ఉండే అజ్ఞానం మొదలైన మాలిన్యాలు తొలగిపోతాయి, అరు వినైయుమ్ శారా = తీరని పాపాలు సైతం వారి దరి చేరవు, తన మాయ = (నిజమైన) సంపద అయిన భక్తికూడా, తానే కై కూడుమ్ = తానుగానే వచ్చి చేరుతుంది.

కైంకర్యోపకరణమై, స్వరూపానురూపమైన ధనం అయిన పరభక్త్యాదులు తమకు తామే వచ్చి చేరతాయి.

అవ :- గడచిన పాశురంలో **"తామ్ తొ*ழு*ా నిఱ్వార్"** అని ఆ*ழ్*వార్లు అన్నారు. అయితే భగవానుని దర్శించగల్గినపుడు కదా అతనిని నమస్కరించ డానికి వీలున్నది. మఱి, ఎక్కడ ఆ స్వామిని దర్శించాలి?'' అనే ప్రశ్న తలెత్తగా, భక్తులు ఈ విధంగా కైంకర్యం చేయాలని తలిస్తే, వీరు ఆదరించి, అభిమానించిన రూపాలను, నామాలను కలవానినిగా తనను అతడు మలచు కొని అర్చావతార రూపంతో వేంచేసి ఈ లోకంలోనే వారి కైంకర్యాన్ని పరిగ్రహిస్తాడు - అని ఈ పాశురంలో ఆ*ழ్*వారు అంటున్నారు.

**44.** **తమరుకన్దతెవ్వురువమ్ అవ్వురువమ్ తానే**
**తమరుకన్ద తెప్పేర్ మ*ற్ఱ*ప్పేర్ - తమరుకన్దు**
**ఎవ్వణ్ణమ్ శిన్దిత్తు ఇమైయాతిరుప్పరే**
**అవ్వణ్ణ మా*ழి*యానామ్**

ఆ*ழి*యాన్ = చక్రపాణి అయిన స్వామి, తమర్ = తన భక్తులు, ఉకన్దదు ఎవ్వురువమ్ = ఆదరించినది ఏరూపమో, అవ్వురువమ్ తానే ఆమ్ = ఆ రూపాన్నే తాను పొందుతాడు, మ*ற్ఱు* = అంతే కాక, తమర్ ఉకన్దదు ఎప్పేర్= దాసులు అభిమానించినది ఏ నామమో, అ ప్పేర్ ఆమ్ = ఆ పేరును పొందు తాడు, తమర్ = దాసులు, ఉకన్దు = అభిమానించి, ఎవ్వణ్ణమ్ శిన్దిత్తు= ఏవిధంగా తలచి, ఇమైయాతు ఇరుప్పరే = నిరంతరం ధ్యానం చేస్తున్నారో, అవ్వణ్ణమ్ ఆమ్ = ఆవిధంగానే రూపొందుతాడు.

ఈవిధంగా తన గొప్ప తనాన్ని చూడకుండా భక్తులు అభిమానించిన రూపం, పేర్లు, గుణం, లీలలు- మొదలైనవానిని కలవాడై, భక్తులు కైంకర్యాలను స్వీకరించే భగవానుని అర్చావతార సౌలభ్యాన్ని అనుసంధిస్తూ ఆ*ழ్*వార్లు విస్మితులవుతున్నారు.

అవ :- సర్వేశ్వరుడు ఇటువంటి విలక్షణమైన సౌలభ్యాన్ని కలవాడా!- అని అంటే, ఈ విధంగా ఉండే అతని సౌలభ్యాన్ని అతడు స్వయంగా దర్శింప జేయగా చూచిన మాకు తప్ప, బ్రహ్మ మొదలైన దేవతలకు తెలిసికోవడానికి అది అరుదైనది సుమా! అని ఇందులో అంటున్నారు.



**45.** **ఆమే యమరర్క్కఱియ అతు నిఱ్క**
**నామే యఱికిఱ్పోమ్ నన్నెఞ్జే! - పూమేయ**
**మాతవత్తోన్ తాళ్ పణిన్ద వాళరక్కన్ నీళ్ ముడియై**
**పాతమత్తా లెణ్ణినాన్ పణ్బు**

నల్ నెఞ్జే = ఓ మంచి మనసా!, పూ మేయ మా తవత్తోన్ = తిరునాభీ పద్మంలో నివసించే, గొప్ప తపస్వి అయిన బ్రహ్మయొక్క, తాళ్ పణిన్ద = పాదాలలో నమస్కరించిన, వాళ్ అరక్కన్ = క్రూరరాక్షసుడైన రావణుని, నీళ్ ముడియై = ఉన్నతాలైన పది తలలను, పాదమ్ అత్తాల్ ఎణ్ణినాన్ = ఆ శ్రీపాదాలలో లెక్కించి చూపిన భగవానుని, పణ్బు = గుణాలు, అమరర్క్కు అఱియ ఆమే = దేవతలకు తెలియదగినవా!, అదు నిఱ్క = అది ఉండనీ, తామే అఱికిఱ్పోమ్ = అతని నిర్హేతుక కృపకు లక్ష్యం అయిన మనమే తెలియగలం.

గొప్ప తపస్సును చేసిన బ్రహ్మాది దేవతలు సైతం తెలియలేకుండా ఉంటే, ఇక అల్పజ్ఞులమైన మనమా భగవానుని తెలియగలం? అని ఆ*ழ్*వార్లు నైచ్యాను సంధానం చేస్తున్నట్లుగా కూడా చెప్పవచ్చు. ఈ అర్థంలో **"నామే"** అనే పదంలోని ఏకారం వ్యతిరేకార్థకం. ఈ పాశురంలో ప్రస్తావింపబడ్డ అపూర్వమైన వృత్తాంతం పురాణేతిహాసాలలో కానరాకపోయినా, కల్పాంతరాలలో సంభవించిన ఈ వృత్తాంతాన్ని యథార్థద్రష్టలైన ఆ*ழ్*వార్లు తాము దర్శించి అనుగ్రహించారని గ్రహించాలి.

అవ :- బ్రహ్మకు కల్గిన క్లేశాన్ని పోగొట్టి రక్షించడంమాత్రమే కాకుండా, లోకాన్ని సృష్టించి, తనకు తండ్రి అయిన ఆ బ్రహ్మ తలను నఱికి, అతడిచ్చిన శాపంచేత పీడింపబడి, చేతిలో బ్రహ్మకపాలాన్ని కలవాడై యాచించి, భుజించి సంచరించే రుద్రుని దుఃఖాన్ని సైతం పోగొట్టి అతనిని రక్షించినవాడితడే- అని దీనిలో అంటున్నారు. **"వేదాపహారగురుపాతకదైత్య పీడాది"** ఇత్యాది స్తోత్రరత్న శ్లోకానికి మూలం ఈ పాశురం.

**46.** **పణ్పురిన్ద నాన్ మఱైయోన్ శెన్ని ప్పలి యే*ற్ఱ***
**వెణ్పురినూల్ మార్బన్ వినై తీర- పుణ్పురిన్ద**

**ఆకత్తాన్ తాళ్ పణివార్ కణ్డీర్ అమరర్‌తమ్**
**పోకత్తాల్ పూమి యాళ్వార్**

పణ్ పురిన్ద నాల్ మఱైయోన్ = స్వరాలతో కూడిన నాల్గు వేదాలను అధ్యయనం చేసిన బ్రహ్మయొక్క, శెన్ని = తలలో (కపాలంలో), పలి ఏ***ఱ్ఱ***= భిక్షను గ్రహించినవాడు, వెణ్ పురి నూల్ మార్బన్ = తెల్లని యజ్ఞోపవీతాన్ని వక్షఃస్థలంలో ధరించేవాడు అయిన, రుద్రుని, వినై తీర = బ్రహ్మహత్యాపాతకం తీరేటట్లుగా, పుణ్ పురిన్ద ఆకత్తాన్ = తన గుండెను గాయపఱచుకొన్న స్వామియొక్క, తాళ్ = శ్రీపాదాలను, పణివార్ కణ్డీర్ = నమస్కరించేవారే సుమా!, అమరర్‌తమ్ పోకత్తాల్ = నిత్యసూరుల భోగంతోపాటు, పూమి ఆళ్ వార్=ఈలోకాన్ని పాలిస్తారు.

ఈ లోకంలో ఉన్నపుడే పరమపదంలో అనుభవించే భోగాన్ని అంతటినీ అనుభవిస్తారని చెప్పవచ్చు. **"అత్ర బ్రహ్మ సమశ్నుతే", "అమృత ఇహ భవతి"** అనే వాక్యాలలో ఈ లోకంలోనే మోక్షాన్ని పొందుతాడని బ్రహ్మను పొందు తున్నాడని చెప్పడం ఈ అర్థంలోనే కదా! విష్ణువు యొక్క పరమపదం అనే లోకం ఒకటి ఉన్నదని, అక్కడకు చేరడమే మోక్షమని, అర్చిరాదిమార్గం ద్వారా ఆలోకానికి ముక్తుడు చేరతాడని, అక్కడినుండి పునరావృత్తి లేదని పలు వాక్యాలు చెబుతూ ఉండగా, కొందఱు జీవన్ముక్తిని అంగీకరించడం యుక్తి విరుద్ధమే కాక, వేదవిరుద్ధం కదా!

అవ :- ఇంద్రియాలను జయించి, మంచి జ్ఞానాన్ని కలవారై, భగవానుని పొందాలని ప్రయత్నించేవారే అతనిని పొందగలరు. మిగిలినవారు అతని శ్రీచరణాలను ఆశ్రయించలేరు- అని దీనిలో అంటున్నారు.

**47.** వారి శురుక్కి మదక్కళిఱైన్దినైయుమ్
**శేరి తిరియామల్ శెన్నిఱీ ఇ- కూరియ**
**మెయ్‌ఞ్ఞానత్తాల్ ఉణర్వార్ కాణ్బరే మేలొరునాళ్**
**కైన్నాకమ్ కాత్తాన్ క*ழ*ల్**

మదమ్ కళిఱు ఐన్దినైయుమ్ =మదించిన ఏనుగులవంటి అయిదు ఇంద్రియాలను, వారి శురుక్కి = భోగం అనే మదజలాన్ని తగ్గించుకొని, శేరి తిరియామల్ శెమ్ నెఱీ ఇ = శబ్దాదిలౌకిక విషయాలనే వీథులలో పరిభ్రమించ కుండా వానిని బాగా కట్టడిచేసి, కూరియ = సూక్ష్మం అయిన, మెయ్ ఞానత్తాల్= యథార్థమైన భక్తిరూపాపన్న జ్ఞానంతో, ఉణర్‌వార్ = అతనిని తెలియగలవారు, మేల్ ఒరు నాళ్ = పూర్వం ఒకానొక సమయంలో, కై నాకమ్ కాత్తాన్ = తొండంతో కూడిన గజం అయిన గజేంద్రుని రక్షించినవాని, క*ழ*ల్= శ్రీచరణాలను, కాణ్బార్ = దర్శించి, అనుభవిస్తారు.

తనను మనస్సుతో భావించిన గజేంద్రుని విరోధిని నిరసించి రక్షించినట్లే, యథార్థజ్ఞానంతో తెలిసిన వీరికి విరోధులైన ఇంద్రియాదులను నిరసించి, వీరినికూడా రక్షిస్తాడని భావం.

అవ :- **"వారి శురుక్కి మదక్కళిఱు ఐన్దినైయుమ్ శేరి తిరియామల్"** అని ఇంద్రియాలను నిర్జించి, యథేష్టంగా పరిభ్రమించకుండా నిలుపడంవంటి అపూర్వకృత్యాలు అతని ద్వారానే అతనిని పొందగోరే మనకు ఆవశ్యకాలు కావు. అతడు తానే తనను అనుగ్రహించే స్వభావాన్ని కలవాడు- అని నీవు అతనిని సంతోషంతో అనుభవించడానికి ప్రయత్నించు'' అని ఇందులో తమ మనస్సుతో ఆ*ழ*్వార్లు అంటున్నారు.

**48. క*ழ*లొన్ఱెడుత్తు ఒరు కై శు*ఱ్ఱి* యోర్ కైమేల్**
**శు*ழ*లుమ్ శురాశురర్‌కళఞ్జ- అ*ழ*లుమ్**
**శెరు వా*ழి* యేన్దినాన్ శేవడిక్కే శెల్ల**
**మరువా*ழி* నెఞ్జే ! మకి*ழ*్‌న్దు**

ఆ*ழి* నెఞ్జే = సముద్రంవలె గంభీరమైన ఓ మనసా!, క*ழ*ల్ ఒన్ఱు = నముచియొక్క ఒక కాలును, ఎడుత్తు = పట్టుకొని, ఒరు కై = ఒక చేతితో, శు*ఱ్ఱి* = చుట్టి, శు*ழ*లుమ్ = ఏమి కీడు మూడుతుందో ఏమో -అని కలత చెందే, శురాశురర్‌కళ్= దేవతలు, అసురులు, అఞ్జ = భయపడేటట్లుగా, ఓర్ కై మేల్ =వేఱొక హస్తంపై, అ*ழ*లుమ్ = జ్వలించేది, శెరు = పోరాడేది అయిన, ఆ*ழి* = సుదర్శనాన్ని, ఏన్దినాన్ = ఎత్తిన స్వామియొక్క, శే అడిక్కే శెల్ల= ఎఱ్ఱని శ్రీపాదాలను చేరేటట్లు, మకి*ழ*్‌న్దు మరువు = ఆనందంతో అనుభవించు.

బాధతో దీనిని ఆచరించకుండా సంతోషంతో అనుష్ఠించి ఆనందంగా భగవద్విషయంలో మెలగు- అని భావం. "మకి*ழ்* మరువు" అనే పాఠానికి ఆదరించి, దరిచేరి అనుభవించు- అని అర్థం.

అవ :- ఎంతగా సాధనానుష్ఠానాన్ని చేసినా, ఇతరవిషయాలలో వైరాగ్యం కల్గి అతనిని ఆశ్రయించేవారికి తప్ప ఇంకొకరికి అతనిని దర్శించడానికి వీలు కాదు- అని ఇందులో అంటున్నారు.

**49.** మకి*ழ*లకొన్టేపోల్ మాఱుమ్ పల్ యాక్కై
నెకి*ழ*  ముయల్ కిఱ్ఱార్క్కల్లాల్- ముకి*ழ்* విరిన్ద
శోదిపోల్ తోన్టుమ్ శుడర్పొన్ నెడుముడి ఎమ్
ఆతి కాణ్బార్క్కు మరితు

మకి*ழ்* అలకు ఒన్టే పోల్ = బొగడ (వకుళ) చెట్టు విత్తనం ఒక్కటే కాణి స్థానంలోను, కోటి స్థానంలోను పెట్టబడి లెక్కింపబడేటట్లే, మాఱుమ్ పల్ యాక్కై= మాఱి మాఱి వచ్చే పలు శరీరాలను, నెకి*ழ* = తొలగిపోయేటట్లుగా, ముయల్ కిఱ్ఱార్క్కు అల్లాల్ = ప్రయత్నం చేసేవారికి తప్ప, కాణ్బార్క్కుమ్= దర్శించాలనే అభిలాషను కల మిగిలినవారికి, ముకి*ழ்* విరిన్ద శోది పోల్ తోన్టుమ్= వికసించిన తేజస్సువలె కన్పించేది, శుడర్ పొన్ నెడు ముడి = కాంతిని వెదజల్లేది, అందమైనది, పెద్దది అయిన కిరీటాన్ని కలవాడు, ఎమ్ ఆది = నాకు కారణభూతుడై ఉండే సర్వేశ్వరుడు, అరిదు = పొందడానికి దుర్లభుడు.

"పటునైకవరాటికైవ...." అనే భట్టర్ శ్రీరంగరాజస్తవ శ్లోకానికి ఈ పాశురం మూలం. "కాణ్బార్క్కుమ్" అనే పదంలోని "ఉమ్" (అప్యర్థకం) వల్ల వినేవారికి కూడా దుర్లభుడనే అర్థం స్ఫురిస్తుంది. ప్రాకృతవిషయాలను ఆశిస్తూనే అతనిని చూడాలి, వినాలి అనే ఆశను మాత్రం కలవారికి ఇతడు తన ముఖాన్ని చూపడని సారం. "ఆది కాణ్బ ఆర్క్కుమ్ అరిదు" అని విడదీసికూడా అర్థాన్ని చెప్పవచ్చు.

అవ :- మిగిలిన విషయాలలో సంగాన్ని విడచి, భక్తితో అతనిని ఆశ్రయించే వారికి అతనిని దర్శించడం చాలా సులభం - అని దీనిలో అంటున్నారు.

**50.** అరియ పులనైన్దడక్కి ఆయ్ మలర్ కొణ్డు ఆర్వమ్
పురియ పరిశినాల్ పుల్‌కిల్- పెరియనాయ్
మా*ఱ్ఱా*తు వీ*ఱ్ఱి*రున్ద మావలిపాల్ వణ్కై నీర్
ఏ*ఱ్ఱా*నై క్కాణ్బతెళితు

అరియ = అణచడానికి సాధ్యం కానివి అయిన, పులన్ ఐన్దు = అయిదు ఇంద్రియాలను, అడక్కి = వశీకరించుకొని, ఆయ్ మలర్ కొణ్డు =పరిశీలించి గ్రహించిన పుష్పాలను చేతిలో పెట్టుకొని, ఆర్వమ్ పురియ పరిశినాల్= ప్రేమ మీరిన దారిలో, పుల్‌కిల్ = నమస్కరిస్తే, పెరియనాయ్ = (సంపదలోను, దాతృత్వంలోను) గొప్పవాడై, మా*ఱ్ఱా*దు వీ*ఱ్ఱి*రున్ద = దానం చేయడంలో ఏమార్పు లేకుండా ఉండే, మా వలిపాల్ = మహాబలివద్ద, వణ్కై = ఉదారమైన తన శ్రీహస్తంలో, నీర్ ఏ*ఱ్ఱా*నై = దానజలాన్ని గ్రహించిన స్వామిని, కాణ్బదు= సేవించడం, ఎళిదు = సులభంగా ఉంటుంది.

ఎన్నో దోషాలున్నా, అప్రతిషేధాన్నే ఆలంబనంగా గ్రహించి, మహాబలి దగ్గరకు యాచకుడై వచ్చాడు. అటువంటి వాడు అరుదైన ఇంద్రియనిగ్రహాన్ని సాధించి, పరిశీలించి పుష్పాలను సేకరించి గైకొని, గొప్ప భక్తితో వాటిని సమర్పిస్తే, నమస్కరిస్తే సులభుడు కాడా! అది కైముతిక న్యాయసిద్ధం కదా!- అని భావం.

అవ :- మధురమైన పాలను తాగగానే పిత్తరోగం నశించినట్లు, భగవానుని తీయని తిరునామాన్ని నోరార పలుకగానే, ప్రహ్లాదునకు విరోధిని పోగొట్టి తనను అనుగ్రహించినట్లే, మన విరోధులను పోగొట్టి తనను మనకు అనుగ్రహిస్తాడు స్వామి- అని తన మనస్సును ఉద్దేశించి ఇందులో అంటున్నారు.

**51.** ఎళితి లిరణ్డడియుమ్ కాణ్బతఱ్కు ఎన్నుళ్ళమ్!
తెళియ త్తెళిన్దొ*ழி*యుమ్ శెవ్వే- కళియిల్
పొరున్దాతవనై ప్పిరలు*ఱ్ఱు* అరియా
యిరున్దాన్ తిరునామ మెణ్

ఎన్ ఉళ్ళమ్ = ఓ మనసా!, ఎళితిల్ = సులభంగా, ఇరణ్డు అడియుమ్= రెండు శ్రీపాదాలను, కాణ్బదఱ్కు = సేవించడానికి తగినట్లు, తెళియ = నీవు తెలివిని పొందితే, శెవ్వే తెళిన్దొ*ழி*యుమ్ = (అతడు) చక్కగా సంతోషిస్తాడు, కళియిల్ = గర్వంవల్ల, పొరున్దాతవనై = తనను చేరనివానితో, (ప్రతికూలునితో)

పొరల్ ఉగ్గిర్రు= పోరాడడానికి ప్రయత్నించి, అరియాయ్ = నరసింహమై, ఇరున్దాన్ = అవతరించినవాని, తిరునామమ్ = అందమైన పేర్లను, ఎణ్ = లెక్కించు.

తిరునామాలను నోటితో లెక్కించి సంకీర్తనం చెయ్యి. దీనిని చేయని హిరణ్యుడు పడిన పాట్లు ఎటువంటివో తెలిసికో- అని భావం.

అవ :- గడచిన పాశురంలో ఆళ్వార్లు **"తిరునామమ్ ఎణ్"** అని మనస్సును ఉద్దేశించి పలికారు. "మాకు అతని పేరు చెప్పకపోతే జీవించడానికి వీలు కాదా! ఏమి'' అని వారి మనస్సు ప్రశ్నించగా, "దురహంకారాన్ని కల అధికారి పురుషులైన దేవతలుకూడా అతనిని నమస్కరించి, తమ అధికారాలను స్థిరీకరించుకొంటూ ఉండగా, మనం అతని తిరునామంతోనే ఉజ్జీవించాలి- అని వేఱే చెప్పాలా!- అని ఈ పాశురంలో అంటున్నారు.

**52. ఎణ్‌మర్ పతినొరువర్ ఈరఱువర్ ఓరిరువర్**
**వణ్ణ మలరేన్ది వైకలుమ్- నణ్ణి**
**ఒరుమాలైయాల్ పరవి ఓవాతు ఎప్పోతుమ్**
**తిరుమాలై క్కైతొழுవర్ శెన్ఱు**

ఎణ్‌మర్ = అష్టవసువులు, పదినొరువర్ = ఏకాదశ రుద్రులు, ఈర్ అఱువర్ = ద్వాదశాదిత్యులు, ఓర్ ఇరువర్ = కవలలు అయిన అశ్వినీదేవతలు, వణ్ణమ్ మలర్ ఏన్ది = పలు వర్ణాలను కల పూవులను ఎత్తి పట్టుకొని, వైకలుమ్ నణ్ణి = ప్రతిదినం సమీపించి, ఒరు మాలైయాల్ = సాటి లేని పురుషసూక్తం అనే వాఙ్మాలతో, ఓవాదు ఎప్పోదుమ్ = ఎడతెగకుండా అన్ని కాలాలలో, పరవి = స్తుతించి, తిరు మాలై = లక్ష్మీనాథుని, శెన్ఱు కై తొழுవర్ = సమీపించి నమస్కరిస్తారు.

**"తదుపర్యపి బాదరాయణః, సంభవాత్" (1-3-25)** (బ్రహ్మోపాసనం మనుష్యులకంటె గొప్పవారైన దేవతలకు కూడా తగును. - అని బాదరాయణు డన్నాడు. వారికికూడా మోక్షాన్ని కోరడమనే అర్థిత్వం, మోక్షసాధనానుష్ఠానం చేయగల సామర్థ్యం ఉండడంవల్ల -) అనే రీతిలో మోక్షంకోసం దేవతలుకూడా పరమాత్మను ఉపాసించవచ్చని బ్రహ్మ సూత్రాలలో తెలుపబడింది కదా!



అవ :- స్వప్రయోజనాన్ని ఆశించి, ప్రార్థించే దురభిమానులైన దేవతలు అతనిని ఆశ్రయించే రీతిని గత పాశురంలో చెప్పినందువల్ల కల్గిన తమ మనః క్లేశం తీరేటట్లుగా, ఏ ప్రయోజనాన్ని ఆశించకుండా ఉండేవారై, దురభిమాన గంధలేశంకూడా లేకుండా ఉండేవారై, పరమపురుషుని ఆ యా స్థితులకు తగిన రూపాన్ని ధరిస్తూ కైంకర్యాన్ని చేసేవారైన నిత్యసూరులకు నాథుడైన ఆదిశేషుడు పరమపురుషునకు సేవ చేసే రీతులను ఇందులో అనుభవిస్తున్నారు.

**53. శెన్ఱాల్ కుడైయామ్ ఇరున్దాల్ శిఙ్గాశనమామ్**
**నిన్ఱాల్ మరవడియామ్ నీళ్ కడలుళ్- ఎన్ఱుమ్**
**పుణైయామ్ మణివిళక్కామ్ పూమ్‌పట్టామ్ పుల్‌కుమ్**
**అణైయామ్ తిరుమాఱ్కు అరవు**

తిరుమాఱ్కు = పిరాట్టితోకూడి ఉండే భగవానునకు, అరవు = ఆదిశేషుడు, శెన్ఱాల్ కుడై ఆమ్ = భగవానుడు విహరించేటపుడు గొడుగుగా అవుతాడు, ఇరున్దాల్ శిఙ్గాశనమ్ ఆమ్ = కూర్చుని ఉంటే సింహాసనం అవుతాడు, నిన్ఱాల్= నిలచి ఉంటే, మరవడి ఆమ్ = పాదుకలుగా అవుతాడు. నీళ్ కడలుళ్ = విశాలమైన సముద్రంలో, ఎన్ఱుమ్ = నిద్రించే సమయంలో అంతటా, పుణై ఆమ్ = కాలిదిండు అవుతాడు, విళక్కు ఆమ్ = మంగళదీపం అవుతాడు, పూమ్ పట్టామ్ = అందమైన పీతాంబరం అవుతాడు, పుల్‌కుమ్ అణై ఆమ్= తడవికోవడానికి పనికివచ్చే తలదిండు అవుతాడు.

స్తోత్రరత్నంలోని **"నివాస శయ్యాసన........"** ఇత్యాది శ్లోకానికి ఈ పాశురమే మూలం.

అవ :- ఈ విధంగా తాను కోరిన రీతిలో అన్ని కైంకర్యాలను చేసే ఆది శేషుడనే పడుకను విడిచి ఈలోకానికి వచ్చి, శ్రీకృష్ణుడై అవతరించి, తన విభూతికి అడ్డంగా ఉండే అసురులను, రాక్షసులను నాశనం చేసి, తన లీలావిభూతిని రక్షించే స్వామి తీరును ఇందులో ఆళ్వార్లు అనుభవిస్తున్నారు.

**54. అరవమడల్ వేழம் ఆన్ కురున్దమ్ పుళ్‌వాయ్**
**కురవై కుడములై మఱ్ఱున్ఱమ్ -కరవిన్ఱి**

**విట్టిఱుత్తు మేయ్‌త్తొశిత్తు క్కీణ్డు కోత్తాడి ఉ-**
**ణ్డట్టెడుత్త శెఙ్గణవన్**

శెమ్ కణ్ అవన్ = ఎఱ్ఱ తామరలవంటి కన్నులను కల ఆ భగవానుడు, కరవు ఇన్ఱి= మఱపు లేకుండా, అరవమ్ విట్టు = కాళియుడనే సర్పాన్ని వెడలగొట్టి, అడల్ వే*ழ*మ్ ఇఱుత్తు = పోరు చేయాలని వచ్చిన కువలయాపీడమనే ఏనుగు దంతాన్ని విఱిచి, ఆన్ మేయ్‌త్తు = పశువులను మేపి, కురున్దమ్ ఒశిత్తు = (అసురావేశాన్ని కల) గురివింద చెట్టును విఱిచి, పుళ్ వాయ్ కీణ్డు =బకరూపాన్ని ధరించి వచ్చిన అసురుని నోటిని చీల్చి, కురవై కోత్తు = (గోపికలతో) రాసక్రీడను ఆడి, కుడమ్ ఆడి = కుంభనృత్యాన్ని చేసి, ములై ఉణ్డు = (పూతనయొక్క) స్తన్యాన్ని (ఆమె ఉసురుతోపాటు) పీల్చి, మల్ అట్టు = (చాణూరముష్టికులనే) మల్లయుద్ధవీరులను చంపి, కున్ఱమ్ ఎడుత్త = గోవర్ధనగిరిని ఎత్తిన (చేసిన లీలల తీరు ఏమి! ఆశ్చర్యకరం !)

ఈలోకంలోని వారుకూడా ఆదిశేషునివలె కైంకర్యం చేయడానికి వీలుగా అతడు శ్రీకృష్ణుడై అవతరించి ఈ రీతిలో సులభుడై వర్తించాడని భావం.

అవ :- అతడు ఈ విధంగా ఆశ్రితులను కన్నులో వెన్న పెట్టుకొని (నిద్ర పోకుండా జాగ్రత్తగా) చూస్తూ, వారి విరోధులను పోగొట్టే స్వభావాన్ని కలవాడై ఉండగా, ఇక వీరిని ఎవరు కళ్ళెఱ్ఱ జేసి చూడగలరు? (హాని చేయ గలరు?) అని దీనిలో అంటున్నారు. (శ్రీవిష్ణుపురాణంలోని యమకింకరసం వాదం ఇక్కడ స్మరించతగినది)

**55.** **అవన్‌తమర్ ఎవ్వినైయరాకిలుమ్ ఎఙ్గో**
**నవన్ తమరే యొన్ఱొ*ழ*ివతల్లాల్- నమ్ తమరాల్**
**ఆరాయప్పట్టఱియార్ కణ్డీర్ అరవణైమేల్**
**పేరాయర్ క్కాట్పట్టార్ పేర్**

అవన్ తమర్ = ఆ పరమపురుషుని భక్తులు, ఎవ్వినైయర్ ఆకిలుమ్ = ఎటువంటి కర్మను చేసినవారై ఉన్నా, ఎన్ కోన్ అవన్ తమరే ఎన్ఱు = "మాకు స్వామి అయిన సర్వేశ్వరుని భక్తులు కదా! వీరు" అని పొగడి, ఒ*ழ*ివతు అల్లాల్= తొలగిపోవడంతప్ప, అరణైమేల్ పేర్ ఆయర్క్కు ఆట్పట్టార్ పేర్ =



ఆదిశేషులనే పడుకపై ఉండి, (దాసులను రక్షించడంకోసం) గోపాలకుడై వచ్చి అవతరించిన భగవానునకు కైంకర్యాన్ని చేసేవారి పేరును ధరించివారుకూడా, నమన్ తమరాల్ = యముని దూతలచే, ఆరాయప్పట్టు అఱియార్ కణ్డీర్ = విచారించి, తెలిసికోబడేవారు కారుసుమా!

భగవానుడే స్వయంగా భక్తుకోసం తాను పరుండిన శయ్యనుండి లేచి వచ్చి లోకంలో అవతరించి, పడరాని పాట్లు పడినపుడు, యమదూతలు భగవద్భక్తులను విచారించగలరా ? "ఎన్నడియార్ అదు శెయ్యార్, శెయ్‌దారేల్ నన్ఱు శెయ్‌దార్" అనే పెరియా*ழ*్వార్ పాశురంలోవలె లక్ష్మీదేవి కూడా వీరిలో దోషాన్ని ఎత్తి చూపడం సాధ్యం కానపుడు యముడా వీరిని విచారించగలడు?

అవ :- జ్ఞానాన్ని కల్గి ఉన్నందుకు తగినట్లు భగవన్నామాలను క్రమ వివక్షలేకుండా చెప్పగలమే తప్ప, సర్వేశ్వరుని ప్రభావం ఎవరికీ పరిచ్ఛేదించి పల్కడం వీలుకాదని ఇందులో అంటున్నారు.

**56.** **పేరే వరప్పిద*ఱ్ఱ*లల్లాల్ ఎమ్బెమ్మానై**
**ఆరే యఱివా రతు నిఱ్క- నేరే**
**కడిక్కమలత్తుళ్ళిరున్దుమ్ కాణ్గిలాన్ కణ్ణన్**
**అడి క్కమలన్దన్నై యయన్**

పేరే = (భగవానుని) తిరునామంతో, వర = అతడు విచ్చేసేటట్లు, పిద*ఱ్ఱ*ల్ అల్లాల్ = క్రమం లేకుండా అనుసంధించడం తప్ప, ఎమ్ పెమ్మానై= భగవానుని, ఆరే అఱివార్ = ఎవరు తెలియగలరు?, అదు నిఱ్క = అది ఉండనీ, కడి కమలత్తు ఉళ్ = సువాసనను కల నాభీపద్మంలో, నేరే ఇరున్దుమ్= (భగవానునకు) అత్యంత సమీపంలో ఉన్నా, అయన్ = అకారవాచ్యుడైన భగవానునివల్ల పుట్టిన బ్రహ్మసైతం, కణ్ణన్ = ఆ స్వామియొక్క, అడి కమలమ్ తన్నై = శ్రీపాదపద్మాలను, కాణ్గిలాన్ = తెలియలేడు.

"బ్రహ్మ బ్రహ్మవిదాం వరః" అని కీర్తింపబడే బ్రహ్మకూడా ఇంతపాట్లు పడినపుడు మిగిలినవారి సంగతిగూర్చి చెప్పాలా?

అవ :- "బ్రహ్మకుకూడా తెలియడానికి సాధ్యం కాని విషయాన్ని మఱి మీరు ఏ విధంగా తెలిసికొన్నారు?" - అని అంటే, "తిరుమంత్రాన్ని ఆశ్రయించి

ఉండి, దానివల్ల అతడు తానే స్వయంగా తనను దర్శింపజేయగా దర్శించాను అంతే!''- అని ఇందులో సమాధానంగా అంటున్నారు.

57. అయ నిన్ద వల్వినైయై అఞ్జినే నఞ్జే
ఉయనిన్ తిరువడియే శేర్‌వాన్ - నయనిన్ద
నన్ మాలై కొణ్డు నమో నారణా వెన్నుమ్
శొన్‌మాలై కఱ్ఱేన్ తొழுతు

అయల్ నిన్ద = సమీపంలో ఉండే, వల్ వినైయై = ప్రబలమైన పాపకర్మలను చూచి, అఞ్జినేన్ = భయపడ్డాను, అఞ్జి = ఈ రీతిలో భయపడి, ఉయ = పాపాలు తొలగి, ఉజ్జీవించడంకోసం, నిన్ = నీయొక్క, తిరువడియై శేర్‌వాన్= శ్రీపాదాలను చేరడంకోసం, నయమ్ నిన్ద = శాస్త్రరూపంగా ఉండే, నల్ మాలై కణ్డు = అందమైన మాలను గొని, తొழுదు = నమస్కరించి, నమో నారణా ఎన్నుమ్ = అష్టాక్షరీమంత్రం అనే, శొల్ మాలై = వాఙ్మాలను, కఱ్ఱేన్ = అభ్యసించాను.

తిరునామాలను అనుసంధించకుండా భగవానుని పూర్వం ఎడబాసి ఉన్న మహాపాపాన్ని తలచి ఆழ்్వార్లు బాధపడుతున్నారని కూడా చెప్పవచ్చు.

అవ :- "మనసా! వాస్తవం ఈ విధంగా ఉన్నపుడు ఈ విషయాన్ని చూచి, మనకు ఒక్కక్షణం అయినా సహించి ఉండడానికి తగిన కారణం ఏదీ లేదు. భగవానుని శ్రీపాదాలను వెంటనే ఆశ్రయించు'' - అని తమ మనస్సుతో ఆழ்్వార్లు ఇందులో అంటున్నారు.

58. తొழுతు మలర్ కొణ్డు తూపమ్ కై యేన్ది
ఎழுతు మెழு వాழி నెఞ్జే - పழுతిన్ఱి
మన్దిరఙ్గళ్ కఱ్పనవుమ్ మాలడియే కైతొழுవాన్
అన్దర మొన్ఱిల్లై యడై

నెఞ్జే = ఓ మనసా, వాழி = నీకు మంగళం కలగాలి, మలర్ కొణ్డు = పూవులను చేతిలో ధరించి, తూపమ్ కై ఏన్ది = ధూపాన్ని చేతిలో దాల్చి, తొழுదు= నమస్కరించి, ఎழுదుమ్ = ఉజ్జీవిద్దాం రా, (తరిద్దాం రా), ఎழு= ఇక లే (ఉజ్జీవించు), పழுతు ఇన్ఱి = వ్యర్థం కాని, మన్దిరఙ్గళ్ = భగవానుని



గూర్చిన మంత్రాలను, కఱ్పనవుమ్= అభ్యసించడం కూడా (ఎందుకంటే), మాల్ అడియే కై తొழுవాన్ = ఆశ్రిత వ్యామోహాన్ని కల భగవానుని శ్రీచరణాలను చేతులతో నమస్కరించడంకోసమే, అందువల్ల, అన్దరమ్ ఒన్ఱు ఇల్లై = ఆలస్యం ఇక చేయడానికి ఏ కారణమూ లేదు, అడై = (స్వామిని వెంటనే) ఆశ్రయించు.

అవ :- "అనుభవానికి కావాలంటే గత పాశురంలో చెప్పినట్లే చేస్తాను. ఈ అనుభవానికి ఆటంకం కల్గించే పాపాలు మొదలైనవానిని నశింపజేసికొనే దారి ఏది?''- అని తమ మనస్సు అడుగగా ఆழ்్వార్లు "దానికి దశరథ చక్రవర్తి కుమారుడైన శ్రీరాముని శరణు పొందడమే ఉపాయం'' అని దీనిలో బదులు పల్కుతున్నారు.

59. అడైన్ద వరు వినైయోడు అల్లల్ నోయ్ పావమ్
మిడైన్దవై మీణ్డొழிయ వేణ్డిల్- నుడఙ్గిడైయై
మున్నిలఙ్గై వైత్తాన్ మురణழிయ మున్నొరు నాళ్
తన్ విలఙ్గై వైత్తాన్ శరణ్

అడైన్ద = సోపాధికం అయిన, అరు వినై యోడు = కఠినమైన అజ్ఞానం (ప్రబలపాపకర్మ) మొదలైనవానితో పాటు, అల్లల్ = మనోవ్యాధి, నోయ్ = శారీరకవ్యాధి, పావమ్= దుష్కర్మలను చేయడమనే పాపాచరణం, మిడన్దవై = (శరీరానికి హేతువు అయిన) దట్టమైన పాపాలు- అనే వీటిని, మీణ్డు ఒழிయ వేణ్డిల్ = తిరిగి పోయేటట్లుగా చేయాలి అని అంటే, నుడఙ్గు ఇడైయై = అల్లల్లాడే సన్నని నడుమును కల్గిన సీతాదేవిని, మున్ = పూర్వం, ఇలఙ్గై వైత్తాన్ = లంకలో చెఱలో పెట్టిన రావణుని, మురణ్ అழிయ = బలం నశించేటట్లుగా, మున్ ఒరు నాళ్ = పూర్వం శ్రీరాముడై అవతరించిన కాలంలో, తన్ విల్ అమ్ కై వైత్తాన్ = తన వింటిని అందమైన శ్రీహస్తంలో ధరించినవాడే, శరణ్ = ఉపాయం.

ఈ పాశురం ఈ ప్రబంధపాశురహారానికి నాయకమణివంటిది. దీనివల్ల భాసించే సారార్థాలు చాలా ఉన్నాయి. కర్మాదులచేత ఆవరింపబడి ఈ సంసారంలో జీవుడు ఉండడం - రాక్షసస్త్రీలచేత పరివేష్ఠితయై, అశోకవనంలో సీతాదేవి ఉన్న స్థితికి సమానం - అని, పిరాట్టి తనను విడిపించుకోవడానికి

తాను ఏ ప్రయత్నం చేయకుండా, **"తత్తస్య సదృశం భవేత్"** అనే రీతిలో స్వామి రాకకోసం వేచిఉన్నట్లే, జీవుడు కూడా వేచి ఉంటే, ఆ సీతాదేవి రక్షణ భారాన్ని తాను తన హృదయంపై బాణపాతాన్ని సహించి అయినా నిర్వహించి నట్లే, ఇతని పాపవిమోచనాన్ని సంతోషంతో స్వామి చేస్తాడు- అని, "లక్ష్మీ సహితుడే ఉపాయం'' - అని అన్నందున స్వామిని శరణు పొందేటపుడు, లక్ష్మిని పురుషకారంగా చేసికొని శరణు పొందాలని, సర్వేశ్వరునకు అత్యంత ప్రీతికరం అయిన ఆత్మవస్తువును "నాది'' అని భావించేవారు సీతాదేవిని నాకోసం అని తలచిన రావణుడు పడిన పాట్లు పడతారని - ఈ రీతిలో పలు అర్థాలను ఈ పాశురం సూచిస్తున్నది.

అన్యోపాయాలను విడచి, భగవానుడనే సిద్ధోపాయాన్ని ఆశ్రయించాలని ఈ పాశురం తెలుపుతున్నదని అనుకొంటే, ఇంతకు ముందు పాశురాలలో **"శిన్దిత్తిరు", "తిరునామ మెణ్", "తొ*ழு*దు ఎ*ழு*తుమ్ నెఞ్జే"**అని అంటూ అన్యోపాయాలను ఆశ్రయించమని ఆ*ழ்*వార్లు చెప్పడం ఏవిధంగా పొసగు తుంది? అనే సందేహం కలుగవచ్చు. వాటిని ఈ పాశురార్థానికి అనుగుణంగా అన్వయించి చూచినపుడు, దేహయాత్రకోసం తిరునామసంకీర్తనాదులు విధింపబడ్డాయి తప్ప ఉపాయరూపేణ అవి విధింపబడలేదనే చెప్పాలి. ఆ విధంగా కాకుండా, గీతలో శ్రీకృష్ణుడు మూడుషట్కాలలోని పద్దెనిమిది అధ్యాయాలలో కర్మజ్ఞాన భక్తియోగాద్యుపాయాలను తెలిపి ఉపదేశించగా, "అత్యంత బలహీనుణ్ణి అయిన నేను వానిని అనుష్ఠించగలనా?'' అని అర్జునుడు శోకించాడు. అపుడు చివరలో చరమశ్లోకాన్ని ఉపదేశించినట్లే, వీరుకూడా అనుష్ఠానంలో దుష్కరాలు, జీవుని అత్యంత పారతంత్ర్యానికి విరుద్ధాలైన అన్యో పాయాలను ముందు పాశురాలలో తమ మనస్సును ఉద్దేశించి ఉపదేశించగా, దీనివల్ల స్వరూపం తేటపడి, మనస్సుకు శోకం కల్గింది. అపుడు ఈ పాశురంలో స్వరూపానుగుణం అయిన శరణాగతిని ఉపదేశించారని కూడా చెప్పవచ్చు. ఈ జీవుడు తన స్వరూపాన్ని తెలిసికొన్నపుడు భగవానుడు తప్ప ఇంకొక ఉపాయం ఏదీ లేదు - అనేది ఈ పాశురసారం. ఇదే ఈ ప్రబంధముఖ్య ప్రమేయంకూడా.

అవ :- గత పాశురంలో "భగవానుడే ఉపాయం''- అని అన్నారు. "మోక్షమనే ఫలం ఈ చేతనునకు చెందినది. అందువల్ల ఉపాయానుష్ఠానంకూడా



అతని కర్తవ్యమే. కనుక భగవానుడే ఉపాయంకూడా - అని అనడం ఏ విధంగా సబబు? అనే ప్రశ్న తల ఎత్తగా, జీవుని స్వభావాన్ని గమనిస్తే- గతంలో జరిగిన వానిని దేనినీ వీడు తెలియడు. ఇపుడు ఈ పాట్లు పడడం వేనివల్ల? అనే విషయాన్నీ తెలియలేడు. ఇక రాబోయే దానిని కూడా తెలియలేడు. కాని, సర్వేశ్వరుణ్ణి చూస్తే, వీటిని- అంటే- అతీత- వర్తమాన- భవిష్యద్వృత్తాంతాలను అన్నిటినీ తెలిసిన సర్వజ్ఞుడే కాక, జీవుని నైచ్యాలను తీర్చి, ఉజ్జీవింపజేయగల సర్వశక్తి అని తెలుస్తున్నది. కనుక, జీవుని అనుష్ఠానం ఉపాయం అవుతుందా? లేక, భగవానుడే ఉపాయం అవుతాడా! ఆలోచించండి - అని ఇందులో అంటున్నారు.

**60. శరణా మఱై పయన్ద తామరైయానోడు**
**మరణాయ మన్నుయిర్ కట్కెల్లామ్- అరణాయ**
**పేరా*ழி* కొణ్డ పిరానన్ఱి మ*ఱ్ఱ*ఱియాతు**
**ఓరా*ழி* శూ*ழ்*న్ద వులకు**

శరణా=చతుర్విధపురుషార్థాలకు ఉపాయంగా, మఱై = వేదాన్ని, పయన్ద= ఉపదేశింపబడ్డ, తామరైయానోడు=నాభీకమలంలో జనించిన బ్రహ్మకూడా, మరణాయ= మరణాన్ని సహజంగా కల, మన్ ఉయిర్‌కట్కు ఎల్లామ్ = నిత్యంగా నిలచి ఉండే జీవులకు అందఱికీ, అరణ్ ఆయ = రక్షకంగా ఉండేవాడైన, పేర్ +ఆ*ழி* కొణ్డ పిరాన్ అన్ఱి = గొప్ప చక్రాన్ని శ్రీహస్తంలో కల స్వామితప్ప, మ*ఱ్ఱ*ు = అతనికంటే వేఱైనదానిని, ఓర్ ఆ*ழி* శూ*ழ்*న్ద = సాటి లేని సముద్రంతోచేత చుట్టబడి ఉండే, ఉలకు = లోకంలోని జనం, అఱి యాదు= తెలియదు.

ఈ పాశురంలో - చిన్నవారు, పెద్దవారు అనే తేడా లేకుండా ఈలోకంలో అందరు తమకు మంచి ఏది అనే దానిని తాము తెలియలేరు. సర్వేశ్వరుడు మాత్రమే దానిని తెలియగలడు- అనే విషయం తెలుపబడింది.

అవ :- భగవానుడు తప్ప మిగిలిన జీవవర్గం అంతా తమ క్షేమాన్నిగూర్చి తాము తెలియరు - అని అంటున్నారే. అతడు వీరిని రక్షించి తీరాలనే నిర్బంధం ఏమి? అని అంటే, అతడు వీటిని కన్నవాడు కనుక అతడు రక్షించకుండా ఉండడు- అని దీనిలో అంటున్నారు.

**61. ఉలకుమ్ ఉలకిఱన్ద వూఴియుమ్ ఒణ్ కేఴ్**
**విలకు కరుఙ్గడలుమ్ వెఱ్పుమ్- ఉలకినిల్**
**శెన్దీయుమ్ మారుతముమ్ వానుమ్ తిరుమాల్‌తన్**
**పున్దియిలాయ పుణర్‌ప్పు**

ఉలకుమ్ = లోకాలు అన్నీ, ఉలకు ఇఱన్ద ఊఴియుమ్ = లోకాలు నశించినా నిలచి ఉండే కాలం, ఒణ్ కేఴ్ విలకు కరుమ్ కడలుమ్ = అందమైన వర్ణాన్ని కల్గినది, అలలు ఎగసిపడేది, నల్లనిది అయిన సముద్రం, వెఱ్పుమ్ = (లోకాలకు ఆధారం అయిన) పర్వతాలు, ఉలకినిల్ = లోకంలో కన్పించే, శెమ్ తీయుమ్ = ఎఱ్ఱని అగ్ని, మారుతముమ్ =వాయువు, వానుమ్ = ఆకాశం, తిరుమాల్ తన్ = లక్ష్మీనాథుని, పున్దియిల్ ఆయ = సంకల్పంవల్ల పుట్టిన, పుణర్‌ప్పు = సృష్టి.

సృష్ట్యాదిలో జీవులు తమను తాము తెలియకుండా, భగవానుని కోరకుండా ఉన్నపుడు, వారి అప్రతిషేధాన్నే ఆలంబనంగా చేసికొని, వారిని స్వామి రక్షించడంవల్ల ఆ భగవానుడే ఉపాయం - అని భావం.

అవ :- ఈ రీతిలో లోకాలను సృష్టించి, తాను వీటికి దూరంగా ఉండి పోతాడా! అని అంటే, వీటి విరోధులను పోగొట్టి రక్షించేవాడుకూడా ఇతడే కదా! - అని దీనిలో అంటున్నారు.

**62. పుణర్ మరుతి నూడు పోయ్ ప్పూఙ్గురున్దమ్ శాయ్‌త్తు**
**మణ మరువ మాల్‌విడై యేఴ్ శెగ్ఱు- కణమ్ వెరువ**
**ఏఴులకమ్ తాయనవుమ్ ఎణ్డిశైయుమ్ పోయినవుమ్**
**శూఴరవ ప్పొఙ్గణైయాన్ తోళ్**

పుణర్ మరుతిన్ = ఒకదానితో ఇంకొకటి ఏమాత్రం సందు లేకుండా చేరి ఉండే రెండు మద్దిచెట్ల నడుమ, ఊడు పోయ్ = దోగాడుతూ పోయి, పూమ్ కురున్దమ్ శాయ్‌త్తు = అందమైన కుందవృక్షాన్ని కూలగొట్టి, మణమ్ మరువ = నప్పిన్నైప్పిరాట్టిని వివాహమాడడంకోసం, మాల్ విడై ఏఴ్ శెగ్ఱు= పెద్ద ఎద్దులు ఏడింటిని సంహరించి, కణమ్ వెరువ = దేవాసురులు అందఱు "ఏమి మూడుతుందో ఏమో!" అని భయపడేటట్లు, ఏఴ్ ఉలకమ్ తాయన



వుమ్= ఏడు లోకాలను అతిక్రమించినవి, ఎణ్ తిశైయుమ్ పోయినవుమ్ = ఎనిమిది దిక్కులలో వ్యాపించినవి ఏవి? అంటే, శూఴ్ అరవ = విస్తరించిన ఆదిశేషుడనే, పొఙ్గు అణైయాన్ = పైపైకి వృద్ధి చెందే శయ్యను కలవాని, తోళ్= బాహువులు.

అతిసుకుమారం అయిన ఆ పడుకవల్లకూడా కందిపోయే అసమాన సౌకుమార్యాన్ని కలవాడుకదా ఈ కఠినమైన కార్యాలను చేశాడు. తన సౌకుమార్యానికి తగినట్లు ఆ శయ్యలోనే పరుండి ఉండకుండా, భక్తులకోసం లేచి వచ్చి, ఇన్ని పడరాని పాట్లను పడుతున్నాడే!- అని ఆఴ్వార్లు ఆశ్చర్య పడుతున్నారు.

అవ :- "ఈరీతిలో ఉండే భగవానునిపట్ల నా అన్ని ఇంద్రియాలు అభినివిష్టాలయ్యాయి. దానివల్ల నేను కూడా అభినివేశాన్ని పొందాను" అని ఇందులో అంటున్నారు. "ముడియానే" (3-8) అనే తిరువాయ్‌మొఴి దశకంలో నమ్మాఴ్వార్లకు కల్గిన అనుభవంవంటిదే ఇదికూడా.

**63. తోళవనై యల్లాల్ తొఴా ఎన్ శెవి యిరణ్డుమ్**
**కేళవనతిన్ మొఴియే కేట్టిరుక్కుమ్- నానాళుమ్**
**కోణా కణైయాన్ కురైకఴలే కూఱువతే**
**నాణామై నళ్ళేన్ నయమ్**

తోళ్ = నా బాహువులు, అవనై అల్లాల్ తొఴా = అతనిని (భగవానుని) తప్ప ఇంకొక రిని నమస్కరించవు, ఎన్ శెవి ఇరణ్డుమ్ = నా శ్రవణాలు రెండు, కేళ్ అవనదు= (నాకు అన్ని విధాలైన) బంధువై ఉండే అతనియొక్క, ఇన్ మొఴియే = తీయని వచనాలనే, కేట్టు ఇరుక్కుమ్ = విని ప్రాణధారణ చేస్తుంది, నా = నా నాలుక, నాళుమ్ = ప్రతిదినం, కోళ్ నాకణైయాన్ = కాంతి నిండిన ఆదిశేషుని పడుకగా కలవాని, కురై కఴలే = ఆభరణధ్వనిచే శబ్దిస్తున్న శ్రీపాదాలనే, కూఱువదే = చెబుతుంది, నయమ్= సంసారులు అభిలషించే విషయాలను, నాణామై నళ్ళేన్ = నేను సిగ్గులేకుండా దరిచేరను.

స్వరూపజ్ఞానం కల్గిన తర్వాత ప్రాకృతవిషయాలను చూస్తే లజ్జించేటట్లుగా కదా అవి ఉంటాయి. ఆడవేషం వేసికొన్న మగవానిని స్త్రీగా భావించి, ఆమె

పొందును కోరి, ఆ తర్వాత ఆమె మగవాడని తెలిసినపుడు ఎంతో లజ్జను పొందినట్లే, లౌకికసుఖాలవల్ల ఆనందాన్ని పొందాలని భావించి, అనంతరం స్వరూపజ్ఞానాన్ని పొందిన చేతనుడు లజ్జను పొందుతాడు- అని పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్య.

అవ :- “మీకు, మీ ఇంద్రియాలకు విషయాంతరాలలో ఏమాత్రం సంగం లేకుండా ఉండేటట్లుగా భగవద్విషయంలో అభినివేశం అధికంగా ఉన్నా, అనాదివాసనవల్ల మిగిలిన విషయాలు మిమ్ములను, మీ ఇంద్రియాలను వశీకరించుకొంటే ఏం చేస్తారు?” అని సంసారులు ప్రశ్నించగా, “నేనున్న స్థితి ఇటువంటిది అయినపుడు ఏవిధంగా అవి నన్ను వశం చేసికొంటాయి?” అని ఇందులో వారిని ప్రతిప్రశ్న చేస్తున్నారు.

**64. నయవేన్ పిఱర్‌పొరుళై నళ్ళేన్ కీ*ళ్ళా*రోడు**
**ఉయవే నుయర్‌న్దవరోడల్లాల్- వియవేన్**
**తిరుమాలై యల్లతు దెయ్‌వ మెన్ఱేత్తేన్**
**వరుమా ఱెన్నెన్‌మేల్ వినై**

పిఱర్ పొరుళై = విలక్షణుడైన భగవానుని సొత్తు అయిన ఆత్మవస్తువును, నయవేన్ = నాది అని ఆశపడను, కీ*ళ్ళా*రోడు = ఆత్మను తనదిగా భావించే అధములైన సంసారులతో, నళ్ళేన్ = స్నేహంతో వర్తించను, ఉయర్‌న్దవరోడు అల్లాల్ ఉయవేన్ = (భగవానునకు శేషమై ఉన్నందున) ఉన్నతులైన శ్రీవైష్ణవులను తప్ప వేఱు మానవులతో మాటలాడను, తిరుమాలై అల్లదు = లక్ష్మీనాథుని తప్ప వేఱెవ్వరినీ, దెయ్‌వమ్ ఎన్ఱు ఏత్తేన్ = దైవం అని స్తుతించను, వియవేన్= వారిని చూచి ఆశ్చర్యపడను, ఎన్ మేల్ = ఇటువంటి నాపై, వినై వరుమ్ ఆఱు ఎన్ = పాపం వచ్చే దారి ఏది?

ఈ విధంగా ఉన్నపుడు భగవానుని అనుగ్రహానికి లక్ష్యం అయిన నన్ను అతని నిగ్రహరూపాలైన పాపాలు, తత్కారణంగా వచ్చే విషయానుభవం ఏ విధంగా జయించగలవు?

అవ :- గడచిన పాశురంలో పల్కిన గొప్పతనం నాకు ఒక్కనికి మాత్రమే కాదు. అతనిని ఆశ్రయించినవారికి అందఱికీ ఉండే విలక్షణమైనది సుమా!- అని దీనిలో అంటున్నారు.



**65. వినైయా లడర్‌ప్పడార్ వెన్నరకిల్ శేరార్**
**తినై యేనుమ్ తీక్కతిక్కణ్ శెల్లార్- నినైత**
**ఱ్కరియానై చ్చేయానై ఆయిరమ్‌పేర్ శెజ్గణ్**
**కరియానై క్కైతొ*ళ్ళు*త క్కాల్**

నినైతఱ్కు అరియానై = స్వప్రయత్నంతో తెలియరానివాడు, శేయానై = చాలా దూరంలో ఉన్నవాడు, ఆయిరమ్ పేర్ శెమ్ కణ్ కరియానై = వేయి తిరునామాలను, ఎఱ్ఱని నేత్రాలను, నల్లని తిరుమేనిని కలవాడైన స్వామిని, కై తొ*ళ్ళు*త క్కాల్ = చేతులతో నమస్కరిస్తే, వినైయాల్ అడర్ ప్పడార్ = కర్మలచేత బాధింపబడరు, వెమ్ నరకిల్ శేరార్ = క్రూర నరకాన్ని చేరరు, తినైయేనుమ్ = కొంచెంకూడా, తీ కది క్కణ్ శెల్లార్ = చెడ్డ దారులలో పోరు.

వీరికి ఏ కొంచెం అయినా నరకాదిదుర్మార్గ సంబంధం కల్గడం- అని భావం. ధర్మపుత్రుడు నరకాన్ని చూడడంవంటిదే.

అవ :- “భగవానుని ఆశ్రయించినవారు దుఃఖాన్ని పొందరు” - అని గత పాశురంలో అన్నారు. “జ్ఞానాన్ని కలవారై ఉంటే అతనిని ఆశ్రయించకుండా ఉండడం సాధ్యమా!” అని అంటున్నారు ఈ పాశురంలో.

**66. కాలై యె*ళ్ళు*న్దు ఉలకమ్ కఱ్పనవుమ్ కఱ్*ఱు*ణర్‌న్ద**
**మేలై త్తలైమఱైయోర్ వేట్పనవుమ్- వేలై క్కణ్**
**ఓరా*ళ్ళి*యానడియే ఓతువతు మోర్‌ప్పనవుమ్**
**పేరా*ళ్ళి* కొణ్డాన్ పెయర్**

కాలై ఎ*ళ్ళు*న్ది = (సత్త్వగుణాన్ని వృద్ధి చేసే) ప్రాతఃకాలంలో నిద్రనుండి లేచి, ఉలకమ్ = చేతనులైన ముముక్షువులు, కఱ్పనవుమ్ = అభ్యసించేవి, కఱ్*ఱు* ఉణర్‌న్ద మేలై తలై మఱైయోర్ = చదివి, తెలిసికొన్నవారైన వైదికశ్రేష్ఠులు, వేట్పనవుమ్ = దర్శించాలని ఆశపడేవి, వేలై క్కణ్ = పాలకడలిలో, ఓర్ ఆ*ళ్ళి*యాన్ అడియే = సాటి లేని సుదర్శనాన్ని చేతిలో ధరించి, నిద్రించే స్వామి శ్రీపాదాలే, ఓదువదుమ్ = ఈ పెద్దలు వినేవి, ఓర్‌ప్పనవుమ్ = భావించేవి, పేర్ ఆ*ళ్ళి* కొణ్డాన్ పెయర్ = గొప్ప చక్రాన్ని కలవాని తిరునామాలే.

"ఒరాళ్ళియాన్" - అనే పదానికి చక్రధారి అనే అర్థాన్ని గ్రహిస్తే, "పేరాళ్ళి కొణ్డాన్" అన్నపుడు పెద్ద సముద్రంవలె చూచేవారిని మోహింపజేసే రూపాన్ని పరిగ్రహించినవాడనే అర్థాన్ని గ్రహించాలి.

అవ :- ఈ విధంగా జ్ఞానులలో శ్రేష్ఠులైనవారంతా అతనిని ఆశపడడానికి కారణం ఏమంటే, జ్ఞానానికి లక్ష్యభూతుడు శ్రియఃపతి తప్ప వేఱొక తత్త్వం కాకపోవడంవల్లనే -అని ఇందులో అంటున్నారు.

67. పెయరుమ్ కరుఙ్గడలే నోక్కు మాఱు ఒణ్ పూ
ఉయరుమ్ కతిరవనే నోక్కుమ్- ఉయిరుమ్
తరుమనైయే నోక్కుమ్ ఒణ్‌తామరైయాళ్‌కేళ్వన్
ఒరువనైయే నోక్కు ముణర్వు

ఆఱు =నది, పెయరుమ్ కరుమ్ కడలే నోక్కుమ్ = అలలు లేచే నల్లని సముద్రాన్ని లక్ష్యంగా కల్గి ఉంటుంది, ఒణ్ పూ = కాంతిని పొందికగా కల తామరపూవు, ఉయరుమ్ కదిరవనే నోక్కుమ్ = చాలా ఉన్నతస్థానంలో (ఆకాశంలో) ఉండే సూర్యుని చూచే వికసిస్తుంది, ఉయిరుమ్ = (అవైష్ణవుల) ఆత్మలు, తరుమనైయే నోక్కుమ్ = (ఆయుష్కాలం చివరలో) యమధర్మ రాజునే పొందుతాయి, (అదే రీతిలో), ఉణర్వు= జ్ఞానం, ఒణ్ తామరై యాళ్ కేళ్వన్ ఒరువనైయే = కాంతి స్థిరంగా ఉండే తామరపూవులో నివసించే లక్ష్మీదేవికి నాథుడైన నారాయణుని మాత్రమే, నోక్కుమ్ = లక్ష్యంగా కల్గి ఉంటుంది.

సముద్రాన్ని ఉద్దేశించి నదులు ప్రవహించడం, తామరపూవు సూర్యుని చూచి వికసించడం, జీవులు యముని చేరడం సహజనియతి అయినట్లే, యధార్థ జ్ఞానం అనేది ఒకటి ఉంటే, అది శ్రియఃపతి ఒక్కని మాత్రమే లక్ష్యంగా కల్గి ఉంటుంది. అలక్ష్మీకులెవ్వరూ జ్ఞానానికి లక్ష్యం కాదని భావం. కొందఱి జ్ఞానం అన్యదైవాలను లక్ష్యంగా ఉన్నా, అది జ్ఞానం కాబోదు. అజ్ఞానమే.

అవ :- గడచిన పాశురంలో "నారాయణం మహాజ్ఞేయమ్" అనే రీతిలో జ్ఞానమనే పేరును కల్గినది అంతా అతనినే లక్ష్యంగా కల్గి ఉన్నది- అని అన్నారు. ఇక, అతనిని పరిచ్ఛేదించి ఇదమిత్థంగా తెలిసేవారెవ్వరూ లేరు- అని దీనిలో అంటున్నారు.



68. ఉణర్వారారున్ పెరుమై ఊళ్ళితోఱూళ్ళి
ఉణర్వారార్ ఉన్నురువన్దన్నై- ఉణర్వారార్
విణ్ణకత్తాయ్! మణ్ణకత్తాయ్! వేఙ్గడత్తాయ్! నాల్‌వేత
ప్పణ్ణకత్తాయ్! నీ కిడన్ద పాల్

విణ్ అకత్తాయ్ = శ్రీవైకుంఠంలో వేంచేసి ఉండేవాడా!, మణ్ అకత్తాయ్= ఈలోకంలో అవతరించినవాడా!, వేఙ్గడత్తాయ్ = శ్రీవేంకటాద్రిలో నిలచి ఉన్న వాడా!, పణ్ = స్వరాన్ని ప్రధానంగా కల, నాల్ వేద అకత్తాయ్ = నాల్గు వేదాలలో (ఉన్న) వెలిగేవాడా!, ఉన్ పెరుమై = నీ గొప్పతనాన్ని, ఉణర్‌వార్ ఆర్ = తెలిసినవారెవ్వరు?, ఊళ్ళి తోఱు ఊళ్ళి = కల్పాల తరబడిగా (విచారించినా), ఉన్ ఉరువమ్‌తన్నై = నీ స్వరూపాన్ని, రూపాన్ని, ఉణర్‌వార్ ఆర్ = ఎవరు తెలియగలరు?, నీ కిడన్ద పాల్ = నీవు పరుండిన పాలసముద్రాన్ని, ఉణర్‌వార్ ఆర్ = ఇంతటిది -అని ఎవరు పరిచ్ఛేదించి తెలియగలరు?

"పాల్" క్షీరమనే అర్థం ఇచ్చే ఈ పదం క్షీరాబ్ధిని లక్షిస్తుంది. 'నీ స్వరూప గుణాలను తెలియడం అటు ఉండనీ. నీ విభూతిసముద్రంలో ఒక చిన్న కణంవంటిది, ఆర్తుల ఆక్రందనలను వినడంకోసం నీవు పరుండి ఉండేదయిన క్షీరాబ్ధిని సైతం ఎవరు తెలియగలరు?' అని భావం.

అవ :- వేఱెవ్వరికీ నీ స్వరూపరూపగుణవిభూతులను తెలియడం సాధ్యం కాదు- అనే విషయం ఉండనీ. సహజంగా అన్నిటినీ తెలిసిన సర్వజ్ఞుడవైన నీవే నీ చేష్టితాన్ని తెలియలేవు- అని ఇందులో అంటున్నారు.

69. పాలన్ తనతురువాయ్ ఏళ్ళులకుణ్డు- ఆలిలైయిన్
మేలన్రు నీ వళర్‌న్ద మెయ్యెన్బర్ -ఆలన్రు
వేలై నీరుళ్ళతో? విణ్ణతో? మణ్ణతో?
శోలైశూళ్ కున్రెడుత్తాయ్ శొల్లు

పాలన్ తనదు ఉరువాయ్ = చిన్న శిశువు రూపాన్ని కలవాడై, ఏళ్ళు ఉలకు ఉణ్డు = ఏడు లోకాలను ఆరగించి, ఆల్ ఇలైయిన్ మేల్ = మఱ్ఱి ఆకు చిగురుపై, అన్రు = ప్రళయకాలంలో, నీ వళర్‌న్ద = నీవు నిద్రించడం, మెయ్ ఎన్బర్ = నిజం - అని వైదికులు అంటారు, అన్రు = అపుడు, ఆల్ = ఆ మఱ్ఱి

ఆకు, వేలై నీర్ = (నీవు నిద్రించిన) సముద్రజలంలో, ఉళ్ళదో = ఉన్నదా!, విణ్ణదో = (ఆధారం లేని) ఆకాశంలో ఉన్నదా!, మణ్ణదో = కఱిగిపోయిన భూమిలో ఉన్నదా?, శోలై శూ*ழ்* కున్రు ఎడుత్తాయ్ = తోటలచే పరివేష్ఠితం అయిన గోవర్ధనపర్వతాన్ని గొడుగుగా ఎత్తినవాడా!, శొల్లు = నీవే చెప్పాలి.

ఏడేండ్ల వయస్సులో ఏడు నాళ్ళు కదలకుండా మెదలకుండా ఉండేటట్లు చిటికెన వేలుపై తోటలచే చుట్టబడ్డ గోవర్ధన పర్వతాన్ని ధరించినవాడవు నీవు. ఈ కార్యం ఏవిధంగా సాధ్యం అన్నది నీవే చెప్పాలి. ఈ కార్యం ముందు పల్కిన లీలలతో సరి కాదు అని; నీ లీలలో ఏ లీల మహిమ అయినా నీవు కూడా చెప్పలేవని భావం.

అవ :- ఈ రీతిలో భగవానుని ప్రతి లీలయొక్క గొప్పతనంకూడా అతడు సైతం చెప్పలేనట్లుగా అంత గొప్ప స్వరూపరూపగుణవిభూతిచేష్టితాలను కల్గినవాడైనపుడు, ఇంక దేనిలోను అభినివేశాన్ని, ఆసక్తిని కలవారు కాకుండా, అతనినే ఆశ్రయించండి- అని లోకులను సంబోధిస్తూ దీనిలో ఆ*ழ்*్వార్లు అంటున్నారు.

**70. శొల్లున్దనైయుమ్ తొ*ழு*మిన్ వి*ழு* ముడమ్బు**
**శెల్లున్దనైయుమ్ తిరుమాలై- నల్లిత*ழ்***
**త్తామత్తాల్ వేళ్వియాల్ తన్దిరత్తాల్ మన్దిరత్తాల్**
**నామత్తా లేత్తుతిరేల్ నన్రు**

తిరు మాలై = లక్ష్మీనాథునిగూర్చి, శొల్లున్దనైయుమ్ = పల్కడానికి శక్తి ఉన్నంతవరకు పల్కి, తొ*ழு*మిన్ = నమస్కరించండి, వి*ழு*మ్ ఉడమ్బు= నశించడం స్వభావంగా కల శరీరం, శెల్లున్దనైయుమ్ = ఉన్నంతవరకు, నల్ ఇత*ழ்* తామత్తాల్ = చక్కని పూరేకులతో కూర్చిన పూమాలతోగాని, వేళ్వియాల్= యాగాలతోకాని, తన్దిరత్తాల్ = మంత్రం లేని క్రియాకలాపాలతో గాని, నామత్తాల్ = తిరునామ సంకీర్తనంతో గాని, ఏత్తుదిరేల్ = (ఆశ్రయించి) స్తుతించినవారైతే, నన్రు = మంచిని ఇస్తుంది.

ఆపదలో ''అమ్మా'' అని అన్నట్లే భగవన్నామాన్ని చెప్పినా చాలు. తిరునామసంకీర్తనానికి యోగ్యత ఏదయినా కావాలా ? అని భట్టర్‌ను నంజీయర్



ప్రశ్నించగా, గంగలో స్నానం చేసేవాడు శుద్ధికోసం ఇంకొక గుంటలో మునగాలా? - అని భట్టర్ బదులిచ్చారట.

అవ :- తాము ఎంతగా ఉపదేశించినా లోకులు సంస్కరింపబడకుండా ఉండడాన్ని చూచి, **"ఆరానుమ్ ఆదానుమ్ శెయ్య అకలిడత్తై ఆరాయ్న్దు అదు తిరుత్తలావదే"** (పెరియతిరువన్దాది- 25) అనే నమ్మా*ழ்*్వార్లవలె వీరుకూడా- "లోకంలోని వారు ఏ కీడు పొందితే నాకేమి? ఓ మనసా! నీవు మాత్రం భగవానుడనే విషయాన్ని మాత్రం చేయి విడువకుసుమా!'' అని ఇందులో అంటున్నారు.

**71. నన్రు పిణి మూప్పు క్కైయకన్*ఱి* నాన్గూ*ழி***
**నిన్రు నిలము*ழு*తు మాణ్డాలుమ్- ఎన్రుమ్**
**విడలా*ழி* నెఞ్జమే ! వేణ్డినేన్ కణ్డాయ్**
**అడలా*ழி* కొణ్డాన్ మాట్టన్బు**

ఆ*ழி* నెఞ్జమే = సముద్రంవంటి ఓ గంభీరమైన మనసా !, పిణి మూప్పు నన్రు కై అకన్*ఱి* = వ్యాధిని, వార్ధక్యాన్ని బాగా పోగొట్టుకొని (కైవల్యాన్ని పొంది), నాన్గు ఊ*ழி*నిన్రు = నాల్గు యుగాలలోను స్థిరంగా నిలచి ఉండి, నిలమ్ ము*ழு*దుమ్ ఆణ్డాలుమ్ = బ్రహ్మాండాన్ని పూర్తిగా ఏలే గొప్ప ఐశ్వర్యాన్ని పొందినా, అడల్ ఆ*ழி* కొణ్డాన్ మాట్టు = స్పర్ధించే శ్రీసుదర్శనాన్ని చేతిలో ధరించినవానిపట్ల, అన్బు = స్నేహాన్ని, విడల్ = విడువకు, వేణ్డినేన్ కణ్డాయ్ = నిన్ను యాచిస్తున్నానుసుమా!

ఇతరపురుషార్థాలు అల్పాస్థిరాలు, కనుక అతనిని ఆశ్రయించు- అని నేను అనడం లేదు. అవి అనంత స్థిరాలైనా, ఇతని అనుభవం అల్పాస్థిరం అయినా భగవానుని పట్ల ప్రేమ వీడకు - అని భావం. గుణకృతదాస్యంకంటే స్వరూపదాస్యమే గొప్పదని ఇందులో సూచింపబడింది. నిజానికి లౌకికభోగాలు అనంత స్థిరాలు కావు. భగవదనుభవం అల్పాస్థిరం కాదు కదా!

అవ :- "భగవానుని విషయంలో ప్రేమను కల్గి ఉండడం మానకు'' అని మనస్సును వేడుతూ గత పాశురంలో ఆ*ழ்*్వార్లు పలికారు. వీరి మనస్సు మొదలైన ఇంద్రియాలు వీరికంటే ముందుగానే భగవానునిపట్ల ఆసక్తిని,

అభినివేశాన్ని పొందినవి కావడంవల్ల, తామే వీరికి ఆచార్యులై "ఆ*ళ్వా*ర్లూ! మీరు ఈ భగవద్విషయాన్ని విడువకుండా ఉండండి" అని వీరికి ఉపదేశించిన తీరును ఇందులో తెలుపుతున్నారు.

**72. అన్బా*ళి* యానై అణుకెన్నుమ్ నా అవన్దన్**
**పణ్బా*ళి*త్తోళ్ పరవి యేత్తెన్నుమ్- మున్బా*ళి***
**కాణానై క్కాణెన్నుమ్ కణ్ శెవి కేళెన్నుమ్**
**పూణారమ్ పూణ్డాన్ పుక*ళ్***

అన్బు = స్నేహపూర్ణమైన మనస్సు, ఆ*ళి*యానై అణుకు ఎన్నుమ్ = "చక్రపాణిని చేరు" అని అంటుంది, నా = నాలుక, అవన్‌తన్ పణ్బు ఆ*ళి* తోళ్ పరవి ఏత్తు ఎన్నుమ్ = "ఆ స్వామియొక్క సౌందర్యసముద్రం అయిన భుజాలను అక్రమంగా స్తుతించు" అని అంటుంది, మున్బు ఊ*ళి* కాణానై క్కాణ్ ఎన్నుమ్ కణ్= నేత్రాలు "మనం అపరాధాలు చేస్తున్న అనాదియైన కాలాన్ని గమనించకుండా ఉండే స్వామిని దర్శించు" అని అంటుంది. శెవి = చెవులు అయితే, పూణ్ ఆరమ్ పూణ్డాన్ పుక*ళ్* కేళ్ ఎన్నుమ్ = "ఆభరణమైన ముత్యాలమాలను ధరించినవాని కీర్తినే విను" అని అంటుంది.

ఆభరణాలకే అందాన్ని కల్గించే స్వామి తిరుమేనికి ఆభరణం అయిన హారం మొదలైన దివ్యాభరణాలను అందం కోసం అలంకరించుకొన్నవాని గుణాలుకదా ఇవి. ఒకవేళ అతని దోషాన్ని చూచినా దీనిని విడువడానికి వీలున్నదా? అని భావం. **"పూణారమ్"** - మిగిలిన ఆభరణాలకు అభరణంవంటి హారం - అని కూడా చెప్పవచ్చు. ముందు తెల్పిన అర్థంలో **"పూణ్"** అనే పదానికి **"ఆభరణస్యా భరణమ్"** అనే అర్థాన్ని గ్రహించాలి.

అవ :- పూర్వం పాశురంలో పల్కిన ఇంద్రియాలు సైతం వెనుకబడే టట్లుగా తాము భగవద్విషయంలో అభినివేశాన్ని పొందిన ఆ*ళ్వా*ర్లు, మనస్సును చూచి, "అతని గొప్పతనాన్ని చూచి నీవు అతనిని ఆశ్రయిస్తే ఆశ్రయించు; విడిస్తే విడు" అని ఇందులో అంటున్నారు.

**73. పుక*ళ్వా*య్ ప*ళి*ప్పాయ్ నీ పూన్దు*ళా*యానై**
**ఇక*ళ్వా*య్ కరుతువాయ్ నెఞ్జే!- తిక*ళ్* నీర్**



**క్కడలు మలైయుమ్ ఇరు విశుమ్బుమ్ కా*ఱ్ఱు*మ్**
**ఉడలు ముయిరు మే*ఱ్ఱా*న్**

(ఎన్) నెఞ్జే = ఓ నామనసా!, నీ = నీవు, పూమ్ తు*ళా*యానై = అందమైన తులసీమాలతో అలంకరింపబడ్డవానిని, పుక*ళ్*వాయ్ = పొగడితే పొగడు, ప*ళి*ప్పాయ్ = నిందిస్తే నిందించు, ఇక*ళ్*వాయ్ = ఆదరిస్తే ఆదరించు, కరుతువాయ్ = లెక్కిస్తే లెక్కించు, (నీవు ఏది చేసినా, అతడు) తిక*ళ్* నీర్ కడలుమ్ = ప్రకాశించే జలాన్ని కల్గిన సముద్రం, మలైయుమ్ = పర్వతం మొదలైన కార్యవస్తువులను, ఇరు విశుమ్బు కా*ఱ్ఱు*మ్ = విస్తరించిన ఆకాశం, వాయువు మొదలైన కారణవస్తువులను, ఉడలుమ్ ఉయిరుమ్ = శరీరాన్ని, ఆత్మను, ఏ*ఱ్ఱా*న్ = ధరించినవాడై ఉన్నాడు.

**"ఉయిర్"** అనే పదం ధర్మభూతజ్ఞానం, నిత్యవిభూత్యాది అజడవస్తువులకు ఉపలక్షణం. స్వామి వైలక్షణ్యాన్ని చూస్తే తర్వాత విడువడానికి వీలు కాదని భావం- లేక, భగవానుని ఏవిధంగా ఆశ్రయించాలి ? అని మనస్సు ప్రశ్నించగా, సకల వస్తువులను ప్రకారంగా కల్గినవాడతడు. అందువల్ల ప్రకారి అయిన అతనిని నేరుగా ఆశ్రయించినా ఆశ్రయించు. లేక, ఉన్నది అంతా భగవత్ప్రకారకమే కనుక, వాటిలో దేనినైనా ఒకదానిని ఆశ్రయించు- అని అంటున్నారనికూడా చెప్పవచ్చు. భగవత్ప్రకారాలైన ఇంద్రాదులకు అంతర్యామిగా అతనిని ఉపాసించే రీతులు బ్రహ్మసూత్రాలలోని ఇంద్రప్రాణాధికరణాదులలో తెలుపబడ్డాయి. లేక, ఓ మనసా! నీవు భగవానుని ఆశ్రయించినా, లేకపోయినా, సముద్రం, పర్వతం, శరీరం, ప్రాణం- మొదలైన వానిని ధరించే వాడుగానే అతడుంటాడు సుమా!" అని భగవద్వైభవం ఇందులో చెప్పబడిందని కూడా చెప్పవచ్చు.

అవ :- "భగవానునే ఆశ్రయించాలని అనడం ఎందుకు? లోకంలో కొందఱు రుద్రుడు ఆశ్రయణీయుడైన పరతత్త్వమని అంటున్నారే! అతనినే ప్రకారిగా భావించి ఆశ్రయించవచ్చునుకదా! - అని అంటే, ఆ రుద్రునకుకూడా పరమపురుషుడు ప్రకారిగా, శరీరిగా, శేషిగా, రక్షకుడుగా ఉన్నాడు. అతడు శ్రీమన్నారాయణుడే" - అని దీనిలో అంటున్నారు. రుద్రునకు, సర్వేశ్వరునకు

మధ్య గల వ్యత్యాసాలను వెంట వెంటనే తెలుపుతూ ముందు చెప్పబడ్డ రుద్రుడు, తరువాత చెప్పబడ్డ శ్రీనారాయణునకు రక్ష్యకోటిలోనికి చేరినవాడు- అని స్పష్టంచేసే ఈ పాశురం ఆ*ఴ్వా*ర్ల శ్రీమన్నారాయణ పారమ్య పక్ష పాతిత్వానికి తిరుగు లేని, ప్రబలమైన సాక్షి.

**74.** ఏ*ఱ్ఱా*న్ పుళ్ళూర్‌న్దాన్ ఎయిలెరిత్తాన్ మార్విడన్దాన్
నీ*ఱ్ఱా*న్ ని*ఴ*ల్‌మణి వణ్ణత్తాన్ - కూ*ఱ్ఱొ*రుపాల్
మఙ్గైయాన్ పూమకళాన్ వార్‌శడైయాన్ నీణ్ముడియాన్
కఙ్గైయాన్ నీళ్‌క*ఴ*లాన్ కాప్పు

ఏ*ఱ్ఱా*న్ = (అప్రసిద్ధం అయిన) ఎద్దును వాహనంగా కలవాడై, ఎయిల్ ఎరిత్తాన్ = (తన భక్తుల) త్రిపురాలను దహించినవాడై, నీ*ఱ్ఱా*న్ =(పాపం తొలగిపోవడం కోసం) భస్మాన్ని ఒంటికి పూసికొన్నవాడై, కూ*ఱ్ఱు* ఒరు పాల్ మఙ్గైయాన్ = (శరీరంలోని) ఒక భాగంలో పత్ని అయిన పార్వతిని ధరించిన వాడై, వార్ శడైయాన్ = వేలాడే జటలతో కూడిన సాధకుడై, కఙ్గైయాన్ = (పాపం తొలగిపోవడంకోసం) గంగను తలపై ధరించినవాడై ఉండే శివుడు, పుళ్ ఊర్‌న్దాన్ = (వేదాన్ని శరీరంగా కల) గరుడుని వాహనంగా కలవాడై, మార్వు ఇడన్దాన్ = భక్తుడైన ప్రహ్లాదునికోసం హిరణ్యకశిపుని వక్షస్సును చీల్చినవాడై, ని*ఴ*ల్ మణి వణ్ణత్తాన్ = చల్లని, నీలమణివంటి రూపాన్ని కలవాడై, పూ మకళాన్ = తామరపూవులో పుట్టిన లక్ష్మిని వక్షఃస్థలంలో కలవాడై, నీళ్ ముడియాన్ = పరత్వసూచకం అయిన దీర్ఘమైన, ఉన్నతమైన కిరీటాన్ని కలవాడై, నీళ్ క*ఴ*లాన్ = (గంగకు ఉత్పత్తిస్థానం అయిన) దీర్ఘపాదాలను కలవాడైన శ్రీమన్నారాయణుని, కాప్పు = రక్ష్యవర్గంలోనికి చేరినవాడు.

"పావనార్థం జటామధ్యే దధార శిరసా హరః" అని, "యచ్చౌచనిఃసృత సరిత్ప్రవరోదకేన తీర్థేన మూర్ధ్ని విధృతేన శివ శ్శివో**ఽ** భూత్" అనే రీతిలో పరమపురుషుని శ్రీపాదతీర్థం గంగను తనను పరిశుద్ధుని చేసికోవడం కోసం ధరించినవాడు, ఆ గంగకు ఉత్పత్తిస్థానంగా పెరిగి వృద్ధి చెందిన శ్రీచరణాలను కల త్రివిక్రముని రక్ష్యకోటిలోనికి చేరినవాడు - అని, శివుడు అతనిచే రక్షింపబడేవాడే- అని వ్యక్తమవుతున్నది.



అవ :- తనను ఈశ్వరునిగా అభిమానించేవాడై, ఇతరులనుకూడా అభిమానించేటట్లు చేసేవాడైన శివునకుకూడా రక్షకుడవైన నిన్ను ఆశ్రయించిన వారికి ఆటంకాలన్నీ తొలగిపోతాయి. సన్మార్గంలో ప్రవర్తించడంకూడా సంభవిస్తుందని ఇందులో అంటున్నారు.

**75.** కాప్పున్నై యున్న క్క*ఴి*యుమ్ అరు విన్నైకళ్
అప్పున్నై యున్న అవి*ఴ్‌న్దొ*ఴి*యుమ్- మూప్పున్నై
చ్చిన్దిప్పార్‌క్కిల్లై తిరుమాలే! నిన్నడియై
వన్దిప్పార్ కాణ్బర్ వ*ఴి*

ఉన్నై ఉన్న = నిన్ను తలిస్తే, కాప్పు = (జీవునకు భగవానునిచే) కావలిగా నియమింపబడ్డ దేవతలు, క*ఴి*యుమ్ =తొలగిపోతారు, అరు విన్నైకళ్ = అరుదైన క్రూరకర్మలు, ఉన్నై ఉన్న = నిన్ను భావించగానే, ఆప్పు అవి*ఴ్‌*న్దు ఒ*ఴి*యుమ్ = పరిపూర్ణంగా నశిస్తాయి, ఉన్నై శిన్దిప్పార్‌క్కు = నిన్ను ధ్యానించేవారికి, మూప్పు ఇల్లై = ముసలితనం మొదలైన ఆఱు వికారాలు లేవు, తిరుమాలే = లక్ష్మీనాథుడవైన స్వామీ!, నిన్ అడియే = నీ శ్రీపాదాలను, వన్దిప్పార్ = నమస్కరించేవారు, వ*ఴి* కాణ్బర్ = అర్చిరాది మోక్షమార్గాన్ని దర్శిస్తారు. (ఈ లోకంలోనే సద్గతిలో పయనించగలరని కూడా భావం.)

అవ :- "నీవు నివసించే తిరుమలైయే తనవద్ద కొంత కాలం నివసించిన వారికి కూడా తప్పక మోక్షాన్ని ఇవ్వగల్గినది అయినపుడు, నిన్ను నమస్కరించే వారు మోక్షాన్ని పొందుతారు అనే విషయాన్ని ప్రత్యేకించి చెప్పాలా? అని కైముతికన్యాయంతో ఇందులో ఆ*ఴ్వా*ర్లు అంటున్నారు.

**76.** వ*ఴి* నిన్ఱు నిన్నై త్తొ*ఴు*వార్ వ*ఴు*వా
మొ*ఴి* నిన్ఱ మూర్‌త్తియరే యావర్- ప*ఴు*దొన్ఱుమ్
వారాద వణ్ణమే విణ్ కొడుక్కుమ్ మణ్ణళన్ద
శీరాన్ తిరువేఙ్గడమ్

వ*ఴి* నిన్ఱు = భక్తిమార్గంలో స్థిరంగా నిలచి, నిన్నై = నిన్ను, తొ*ఴు*వార్= ఆశ్రయించేవారు, వ*ఴు*వా మొ*ఴి* నిన్ఱ = అసత్యం లేని వాక్కు అయిన వేదంలో

చెప్పబడ్డ, మూర్త్తియరే ఆవర్ = స్వరూపాన్ని కలవారుగా తప్పక కాగలరు, మణ్ అళన్ద శీరాన్ = (తన పరత్వాన్ని గమనించకుండా) లోకం అంతటిని కొలిచిన సౌలభ్యాన్ని కల్గినవానియొక్క, తిరువేఙ్గడమ్ = శ్రీవేంకటాచలం, ప*ళు*దు ఒన్ఱుమ్ = ఏ విధమైన కొఱత, వారాద వణ్ణమే = రాని రీతిలో, విణ్ కొడుక్కుమ్ =పరమపదాన్ని ఇస్తుందికదా!

తనవద్ద కొంతకాలం ఉన్న వారికి తిరుమల ప్రాప్యం అయిన పరమ పురుషుని స్థానం, ప్రాపకం అయిన తనవద్దచోటు రుచిస్తుంది. విశ్వాసానికి ఏ లోటు లేకుండా తానే రక్షించి, పరమపదాన్ని కూడా తానే ఇస్తుంది. అచేతనం అయిన కొండ ఏవిధంగా మోక్షం ఇస్తుంది? అని అంటే, ఈ దివ్యదేశవాసమే ఫలసాధనమై, భక్తిప్రపత్తులను కల్గించి కాని, నేరుగా కాని భగవత్ప్రీతిని కల్గించి పరమపదాన్ని భగవానుడివ్వడంలో సహాయపడుతుందని భావం. పాశురంలోని పూర్వార్ధంలో భక్తియోగం మోక్షసాధనం అని, ఉత్తరార్ధంలో దివ్యదేశవాసం మోక్షసాధనం అవుతుందని చెప్పబడింది. 'ఎమ్బార్' అనే ఆచార్యులు ఈ పాశురాన్ని ప్రతిదినం ప్రాతఃకాలంలో అనుసంధించేవారట.

అవ :- "శ్రీవేంకటాచలానికి ఒక్కదానికే మోక్షసాధనత్వమున్నదని భావించవద్దు. దివ్యదేశాలకు అన్నిటికీ తమను అనుసంధించేవారికి మోక్షాన్ని ఇచ్చే గొప్పతనం ఉన్నది"- అని దీనిలో అంటున్నారు. లేక, తిరుమలైను చేరగానే అనిష్టనివృత్తి, ఇష్టప్రాప్తి కల్గుతుందా? అని అంటే, ఈ ఆత్మలను పొందడం కోసం అతడు దివ్యదేశాలలో నిలచి, కూర్చుండి, పరుండి, నడచి పడిన పాట్లను అన్నిటినీ చూస్తే, ఈ దివ్యదేశాలు చేతనుడు, పరమచేతనుడు- అనే భేదం లేకుండా ఇద్దఱికీ అనిష్టనివృత్తిని, ఇష్టప్రాప్తిని కల్గిస్తాయి- అనే విషయం తనకు తానే సిద్ధిస్తుంది కదా - అని అంటున్నారు- అని కూడా చెప్పవచ్చు.

**77. వేఙ్గడముమ్ విణ్ణకరుమ్ వెంఃకావుమ్ - అంఃకాత**
**పూఙ్గిడఙ్గిన్ నీళ్ కోవల్ పొన్నకరుమ్- నాన్గిడత్తుమ్**
**నిన్ఱా నిరున్దాన్ కిడన్దాన్ నడన్దానే**
**ఎన్ఱాల్ కెడుమా మిడర్**



వేఙ్గడముమ్ = తిరుమలై, విణ్ నకరుమ్ = శ్రీవైకుంఠం, వెంఃకావుమ్ = తిరువెంఃకా, అంఃకాద పూమ్ కిడఙ్గిన్ = మాఱని పుష్పాలతో కూడిన, అగడ్తలను కల్గినది, నీళ్ కోవల్ పొన్ నకరుమ్ = భోగ్యమైనది, అందమైనది అయిన తిరు క్కోవలూర్, నాన్గు ఇడత్తుమ్ = అనే నాల్గు దివ్యదేశాలలో, నిన్ఱాన్ ఇరున్దాన్ కిడన్దాన్ నడన్దాన్ ఎన్ఱాల్ = (స్వామి) నిలచి, కూర్చుని, పరుండి, నడుస్తూ ఉన్నాడు - అని అంటే, ఇడర్ = మనం నిలచినపుడు, కూర్చున్నపుడు, శయనించి నపుడు, నడచినపుడు చేసే పాపాలు, కెడుమామ్ = నశించిపోతాయి.

జీవుడు తానుగా కొని తెచ్చుకొన్న క్లేశాలన్నీ ఉరువు లేకుండా నశిస్తాయి - అని భావం. ఇక్కడ అనిష్టవృత్తిమాత్రమే చెప్పబడినా, అది ఇష్టప్రాప్తిని లక్షిస్తుంది.

అవ :- "ఈవిధంగా భగవానుడు నిలచి, కూర్చుని, పరుండి, నడచి చేసిన లీలలను మాత్రమేనా? దాసులకోసం అతడు చేసిన గజేంద్రరక్షణాది లీలలను మనం అనుసంధిస్తే అతని శ్రీచరణాలలో కైంకర్యం చేస్తే తప్ప మనకు నిలవడానికి సాధ్యం కాదుసుమా!" - అని మనస్సుతో అంటున్నారు.

**78. ఇడరార్ పడువారె*ళు* నెఞ్జే ! వే*ళ*మ్**
**తొడర్‌వాన్ కొడుముతలై శూ*ళ్*న్ద -పడ ముడైయ**
**పైన్నాక ప్పళ్ళియాన్ పాతమే కైతొ*ళు*తుమ్**
**కొయ్‌న్నాక ప్పూమ్బోతు కొణ్డు**

వే*ళ*మ్ = గజేంద్రుని, తొడర్ = (మింగడం కోసం) వెంబడించి వచ్చిన, వాన్= బలాన్ని కల, కొడు ముతలై = క్రూరమైన మొసలిని, శూ*ళ్*న్ద = వధించినవాడు, పడమ్ ఉడైయ = పడగలను కలవాడై, పై నాకమ్ పళ్ళియాన్= విస్తరించి ఉన్న ఆదిశేషుని పడుకగా కలవాడైన స్వామియొక్క, పాదమే = శ్రీచరణాలే, నాకమ్ కొయ్ పూమ్ పోదు కొణ్డు = పొన్నచెట్టునుండి కోసిన, అందమైన పూలను తీసికొని, కై తొ*ళు*దుమ్ = నమస్కరిద్దాం, నెఞ్జే = మనసా!, ఎ*ళు* = (ఈ విధంగా నమస్కరించడంకోసం) లేచి రా, (ఈ రీతిలో నమస్కరిస్తే), ఆర్ ఇడర్ పడువార్ = ఎవరు దుఃఖాన్ని అనుభవిస్తారు?

ఓ మనసా! ఈ విధంగా భగవానుని శ్రీచరణాలలో పూలను సమర్పిస్తే నీవు బాధపడే అవకాశంలేదు. ఇక, మన వద్దకు క్లేశాలు వస్తే అవి మొసలి పడినపాట్లు పడతాయి సుమా! కనుక, క్లేశపడతామో! ఏమో! - అనే సందేహం పడకుండా, భగవానుని ఆశ్రయించి, కొలవాలని చూడు.

అవ :- "స్వామి తన దాసులకోసం కార్యాన్ని చేయడాన్ని వేటెక్కడైనా చూచామా?'' అని అంటే, తన దాసుడైన ఇంద్రునికోసం తనను యాచకునిగా చేసికొని, నిందను మోసి, "ఇచ్చేవాడే తప్ప గ్రహించేవాడు కాదు'' అనే తన స్వభావాన్ని సైతం మార్చుకొని, కార్యాన్ని సాధించడాన్ని చూడలేదా?- అని ఇందులో ఆళ్వార్లు ఎదురు ప్రశ్న వేస్తున్నారు.

**79.** **కొణ్డానై యల్లాల్ కొడుత్తారై యార్ పళిప్పార్**
**మణ్ తా వెన విరన్దు మావలియై -ఒణ్డారై**
**నీరజ్గై తోయ నిమిర్న్దిలైయే నీళ్విశుమ్బిల్**
**ఆరజ్గై తోయ వడుత్తు**

**"మణ్ తా"** ఎన = "(మూడడుగుల) నేలను దానం ఇవ్వాలి'' అని, మా వలియై ఇరన్దు = మహాబలిదగ్గర యాచించి, ఒణ్ తారై నీర్ = (అతనిచే పోయబడ్డ) గొప్ప కాంతిని కల దానజలధారను, అమ్ కై తోయ= (నీ) అందమైన శ్రీహస్తంలో పడగానే, నీళ్ విశుమ్బిలార్ = విస్తరించిన ఆకాశంలో ఉండే దేవతలు, అమ్ కై = (నీ) అందమైన బాహువులలో, తోయ = ఆలింగనం చేసికొనేటట్లు, అడుత్తు నిమిర్న్దిలైయే= త్వరగా వృద్ధిచెందలేదా!, కొణ్డానై = (తన సొత్తును) తన స్వంతం చేసికొన్న స్వామిని, (పళిప్పార్) అల్లాల్ = నిందించేవారే తప్ప, కొడుత్తారై = తన సొత్తు కానిదానిని తనదిగా అభిమానించి) ఇచ్చిన మహాబలిని, యార్ పళిప్పార్ = ఎవరు నిందిస్తారు?

తనదికాని భూమిని తనది అని భావించి, అంతటితో ఆగకుండా, దానిని స్వామివైన నీవు వచ్చి అడిగినపుడే నీవు ఎవరో తెలిసినా, నీ భూమిని నీ ఎదురుగానే తనదని అభిమానించి నీకే ఇచ్చే దురహంకారి అయిన మహాబలిని "భగవదైశ్వర్యాన్ని అపహరించినవాడు, అహంకారం నిండినవాడు, ఆసుర స్వభావం కలవాడు'' - అని నిందించవలసిఉండగా, ఆవిధంగానే ఎవరూ అనలేదు. సరికదా; అతనిని "గొప్ప దాత'' అని అంటున్నారే. నిన్ను మోసగాడని నిందిస్తున్నారే? గుణవంతుని నిందించడం, గుణహీనుని కీర్తించడం ఈలోకం స్వభావమేకదా! - అని ఇందులో లోకులను గర్హిస్తున్నారు.



అవ :- భగవానుడు, మహాబలి దగ్గరనుండి భూమిని తిరిగి తీసికొని ఇంద్రుని రక్షించడం మాత్రమేనా! తనకు అంతరంగులైన భక్తులతో **"న క్షమామి"** అనే రీతిలో విరోధం పెట్టుకొన్న ఒకడు వచ్చి తనను శరణు కోరినా, **"న క్షమామి"** అనే వచనానికి, **"న త్యజేయమ్"** అనే వచనానికి ఏ విరోధం రాని రీతిలో తనను శరణు పొందినవానిని అతనికి విరోధిగా ఉండే తన భక్తుని దగ్గరనే అప్పగించి, అతని ద్వారానే రక్షించగల అత్యంతసామర్థ్యాన్ని కలవాడుకదా! - అని దీనిలో అంటున్నారు. భగవానుడు దేవలోకంలో ఇంద్రునకు తమ్ముడుగా ఉపేంద్రుని రూపంలో అవతరించినపుడు గరుడుడు వినతకు కుమారుడుగా అవతరించాడు. పాతాళలోకంలో సుముఖుడనే ఒక సర్పాన్ని ఆ గరుడుడు భక్షించాలని తలచాడు. దానిని తెలిసిన సుముఖుడు ఉపేంద్రుని శయనపర్యంకంలోని ఒక కాలుకు చుట్టుకొని, భగవానుని రక్షించమని శరణు వేడాడు. గరుడుడు "దేవదేవుడవైన నిన్నుకూడా మోసే నా ఎరను నీవే అడ్డుగొడతావా?'' అని కోపంతో అనగా, "నీతోపాటు లోకాలను అన్నిటినీ నేను ధరిస్తూ ఉండగా, నీవా నన్ను మోస్తున్నావు! కనీసం నా కుడిచేయిని అయినా నీవు మోయగలవేమో చూడు!'' అని అంటూ స్వామి తన కుడిచేతిని మాత్రం గరుడునిపై పెట్టాడు. గరుడుడు ఆ పరమపురుషుని కుడిచేయి భారాన్ని మోయలేక నీరసపడి, నిజాన్ని తెలిసి స్వామిని స్తుతించాడు. అపుడు సుముఖుని గరుడుని చేతికి ఇచ్చి, అతని రక్షణభారాన్ని గరుడునకు అప్పగించాడు- అనే పౌరాణికగాథను ప్రకృతంలో స్మరించాలి.

**80.** **ఆడుత్త కడుమ్బుకైళుక్కు ఆర్ఱ్రే వెన్నోడి**
**పడుత్త పెరుమ్బాళి శూళ్న్ద- విడత్తరవై**
**వల్లాళన్ కైక్కొడుత్త మామేని మాయవనుక్కు**
**అల్లాతు మావరో ఆళ్**

అడుత్త కడుమ్ పకైఞఱ్కు= సహజంగానే క్రూరమైన శత్రువు అయిన గరుడునకు, ఆఱ్ఱేన్ ఎన్ఱు = "(నేరుగా ఎదురొడ్డి) జీవించలేను'' అని పల్కి, ఓడి = పరుగెత్తిపోయి, పడుత్త పెరుమ్ పాழ் = భగవానుడు పరుండిన గొప్ప శయ్యను, శూழ்న్ద = చుట్టుకొన్న, విడత్తు అరవై = విషాన్ని కల సుముఖుడనే సర్పాన్ని, వల్లాళన్= బలాన్ని కలవాడైన గరుడుని, కై కొడుత్త = చేతిలో రక్ష్యవస్తువుగా అప్పగించినవాడు, మా మేని మాయవనుక్కు అల్లాదుమ్ = గొప్ప తిరుమేనిని కల్గినవాడు, ఆశ్చర్యభూతుడు అయిన స్వామికి తప్ప మిగిలిన వారికి, ఆళ్ ఆవరో = శేషభూతులు అవుతారా! (కారు)

ఇటువంటి ఆశ్చర్యకరం అయిన స్వభావాన్ని కలవానికి దాస్యాన్ని చేయాలే తప్ప, తనను, ఇతరులను రక్షించలేని ఒక క్షుద్రదేవతను ఆశ్రయించవచ్చునా! అని హృదయం.

అవ :- కల్పవృక్షం దగ్గరనుండి కౌపీనాన్ని (గోచీని) వరంగా ప్రార్థించే రీతిలో, తననే దానం చేసే అపూర్వకల్పకం అయిన తనవద్ద ఒక అల్ప ప్రయోజనాన్ని కోరిన దేవతలకోసం తన దేహం శ్రమపడేటట్లుగా సముద్రాన్ని చిలికి, వారు కోరిన దానిని ఇచ్చినవాని తిరునామమేకదా సంసారాన్ని దాటడానికి ఉపాయం!- అని ఇందులో అంటున్నారు.

**81. అళమర్ వెన్ఱి అడుకళత్తుళఞ్జాన్ఱు**
**వాళమర్ వేణ్డి వరై నట్టు- నీళరవై**
**చ్చుఱ్ఱి క్కడైన్దాన్ పెయరన్ఱే తొల్ నరకై**
**ప్పఱ్ఱి క్కడత్తుమ్ పడై**

ఆళ్ అమర్ వెన్ఱి అడు కళత్తుళ్ = యుద్ధాన్ని చేసే వీరులతో నిండినది, జయాన్ని కల్గినది అయిన యుద్ధరంగంలో, అఞ్జాన్ఱు = (అసురులు, దేవతలను హింసించిన ఆకాలంలో) వాళ్ అమర్ వేణ్డి = గొప్ప తేజస్సును కల పోరును కోరి, వరై నట్టు = మందరగిరిని (కవ్వగా) నాటి, నీళ్ అరవై శుఱ్ఱి = పొడుగైన వాసుకి అనే సర్పాన్ని దారంగా చుట్టి, కడైన్దాన్ = (పాలసముద్రాన్ని) చిలికినవాని, పెయర్ = తిరునామాలు, పఱ్ఱి = చేతనులను (జీవులను) పరిగ్రహించి, తొల్ నరకై = అనాది అయిన నరకాలను, కడత్తుమ్ = దాటించే, పడై అన్ఱే = ఉపాయం కదా!



అనాది అయిన సంసారం అనే నరకంలో పడి ఉండే ఈ జీవుని పరిగ్రహించి, పరమపదాన్ని చేర్చే సాధనం ఇది. భగవానుడే ఉపాయం అనే మహావిశ్వాసం లేనివారికి కూడా ఇదే ఫలసాధనంగా నిలచి, భగవానుని ద్వారా మోక్షప్రాప్తిని కల్గిస్తుంది. **"వాచ్యప్రభావమ్ పోలన్ఱు వాచకప్రభావమ్; అవన్ దూరస్థనానాలుమ్ ఇదు కిట్టి నిన్ఱు ఉదవుమ్"** అనే ముముక్షుప్పడి సూత్రం, దానికి శ్రీవరవరమునులు అనుగ్రహించిన వ్యాఖ్య అనుసంధేయాలు.

అవ :- సముద్రాన్ని చిలకడంకోసం దేవతలు తనకు శరణు పొందేటట్లుగా క్షీరాబ్ధిలో శయనించి ఉండడమే కాక, స్త్రీలు సైతం శరణు వేడేటట్లుగా స్వామి తిరుమలైలోకి వచ్చి నిలచి ఉన్నాడని ఇందులో అంటున్నారు. దీనివల్ల అందఱు ఆశ్రయించేటట్లుగా ఉండే స్వామి స్వభావం, సౌలభ్యం, **'మాన్మాయ'** అని అన్నందున ఆశ్రితపారతంత్ర్యం ఈ పాశురంలో చెప్పబడ్డాయి.

**82. పడై యారుమ్ వాళ్కణ్ణార్ పారశినాళ్ పైమ్బూమ్**
**తొడైయలోడు ఏన్దియ తూపమ్- ఇడైయిడైయిన్**
**మీన్ మాయ మాశుణుమ్ వేఙ్గడమే మేలొరునాళ్**
**మాన్ మాయ వెయ్‌తాన్ వరై**

పడై ఆరుమ్ = వేలాయుధంవంటి, వాళ్ కణ్ణార్ = కాంతి నిండిన నేత్రాలను కల స్త్రీలు, పారశినాళ్ = ద్వాదశీతిథినాడు, పై = అందమైన, పూ తొడైయలోడు = పూమాలికలతో, ఏన్దియ = ఎత్తి ధరించిన, తూపమ్ = పొగ, ఇడై ఇడైయిల్ మీన్ = మధ్య మధ్యలో కన్పించే నక్షత్రాలు, మాయ = మఱుగుపడేటట్లుగా, మాశు ఉణుమ్= మాలిన్యాన్ని పొందేటట్లుగా చేసే, వేఙ్గడమే= తిరుమలైయే, మేల్ ఒరు నాళ్ = పూర్వ ఒకానొక సమయంలో, మాన్ = మాయామృగం అయిన మారీచుడు, మాయ = నశించేటట్లుగా, ఎయ్‌దాన్ = బాణాన్ని ప్రయోగించినవాని, వరై = పర్వతం.

సీతాదేవికి వశుడై, తన అనర్థాన్ని కూడా గమనించకుండా ఆమె కార్యాన్ని చేయడానికి సిద్ధపడ్డట్లే, భగవానుడు భక్తులకు వశుడై, వారి కార్యాన్ని చేయడానికి సిద్ధపడతాడని భావం.

అవ :- "ప్రాణేభ్యోఽపి గరీయసీ' అన్నట్లుగా నాకు నా ప్రాణాలకంటే ఎక్కువ ఇష్టం అయిన పిరాట్టియొక్క కార్యాన్ని నిర్వహించినంతమాత్రంతో భక్తులందఱికీ వశుడనై వారి కార్యాన్ని చేస్తాను- అనే నిర్బంధం ఏదయినా ఉన్నదా! ఏమి!- అని భగవానుడు తలచినట్లుగా భావించి, "మధుకైటభులను చూర్ణం చేసిన చక్రాన్ని ధరించిన నీవు, ఆ విధంగా కార్యం చేయడానికి కాకుండా పర్వతాన్ని ఎత్తడం, ఏడు ఎద్దులను మర్దించడం - మొదలైన లీలలను చేయడం మఱి ఎవరికోసం?'' అని అంటున్నారు.

83. వరై కుడైతోళ్ కామ్బాక అనిరై కాత్తు ఆయర్
నిరైవిడై యే*ழ్* శె*ற்ற* వాఱెన్నే -ఉరవుడైయ
నీరా*ழி*యుళ్ కిడన్దు నేరా నిశాశరర్ మేల్
పేరా*ழி* కొణ్డ పిరాన్

ఉరవు ఉడైయ = బలాన్ని కల, నీర్ ఆ*ழி*యుళ్ కిడన్దు = నీటిని కల్గిన క్షీరాబ్ధిలో నిద్రించి, నేర్ ఆమ్ = విరోధులై వచ్చిన, నిశాశరర్‌మేల్ = మధుకైటభులనే అసురులపై, పేర్ ఆ*ழி* కొణ్డ = గొప్ప చక్రాన్ని ఎత్తిన, పిరాన్ = ఉపకారకా!, విరై కుడై (ఆక) గోవర్ధనపర్వతాన్ని గొడుగుగాను, తోళ్ కామ్బు ఆక = తన బాహువులను గొడుగుకర్రగా చేసి, ఆ నిరై కాత్తు = గోసమూహాలను కాచి, ఆయర్ = గోపాలకుల, నిరై విడై ఏ*ழ్* = ఏడు బలిసిన ఎద్దులను, శె*ற்ற* ఆఱు = చంపిన తీరు, ఎన్నే = ఏమి ఆశ్చర్యకరం!

నప్పిన్నై కోసం చేసిన లీలతో పాటు, గోపాలకులకోసం చేసిన లీలతో పాటు తేడా లేకుండా, భక్తులకు ఆపద వచ్చినపుడు సంకల్పంతోనో, ఆయుధంతోనో కార్యం చేయకుండా, నీ దేహాన్ని శ్రమ పెట్టుకొని అయినా వారి కార్యాన్ని చేస్తావు- అనే విషయాన్ని ఈ లీలలు తెలుపుతున్నాయి కదా! - అని హార్దభావం.

అవ :- "రక్షింపబడే వస్తువులకంటే, వాటిని రక్షించాలనే నీ మనోరథం చాలా మించి ఉన్నది. ఈ నీ రక్షణమనోరథాన్ని ఇంతటిది అని పరిచ్ఛేదించడం ఎవరితరం?'' అని ఇందులో భగవానుని ఉద్దేశించి ఆ*ழ்*వార్లు అంటున్నారు.



**84. పిరానున్ పెరుమై పిఱరారఱివార్?**
**ఉరా యులకళన్ద నాన్డు- వరాక**
**త్తెయి*ற்ற*ళవు పోతావాఱెన్ కొలో! ఎన్నై**
**అడిక్క ళవు పోన్ద పడి**

పిరాన్ = స్వామీ!, ఉరాయ్ = శ్రమ లేకుండా, ఉలకు అళన్ద నాన్డు = నీవు లోకాలను కొలిచిన ఆనాడు, ఎన్నై = నా స్వామివైన నీయొక్క, అడిక్కు = శ్రీపాదానికి, అళవు పోన్ద = కొలువడానికి సరిగా ఉన్న, పడి = భూమి, వరాకత్తు= వరాహరూపివి అయిన నీయొక్క, ఎయిఱు అళవు = దంతంలో ఒక భాగానికి కూడా, పోతా ఆఱు= చాలని తీరు, ఎన్ కొల్ = ఏమో కదా!, ఉన్ పెరుమై = నీ పరత్వాన్ని, పిఱర్ ఆర్ అఱివార్ = (నీకు తప్ప) ఇంకెవరికి తెలియడానికి సాధ్యం.

**"సో అంగ వేద యది వా న వేద"** అనే శ్రుత్యర్థం భావ్యం. ఈ పాశురంలోని ప్రశ్నకు సమాధానాన్ని ఆచార్యులీ విధంగా తెలిపారు. త్రివిక్రమావతారకాలంలో భూమికి ఆపద కలుగ లేదు. ఇంద్రుని వద్దనుండి దానిని అపహరించాడు, అంతే. వరాహావతారకాలంలో అయితే హిరణ్యాక్షుడు భూమిని సముద్రంలో ముంచి వేశాడు. అపుడు దాని స్వరూపానికే ఆపద కల్గింది. అందువల్ల త్రివిక్రమావతార కాలంలోకంటే వరాహావతారకాలంలో రక్షణమనోరథం అతిశయించి, రక్ష్యవస్తువైన భూమికంటే మించి ఉన్నది. కనుక చాలా పెద్ద రూపాన్ని ఎత్తిన వరాహస్వామి దంతాగ్రంలో ఒక మూలలో అణగిపోయింది భూమి. దీనినిబట్టి రక్ష్యభూతుని పరిమితిలో ఉండేది కాదు- రక్షకుని రక్షణాభినివేశం- అనే శాస్త్రార్థం సూచితం.

అవ :- "ఇతరులు ఎవరు తెలియగలరు?'' అని అనడం ఎందుకు? నేను తెలిసికొన్నానుకదా!'' అని ఆ*ழ்*వార్ల మనస్సు అనగా, "ఓ మనసా! ఇంద్రియజయాన్ని పొంది, అతనిని తెలియాలని ప్రయత్నించే స్థితిలో ఉన్నావే తప్ప, నీవు అతనిని తెలిసికోలేదు. తెలిసికొని ఉంటే అతని రీతులలో ఒకటిని అయినా అనుభవించావా? అనుభవిస్తే దానినిగూర్చి కొంచెం చెప్పు?'' అని ఇందులో అంటున్నారు.

**85. పడి కణ్డఱితియే? పామ్బణైయినాన్ పుళ్**
**కొడికణ్డఱితియే కూఱాయ్- వడివిల్**
**పొఱి యైన్దు ముళ్ళడక్కి ప్పోతొడు నీరేన్ది**
**నెఱి నిన్ఱ నెఞ్జమే! నీ**

వడివు ఇల్ = రూపం లేనివి అయిన, పొఱి ఐన్దుమ్ = పంచేంద్రియాలను, ఉళ్ అడక్కి= శరీరం లోపల అణచి, పోదొడు నీర్ ఏన్ది = పుష్పాలతో పాటు తీర్థాన్ని తీసికొని, నెఱి నిన్ఱ = (భగవానుని ఆశ్రయించడం అనే) సన్మార్గంలో స్థిరంగా నిలచిన, నెఞ్జమే = మనసా!, నీ = నీవు, పామ్బు అణైయినాన్ = ఆదిశేషుని పడుకగా కల భగవానుని, పడి = తిరుమేనిని, కణ్డు అఱిదియే = చూచి అనుభవించావా!, పుళ్ కొడి = అతని గరుడధ్వజాన్ని, కణ్డు అఱితియే= సేవించి తెలిసికొన్నావా?, కూఱాయ్ = నీవే చెప్పు.

అవ :- ఈ విధంగా ఆళ్వార్లు తమ మనస్సును ఉద్దేశించి ‘అతనిని నేరుగా దర్శించి అనుభవించ లేదే’’ అని అనడాన్ని స్వామి సహించలేక, వీరు ఉన్న చోటనే లక్ష్మీసహితుడై భగవానుడు వచ్చి సమ్మర్దాన్ని కల్గించాడు. దానిని సాక్షాత్తు దర్శించి ఆళ్వార్లు ఇందులో అనుభవిస్తున్నారు. ముదలాళ్వార్లు ముగ్గురు తిరుక్కోవలూర్‌లో ఒకనాటి రాత్రి మృకండుముని ఇంటిలో వసారాలో ఒక మూల చేరి ఉండగా, వీరి తిరుమేని సంబంధాన్ని పొందాలని ఆశపడి భగవానుడు ప్రత్యక్షమై వచ్చి సమ్మర్దించాడు- అనే ఐతిహ్యం ప్రసిద్ధం. దానిని ఈ పాశురంలో తెలుపుతున్నారని కూడా చెప్పవచ్చు.

**86. నీయుమ్ తిరుమకళుమ్ నిన్ఱాయాల్ కున్ఱెడుత్తు**
**పాయుమ్ పనిమఱైత్త పణ్బాళా!- వాశల్**
**కడై కళియా వుళ్ పుకా క్కామర్పూమ్ కోవల్**
**ఇడై కళియే పఱ్ఱి యిని**

కున్ఱు ఎడుత్తు = గోవర్ధనగిరిని (గొడుగుగా) ఎత్తి, పాయుమ్ పని మఱైత్త= కురిసే వర్షాన్ని అడ్డగించిన, పణ్బాళా = సౌలభ్యాన్ని కలవాడా!, వాశల్ కడై = వాకిలికి బయట, కళియా = పోకుండా, ఉళ్ పుకా =లోపల ప్రవేశించకుండా, కామర్ పూమ్ కోవల్ = సహజసౌందర్యం, కృతకసౌందర్యం నిండిన తిరుక్కోవ లూర్‌లో, ఇడై కళియే= (వాకిటికి, లోపలి భాగానికి మధ్యలో ఉండే ప్రదేశం అయిన) వసారాను, పఱ్ఱి = ఆశ్రయించి, నీయుమ్ తిరు మకళుమ్ = నీవు, లక్ష్మీదేవి, ఇని = ఇపుడు, నిన్ఱాయాల్= నిలచి ఉన్నారుకదా! ఆహా!

అవ :- “ఈ విధంగా సర్వేశ్వరుడు ఈ లోకంలో నిత్యవాసం చేయాలని వచ్చిన తరువాత, నరకానికి పోయేవారెవ్వరూ లేరు. నరకాలను నిర్వహించేవారు నరకద్వారాలను మూసివేసి పారిపోవడం మంచిది’’- అని అంటున్నారు.

**87. ఇని యార్ పుకువార్ ఎళు నరకవాశల్?**
**మునియాతు మూరిత్తాళ్ కోమిన్- కని శాయ**
**క్కన్ఱెఱిన్దతోళాన్ కనైకళలే కాణ్బతఱ్కు**
**నన్గఱిన్ద వా వలమ్ శూళ్ నాడు**

కని = వెలగపండురూపంలో వచ్చిన అసురుడు, శాయ = రాలి నశించి పోయేటట్లుగా, కన్ఱు = లేగదూడరూపంలో వచ్చిన వత్సాసురుని, ఎఱిన్ద = విసరిన, తోళాన్ = బాహువులను కలవాడైన భగవానుని, కనై కళలే = ఆభరణధ్వనితో కూడిన శ్రీపాదాలనే, కాణ్బదఱ్కు = దర్శించే దారిని, అమ్ నావల్ శూళ్ నాడు = అందమైన జంబూద్వీపమనే పేరును పొందిన విస్తృతమైన దేశంలో ఉండే ప్రాణులు, నన్గు అఱిన్ద = చక్కగా తెలిసినవి, ఇని = ఇకపై, ఎళు నరక వాశల్ = ఏడు విధాలైన నరకాల ద్వారాలలో, యార్ పుకువార్ = ఎవరు ప్రవేశిస్తారు ? (ఓ యమకింకరులారా!) మునియాదు = నన్ను కోపించకుండా, మూరి తాళ్ కోమిన్ = (నరకద్వారాలకు) బలమైన తాళాలను వేసి, పారిపొండి.

అవ :- ఈ విధంగా తిరుక్కోవలూర్‌తో సంబంధాన్ని కల్గిన దివ్యదేశాలలో నివసించినా, భగవద్విషయాన్ని విడిచిపెట్టి వేఱు విషయాలలో లగ్నమై తిరిగే సంసారులను చూచి, దారి దోపిడీని చేసే చోట తమ చేతిలోని ద్రవ్యం దొంగతనం పోకుండా తిరిగి తాను దానిని పొందితే సంతోషించినట్లే, “నా మూడు కరణాలతోను, నేను భగవద్విషయంలో అభినివేశాన్ని పొందాను’’ అని తాము పొందిన ప్రయోజనాన్నిగూర్చి ఆళ్వార్లు తెలిపారు.

**88. నాడిలుమ్ నిన్నడియే నాడువన్ నాడోఱుమ్**
**పాడిలుమ్ నిన్ పుకళే పాడువన్- శూడిలుమ్**

**పొన్నాళి యేన్దినాన్ పొన్నడియే శూడువేఙ్క్**
**ఎన్నాకిలెన్నే యెనక్కు**

నాడిలుమ్ = మనస్సులో భావించినా, అది, నిన్ అడియే = నీ శ్రీపాదాలనే, నాడువన్ = భావిస్తాను, నాళ్ తోఱుమ్ = ప్రతిదినం, పాడిలుమ్ = నోటితో పాడే సమయంలోను, నిన్ పుకళ్లే పాడువన్ = నీ కీర్తినే పాడుతాను, శూడిలుమ్= దేనినైనా అలంకరించుకోవాలని అనుకున్నా, పొన్ ఆళి ఏన్దినాన్ = అందమైన చక్రత్తాళ్వార్లను ధరించినవాడవైన నీయొక్క, పొన్ అడియే = బంగారు శ్రీపాదాలనే, శూడువేఙ్క్ = తలపై ధరించేవాడనై, ఎనక్కు=నాకు, ఎన్ అకిల్ ఎన్ = ఏమయితే ఏమి?

అవ :- గత పాశురంలో కల్గిన భగవదనుభవం తిరిగి ఆవృత్తంకాగా, తమ అనుభవాతిశయాన్నిగూర్చి ఆళ్వార్లు ఇందులో తెలుపుతున్నారు. తన గొప్పతనాన్ని గూర్చి తానే ఈవిధంగా చెప్పవచ్చునా? అని అంటే, భగవద్భాగవత సంబంధ పూర్వకంగా కల్గిన అతిశయాన్ని తెలుపడంలో తప్పు లేదు కదా!

89. **ఎనక్కావార్ ఆరొరువరే ఎమ్బెరుమాన్**
**తనక్కావాన్ తానే మఱ్ఱల్లాల్- పునక్కాయామ్**
**పూమేని కాణ ప్పొది యవిళుమ్ పూవైప్పూ**
**మా మేని కాట్టుమ్ వరమ్**

పునమ్ = తనకు తగిన చోట ఉండే, కాయామ్ పూ మేని = అగిసెపూవు రంగు, కాణ = చూడగా చూడగా, పొది అవిళుమ్ = వికసించే, పూవై ప్పూ (మేని) = పూవై ప్పూ వర్ణం, మా మేని = భగవానుని గొప్ప తిరుమేనిని, వరమ్ కాట్టుమ్ = చక్కగా దర్శింపజేస్తుంది, ఎనక్కు = (ఇటువంటి భాగ్యశాలి అయిన) నాకు, ఆర్ ఒరువరే ఆవర్ = సాటి వచ్చేవారు ఒకరైనా ఉన్నారా ?, ఎమ్బెరుమాన్= సర్వేశ్వరుడుకూడా తానే తనక్కు ఆవాన్ అల్లాల్ = తానే తనకు ఉపమానం (సాటి) అవుతాడే తప్ప, మఱ్ఱు = నాకు సమానం అవుతాడా?

అవ :- భగవానుడు తనతో సాటి వచ్చే అగిసెపూవు, కాటుకపూవు-మొదలైనవానిని చూపి తమను ప్రాణాన్ని ధరించేటట్లుగా చేసిన రీతిని చెప్పగానే,



ప్రహ్లాదుని విరోధిని పోగొట్టి, తనను దర్శింపజేసిన స్వామి ఔదార్యం తమ మనస్సులో స్ఫురించింది. దానినిగూర్చి ఆళ్వార్లు ఇందులో తెలుపుతున్నారు.

90. **వరత్తాల్ వలి నినైన్దు మాతవ! నిన్ పాతమ్**
**శిరత్తాల్ వణఙ్గానా మెన్టే- ఉరత్తినాల్**
**ఈరరియాయ్ నేర్‌వలియోనాయ విరణియనై**
**ఓరరియాయ్ నీ యిడన్ద తూన్**

ఈర్ అరి ఆయ్ = చీల్చదగిన శత్రువై, నేర్ వలియోన్ ఆయ = ఎదురొడ్డి యుద్ధం చేయగల బలాన్ని కలవాడైన, ఇరణియనై = హిరణ్యకశిపుని, ఊన్ = శరీరాన్ని, ఓర్ అరి ఆయ్ = సాటి లేని నరసింహమూర్తిగా ఆవిర్భవించి, ఉరత్తినాల్ = (నీ) బలంతో, నీ ఇడన్దదు = నీవు చీల్చినది, వరత్తాల్ = (బ్రహ్మ మొదలైన దేవతలచే అనుగ్రహింపబడ్డ) వరాలవల్ల కల్గిన, వలి నినైత్తు = (తన) బలాన్ని గొప్పగా తలచి, శిరత్తాల్ = తన శిరస్సుతో, నిన్ పాదమ్= తన శ్రీచరణాలను, వణఙ్గానామ్ ఎన్టే = నమస్కరించకుండా ఉన్నాడనే కారణంతోనా! (కాదు.)

భాగవతుడైన ప్రహ్లాదుని విషయంలో అతడు చేసిన అసహ్యాపచారాన్ని సహించలేనందువల్లనే కదా! - అని తాత్పర్యం.

అవ :- "ఎమ్బెమ్మాన్నై ఆరే అఱివార్" (56) ఇత్యాది స్థలాలలో ఎంతో గొప్ప జ్ఞానాన్ని కల బ్రహ్మ మొదలైనవారికి కూడా తమ ప్రయత్నంతో భగవానుని దర్శించడానికి వీలు కాదు- అని అన్నారు. ఆ విధంగా అయితే జీవుని విషయంలో సాధనానుష్ఠానం అనేది ఏమీ అక్కరలేదా! ఇష్టం వచ్చినట్లుగా అతడు పరిభ్రమించినా మోక్షం కల్గుతుందా! అనే ప్రశ్న రాగా, భగవానుడు ఏ ఉపాయానుష్ఠానాన్ని జీవునినుండి ఎదురుచూడకుండా అన్ని ఫలాలను ఇచ్చేవాడే అయినా, అతనికంటే వేఱయిన అన్యవిషయాలలో రుచి నశించి, అతనిని శరణు పొందినవారికి తప్ప పరమపదం ఇంకొకరికి లభించదు- అని ఇందులో అంటున్నారు.

91. **ఊన క్కురమ్బెయిల్ ఉళ్‌పుక్కిరుళ్ నీక్కి**
**ఞానచ్చుడర్‌కొళీ ఇ నాడోఱుమ్- ఏన**

త్తురువాయులకిడన్ద ఊழியాన్ పాతమ్
మరువాతార్‌క్కుణ్డామో వాన్

ఊన కురమ్బైయిన్ = మాంసంతో నిర్మింపబడ్డ శరీరం అనే గుడిశెలో, ఉళ్ పుక్కు= లోపల ప్రవేశించి, (పరిశీలించి), ఇరుళ్ = (శరీరాన్ని భోగ్యంగా తలచే) అజ్ఞానాన్ని, నీక్కి = పోగొట్టి, ఞానమ్ శుడర్ = యథార్థజ్ఞానం అనే దీపాన్ని, కొళీ ఇ = వెలిగించి, ఏనత్తు ఉరు ఆయ్ = వరాహమూర్తియై అవతరించి, ఉలకు ఇడన్ద = లోకాన్ని అండభిత్తినుండి విడదీసి ఉద్ధరించినవాడు, ఊழியాన్= ప్రళయకాలంలో ఉన్నవాడు అయిన స్వామియొక్క, పాదమ్ = శ్రీచరణాలను, నాళ్ తోఱుమ్ = ప్రతిదినం, మరువాతార్‌క్కు =కొలువనివారికి, వాన్ = పరమపదం, ఉణ్డామో = లభిస్తుందా! (లభించదు)

అవ :- గత పాశురంలో చెప్పిన రీతిలో భగవానుడు తనను ఆశ్రయించిన వారిని రక్షించడం మాత్రమేకాకుండా, **"అవాప్తసమస్తకాముదు"** అనే తన పూర్తికి తగనట్లు భక్తుల కరస్పర్శను కల వెన్నను భోగ్యంగా, తనకు ధారకంగా భావించిన వత్సలుడు సుమా!- అని అంటున్నారు.

**92.** వానాకి త్తీయాయ్ మఱి కడలాయ్ మారుతమాయ్
తేనాకి ప్పాలామ్ తిరుమాలే!- ఆనాయ్‌చ్చి
వెణ్ణెయ్ విழுజ్గ నిఱైయుమే మున్నొరునాళ్
మణ్ణై యుమిழ்న్ద వయిఱు

వాన్ ఆకి = ఆకాశరూపివై, తీ ఆయ్ = అగ్నిరూపివై, మఱి కడలాయ్= అలలు లేచే, సముద్రరూపివై, మారుతమ్ ఆయ్ = వాయురూపివై (బ్రహ్మాం డానికి నిర్వాహకుడవై), తేన్ ఆకి = నిత్యులకు, ముక్తులకు తేనెవలె భోగ్యరూపుడవై ఉన్న, తిరుమాలే = లక్ష్మీనాథా!, ఆన్ ఆయ్‌చ్చి= పశువులను పెంచే గోకులంలో పుట్టిన గోపికయొక్క, వెణ్ణెయ్ విழுజ్గ= వెన్నను ఆరగించగా, మున్ ఒరు నాళ్ = పూర్వం ఒకానొక కాలంలో, మణ్ణై = లోకాన్ని అంతటినీ, ఉమిழ்న్ద= వ్యక్తం చేసిన, వయిఱు = (నీ)ఉదరం, నిఱైయుమే = నిండు తుందా? (చెప్పు)



అవ :- "ఒరరియాయ్ నీ ఇడన్దదు" (90) అని నన్ను మీరు ఆశ్రితపక్ష పాతిగా చెప్పారే! ఆ విషయాన్ని మీరు ఏ విధంగా గ్రహించారు? - అని భగవానుని అభిప్రాయమని భావించి, హిరణ్యకశిపునిపై నీవు పొందిన కోపాన్ని చూచి నేను ఆవిధంగా నిశ్చయించుకొన్నాను - అని ఈ పాశురంలో ఆழ்వార్లు అంటున్నారు.

**93.** వయిఱழల వాళురువి వన్దానై యఞ్జ
ఎయిఱిలకవాయ్ మడిత్తతెన్ నీ? - పొఱి యుకిరాల్
పూవడివై యీడழித్త పొన్నాழிక్కైయా నిన్
శేవడిమే లీడழிయ చ్చెత్తు

పూ వడివై = పూల అందాన్ని, ఈడు అழித్త = పూర్తిగా అధఃకరించినది, పొన్ ఆழி కైయా = అందమైన శ్రీసుదర్శనాన్ని కల్గినది అయిన శ్రీహస్తాన్ని కలవాడా!, వయిఱు అழల = భక్తుల కడుపు మండేటట్లుగా, వాళ్ ఉరువి వన్దానై=ఖడ్గాన్ని ఆయుధంగా పట్టి వచ్చిన హిరణ్యకశిపుని, అఞ్జ =(నీ రూపాన్ని చూచి అతడు) భయపడేటట్లు, నిన్ శేవడిమేల్ = నీ ఎఱ్ఱని శ్రీపాదాలపైన (నిలిపి), పొఱి ఉకిరాల్ = పలు వర్ణాలను కల నఖాలతో, ఈడు అழிయ శెఱ్ఱు = పూర్తిగా చెడి చిందవందర అయేటట్లుగా చంపిన తర్వాతకూడా, ఎయిఱు ఇలక = నీ దంతాలు ప్రకాశించేటట్లుగా, నీ వాయ్ మడుత్తదు ఎన్= నీవు నాలుకను మడచుకొని ఉండడం ఎందుకోసం?

శత్రుసంహారానంతరం కూడా భగవానుని కోపం తీరకపోవడం, భక్తుని విషయంలో అతనికి గల వాత్సల్యాతిశయాన్ని సూచిస్తుంది - అని భావం.

అవ :- తనను ఆశ్రయించినవారికి తన మహిమలను అన్నిటిని దర్శింప జేసే స్వభావాన్ని కల భగవానుని కీర్తిస్తుంది. తప్ప నా నాలుక వేఱొకరిని స్తుతించదు- అని అంటున్నారు. మార్కండేయమహర్షికి తన ఉదరంలో అన్ని వస్తువులను చూపినట్లుగా మహాభారతం అరణ్యపర్వంలో గల ఒక ఉపాఖ్యానంలో ఉన్నది. ఈ పాశురంలో ఆ ఉపాఖ్యానం చెప్పబడినదనే ఇంకో నిర్వాహం ఉన్నది. పంచపాండవులకోసం దూతగా పోయినపుడు మోసపు ఆసనాన్ని ఇచ్చిన దుర్యోధనునకు శ్రీకృష్ణుడు సభలో విశ్వరూపాన్ని చూపిన వృత్తాంతం ఇందులో చెప్పబడిందనికూడా వేఱొక నిర్వాహం ఉన్నది.

**94.** **శెఱ్ఱెழுన్దు తీ విழిత్తు చ్చెన్ద్ర విన్ద వేழுలకుమ్**
**మఱ్ఱివైయా వెన్ఱు వాయఙ్గాన్దు-ముఱ్ఱుమ్**
**మఱైయవఱ్కు క్కాట్టియ మాయవనై యల్లాల్**
**ఇఱైయేను మేత్తాతెన్ నా**

శెఱ్ఱు ఎழுన్దు = కోపించి (ఆసనంనుండి) పైకి లేచి, తీ విழిత్తు= (దుర్యోధనుడు మొదలైనవారిని) కోపంగా చూచి, శెన్ద్ర ఇన్ద ఏழ் ఉలకుమ్ మఱ్ఱు ఇవై = ఇపుడు ప్రవర్తిస్తున్న ఈ ఏడు లోకాలు ఇవే!'' (అని పల్కి), ఆ ఎన్ఱు వాయ్ అఙ్గాన్దు = 'ఆ' అని నోటిని తెఱచి, ముఱ్ఱుమ్ = అన్ని లోకాలను, మఱైయవఱ్కు = భీష్మద్రోణాది వైదికులకు, కాట్టియ = తన నోటిలో చూపిన, మాయవనై అల్లాల్ = ఆశ్చర్యకరశక్తిని కల శ్రీకృష్ణుని తప్ప ఇంకొకరిని, ఎన్ నా= నా నాలుక, ఏత్తాదు = కీర్తించదు.

వేఱొక నిర్వాహంలో :- ఎழுన్దు = లోకాన్ని అంతటినీ నశింపజేయడం కోసం, పైకి లేచి, తీ విழிత్తు = నిప్పులు కురిసేటట్లుగా కళ్ళు తెరిచి చూచి, శెఱ్ఱు = అన్ని లోకాలను, నశింపజేసి, శెన్ద్ర ఇన్ద ఏழ் ఉలకుమ్ మఱ్ఱు ఇవై= (నా ఉదరంలో కల) ప్రవర్తించిన ఈ ఏడు లోకాలు ఇవే! అని పల్కి, ఆ ఎన్ఱు వాయ్ అఙ్గాన్దు = 'ఆ' అని నోటిని తెఱచి, ముఱ్ఱుమ్ = అన్ని లోకాలను, మఱైయవర్క్కు = వైదికుడైన మార్కండేయమునికి, కాట్టియ= దర్శింపజేసిన, మాయవనై అల్లాల్= అఘటిత ఘటనాశక్తిని కల స్వామిని తప్ప ఇంకొకరిని, ఎన్ నా = నా నాలుక, ఇఱైయేనుమ్ = కొంచెం కూడా, ఏత్తాదు = స్తుతించదు.

అవ :- "భగవానుని తప్ప ఇంకొకరిని స్తుతించని నా నాలుకవలె కాకుండా, అతనిని స్తుతించ గల్గిన నాలుకను కల్గి ఉన్నా, అవిధంగా స్తుతించకుండా సంసారులు, తమ నాలుకను సంసారాన్ని ఇంకా ఇంకా వృద్ధి చేసికోవడం కోసమే ఏవిధంగా ఉపయోగిస్తున్నారో కదా!'' - అని వారిని చూచి ఆశ్చర్య పడుతున్నారు.

**95.** **నావాయిలుణ్డే నమో నారణా వెన్ఱు**
**ఓవాతురైక్కు మురై యుణ్డే- మూవాద**
**మాక్కతి క్కణ్ శెల్లుమ్ వకైయుణ్డే ఎన్నొరువర్**
**తీక్కతిక్కణ్ శెల్లుమ్ తిఱమ్**



నా = (భగవానుని స్తుతించడానికి సాధనం అయిన) నాలుక, వాయిల్ ఉణ్డే = (అన్వేషించవలసిన అవసరం లేకుండా) నోటిలోనే ఉన్నదికదా !, ఓవాదు =శ్రమ లేకుండా, పలు మార్లు, ఉరైక్కుమ్ = చెప్పదగిన, నమో నారణా ఎన్ఱు ఉరై = తిరుమంత్రం, ఉణ్డే = ఉన్నదికదా !, మూవాద = పునరావృత్తి లేని, మా కతి క్కణ్ = పరంపరాప్రాప్యం అయిన పరమపదానికి, శెల్లుమ్ వకై ఉణ్డే = పోవడం కోసం అర్చిరాదిమార్గం సిద్ధంగా ఉన్నదే !, (ఈ విధంగా ఉన్నా), తీ కతి క్కణ్ = నరకమార్గంలో, ఒరువర్ = కొందఱు, శెల్లుమ్ తిఱమ్ ఎన్ = పోయే దారి ఏ రీతిలోనో కదా!

అవ :- "లోకంలోని సంసారులు తమ శరీరేంద్రియాలను ఉపయోగించి, చెడ్డదారులలో పయనిస్తే పయనించనీ. ఓ మనసా! నీవు మొట్టమొదట నేను పలికే భగవద్విషయగౌరవాన్ని తెలిసికో''- అని తమ మనస్సులో ఆழ்వార్లు అంటున్నారు.

**96.** **తిఱమ్బాతెన్ నెఞ్జమే! శెఙ్గణ్మాల్ కణ్డాయ్**
**అఱ మ్బావ మెన్ఱిరణ్డు మావాన్- పుఱన్దాని**
**మ్మణ్ తాన్ మఱికడల్ తాన్ మారుతన్దాన్ వాన్ తానే**
**కణ్డాయ్! కడైక్కట్పిడి**

ఎన్ నెఞ్జమే = నా మనసా!, అఱమ్ పావమ్ ఎన్ఱు ఇరణ్డుమ్ ఆవాన్ = పుణ్యం-పాపం అనే రెండు రీతులలోని కర్మలకు నిర్వాహకుడు, శెమ్ కణ్ మాల్ కణ్డాయ్ = ఎఱ్ఱ తామరలవంటి కన్నులను కల భగవానుడే సుమా!, ఇమ్మణ్ తాన్ = ఈ భూలోకం, మఱి కడల్ తాన్ = అలలు ఎగసి పడే సముద్రం, మారుతముమ్ తాన్ = వాయువు, వాన్ = ఆకాశం, పుఱన్దాన్ = వీటికంటే విలక్షణం అయిన జీవుడు, మహాన్, అహంకారం -మొదలైనివి, తానే కణ్డాయ్ = ఆ స్వామే సుమా!, (ఈ అర్థాన్ని), తిఱమ్బాదు = తప్పకుండా, కడై క్కణ్ పిడి = చివరి వరకు తెలిసికో.

అవ :- "ధర్మమూ అతడే అని, పావన ద్రవ్యాలు అతడే'' అని అన్నారు. "గంగ మొదలైన ఇంకా కొన్ని వస్తువులు కూడా లోకంలో పావనం చేసేవిగా చెప్పబడుతున్నాయి కదా!''- అని అంటే, "వాటి పావనస్వభావం అతనితో

సంబంధాన్ని పొందినందువల్లే ఏర్పడింది''- అని అంటున్నారు. **“అఱమ్ పావమ్ ఎన్డిరణ్డు మావాన్”** అనే సూక్తికి వ్యాఖ్యానం ఈ పాశురం - అని పెరియ వాచ్చాన్‌పిళ్ళై సూక్తి.

**97. పిడి శేర్ కళిఱళిత్త పేరాళా! ఉన్దన్**
**అడిశేర్న్దరుళ్ పెఱ్ఱాళన్రే- పొడి శేర్**
**అనఱ్కజ్గై యేఱ్ఱాన్ అవిర్ శడైమేల్ పాయ్న్ద**
**పునల్ కజ్గై యెన్నుమ్ పెయర్ ప్పొన్**

పిడి శేర్ = ఆడ ఏనుగుతో చేరి (విషయభోగాలను అనుభవిస్తూ) తిరిగిన, కళిఱు = గజేంద్రుని, అళిత్త = రక్షించిన, పేరాళా = మహానుభావా!, పొడి శేర్= భస్మాన్ని ధరించినవాడై, అనఱ్కు= అగ్నికి, అమ్ కై ఏఱ్ఱాన్ = అందమైన చేతిని ఎత్తిన రుద్రుని, అవిర్ శడైమేల్ = ప్రకాశించే జటలపై, పాయ్న్ద = ప్రవహించిన, పునల్ = జలాన్ని కల, కజ్గై ఎన్నుమ్ పేర్ = గంగ అనే పేరును కల, పొన్ = గొప్ప బంగారం, ఉన్ తన్ అడి శేర్న్దు = నీ శ్రీపాదాలను చేరి, అరుళ్ పెఱ్ఱాళ్ అన్రే =కృపను పొందింది కదా!

అవ :- “సర్వేశ్వరుని శ్రీపాదాలలో పుట్టిన గంగను ధరించిన పరిశుద్ధుడు, అని రుద్రుని తక్కువచేసి చెప్పవచ్చునా? అతడుకూడా జగత్సంహారం అనే ఒక గొప్ప కార్యానికి అధికారిగా, ఈశ్వరుడు అనే ప్రసిద్ధిని పొందినవాడుగా, తన భక్తులు పలువురకు పలు ఫలాలను ఇచ్చేవాడుగా, తనకంటూ ఒక లోకం, వాహనం, గణాలు-మొదలైనవానిని కలవాడుగాకదా ఉన్నాడు. అతని ఈ మహిమలన్నీ అసత్యాలా! - అని కొందఱు ప్రశ్నించగా, అతని గొప్పతనాలను అసత్యాలని అనడం లేదే! అవి అన్నీ అతడు పరమపురుషునకు శరీరమై ఉన్నందువల్ల వచ్చినవే తప్ప, సహజంగా ఏర్పడినవి కానేకావు-అని అంటున్నారు.

**98. పొన్ తికழுం మేని ప్పురిశడైయ మ్మువ్ణియనుమ్**
**నిన్ఱులకమ్ తాయ నెడుమాలుమ్ - ఎన్ఱుమ్**
**ఇరువరజ్గత్తాల్ తిరివరేలుమ్ ఒరువన్**
**ఒరువనజ్గత్తెన్ఱు ముళన్**



పొన్ తికழுమ్ మేని = బంగారంవలె ప్రకాశించే రూపాన్ని, పురి శడై = పేనిన జటను, అమ్ పుణ్ణియనుమ్ = అందమైన గొప్ప పుణ్యాన్ని కలవాడైన రుద్రుడు, నిన్ఱు ఉలకమ్ తాయ నెడుమాలుమ్ = నిలచి లోకాలను అన్నిటినీ కొలిచిన సర్వేశ్వరుడు, ఎన్ఱుమ్ = ఎల్లప్పుడూ, ఇరువర్ అజ్గత్తాల్ తిరివరేలుమ్= రెండు రూపాలతో తిరిగేవారే అయినా, ఒరువన్ = సాధకవేషాన్ని దాల్చిన ఒకడు, (శివుడు), ఒరువన్ అజ్గత్తు = ఇంకొకని అంటే -శ్రీమన్నారాయణుని శరీరాన్ని ఆశ్రయించి, ఎన్ఱుమ్ = అన్ని కాలాలలోను, ఉళన్ = సత్తను కలవాడై ఉన్నాడు.

అవ :- లోకంలో జ్ఞానం, శక్తి మొదలైనవానిలో గొప్పవారై ఉండే రుద్రుడు మొదలైనవారు, తమ మనసారా తాము జీవులమని తెలిసినా, తమను ఈశ్వరులుగా భ్రమించి, ఇతరులను భ్రమింపజేయడాన్ని చూచి, ఆழ்వార్లు- “మేముకూడా ఈ విధంగా అవుతామో! ఏమో!'' అని భీతిల్లి, తమ ప్రయత్నంతో భగవానుని దర్శించినవారికి ఆ విధంగా అయే అవకాశం ఉన్నదని, మన అప్రతిషేధాన్నే ఆధారంగా చేసికొని, అతడు స్వయంగా ప్రయత్నించగా పొందిన మేము ఆవిధంగా కాబోము. ఆవిధంగా ఒకవేళ మేమే మా కంఠానికి ఉచ్చును బిగించుకొన్నా, ఆ ఉచ్చును తెంపి, కాపాడడానికి అతడున్నాడు; దీనిని తెలిసికో- అని తమ మనస్సుతో అంటున్నారు.

**99. ఉళన్ కణ్డాయ్ నన్నెఞ్జే ! ఉత్తమనెన్ఱు**
**ముళన్ కణ్డాయ్ ఉళ్ళువారుళ్ళ-త్తుళన్ కణ్డాయ్**
**వెళ్ళత్తి నుళ్ళానుమ్ వేజ్గడత్తు మేయానుమ్**
**ఉళ్ళత్తినుళ్ళా నెన్ఱోర్**

నల్ నెఞ్జే = అనుకూలం అయిన ఓ మనసా!, ఉత్తమన్ = పురుషోత్తముడు, ఎన్ఱుమ్ = అన్ని కాలలోను, ఉళన్ కణ్డాయ్ = (మనలను రక్షించడం కోసమే) ఉన్నాడుసుమా!, ఉళ్ళువార్ ఉళ్ళత్తు = తనను తలచేవారి మనస్సులో, ఉళన్ కణ్డాయ్= నిత్యవాసం చేస్తున్నాడుసుమా!, వెళ్ళత్తిన్ ఉళ్ళానుమ్ = పాలసముద్రంలో నిద్రించేవాడు, వేజ్గడత్తు మేయానుమ్ = తిరుమలలో నిలచి

ఉన్నవాడే, ఉళ్ళత్తిన్ ఉళ్ళాన్ ఎన్రు = నా హృదయంలో నిత్యవాసం చేసేవాడు - అని, ఓర్= తెలిసికో.

అవ :- "ఈ విధంగా మన విషయంలో అభినివిష్టుడై, మనలను చేరాలని ఆశించే భగవానుని పొందడానికి ఏది ఉపాయం!"- అని ఆళ్వార్ల మనస్సు ప్రశ్నించగా, "పొందదగిన ఉపేయమూ అతడే; ప్రాప్యం అయిన అతనిని పొందడానికి ఉపాయంకూడా అతడే. నీవు చేయవలసినది ఈ అర్థంలో స్థిరంగా నమ్మికను కల్గి ఉండడమే"- అని తమ మనస్సుకు ఆళ్వార్లు అనుగ్రహిస్తున్నారు.

**100. ఓరడియుమ్ శాడుతైత్త ఒణ్మలర్‌శేవడియుమ్**
**ఈరడియుమ్ కాణలా మెన్నెఞ్జే! - ఓరడియిల్**
**తాయవనై క్కేశవనై త్తణ్డుళాయ్ మాలై శేర్**
**మాయవనైయే మనత్తు వై**

ఎన్ నెఞ్జే = ఓ నా మనసా!, ఓర్ అడియిల్ తాయవనై = ఒక శ్రీపాదంతో లోకాన్ని అంతటినీ కొలిచినవాడై, కేశవనై = కేశి అనే అసురుని సంహరించినవాడై, తణ్ తుళాయ్ మాలై శేర్ = చల్లని తులసీమాలతో అలంకరింపబడ్డ, మాయవనైయే = ఆశ్చర్యచేష్టితాలను కల భగవానునే, మనత్తు వై = మనస్సులో నిలుపుకో, (ఈ రీతిలో అతనిని ఆశ్రయిస్తే), ఓర్ అడియుమ్ = లోకాలను కొలిచిన శ్రీపాదం, శాడు ఉదైత్త = బండి విఱిగి కూలిపోయేటట్లు తన్నిన, ఒణ్ మలర్ శే అడియుమ్ = అందమైన పుష్పంవంటి ఎఱ్ఱని శ్రీచరణం అనే, ఈర్ అడియుమ్= రెండు శ్రీచరణాలను, కాణలామ్ = దర్శించవచ్చును.

పొయ్‌కైయాళ్వార్ తిరువడికళే శరణమ్
ముదల్‌తిరువన్దాది టీకా వివరణలు సంపూర్ణం





పూదత్తాళ్వార్ అనుగ్రహించిన

# ఇరణ్డామ్ తిరువన్దాది

తిరుక్కురుకై ప్పిరాన్ అనుగ్రహించిన తనియన్

**ఎన్ పిఱవి తీర ఇఱైఞ్జినేన్ ఇన్నముతా**
**అన్బే తకళి యళిత్తానై- నన్ పుకళ్ శేర్**
**శీతత్తార్ ముత్తుక్కళ్ శేరుమ్ కడల్‌మల్లై**
**ప్పూదత్తార్ పొన్నజ్గళల్**

ఇన్ =తీయని (భోగ్యమైన), అముదు+ఆక = అమృతంగా, అన్బే తకళి= "అన్బే తకళి" అని ప్రారంభం అయ్యే ఇరణ్డామ్ తిరువన్దాదిని, అళిత్తాన్ = అనుగ్రహించినవారై, నల్ = గొప్ప, పుకళ్ = కీర్తి, శేర్ = కల్గినది, శీదత్తు ఆర్=చల్లదనం నిండిన, ముత్తుక్కళ్ = ముత్యాలు, శేరుమ్ = చేరేది అయిన, కడల్ మల్లై = "తిరుక్కడల్ మల్లై" అనే తిరునామాన్ని కల దివ్యదేశంలో అవతరించిన, పూదత్తార్= పూదత్తాళ్వార్ల, పొన్ అమ్ కళల్ = బంగారం వలె అభిలషించదగిన అందమైన శ్రీచరణాలను, ఎన్= నా, పిఱవి = జన్మలు, తీర = తీరేటట్లు (తీరడంకోసం), ఇఱైఞ్జినేన్ = స్తుతించాను.

ఈ తనియన్ పాశురాన్ని భగవద్రామానుజుల శిష్యులలో ముఖ్యులు, వారి జ్ఞానపుత్రులుగా కీర్తింపబడేవారైన తిరుక్కురుకైప్పిరాన్‌పిళ్ళాన్ (కురుకేశులు) రచించారు. ఈ కురుకేశులే నమ్మాళ్వార్ల తిరువాయ్‌మొళికి ప్రబంధానికి ఆఱాయిరప్పడి అనే వ్యాఖ్యను రచించారు.



అవ :- పొయ్‌కై ఆళ్వార్లు "వైయమ్ తకళియా" అని ప్రారంభించి విచిత్రమైన లోకాన్ని నిర్వహించే భగవానుని గొప్పతనాన్ని అనుసంధించారు. "భక్తి, పరభక్తి (ఆర్వమ్) మొదలైనవానిని కల్గించి, నన్ను కూడా సంస్కరించిన రీతిని చూస్తే, విచిత్రమైన లోకాన్ని స్వామి నిర్వహించడం అంతా తగి ఉన్నది"- అని అంటూ తమ అభినివేశాన్ని పూదత్తాళ్వార్లు ఈ మొదటి పాశురంలో

ప్రకటిస్తున్నారు. పరమపురుషుని కృపతో ఏర్పడిన తమ భక్త్యవస్థలను ప్రమిదగా, నేయిగా రూపిస్తూ, అందరికీ నాథుడైన నారాయణునకు పరజ్ఞానం అనే ప్రజ్వలించే దీపాన్ని వెలిగించి, కైంకర్యాన్ని చేయగలిగాను కదా!- అని దీనిలో పూదత్తాళ్వార్లు ఆనందిస్తున్నారు.

1. అన్బే తకళియా ఆర్వమే నెయ్యాక
ఇన్బురుకు శిన్దై యిడు తిరియా- నన్బురుకి
ఞానచ్చుడర్ విళక్కేఱ్ఱినేన్ నారణఱ్కు
ఞానత్తమిళ్ పురిన్ద నాన్

ఞానమ్ తమిళ్ = జ్ఞానాన్ని కల్గించే ద్రావిడమాలను, పురిన్ద = రచించిన, నాన్= నేను, అన్బే = భక్తినే, తకళియా = ప్రమిదగా, ఆర్వమే= పరభక్తినే, నెయ్ ఆక= నేయిగా, ఇన్బు ఉరుకు శిన్దై = భోగ్యతవల్ల కఱగిపోయే మనస్సును, ఇడు తిరియా= ప్రమిదలో పెట్టబడే వత్తిగా చేసి, నన్బు = జ్ఞానస్వరూపమైన ఆత్మ, ఉరుకి= కఱగి, ఞానమ్= పరజ్ఞానం అనే భక్తి దశను, శుడర్ విళక్కు = ప్రజ్వలించే దీపంగా, నారణఱ్కు = శ్రీమన్నారాయణునకు, ఏఱ్ఱినేన్ = వెలిగించాను.

అవ:- భక్తికి వశులై, క్రమవివక్ష లేకుండా తిరునామాలను అనుసంధించి పిలిచేవారికి సర్వేశ్వరుడు నిత్యసూరులతో సాటి వచ్చే గొప్పతనాన్ని పరమ పదంలో అనుగ్రహించి, రక్షిస్తాడు- అని ఈ రెండవ పాశురంలో అంటున్నారు.

2. ఞానత్తాల్ నన్గుణర్న్దు నారణన్దన్ నామఙ్గళ్
తానత్తాల్ మఱ్ఱవన్ పేర్ శాఱ్ఱినాల్- వాన
త్తణియమరర్ ఆక్కువిక్కు మంఽితన్దే నఙ్గళ్
పణియమరర్ కోమాన్ పరిశు

నారణన్ తన్ = శ్రీమన్నారాయణుని, నామఙ్గళ్ = స్వరూపరూపగుణాలను తెలిపే) నామాలను, మఱ్ఱు = ఇంకా, అవన్ పేర్ = ఆ స్వామియొక్క (విభూతి విస్తృతికి వాచకాలైన) తిరునామాలను, ఞానత్తాల్ = భక్తిరూపాపన్న జ్ఞానంతో, నన్గు ఉణర్న్దు = యథాతథంగా తెలిసి, తానత్తాల్ = (భక్తిపరాకాష్ఠ అయిన)



స్థానంలో నిలచి, శాఱ్ఱినాల్ = అనుసంధిస్తే, నఙ్గళ్ పణి అమరర్ కోమాన్ పరిశు = మనకు బంధువులుగాను, సదా కైంకర్యపరులుగానే ఉండే నిత్య సూరులకు నాథుడైన భగవానుని స్వభావం, వానత్తు అణి అమరర్ ఆక్కువిక్కుమ్ అంఽితు అన్దే = పరమపదానికి అలంకారభూతులతో అయిన నిత్యసూరులతో సమానంగా మనలనుకూడా చేస్తుంది కదా!

ఈ లోకంలో స్వయం ప్రయోజనంగా, క్రమవివక్ష లేకుండా తిరునామాను సంధానం చేసినవారిని, ఆ లోకం అయిన పరమపదంలో క్రమవివక్ష లేకుండా నామానుసంధానం చేసే నిత్యసూరుల గోష్ఠిలోకి స్వామి చేరుస్తాడని భావం. **"నఙ్గళ్ అమరర్", "పణి అమరర్"** (మనకు సహజమైన బంధువులు, కైంకర్యం చేయడమే స్వరూపంగా కలవారు) అని విశేషించి పల్కడంవల్ల అహంకారులైన ఇంద్రాదిదేవతలు బంధువులు కారని చెప్పబడింది.

అవ :- గత పాశురంలో తెల్పిన విషయాన్నే ఆళ్వార్లు ఇందులో మళ్ళీ వివరిస్తున్నారు. పరమపదంనుండి, సంసారులకు సమీపంలో ఉండే పాలకడలి లోకి వచ్చి శయనించిన సౌలభ్యాన్ని కలవాని శ్రీపాదాలను ఉపాయంగా ఆశ్రయించేవారు బ్రహ్మాది దేవతలచేత పొందడానికి సాధ్యం కాని పరమపదాన్ని చేరుతారు - అని అంటూ తమకు భగవానుడు చేసిన హితాన్నిగూర్చి ఆళ్వార్లు అభినివేశాన్ని పొందుతున్నారు.

3. పరిశు నఱు మలరాల్ పాఱ్కడలాన్ పాతమ్
పురివార్ పుకప్పెఱువర్ పోలామ్- పురివార్కళ్
తొల్లమరర్ కేళ్వి త్తులఙ్గొళిశేర్ తోఱ్ఱత్తు
నల్లమరర్ కోమాన్ నకర్

పాల్ కడలాన్ పాదమ్ = క్షీరాబ్ధినాథుని చరణాలను, నఱు మలరాల్ = పరిమళం అతిశయించిన పుష్పాలతో, పరిశు పురివార్ = భక్తిమార్గంలో ఆశపడి, సేవించేవారు, పురివార్కళ్ తొల్ అమరర్ = సాధనానుష్ఠానపరులైన బ్రహ్మాది సనాతన దేవతలకుకూడా, కేళ్వి = (నేత్రాలతో దర్శించడానికి సాధ్యం కాకుండా) చెవులతో మాత్రం వినడానికి వీలయినది, తులఙ్గు ఒళి శేర్ తోఱ్ఱత్తు =

చాలా గొప్పగా వెలిగే, కాంతి నిండిన దర్శనాన్ని కల్గినది అయిన, నల్ అమరర్ కోమాన్ నకర్ = నిత్యసూరుల నాథుని గొప్ప నగరం అయిన పరమపదాన్ని, పుక ప్పెఱువార్ పోలామ్ = పొందగలవారే అవుతారు.

**"పోలామ్"** అనే పదం ఆశ్చర్యాన్ని సూచిస్తుంది. చిరకాలం సాధనానుష్ఠానాన్ని చేసినవారికిసైతం పొందడానికి వీలు కాని పరమపదం ఒకసారి అతనినే ఉపాయంగా తలచినవారికి సులభం కావడం అత్యాశ్చర్యకరం కదా! ఈ ఆశ్చర్యం ఘటించడానికి కారణం - బ్రహ్మాదిదేవతలకు భగవత్సంబంధజ్ఞానం పరిపూర్ణంగా లేకపోవడం, ప్రపన్నులకు అది పరిపూర్ణంగా ఉండడమే. కూలిపని చేసి, దానికి తగిన జీతం పొందాలనుకొనే కూలివాడికి, పనికి తగిన పనిచేసిన తర్వాత ఆ కూలి లభించడం, సంబంధజ్ఞానం కల భార్యా,బిడ్డలు మొదలైన అతని బంధువులు ఏ కూలి చేయకపోయినా ఆ కూలి ఫలాన్ని పొందడం చూస్తూనే ఉన్నాము కదా! అదేరీతిలో భగవానుడు మనకు అన్ని విధాలుగా బంధువు అనే విషయాన్ని గుర్తించకుండా, ఏదో ఒక సాధనాన్ని అనుష్ఠించి ఫలాన్ని పొందాలని ప్రయత్నించే బ్రహ్మాదులకు, గొప్పదై మోక్షానికి కొంచెం అయినా సాటిరాని వారు కోరే అల్ప ఫలాన్ని సైతం పెద్ద ప్రయత్నాన్ని చేస్తే తప్ప ఇవ్వడు. "అతడు మనకు అన్ని విధాలుగా బంధువు కనుక, మన రక్షణ అతని బాధ్యత - అని తలచే ప్రపన్నులనుండి ఏ ప్రయత్నాన్ని ఎదురు చూడకుండా పరమపురుషార్థాన్ని ఇస్తాడు. ఇదే ఈ పాశురంలో చూపబడ్డ ఆశ్చర్యానికి కారణం.

అవ:- **"అన్బే తకళి"** అనే మొదటి పాశురంలో భక్తి ప్రారంభదశలను ప్రమిదగాను, నేయిగాను, పండిన దశలైన పరజ్ఞానాన్ని ఒక దీపంగాను, రూపించి పల్కినట్లే, ఇందులో తమ భక్త్యవస్థావిశేషాలను రేకులు, కేసరాలు, పుప్పొడి- మొదలైనవానితో కూడిన తామరపూవుగా రూపిస్తూ ఆ పూవుతో భగవానుని ఆళ్వార్లు ఆశ్రయిస్తున్నారు.

**4. నకరిళైత్తు నిత్తిలత్తు నాణ్మలర్ కొణ్డు ఆఙ్గే**
**తికళుమ్ మణివయిరమ్ శేర్త్తు-నికరిల్లా**
**పైఙ్గమల మేన్ది ప్పణిన్దేన్ పనిమలరాళ్**
**అఙ్గమ్ వలమ్ కొణ్డానడి**

నకర్ ఇళైత్తు = నా మనస్సును భగవానుడు నివసించదగిన గొప్ప నగరంగా మలచుకొని, నిత్తిలత్తు నాళ్ మలర్ కొణ్డు = (అందులో) ముత్యంవంటి స్నేహాన్ని అపుడే విరిసిన బయటి పూరేకుగా చేసికొని, తికళుమ్ మణి వయిరమ్ శేర్త్తు = సంగం, కామం- అనే మంచి మాణిక్యాన్ని, వజ్రాన్ని ఆ తామరలోని కేసరాలుగా, పుప్పొడిగా అమర్చి, నికర్ ఇల్లా = సాటి లేని, పైఙ్కమలమ్ ఏన్ది = భక్తి అనే అందమైన తామరపూవును ధరిస్తూ, పని మలరాళ్ అఙ్గమ్ వలమ్ కొణ్డాన్ = చల్లని తామరపూవులో వేంచేసి లక్ష్మిని వక్షఃస్థలంలో కుడివైపున కల భగవానుని, అడి= శ్రీపాదాలను, పణిన్దేన్ = సేవించాను.

పరిపూర్ణం కాని సమాశ్రయణాన్ని, అంటే- ప్రపత్తిని సైతం-పరిపూర్ణం చేయగల లక్ష్మీపురుషకారాన్ని పురస్కరించుకొని నారాయణుని శ్రీచరణాలను ఆశ్రయించానని ప్రకృత భావం. ఇది ద్వయం పూర్వఖండార్థం. భగవద్విషయంలోని స్నేహం, సంగం, కామం- మొదలైనవానిని ముత్యం, మాణిక్యం, వజ్రం- అని, తామరపూవులోని బయటి రేకులుగా, లోపలి రేకులుగా, కేసరాలుగాను రూపణం చేయడంలో ఏం తాత్పర్యం? - అంటే, మనస్సును నగరంగా రూపించినందువల్ల ఆ నగరం ముత్యాలను, మాణిక్యాలను, వజ్రాలను కల్గినదని తెలుపడంకోసం స్నేహాదులను ముత్యాదులతో రూపిస్తున్నారు. **"పైఙ్గమలమ్"** అని భక్తిని తామరపూవుగా రూపించినందుకు అనుగుణంగా, భక్తికి ముందు దశలైన స్నేహాదులను బయటి రేకులు మొదలైనవానితో రూపించి, కొన్నిటిని వ్యక్తం చేస్తూ, మఱి కొన్నిటిని గూఢంగా సూచిస్తున్నారు. భక్తి అనేది భగవానుని అనుభవించడానికి సాధనంగాను, అనుభావ్యంగాను, అంటే- ప్రాపకంగా, ప్రాప్యంగాను ప్రకాశిస్తున్నందున, ఇతర సుఖాలను పొందడానికి సాధనం గాను, తానే భోగ్యంగాను ఉండే తామరపూవుతో దానిని పోల్చారు. మనస్సును రాజధానిగా రూపించడంలో ఏమి తాత్పర్యం? అని అంటే, శరణు పొందగానే, ఏ పరిణామం లేని పరమపదం పట్ల గల అభినివేశానికి మించిన అభినివేశాన్ని

మనపట్ల కల్గి, అతడు ఎంతో ప్రేమతో, సరసంగా వర్తిస్తాడని సూచించడం కోసం, మనస్సును రాజధానిగా ఆళ్వార్లు పోల్చారు.

అవ :- "ఇంతకు ముందు "నన్గుణర్న్దు పేర్ శాత్తినాల్" (2) అని, "పాదమ్ పురివార్ పుక ప్పెఱువర్" (3) అని, "అడి పణిన్దేన్" (4) అని అన్నారే ! మీరు నన్ను బాగా గ్రహించి, అన్నారా మఱి!"- అని అంటే, "నిన్ను పూర్తిగా తెలియడానికి ఎవరికైనా సాధ్యమా! నీ పరత్వాన్ని ఏదో కొంచెం తెలిసినా తెలియవచ్చునేమో కాని, సౌలభ్యాన్ని గూర్చి ఎవరూ తెలియలేరుకదా!"- అని ఇందులో అంటున్నారు.

5. అడి మూన్ఱివ్వులకమ్ అన్ఱళన్దాయ్ పోలుమ్
అడిమూన్ఱిరన్దవని కొణ్డాయ్! - పడి నిన్ఱ
నీరోత మేని నెడుమాలే! నిన్నడియై
యారోతవల్లా రఱిన్దు

పడి నిన్ఱ = భూమిలో అవతరించి ఉండే, నీర్ ఓదమ్ మేని నెడు మాలే= సముద్రవర్ణుడవైన ఓ సర్వేశ్వరా!, అడి మూన్ఱు = మూడడుగుల నేలను, ఇరన్దు కొణ్డాయ్ = మహాబలివద్ద యాచించి పొందావు, అన్ఱు = ఆ కాలంలో, ఇ ఉలకమ్ = ఈ లోకాన్ని, అడి మూన్ఱిల్ అళన్దాయ్ పోలుమ్ =మూడు పాదాలతో కొలిచావా! (లేదే), నిన్ అడియై = నీ శ్రీపాదాన్ని, అఱిన్దు = బాగా తెలిసికొని, ఓదవల్లార్ ఆర్ = పలుకగలవారెవరు ? (ఎవరూ లేరు)

"పరో మాత్రయా తన్వా వృధాన న తే మహిత్వ మన్వశ్నువంతి" అనే వైదిక సూక్త్యర్థం ప్రకృతంలో భావ్యం.

అవ :- "ఎవరూ భగవానుని తెలియకలేకపోతే భగవద్విషయం గగన కుసుమంవలె శూన్యమై, తుచ్ఛమే కావలసివస్తుంది కదా! ఆవిధంగా సర్వథా శూన్యం కాకపోయినా, అరుదైనది అవుతుంది కనుక, దానిని అందరూ కోల్పోవలసి వస్తుంది. అందువల్ల నిష్ఫలమే అవుతుందికదా" - అనే ప్రశ్న తల ఎత్తగా, "ఆ విధంగా కాదు. ఇతరవిషయాలలో సంగాన్ని వీడి, అతనిపట్ల గొప్ప అనురాగంతో అతని తిరునామాలను ఆర్తితో పల్కి కీర్తించే భాగ్యాన్ని కలవారు అతనిని తప్పక పొందుతారు" అని అంటున్నారు. గత పాశురంలో



"అతనిని ఎవ్వరూ తెలియలేరు" అనే మాటకు- ఎంతటి జ్ఞానాన్ని కలవారైనా అతనిని ఇదమిత్థంగా పరిచ్ఛేదించి తెలియగల్గినవారుకాదని భావం. ఇక్కడ- "భక్తితో అతనిని ఆశ్రయించేవారికే కదా తనను అతడు దర్శింపజేస్తాడు" అని చెప్పబడింది. కావున ఈరెండిటి అర్థంలో పరస్పరవిరోధం లేదు.

6. అఱిన్దైన్దు ముళ్ళడక్కి అయ్మలర్ కొణ్డు ఆర్వమ్
శెఱిన్ద మనత్తరాయ్ చ్చెవ్వే- అఱిన్దవన్ఱన్
పేరోది యేత్తుమ్ పెరున్దవత్తోర్ కాణ్బరే
కారోత వణ్ణన్ కழల్

అఱిన్దు =(భగవానుని గొప్పతనాన్ని, లౌకికవిషయాల నైచ్యాన్ని చక్కగా) తెలిసికొని, ఐన్దుమ్ = పంచేంద్రియాలను, ఉళ్ అడక్కి = (అన్యవిషయాలో ఆసక్తిని కల్గి ఉండని రీతిలో బాగా నియంత్రించి) భగవద్విషయంలో ఊనికను కల్గి ఉండేటట్లుగా నియమించి, ఆయ్ మలర్ కొణ్డు = (భగవానునకు తగిన రీతిలో) పరిశీలించి, పూలను సమర్పిస్తూ, శెవ్వే అఱిన్దు = (భగవానునకు, తమకు మధ్య ఉండే శేషశేషిభావసంబంధాన్ని) బుజువుగా తెలిసికొని, అవన్‌తన్ పేర్= ఆ స్వామి తిరునామాలను, ఓది = నిరంతరం అనుసంధిస్తూ, ఏత్తుమ్ = స్తుతించే, పెరుమ్ తవత్తోర్ = మహాభాగ్యశాలురు, కార్ ఓదమ్ కణ్ణన్ కழల్= నల్లని సముద్రవర్ణంవంటి వర్ణాన్ని కల ఆ భగవానుని శ్రీచరణాలను, కాణ్బర్= దర్శించి, అనుభవించగలరు.

శ్రీచరణాలను ఉపాయంగా ఆశ్రయించి, ఆ శ్రీచరణాలనే ప్రాప్యంగా పొందుతారు - అని భావం.

అవ :- ఈ విధంగా భాగ్యశాలురందఱూ సంతోషించి, ఆశ్రయించి ఉజ్జీవించే విషయాన్ని నీవుకూడా ఆనందించి, ఆశ్రయించి, ఉజ్జీవించు -అని అంటూ తమ మనస్సును ఉద్దేశించి ఇందులో ఉపదేశిస్తున్నారు. పాపాలు మొదలైన ఆటంకాలు అతనిని ఆశ్రయించిన వెంటనే నముచి పడిన పాట్లను పడతాయి - అతని తెలుపడంకోసం నముచి వృత్తాంతాన్ని ఇక్కడ ప్రస్తావిస్తున్నారు.

7. కఴలెడుత్తు వాయ్ మడిత్తు కణ్ శుழన్టు మాఱ్ఱార్
అళలెడుత్త శిన్దైయరాయఞ్జ- తழలెడుత్త
పోరాழి యేన్దినాన్ పొన్ మలర్ చ్చేవడియే
ఓరాழి నెఞ్జే! యుకన్దు

ఆழి నెఞ్జే = సముద్రంవలె గంభీరం అయిన ఓ మనసా!, (పూర్వం స్వామి త్రివిక్రమావతారాన్ని ఎత్తినపుడు) కழల్ ఎడుత్తు = తన శ్రీపాదాలను ఉన్నతంగా ఎత్తిన వాడుగాను, మాఱ్ఱార్ = తనను ఎదిర్చిన నముచి మొదలైన వారు, అழల్ ఎడుత్త శిన్దైయర్ ఆయ్ అఞ్జ = భయాగ్ని ప్రజ్వలించే మనస్సును కలవారై, భయపడేటట్లుగా, వాయ్ మడుత్తు = దవుడలను మడిచి, కణ్ శుழన్టు= (చూచే చూపులోనే ఆ శత్రువులు పడిపోయేటట్లుగా) కన్నులను గుండ్రంగా తిప్పుతూ, తழల్ ఎడుత్త పోర్ ఆழి = నిప్పును ఉమిసే, పోరును చేయగల సుదర్శనుని, ఏన్దినాన్ = ధరించేవాడై ఉండే భగవానుని, పొన్ మలర్ శే అడియే= అందమైన పూవువంటి శ్రీపాదాలనే, ఉకన్దు ఓర్ =ఆశపడి అనుసంధించు.

తీయని పాలను తాగడంకోసం కాళ్ళు పట్టుకోవాలా? చంటిబిడ్డకు తల్లిపాల వలె, శేషభూతుడైన చేతనునకు అనుభావ్యంగా ఉండే భగవానుని శ్రీచరణాలను ఆశ్రయించమని వేఱే చెప్పాలా? నాకంటే ముందుగానే నీవే ఆశ్రయించదగిన విషయం కదా ఇది- అని భావం.

అవ :- ఈ విధంగా భగవానుని శ్రీపాదాలను ఆశ్రయించేటపుడు ఆటంకాలు కల్గితే ఏం చేయాలి? అని అంటే, పూతనను నశింపజేసినట్లే అతడే ఆ అన్ని ఆటంకాలను పోగొడతాడు- అని చూపడంకోసం ఇందులో పూతనా వృత్తాంతాన్ని ఆழ్వార్లు అనుసంధిస్తున్నారు. ఆర్తితో అతని శ్రీచరణాలను పొందేటపుడు పూతనవలెనే అసత్యమైన ప్రీతితో అతని దరి చేరితే నాశమే కల్గుతుంది. అందువల్ల నిజమైన భక్తితో ఆశ్రయించాలి- అని తెలుపడంకోసం పూతనావృత్తాంతాన్ని అనుగ్రహిస్తున్నారని కూడా అనవచ్చు.

8. ఉకన్దున్నై వాఙ్గి ఒళినిఱఙ్గొళ్ కొఙ్గై
అకమ్ కుళిర వుణ్ణెన్టాళావి- ఉకన్దు
ములై యుణ్బాయ్‌పోలే మునిన్దుణ్డాయ్ నీయుమ్
అలై పణ్బా లానమైయాలన్టు

ఉకన్దు = యశోదాదేవివలె ప్రేమను కల్గినదిగా అభినయించి, ఉన్నై వాఙ్గి= (నీవు నిద్రించేటపుడు వచ్చి) నిన్ను ఎత్తి తీసికొని, ఒళి నిఱమ్ కొళ్ కొఙ్గై = (పాలు ఉప్పొంగి రావడంవల్ల) వెలిగే సౌందర్యాన్ని కల తన స్తనాలను, అకమ్ కుళిర ఉణ్ ఎన్టాళ్ = (శిశువు) మనస్సు ఆనందించేటట్లుగా "తాగు'' అని అన్నది, ఆనమైయాల్= అందువల్ల, అన్టు = ఆమె స్తన్యాన్ని ఇచ్చిన ఆ కాలంలో, నీయుమ్ = చిన్న బిడ్డవైన నీవుకూడా, అలై పణ్బాల్ = అలలు లేచే (అధికమైన) నీ శైశవంవల్ల, ములై ఉణ్డాయ్ పోల్ = వాస్తవంగానే పాలను తాగేవానివలె, ఉకన్దు = (అలభ్యలాభం పొందినవానివలె బయటకు) ఆనందాన్ని చూపిస్తూ, మునిన్దు= మనస్సులో చాలా కోపాన్ని పొంది, ఆవి= (ఆ పూతనయొక్క), ప్రాణాలను, ఉణ్డాయ్ = (పాలతో పాటు పీల్చి) ఆరగించావు.

**"అలై పణ్బాల్ ఉణ్ - ఎన్టాళ్"** అని అన్వయించి, క్రూరమైన గుణంతో బిడ్డను చంపాలని తలచి, విషం పూసిన స్తన్యాన్ని "తాగు'' అని అన్నది- అని చెప్పవచ్చు. **"అలై పణ్బాల్ ఆనమైయాల్"**- దాసులపట్ల ఉండే, అత్యధికమైన అలలు వీచే పక్షపాతంతో - అనే అర్థాన్ని చెప్పవచ్చు. **"మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయమ్"** అనే రీతిలో పైన ఆరోపించుకొన్న స్నేహంతో వచ్చిన పూతనకు కూడా కార్యసిద్ధిని కల్గించాలని తలచే నీవు నిన్ను నశింపజేసికోకుండా కాపాడుకొని, పూతనను వధించి, మాకు నిన్ను అనుగ్రహించడానికి కారణం- భక్తుల పట్ల నీకు ఉండే అపరిమితం అయిన పక్షపాతమే కదా!- అని అంటున్నారు.

అవ :- పూతనయొక్క అసత్యమైన ప్రేమను స్మరించినందువల్ల తమకు కల్గిన దుఃఖం తీరేటట్లు, శ్రీకృష్ణునిపట్ల స్థిరమైన, సత్యమైన భక్తిని కల యశోదాదేవికి ఉపమానం ఉన్నదా! అని అంటూ ఆమె ప్రేమను గొప్పగా ఇందులో ఆழ్వార్లు ప్రశంసిస్తున్నారు.

9. అన్టతు కణ్డఞ్జాత ఆయ్‌చ్చి యునక్కిరఙ్గి
నిన్టు ములై తన్ద విన్నీర్మైక్కు- అన్టు

వరన్ ముత్తైయాల్ నీ యళన్ద మాకడల్‌శూ*ழ்* ఞాలమ్
పెరు ముత్తైయాలెయ్‌దుమో పేర్‌త్తు

అన్దు = (పూతన చచ్చి శవంగా పడేటట్లుగా నీవు ఆమె స్తన్యాన్ని తాగి, ఆమెను వధించిన) ఆ కాలంలో, అతు కణ్డు = స్తన్యాన్ని ఇచ్చి ఆమె చచ్చిపడిన భయంకర దృశ్యాన్ని కళ్ళతో చూచి, అఞ్జాద = 'స్తన్యాన్ని ఇచ్చే నేనుకూడా చచ్చిపోతానో ఏమో!'' అని భయపడని, ఆయ్‌చ్చి = యశోదాదేవి, నిన్దు = ధరించి నిలచి, (ఆ పూతన విషానికి మాఱుగా), ఉనక్కు ఇరఙ్గి ములై తన్ద = నీ విషయంలో ప్రేమను కల్గి, స్తన్యాన్ని ఇచ్చిన, ఇ నీర్‌మైక్కు = ఈ మహా గుణానికి, అన్దు నీ వరన్ ముత్తైయాల్ అళన్ద మా కడల్ శూ*ழ்* ఞాలమ్= పూర్వం నీవు గొప్ప దైన స్వస్వామిరూపసంబంధాన్ని పురస్కరించుకొని కొలిచిన, గొప్ప సముద్రంచే చుట్టబడి ఉండే ఈ భూలోకం, పెరు ముత్తైయాల్ ఎయ్‌దుమో = ఇది పెద్దది అని చూచే క్రమంలో సాటివస్తుందా! (ఈ భూమి సమస్తం కూడా యశోదాదేవి మహాగుణానికి సాటిరాదు).

**"మాకడళ్ శూ*ழ்* ఞాలమ్ అళన్ద ఎయ్‌దుమో ?"**- అని అన్వయించి, ఆమె ఆ దశలో కూడా స్తన్యాన్ని ఇచ్చిన స్వభావానికి నీవు లోకాలను అన్నిటినీ చల్లగా తడిమి కొలిచిన గొప్పతనం సైతం సాటి వస్తుందా?- అని కూడా చెప్పవచ్చు. నీవు లోకాలను కొలిచిన లీల గొప్పదే అయినా, ఈ తల్లి చేసిన గొప్ప పనికి అదికూడా సాటి రాదని భావం. ఈ రీతిగా, యశోదకు కృష్ణునిపట్ల ఉండే వాత్సల్యాతిశయాన్ని కీర్తించి ఆ*ழ்*వార్లు విద్దులయ్యారు.

అవ :- "ఆ యశోదాదేవివలె నీ విషయంలో నాకు అంతటి చాలా గొప్ప ప్రేమ లేకపోయినా, కొంచమైనా నాకు భక్తి లేకపోలేదు. దానిని మూలంగా చేసికొని, నేను పలు జన్మలలో, నాకు కన్పించిన దైవాల కాళ్ళలో శిరస్సు వంచిన నా నైచ్యాలను అన్నిటినీ పోగొట్టి నీవే రక్షించాలి''- అని అంటున్నారు.

**10.** పేర్‌త్తనై మాశకడమ్ పిళ్ళైయాయ్ మణ్ ఇరన్దు
కాత్తనై పల్లురుమ్ కావలనే! - ఏత్తియ
నావుడైయేన్ పూవుడైయేన్ నిన్నుళ్ళి నిన్డమైయాల్
కా వడియేన్ పట్ట కడై



కావలనే = సర్వరక్షకా!, పిళ్ళై ఆయ్ = చిన్న బిడ్డవై ఉండి, మా శకడమ్ = అసురావేశాన్ని కల పెద్ద బండిని, పేర్‌త్తనై = విఱిగి కూలిపోయేటట్లుగా తన్ని తోశావు, మణ్ = భూమిని, (మహాబలిదగ్గరనుండి) యాచించి పొంది, (శ్రీపాదంతో చల్లగా తడవి), పల్ ఉయిరుమ్ = అన్ని ఆత్మలను, కాత్తనై = రక్షించావు, నిన్ = ఈవిధంగా రక్షకుడవైన, నిన్ను, ఉళ్ళి నిన్డమైయాల్ = (రక్షకుడు) తలచినందువల్ల, ఏత్తియ నా ఉడైయేన్ = నిన్ను స్తుతించడమే స్వభావంగా కల జిహ్వను కల్గినవాడనై ఉన్నాను, పూ ఉడైయేన్ = (అర్చించడానికి తగిన) పూలను కలవాడనై ఉన్నాను. (అందువల్ల), అడియేన్ = నీకు దాసుడనై ఉండే గొప్ప పదవిని పొందిన నేను, పట్ట = (చాలా కాలంగా మిగిలిన దైవాలనుగూర్చి) ఆశ్రయించి పొందిన, కడై = నైచ్యాలను, కా = పోగొట్టాలి.

చక్రవర్తిని ఆశ్రయించినవారు అతని సేవకుల పాదాలపై పడతారా ? అదే విధంగా, నేను పూర్వజన్మలలో కన్పించిన దేవతలందఱి పాదాలపై శిరస్సు వంచిన నైచ్యాలు, సేవించి పడిన పాట్లు అన్నీ తీరేటట్లుగా, వాటిని ఇకపై నేను పడనట్లుగా సర్వరక్షకుడవైన నీవే రక్షించాలి.

అవ:- "అనాదికాలంగా నేను మిగిలిన దైవాలను ఆశ్రయించి, అనుభవించిన నైచ్యాన్ని ఇక పొందకుండా ఉండేటట్లు పోగొట్టాలి'' అని అంటూ ఆ*ழ்*వార్లు గత పాశురంలో అనగానే, "చక్రవర్తి అయిన నేనుండగా, నా సేవకులైన అన్యదైవాలను ఆశ్రయించి, అనర్థాన్ని పొందేవారున్నారా !''- అని భగవానుడు మనస్సులో భావిస్తున్నట్లు తలచి, "లోకంలో పలువురు క్షుద్రదైవాలను ఆశ్రయించి, క్షుద్రపురుషార్థాలను పొందుతున్నారే తప్ప, నీ శ్రీచరణాలనే ప్రాప్యంగా తెలిసికొని నిన్ను ఆశ్రయించేవారు చాలా కొద్దిమందే కదా స్వామీ!'' అని అంటున్నారు.

**11.** కడైనిన్డమరర్ క*ழ*ల్ తొ*ழ*ుతు నాళుమ్
ఇడైనిన్ద విన్బత్తరావర్- పుడై నిన్ద
నీరోత మేని నెడుమాలే! నిన్నడియై
యారోతవల్లావర్

(సంసారులు) అమరర్ కడై నిన్రు = అన్యదేవతల వాకిళ్ళను ఆశ్రయించి ఉండి, నాళుమ్ = ప్రతిదినం, కழల్ తొழுదు = వారి కాలిలో పడి (గొప్ప ఆనందాన్ని పొందకుండా), ఇడై నిన్ర ఇన్బత్తర్ అవర్ = మధ్యలో లభించే (స్వర్గాన్ని) సుఖాన్ని పొంది తృప్తిపడతారు, పుడై నిన్ర నీర్ ఓద మేని నెడు మాలే = (ఈలోకాన్ని) చుట్టి ఉండే సముద్రంవంటి తిరుమేనిని కల సర్వేశ్వరా!, నిన్ అడియై = నీ శ్రీచరణాలను, ఓద వల్లార్ అవర్ ఆర్ = భావించగల గొప్పతనాన్ని కలవారు ఎవరైనా ఉన్నారా!, (ఎవరూ లేరు)

ఈవిధంగా సర్వాధికుడవైన నీ శ్రీచరణాలనే పరమభోగ్యంగా గ్రహించి స్తుతి మొదలైనవానిని చేసి, ఆశ్రయించగల గొప్పతనాన్ని కలవారు ఈ లోకంలో ఎవరున్నారు? లోకంలో సామాన్యంగా అన్యదైవాలను ఆశ్రయించి, అల్పఫలాలను పొందేవారే ఎక్కువగా ఉన్నారు. భగవానుని ఆశ్రయించే వారిలో కూడా చాలామంది ఆ స్వామిని ఉపాయంగా, ఉపేయంగా ఆశ్రయించడం లేదు. అతనినే ఉపాయంగా ఆశ్రయించి, అతని శ్రీచరణాలలో కైంకర్యం చేయాలని ఆశపడేవారు చాలా తక్కువమంది- అని తాత్పర్యం. **"వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః"** అని గీతాచార్యుడే అన్నాడు కదా!

పాశురంలో మొదటి రెండు చరణాలకు వేఱే విధంగా ఈ క్రింది రీతిలో అర్థాన్ని నిర్వహించవచ్చు.

**(అమరర్)**- బ్రహ్మరుద్రాదిదేవతలు, **(కడై నిన్రు)** - నీ కోవెల వాకిటిలో నిలచి, **(కழల్ తొழுదు)** -నీ శ్రీచరణాలను సేవించి, **(నాళుమ్ ఇడైనిన్ర ఇన్బత్తరావర్)** -నిన్నే ప్రయోజనంగా గ్రహించకుండా ఎల్లప్పుడూ బ్రహ్మపదవి, రుద్రపదవి, ఇంద్రపదవి మొదలైన మధ్యమపురుషార్థాలను పొందుతారు. కల్పవృక్షం దగ్గర కౌపీనాన్ని కోరినట్లు, ఇదేమి జ్ఞానహైన్యం ?- అని గర్హిస్తున్నారు.

అవ :- "అన్యదైవాలను ఆశ్రయించేవారు జ్ఞానహీనులు''- అని ఆழ்వార్లు గత పాశురంలో అన్నారు. దీనికి ఏం కారణం? - అని అంటే, వీరిచే ఆశ్రయింప బడే ఆ దైవాలుకూడా మన మనోరథాలను పొందడానికి భగవానునే ఆశ్రయించడం వల్ల, మనంకూడా అతనిని ఆశ్రయించడమేకదా తగినది- అని ఇందులో అంటున్నారు.



**12. అవరివరెన్రిల్లై అరవణైయాన్ పాతమ్**
**ఎవర్ వణఙ్గి యేత్తాతా రెణ్ణిల్- పవరుమ్**
**శెழுఙ్గతిరో నొణ్మలరోన్ కణ్ణుతలో నన్రే**
**తొழுన్దకైయార్ నాళుమ్ తొడర్న్దు**

ఎణ్ణిల్ = (భగవానుని సేవించి, ఉజ్జీవించేవారు ఎవరు? అని) లెక్కించి నపుడు, అవర్ అవర్ ఎన్రు ఇల్లై = వీరే ఆశ్రయించేవారు, వీరు ఆశ్రయించని వారు- అనే భేదం లేదు, అరవు అణైయాన్ పాదమ్ = ఆదిశేషశయనుడైన ఆ స్వామి శ్రీపాదాలను, వణఙ్గి = నమస్కరించి, ఏత్తాదార్ = స్తుతించనివారు, ఎవర్ = ఎవరు? (ఎవరూ లేరు), పవరుమ్ శెழுమ్ కతిరోన్ = విస్తరించిన, అందమైన వేయి కిరణాలను కల సూర్యుడు, ఒణ్ మలరోన్ = అందమైన తిరునాభీకమలాన్ని జన్మస్థానంగా కల బ్రహ్మ, కణ్ నుదలోన్ = ఫాలనేత్రుడైన రుద్రుడు- అనే దేవతలంతా, నాళుమ్= ప్రతిదినం, తొడర్న్దు తొழுమ్ తకైయార్ అన్రే = ఆ స్వామి వేంచేసి ఉండే స్థానాన్ని వెదకి, అతనిని నమస్కరించే స్వభావాన్ని కలవారుకదా!

ప్రతి అవతారంలోను బ్రహ్మాదులు భగవానుని సేవించిన వృత్తాంతాలు వేన వేలు పురాణేతిహాసాలలో కన్పడతాయి. గడచిన పాశురంలో **"నెడుమాలే! నిన్నడియై ఆర్ ఓదవల్లార్?"** అని పల్కి, ఈ పాశురంలో **"అరవణైయాన్ పాదమ్ ఎవర్ వణఙ్గి ఏత్తాదార్?"** అని అనడం పరస్పరవిరుద్ధం కదా?- అని అంటే, కాదు. గత పాశురంలో పరమపురుషుని శ్రీచరణాలనే ప్రాప్యంగా తెలిసికొని, అతనిని స్తుతించేవారు అరుదు- అని అన్నారు. ఈ పాశురం అన్యప్రయోజనాలకోసం బ్రహ్మాది దేవతలతో, మానవులలో తేడా లేకుండా, అందఱూ అతనిని స్తుతించేవారే- అని అంటున్నారు. అందువల్ల విరోధం లేదు.

అవ :- జ్ఞానంలో, శక్తిలో గొప్పవారైన బ్రహ్మరుద్రాదులకు ఇతనిని ఆశ్రయించడం వీలవుతుందా? అని అంటే, ఆవిధంగా కాదు, జన్మ, వృత్తం, జ్ఞానం మొదలైనవానిలో చాలా తక్కువ అయిన తిర్యక్కులు సైతం ఇతనిని

ఏ సంకోచం లేకుండా ఆశ్రయించ వచ్చు. వారికి కూడా ఇతడు సులభుడుగా ఉన్నాడని అంటున్నారు.

13. తొడరెడుత్త మాల్యానై శూఴ్కయమ్బుక్కఞ్జి
పడరెడుత్త పైఙ్గమలమ్ కొణ్డు- అన్టిడరడుక్క
ఆఴియాన్ పాతమ్ పణిన్దన్టే వానవర్ కోన్
పాఴి త్తానెయ్తిన్ఱు ప్పణ్డు

తొడర్ ఎడుత్త మాల్ యానై = కాలి సంకెళ్ళను ఛేదించుకొని తొండంతో పట్టుకొని తిరిగే స్వభావాన్ని కల మదపుటేనుగు, శూఴ్ కయమ్ పుక్కు = విశాలంగా ఉండే కొలనులో దిగి, ప్రవేశించి, పడర్ ఎడుత్త పై కమలమ్ కొణ్డు= వికసించి, ఉన్నతంగా ఉండే అందమైన తామరపూలను (భగవానుని శ్రీచరణాలలో సమర్పించడం కోసం) చేతిలో ధరించి, అన్టు ఇడర్ అడుక్క = ఆ స్థితిలో (మొసలినోటిలో చిక్కుకొని తనను విడిపించుకోలేని) గొప్ప దుఃఖం కలుగగా, అఞ్జి = (వాడిపోవడానికి ముందే ఆ పూలను భగవానుని శ్రీచరణాలలో సమర్పించలేకపోతానో! ఏమో! అని) మనస్సులో భయపడి, ఆఴియాన్ పాదమ్ = మొసలిని ఖండించే సాధనం అయిన శ్రీసుదర్శనాన్ని శ్రీహస్తంలో ధరించిన భగవానుని శ్రీచరణాలను, పణిన్దు అన్టే= (శరణు పొంది) నమస్కరించి నందువల్లనే కదా!, తాన్ = ఆ గజేంద్రుడు, పణ్డు = పూర్వకాలంలో, వానవర్ కోన్ పాఴి = నిత్యసూరినాథుని వాసస్థానం అయిన పరమపదాన్ని, ఎయ్ తిన్ఱు= పొందింది.

పూర్వం ఒకానొక సమయంలో నిత్యసూరినాథుడైన నారాయణుని అప్రాకృతసంస్థానం అయిన పరమపదాన్నికదా గజేంద్రుడు పొందాడు. తిర్యక్ జాతిలో పుట్టినవాడుకదా అతడు. అందువల్ల భగవానుని ఆశ్రయించడానికి వీరే యోగ్యులు, వీరు కారు- అనే నియమం లేదు- అని భావం. అయితే, అధికారినియమం లేకపోవడం ఏమి ? అని అంటే, ధర్మపుత్రాదులు ద్రౌపది, కాకాసురుడు, కాళియుడు, శ్రీగజేంద్రుడు, విభీషణుడు, గుహుడు- మొదలైనవారు ఆశ్రయించినందువల్ల అధికారి నియమం లేదు - అని తెలిపే శ్రీవచనభూషణసూత్రం (32), దాని వ్యాఖ్య అనుసంధేయాలు.



అవ :- ఈ రీతిలో భగవానుని ఆశ్రయించడానికి యోగ్యులు కాని వారెవ్వరూ లేనపుడు, సంసారాన్ని వృద్ధిచేయడానికే సహాయపడే అధములైన సంసారులను స్తుతిస్తూ సంచరించకుండా, సర్వేశ్వరుని శ్రీచరణాలను సేవించి, అతని తిరునామాలను అనుసంధించి, మీ సంబంధంతో లోకాన్ని పవిత్రం చేయండి- అని ఇందులో లోకులతో అంటున్నారు.

14. పణ్డి ప్పెరుమ్పతియై యాక్కి పఴి పావమ్
కొణ్డిఙ్గు వాఴ్వారై క్కూఱాతే- ఎణ్డిశైయుమ్
పేర్త్తకర నాన్గుడైయాన్ పేరోతి ప్పేతైకాళ్!
తీర్త్తకరరామిన్ తిరిన్దు

పణ్డి = కడుపును, పెరుమ్ పది ఆక్కి = పెద్ద ఊరువలె కన్పించినదానితో అంతటితో నింపి, పెంచి, పఴి పావమ్ కొణ్డు = తెలియక చేసే తప్పులను, తెలిసి చేసే పాపాలను ఇంకా ఇంకా వృద్ధి చేసికొంటూ, ఇఙ్గు = ఈ లోకంలో, వాఴ్వారై = బ్రతికే సంసారులను, కూఱాదే = పొగడకుండా, ఎణ్ తిశైయుమ్ పేర్త్త కరమ్ నాన్గు ఉడైయాన్= (లోకాలను కొలిచిన కాలంలో) ఎనిమిది దిక్కులలో అంతటా వ్యాపించేటట్లు వృద్ధి అయిన నాల్గు బాహువులను కలవాడైన త్రివిక్రముని, పేర్ = తిరునామాలను, ఓది = ఏ ప్రయోజనాన్ని ఆశించకుండా అనుసంధించి, తిరిన్దు = లోకంలో అంతటా సంచరించి, తీర్త్తకరర్ ఆమిన్= (మీ సంబంధంలో) లోకాలను అన్నిటినీ పావనం చేయండి.

ఈ విధంగా, నిర్దుష్టమైన సన్మార్గాన్ని దర్శింపజేస్తూ లోకంలో అంతా సంచరించి, మీ స్పర్శ, కటాక్షం మొదలైనవానితో సంబంధాన్ని పొందిన పదార్థాలను అన్నిటినీ పవిత్రం చేయండి - అని భావం. ఆవిధంగా కాకుండా, మీ పొట్టను పెద్ద ఊరు చేసికొని, కనబడిన వాటితో నింపుకొంటూ, తెలిసి తెలియకచేసే పనులతో ఇంకా ఇంకా మీ పాపాలను పెంచుకొంటూ ఉంటే, మీకు, వారికి (మీ సంబంధం ఉన్నవారికి) అనర్థాలనే పెంచుకొంటారు అంతే. ఎనిమిది దిక్కులలో వ్యాపించేటట్లు వృద్ధిచెందిన నాల్గు దిక్కులను కల త్రివిక్రముని నామాలను ఫలాభిసంధిరహితంగా అనుసంధిస్తూ సంచరిస్తే మీ పాపాలను, ఇతరులను పాపాలను తీర్చిన వారవుతారు- అనికూడా భావం.

అవ :- త్రివిక్రముడై అరణ్యాలను, మిట్టలను, పూవుకంటే సుకుమారం అయిన తన శ్రీపాదాలతో కొలిచి స్వామి పొందిన శ్రమ గతపాశురంలో స్మరణకు రాగానే, వెంటనే ఈ పాశురంలో మిగిలిన అవతారాలలో భక్తులకోసం స్వామి పడిన పాట్లను తలచి నొచ్చుకొంటున్నారు- అని అనవచ్చు. లేక, "పణ్డి ప్పెరుమ్ పదియై యాక్కి ప్పళ్లి పావమ్ కొణ్డు" (14 వ పాశురం) అనే రీతిలో జీవించే హీనులైన ఈ సంసారుల కోసం అతడు శ్రీరాముడుగా, శ్రీకృష్ణుడుగా అవతరించి, పరత్వం అతిశయించిన తన తిరుమేనితో పడిన పాట్లను తలచి నొచ్చుకొంటున్నారు- అని కూడా అనవచ్చు.

**15.** **తిరిన్దతు వెఞ్జమత్తు త్తేర్ కడవి అన్ఱు**
**పిరిన్దతు శీతైయై మాన్పిన్ పోయ్- పురిన్దతువుమ్**
**కణ్ పళ్ళికొళ్ళ అళ్గియతే నాకత్తిన్**
**తణ్ పళ్ళికొళ్వానుక్కు**

వెమ్ శమత్తు = (శ్రీకృష్ణుడై అవతరించినపుడు జరిగిన) భయంకరమైన భారతయుద్ధంలో, తేర్ కడవి = (పార్థసారథియై) రథాన్ని నడపి, తిరిన్దతుమ్= పరిభ్రమించడం, అన్ఱు = శ్రీరాముడుగా అవతరించినపుడు, మాన్ పిన్ పోయ్= మారీచుడనే మాయామృగం వెంట పోయి, శీతైయై పిరిన్దదుమ్ = సీతాదేవిని విశ్లేషించి, బాధపడడం, కణ్ =భూమిపై, పళ్ళికొళ్ళ = పరుండడంకోసం, పురిన్దదుమ్ = కోరడం- అనే ఈ లీలలు అన్నీ, నాకత్తిన్ తణ్ పళ్ళికొళ్వాన్ తనక్కు = ఆదిశేషుడనే చల్లని పడుకపై పరుండి ఉండే భగవానునకు, అళ్గియదే = తగినవా! (కావు).

లక్ష్మీదేవి, తాను కలసి చల్లని తిరుమేనిని కల ఆదిశేషునిపై పరుండి ఉండేవానికి ఒక మాయామృగం వెంట పోయి, లక్ష్మిని విశ్లేషించిన కార్యం తగినదా? ఎంతో సౌకుమార్యాన్ని కల తిరుమేనికి, ఈ లీలకు ఏమి పొందిక ఉన్నది? "పణ్డి ప్పెరుమ్ పదియై యాక్కి ప్పళ్లి పావమ్ కొణ్డు" అనే రీతిలో జీవించే కుక్షింభరులను తరింపజేయడం కోసమా? ఈ లీలను చేసినది? అని భావం.



అవ :- ఈ రీతిలో మనలను పొందడంకోసం భగవానుడు స్వయంగా అవతరించి సాక్షాత్తుగా తానే కార్యాన్ని చేస్తూ ఉండగా, అతడు మన విషయంలో అత్యంతప్రావణ్యాన్ని కలవాడై మనలను అనుగ్రహిస్తూ ఉండగా, ఆ ప్రయత్నాన్ని అడ్డుపెట్టకుండా, మనం జ్ఞానం కలవారమై ఉన్నదానికి తగినట్లుగా, "భగవానుని పొందాలి'' అనే రుచిని కలవారమై ఉండడం తప్ప, "మన ప్రయోజనసిద్ధికోసం మనం ప్రయత్నించాలి''- అనే విషయం ఒకటి ఉన్నదా! లేదు కదా - అని ఇందులో అంటున్నారు. పరగతస్వీకారవైభవాన్ని తెలిపే పాశురం ఇది.

**16.** **తనక్కడిమై పట్టతు తానఱియానేలుమ్**
**మనత్తడైయ వైప్పతామ్ మాలై- వనత్తిడరై**
**ఏరియామ్ వణ్ణమ్ ఇయఱ్ఱు మితువల్లాల్**
**మారి యార్ పెయ్కిఱ్పార్ మఱ్ఱు**

తనక్కు = చేతనుడైన తనకు, అడిమై =శేషత్వమనేది, పట్టదు= పొసగి ఉన్నది అనే విషయాన్ని, తాన్ అఱియాన్ ఏలుమ్ = తాను తెలిసికోలేనివాడై ఉన్నా, (భగవానుడే స్వయంగా), మనత్తు = మనస్సులోకి, అడైయ = వచ్చి చేరగానే, మాలై= ఆ స్వామిని, వైప్పదు = అవకాశం ఇచ్చి నిలుపుకోవడం అనేది, ఆమ్ = యుక్తం, (ఇతనికి ఇంత మాత్రం రుచి అయినా కల్గితే విరోధులను పోగొట్టి, తనను తానే స్వామి అనుగ్రహిస్తాడు. అది ఏవిధంగా? అని అంటే), వనమ్ తిడరై = అడవిగా మాఱిన మెట్టప్రాంతాన్ని, ఏరి ఆమ్ వణ్ణమ్ ఇయఱ్ఱుమ్ ఇదు అల్లాల్ = కురిసే వర్షపు నీరు ఆవలివైపుకు పోకుండా అడ్డుకొని, లోపలకు వచ్చి చేరేటట్లుగా చెఱువు తవ్వడం తప్ప, మఱ్ఱు = మఱి ఇంకా, మారి = వర్షాన్ని, పెయ్కిఱ్పార్ = కురిసేటట్లుగా చేయగల్గినవారు, యార్ = ఎవరున్నారు? (వర్షం కురవడం అన్నది భగవత్సంకల్పంవల్లనే కదా సంభవిస్తుంది !)

మానవులను ప్రేరేపించి, అరణ్యంలో ఉండే మిట్టను తవ్వించేవాడు, ఆ తరువాత ఇంద్రుడు, వరుణుడు మొదలైనవారిని ప్రేరేపించి వర్షం కురిసే

టట్లుచేసేవాడు సర్వేశ్వరుడు తప్ప వేఱెవరు? బయటకు మాత్రం కొందఱు మానవులు చెఱువు తవ్వినట్లు, ఇంద్రుడు మొదలైనవారు వర్షాన్ని కురిపించినట్లు తోచినా, వీరిని అందఱినీ ప్రేరణ చేసి చెఱువును తవ్వించడం, వర్షాన్ని కురిపించడం మొదలైన వానిని చేసేవాడు సర్వేశ్వరుడే కదా! ఇదే రీతిలో, ఈ జీవుడు తనకు హితంలో రుచిని కల్గించుకొంటున్నట్లు, ఆ పరమచేతనుడు కరుణను కురిపించినట్లు పైకి తోచినా, ఈ చేతనుని మనస్సులోని మిట్టవంటి అవిద్యను, కర్మ, వాసనలనే ముళ్ళపొదలను తొలగించి, రుచి అనే విత్తును విత్తి, అది పెరగడంకోసం తన కల్యాణగుణాలనే వర్షాన్ని కురిపించేవాడు ఆ పరమపురుషుడే- అని తాత్పర్యం. ఇది కూరేశుల నిర్వాహం. **"విత్తుమ్ ఇడ వేణ్డుఙ్కాలో విడై యడర్త్త పత్తియు*ళ్ళు*వన్ ప*ళ్ళ*మ్ పునత్తు"** అని (నాన్ముకన్-23) అని తిరుమ*ళ్ళి*శై ఆ*ళ్ళ్వా*ర్లు అన్నారుకదా!

అన్నీ భగవదధీనాలైతే, ఇతడు (జీవుడు) చేయవలసినది ఏదీ లేదా ?- అని అంటే, ఇతడు చైతన్యాన్ని కలవాడైనందులకు తగినట్లుగా అప్రతిషేధాన్ని, రుచిని కలవాడుగా ఉండవలసినదే. అనాదికాలంగా తానున్న స్థితిని, ఎన్నో జన్మలను పొందుతూ పడిన పడరాని పాట్లను చూస్తే, ఈ అప్రతిషేధం, రుచికూడా ఆ భగవానునివల్లనే కలిగాయి- అని భావించాలి అని భావం. అందువల్లనే తిరుమలైనంబి నిర్వాహానికి, కూరేశుల నిర్వాహానికి అన్వయభేదమే తప్ప విరోధం లేదు.

ఇక తిరుమలైనంబి నిర్వాహం ఏమంటే- వర్షాన్ని కురపించి చెఱువు నీరు నిండేటట్లుగా చేయడం మానవులకు సాధ్యమా? వర్షానికి అధిదేవత అయిన వరుణునియొక్క, అతనికి అంతర్యామి అయిన భగవానునియొక్క సంకల్పంవల్ల తప్ప, చెఱువువల్ల ప్రయోజనం సిద్ధిస్తుందా? చెఱువు తనకు తానే వర్షాన్ని కురిపించగల్గినపుడు కదా, ఈ చేతనుడు తానే భగవత్ప్రాప్తిని కల్గించుకోగలడు. అరణ్యంలోని మిట్టను చెఱువుగా తవ్వి మార్చేటట్లే, ఇతడు (జీవుడు) తనకు రుచితో సంస్కరించుకోవచ్చునే తప్ప, ఫలాన్ని పొందేటట్లుగా చేయడం ఇతనివల్ల అవుతుందా ? కాదని భావం. ఇందువల్ల, ఈ చేతనుని దగ్గర ఉండేది ఏదయినా, అది అధికారి విశేషణం అవుతుందే తప్ప, అతనిని



పొందడానికి సాధనం కాబోదు- అని, అతడే అతనిని పొందడానికి ఉపాయం అవుతున్నాడని తెలియడమే జ్ఞానులకు తగినది- అని తెలుపబడింది. చేతనుని దగ్గర ఉండే రుచిని మాత్రం ఆధారంగా చేసికొని భగవానుడు తనను అనుగ్రహిస్తాడని -ఈ నిర్వాహంలోని సారం.

శాస్త్రాలలో ఉపాయాంతరాలకు ఫలకరణత్వం ఉన్నదని చెప్పబడుతూ ఉండగా, ఈ విధంగా జీవుడు ఆచరించవలసినదేదీ లేదని నిషేధించడం తగునా?- అని అంటే, పరమపురుషుని ఉపాయంగా కల్గిన ప్రపన్నుని అనుసంధానప్రకారాన్ని ఈ పాశురం తెలుపుతున్నది కనుక, తప్పు లేదు. ఉపాయాంతరనిష్ఠులు భక్తిమొదలైన ఉపాయాంతరాలలో ఉపాయత్వబుద్ధిని కల్గి ఉండడంచేత, సర్వేశ్వరుడుకూడా వాటికి ఫలకరణత్వాన్ని అంగీకరించి, తాను ఫలప్రదుడుగా మాత్రమే ఉంటాడు. అందువల్ల, వాటికి ఉండే ఫలకరణత్వం ఔపాధికం. ఇక, ప్రపన్నుల విషయంలో అయితే, సర్వేశ్వరుని ఫలకరణత్వం నిరుపాధికం. అందువల్లనే భట్టర్ **"ఉపాయోపేయత్వే తదిహ తత్వమ్"** అని అన్నారు. అంతేకాక, మోక్షఫలగౌరవాన్ని తలచినపుడు, భక్తి మొదలైనవి కేవలం వ్యాజాలు- అని, చెప్పేటట్లుంటుంది. కనుకనే, ప్రపన్నుడైన ముముక్షువు విషయంలో- ఈ చేతనుడు చేయవలసిన కర్తవ్యం ఏదీ లేదని, అన్నీ అతనివల్లనే అని అనుసంధించడం ఏ రీతిలో అయినా యుక్తమే -అని భావం.

అవ :- "ఈ విధంగా నిరపేక్షోపాయంగా ఉండే భగవానుడు తప్ప ఆశ్రయణీయులు ఇంక ఎవరున్నారు'' - అని ఇందులో అంటున్నారు.

**17. మఱ్ఱారియలావార్ వానవర్కోన్ మామలరోన్**
**శుఱ్ఱుమ్ వణఙ్గుమ్ తొ*ళ్ళి*లానై -ఒఱ్ఱై**
**ప్పిఱై యిరున్ద శఞ్జడైయాన్ పిన్ శెన్ఱు మాఱై**
**క్కుఱై యిరన్దు తాన్ ముడిత్తాన్ కొణ్డు**

వానవర్ కోన్ = దేవతలకు ప్రభువైన ఇంద్రుడు, మా మలరోన్ = (భగవానుని) గొప్ప తిరునాభీకమలాన్ని వాసస్థానంగా కల బ్రహ్మ, శుఱ్ఱుమ్

వణఙ్గుమ్ తొ*ళ్ళి*లానై= పార్శ్వభాగాలలో చుట్టుకొని ఉండి, ఆశ్రయించడానికి తగిన సౌలభ్యసౌందర్యాది గుణాలను, తత్ప్రయుక్తాలైన చేష్టలను కలవాడైన, మాలై = భగవానుని, కొణ్డు = మనస్సులో నిలుపుకొని, ఒ*న్ఱై* పిఱై ఇరున్ద శెమ్ శడైయాన్ = ఒక కళమాత్రం మిగిలి ఉండే చంద్రవంకను ధరించిన, ఎఱ్ఱని జటలను కల రుద్రుడు, పిన్ శెన్ఱు = వెంబడించి నిలచి, ఇరన్దు = ప్రార్థించగా, కుఱై = (బ్రహ్మహత్యాదోషం అనే) అతని కొఱతను, తాన్ ముడిత్తాన్ = తాను తీర్చాడు, (కనుక), ఇయల్ ఆవార్ = ఆశ్రయించేటట్లుగా యోగ్యతను కలవారు, మ*న్ఱు* ఆర్ = ఆ సర్వేశ్వరుడు తప్ప వేఱు ఎవరున్నారు? (ఎవరూ లేరు)

అవ :- ఈ రీతిలో భగవానుడు, బ్రహ్మరుద్రాదులకుకూడా ఆశ్రయణీయుడై, వారికికూడా ఈశ్వరుడై ఉన్నా, రూపాన్ని మార్చుకొని, తక్కువ చేసికొని అయినా, దాసులను రక్షించే స్వభావాన్ని కలవాడై ఉన్నాడు- అని ఇందులో అంటున్నారు.

**18.** **కొణ్డతులకమ్ కుఱళురువాయ్ క్కోళరియాయ్**
**ఒణ్ తిఱలోన్ మార్వత్తుకిర్ వైత్తతు- ఉణ్డతువుమ్**
**తాన్ కడన్ద వే*ళ్ళు*లకే తామరైక్కణ్ మాలొరునాళ్**
**వాన్ కడన్దాన్ శెయ్ద వ*ళ్ళు*క్కు**

కుఱళ్ ఉరు ఆయ్ = వామన రూపియై (మహాబలి దగ్గరకు పోయి యాచించి), ఉలకమ్ = భూమి మొదలైన లోకాలను, కొణ్డదు = ఆక్రమించడం, కోళ్ అరి ఆయ్= గొప్ప బలాన్ని కల నరసింహమూర్తియై, ఒణ్ తిఱలోన్ మార్వత్తు = మహాబలశాలి అయిన హిరణ్యకశిపుని వక్షస్థలంలో, ఉకిర్ వైత్తదు= తన గోళ్ళను గుచ్చి చీల్చి చంపడం, ఒరు నాళ్ = ఒకానొక కాలంలో, తాన్ కడన్ద = తాను కొలిచిన, ఏ*ళ్* ఉలకే = అన్ని (ఏడు) లోకాలను, ఉణ్డదువుమ్= (ప్రళయం మింగకుండా), తన కడుపులో పెట్టుకోవడం- (అనే ఈ లీలలు), వాన్ కడన్దాన్ = విస్తృతమైన ఆకాశాన్ని పరిచ్ఛేదించినా, ఇదమిత్థంగా లెక్కకట్టడానికి వీలు లేని రీతిలో ఉండే గొప్పతనాన్ని కలవాడు, తామరై కణ్= ఎఱ్ఱ తామరలవంటి కన్నులను కలవాడైన, మాల్ =ఆశ్రిత వ్యామోహాన్ని కల స్వామి, శెయ్ద=చేసిన, వ*ళ్ళు*క్కు = న్యాయమైన, సహజమైన లీలలు.



"నా సొత్తును నేనే, నన్ను తక్కువచేసికొని అయినా, రక్షించడం నాకు కర్తవ్యం కదా!" అనే భావనతో సర్వరక్షకుడైన భగవానుడు చేసిన లీలలు ఇవి. ఇవి అన్నీ భక్తులకు చెందిన కార్యాలే అయినా, "వారి కార్యాలు కదా ఇవి!" అని ఉపేక్షించకుండా, తన కార్యాన్ని చేస్తున్నట్లుగానే చేసి భగవానుడు ఆనందిస్తాడని భావం. **"అభిషిచ్య చ లంకాయాం రాక్షసేంద్రం విభీషణమ్, కృతకృత్య స్తదా రామో విజ్వరః ప్రముమోద"** అని కదా వాల్మీకి వాక్కు. తన సొత్తును రక్షించడం స్వామికార్యం కదా!

అవ :- "నా స్వరూపం మాఱినా నా సొత్తును రక్షించడం నా బాధ్యత"- అని సర్వేశ్వరుడు అనుకొంటాడనే విషయం గత పాశురంలో ప్రస్తుతం కాగానే, ఆ*ళ్వా*ర్లు అతని తిరుమేనియొక్క గొప్పతనాన్ని స్మరించి, "నీ జగద్రక్షణలీలలు నీ ఈ రూపానికి తగినవా స్వామీ! చెప్పు" అని అంటూ కడుపును మోదుకొంటున్నారు. (బాధపడుతున్నారు)

**19.** **వ*ళ్ళు*క్కన్ఱు కణ్డాయ్! వలిశకడమ్ శె*ఱ్ఱ*రాయ్**
**వ*ళ్ళు*క్కెన్ఱు నీ మతిక్కవేణ్డా- కు*ళ్ళు*క్కన్ఱు**
**తీ విళవిన్ కాయ్క్కెఱిన్ద తీమై తిరుమాలే!**
**పార్ విళఙ్గ చ్చెయ్తాయ్ ప*ళి***

తిరు మాలే = శ్రియఃపతీ, నీ = శ్రీకృష్ణుడవై అవతరించినపుడు, నీవు, వలి శకడమ్ = బలిష్ఠమైన శకటాన్ని, శె*ఱ్ఱ*రాయ్ = తన్ని, విఱిచి, కూలదోశావు, వ*ళ్ళు*క్కు అన్ఱు కణ్డాయ్ = ఇది నీకు తగినది కాదు సుమా!, వ*ళ్ళు*క్కు ఎన్ఱు నీ మదిక్క వేణ్డా = "ఇది నాకు తగినదే" అని నీవు భావించకు, ఈ సాహస కార్యాన్ని చేయడమేకాకుండా, కు*ళ్ళు* కన్ఱు = అసురావిష్టమైన లేగదూడను, తీ విళవిన్ కాయ్క్కు ఎఱిన్ద = అసురావేశాన్ని కల్గి ఉన్నందున చెడ్డదైన వెలగకాయను రూపుమాపడంకోసం విసరిన, తీమై = ఈ తగని కార్యాన్ని, పార్ ఇళఙ్గ = భూమిలో ప్రకాశించేటట్లుగా, ప*ళి* శెయ్దాయ్ = తప్పు చేశావు.

భగవానుడు ఎన్నో లీలలు పలు అవతారాలలో చేసినా, వాటిని ప్రస్తుతించ కుండా, ఇక్కడ శకటాసురనిరసన, కపిత్థాసుర భంజనం-అనే ఈ రెండు లీలలను ఎత్తి, అస్థానే భయశంకను ప్రదర్శించడం ఎందుకు? అని అంటే, శ్రీకృష్ణావ తారంలో తల్లితండ్రులు సాధువులు. గొల్లలు, ఊరు రేపల్లె, శత్రువులను చూస్తే కంసాదులు, అన్నీ ఒక క్షణం దూరం అయితే, తాను పాము (కాళియుని) నోట్లో పడడంవంటి ప్రమాదకరచేష్టలను చేసేవాడు కృష్ణుడు. పూతనాదుల వల్ల కల్గిన ఆపదలకు అంతే లేదు. శ్రీకృష్ణావతారంలో మంగళాశాసనం చేసేవారే లేరు. - అనే ఈ హేతువులనుబట్టి ఆళ్వార్లు శ్రీకృష్ణావతారంలోనే ఎక్కువగా మంగళాశాసనాన్ని చేయడంలో నిమగ్నులై ఉంటారని భట్టర్‌సూక్తి)

అవ :- పరమపురుషుని పూర్ణంగా ఆశ్రయించినవారు, అతనిని ఆశ్రయించడం ప్రారంభించినవారు - అనే ఏ భేదం లేకుండా అందఱు ఉజ్జీవనాన్ని ఆస్వామివల్ల పొందుతారు - అని అంటున్నారు.

**20. పళ్గి పావమ్ కైయకత్తి ప్పల్ కాలుమ్ నిన్నై**
**వళ్గి వాళ్గ్‌వార్ వాళ్గ్‌వరామ్ మాతో- వళ్గువిన్ఱి**
**నారణన్దన్ నామజ్గళ్ నన్గుణర్న్దు నన్గేత్తుమ్**
**కారణజ్గళ్ తాముడైయార్ తామ్**

పళ్గి = అపకీర్తిని, పావమ్ = తెలిసి చేసే పాపకృత్యాలను, కై అకత్తి = పోగొట్టే, పల్ కాలుమ్ = సదా, నిన్నై = నిన్ను, వళ్గి తొళ్గువార్ = శాస్త్రవిధిలో ఆశ్రయించేవారు కూడా, నారణన్‌తన్ = శ్రీమన్నారాయణుడవైన నీయొక్క, నామజ్గళ్= తిరునామాలు, నన్గు ఉణర్న్దు = చక్కగా గ్రహించి, వళ్గు ఇన్ఱి = దోషాలు ఏమీ లేకుండా ఉండేటట్లు, నన్గు ఏత్తుమ్ కారణజ్గళ్ తామ్ ఉడైయార్‌తామ్ = అందంగా స్తుతించడానికి తగిన కారణపరంపరలను కలవారు- అనే ఈ రెండు విధాలైన అధికారులు, వాళ్గ్‌వరామ్ = నిన్ను యాచించి, ఉజ్జీవిస్తారు. మాతో = ఇదేమి ఆశ్చర్యం!



నారాయణుడవనే చాలా గొప్ప పేరును కలవాడవు కనుక, సర్వరక్షకుడవైన నీ వేయి నామాలను నిరంతరం ప్రేమతో అర్థానుసంధానపురస్సరంగా చక్కగా తెలిసికొని, భక్తిప్రకర్షను కలవాడై, అందంగా స్తుతించడానికి కారణం అయిన భక్తి, దానికి కారణం అయిన నిన్నుగూర్చి అధికంగా భజనం చేయడం, దానికి కారణం అయిన రుచి, దానికి కారణం అయిన పుణ్యం, దానికి కారణం అయిన నీ జాయమాన కటాక్షం - అని ఈ రీతిలో చెప్పబడే కారణపరం పరలను పొందినవారుకూడా ముందు తెలుపబడ్డ అధికారులవలె ఉజ్జీవనాన్ని తప్పక పొందుతారు. నిన్ను పరిపూర్ణంగా ఆశ్రయించ గలవారు తరించడం నిశ్చయం అయినట్లే, నిన్ను ఆశ్రయించడానికి తగిన కారణ పరంపరలను కలవారు కూడా ఉజ్జీవించడం అనేది నిశ్చయంగా ఉండడం ఎంతో ఆశ్చర్యం కదా! అని అంటున్నారు. ఆశ్రయించడానికి తగిన రుచి- మొదలైన కారణ పరంపరలను కలవారికి కూడా, ఆ కారణపరంపరలను భక్తిలోకిగాని, ప్రపత్తిలోకి గాని అంతర్భవింపజేసి, ఫలాన్ని పొందింపజేయడం నిశ్చయం కనుక, పరిపూర్ణంగా ఆశ్రయించివలెనే వీరు కూడా ఫలాన్ని పొందడం నిశ్చయమని తాత్పర్యం. **“నేహాభిక్రమనాశోऽస్తి”** అని కదా గీతాసూక్తి. **“కారణజ్గళ్”** అనే పదం కారణ పరంపరలను తెల్పుతున్నది. **“తారణజ్గళ్ తాముడైయార్‌తామ్”** అనే ప్రాసకు అనుగుణంగా గ్రహిస్తే, అపుడు **“తారణమ్”** అనేది సంస్కృతపదం. ధృతి అనబడే మనఃస్థైర్యం కలవారు భగవానుని పొందడం నిశ్చయం - అని దీని భావం. **“నాయ మాత్మా బలహీనేన లభ్యః”** అనే శ్రుతి వ్యతిరేకముఖంగా పల్కిన అర్థాన్నే ఇక్కడ ఆళ్వార్లు **“తారణజ్గళ్ తాముడైయార్ తామ్”** అని అంటూ అనుకూలక్రమంలో తెలిపారు.

అవ :- భగవద్విషయంలో మొట్టమొదటి అడుగును పెట్టినవారు సైతం ఉజ్జీవనాన్ని పొందే ఆశ్చర్యాన్ని గత పాశురంలో అనుగ్రహించారు. సర్వేశ్వరుని పట్ల భక్తిని కల్గి ఉండడానికి ఆవశ్యకం అయిన సాధనాలు అన్నీ నిండి ఉన్నా, సంసారులు బలవంతంగా చెడ్డదారులన్నిటిలో పయనించి, సంసారంలో పడే మహాశ్చర్యాన్ని చూచి ఆళ్వార్లు ఈ పాశురంలో విస్మితులవుతున్నారు, ముదల్ తిరువన్దాదిలోని **“నా వాయిల్ ఉణ్డే”** అనే పాశురాన్ని అనుసరిస్తున్నది ఈ పాశురం.

**21. తాముళరే తమ్ముళ్ళ ముళ్ళుళతే తామరైయిన్**
**పూవుళతే యేత్తుమ్ పొ*ழு*తుణ్డే- వామన్**
**తిరుమరువు తాళ్మరువు శెన్నియరే శెవ్వే**
**అరు నరకమ్ శేర్వదరిదు**

తామ్ ఉళరే = (భగవానుని సేవించడానికి తగిన దేహేంద్రియాలను కల) చేతనులు తాము ఉండనే ఉన్నారుకదా!, తమ్ ఉళ్ళమ్ ఉళ్ ఉళదే = భగవానుని చింతించడంకోసం తమ మనస్సుకూడా (బయటకు పోయి వెదకవలసిన అవసరం లేకుండా) తమలోనే ఉన్నదికదా!, తామరైయిన్ పూ ఉళదే = (భగవానుని శ్రీచరణాలో సమర్పించదగిన) తామరపూలు జలాశయాలు అన్నిటిలోను నిండుగా ఉన్నాయికదా!, ఏత్తుమ్ పొ*ழு*దు ఉణ్డే = అతనిని నోటు తెఱచి స్తుతించడానికి తగిన ఆయుఃకాలం పూర్ణంగా ఉన్నదికదా!, వామన్ = అందఱి తలలపై పాదాన్ని పెట్టిన, వామనమూర్తి అయిన సర్వేశ్వరుని, తిరు మరువు తాళ్ = అందమైన శ్రీపాదాలను, మరువు = సేవించడానికి యోగ్యమైన, శెన్నియరే = తలలను కలవార్రై ఉన్నారు కదా! (అయినా, ఏ కొఱత లేకపోయినా, ఈలోకంలోనివారు), శెవ్వే = నేరుగా, అరు నరకమ్ = క్రూర నరకాన్ని, శేర్ వదు= చేరడమన్నది, అరిదు = అరుదైన కార్యంగా తోస్తున్నది.

ఈవిధంగా భగవానుని పొందడానికి ఆవశ్యకాలైన ఉపకరణాలు కొఱత లేకుండా ఉన్నా, క్రూరనరకం అయిన సంసారంలో నేరుగా పడి చేతనులు అలమటించడం ఎంత ఆశ్చర్యం! అని అంటున్నారు. దారి కాని దారిలో ప్రవర్తించినందువల్లనే ఈ సంసారులు ఇంకా ఈ క్రూరనరకంలో పడిమునిగి ఉన్నారు. ఏవిధంగా ఎప్పటికి దీని దరిచేరతారో కదా! అని విస్మితులవుతున్నారు. **"నారాయణేతి శబ్దోఽస్తి వాగస్తి వశవర్తినీ, తథాఽపి నరకే ఘోరే పతంతీతి కిమద్భుతమ్"** అనే సూక్త్యర్థం ప్రకృతంలో భావ్యం.

అవ :- ఇందులో, తమకు భగవానుని పొందడానికి తగిన ఉపకరణాలు ఏమీ లేకపోయినా, అతని సన్నిధిలో తమ రక్షణభారాన్ని సమర్పించి, శరణు పొందినవారికి అతనిని ఆశ్రయించడంతోపాటు, అతనిని పొందడంతోపాటు



తేడా లేకుండా అంతా సులభంగా ఉంటుంది- అనే విషయాన్ని దృష్టాంత పూర్వకంగా చూపి, వివరించి, ఆ స్వామి సౌలభ్యగుణ వైభవాన్ని అనుగ్రహిస్తున్నారు. ప్రపత్తిపరమైన నిర్వాహం, భక్తిపరమైన నిర్వాహం- అనే రెండు నిర్వాహాలను (వివరణాలను) పూర్వాచార్యులు ఈ పాశురానికి అనుగ్రహించారు. ఈ క్రింది వివరణం ప్రపత్తిపరమైన నిర్వాహం.

**22. అరియ తెళితాకుమ్ ఆ*ర్రా*లాల్ మా*ర్రి***
**పెరుక ముయల్వార్రై ప్పె*ర్రా*ల్- కరియతోర్**
**వెణ్కోట్టు మాల్యానై వెన్ది ముడిత్తన్దే**
**తణ్ కోట్టు మామలరాల్ తా*ழ்*న్దు**

ఆ*ర్ర*లాల్ = తనశక్తితో, మా*ర్రి* = (చేతనుడు చేసే ప్రయత్నం-అనే) ఆటంకాన్ని తొలగించి చేతనునకు హితం అయిన సకలకార్యాలను తానే చేసే టట్లుగా సకలభారాన్ని తానే వహించి, పెరుక ముయల్వార్రై = గొప్ప ప్రయత్నం చేసే మహానుభావుడైన భగవానుని, పె*ర్రా*ల్ = పొందగల్గితే, అరియదు = పొందడానికి అరుదైన మోక్షం, ఎళిదు ఆకుమ్ = సులభం అవుతుంది. (ఈ విషయాన్ని ఎక్కడ చూచాము? అని అంటే), వెణ్ కోడు = తెల్లని వర్ణాన్ని కల దంతాలను కల్గిన, మాల్ = పెద్ద, కరియదు ఓర్ యానై = నల్లని వర్ణాన్ని కల, సాటి లేని ఏనుగు అయిన గజేంద్రుడు, వెన్ది ముడిత్తు = మొసలిని జయించి, వధించి, తణ్ = చల్లని, కోడు = సరస్సుతీరంలో, మా = గొప్ప, మలరాల్= తామరపూవులతో, తా*ழ்*న్దు అన్దే = భగవానుని నమస్కరించి, కైంకర్యం చేయగల్గిందికదా!

**"పరమాపద మాపన్నో మనసాఽ చింతయద్ధరిమ్, స తు నాగవరః శ్రీమాన్ నారాయణపరాయణః"** అనే రీతిలో అతనినే ఉపాయంగా నమ్మినందువల్ల అరుదైన ఇష్టప్రాప్తిని, అనిష్టనివృత్తిని పొందిన గజేంద్రునివలె, భగవానునే ఉపాయంగా కల్గి ఉంటే అరుదైన ఫలం అయిన భగవత్ప్రాప్తి సులభం కాగలదని చెప్పినట్లయింది. ఇది ప్రపత్తిపరమైన నిర్వాహం. ఇక భక్తిపరమైన నిర్వాహం ఏమంటే-

జన్మాంతరంలో భగవద్భక్తుడైన ఒక రాజు శాపవశంచేత గజేంద్రునిగా పుట్టి, పూర్వజన్మస్మృతిని కల్గి ఉన్నందువల్ల భగవానునే నిత్యం స్మరిస్తూ పుష్పాలతో ఆరాధించేవాడని, ఆవిధంగా ఒకనాడు దైవారాధన కోసం పూలను కోయడానికై సరస్సులోకి వెళ్ళినపుడు అతని కాలును మొసలి పట్టుకోగా, ఆ భగవత్సేవలో కల్గిన ఆ ఆటంకాన్ని భగవానుని శరణు వేడి పోగొట్టుకొని, స్వామి శ్రీపాదాలలో పూలను సమర్పించి, తన భక్తియోగాన్ని పూర్తి చేసికొని, మోక్షాన్ని పొందాడనే వృత్తాంతాన్ని బట్టి తదనుగుణంగాను, **"తాழ్న్దు వెన్టి ముడిత్తన్డే"** అనే శబ్దస్వారస్యానుగుణంగాను భక్తిపరంగా ఈపాశురం వివరింపబడింది. నల్లని రూపాన్ని, తెల్లని దంతాలను కల గొప్ప గజేంద్రుడు పెద్ద పెద్ద పూలను తీసికొని, చిరకాలం భగవానుని సేవించి, నమస్కరించినందువల్లకదా తన కార్యాన్ని సఫలం చేసికొన్నాడు. చిరకాలం భగవానుని సేవించినదానికి ఫలంగానే భగవానుని శరణు పొంది, మొసలివల్ల కల్గిన ఆటంకాన్ని తీర్చుకొని, తనభక్తి యొక్క సిద్ధిని పొందాడు - అని భావం. మొదటి (ప్రపత్తి) నిర్వాహంలో- శరణాగతివల్లనే భగవత్ప్రాప్తి విరోధి అయిన మొసలి నశింపజేసికొని భగవానుని పొందాడు - అని తాత్పర్యం.

ఈ రెండు నిర్వాహాలలో, చిరకాలం గజేంద్రుడు అనుష్ఠిస్తూ వచ్చిన భగవద్భక్తి అనే ప్రయత్నమే అతనిని శరణాగతిలో అన్వయింపజేసి, మధ్యలో కల్గిన అంతరాయాన్ని తీర్చి, భక్తియోగాన్ని పూర్తిచేసి, భగవత్ప్రాప్తిని కల్గించింది- అని భావం. మొదటి నిర్వాహంలో స్వతంత్రప్రపత్తి (అంగిప్రపత్తి) వల్లనే ఇష్టప్రాప్తి- అనిష్టనివృత్తులు కలిగాయని, రెండవ నిర్వాహంలో అంగప్రపత్తివల్ల మొసలిద్వారా ఏర్పడ్డ ఆటంకాన్ని తీర్చుకొని, భక్తియోగానుష్ఠానాన్ని పూర్తి చేసికొని భగవత్ప్రాప్తిని గజేంద్రుడు పొందాడని తెలుపబడింది. ఈ రెండు వివరణలలో, **"పిడి శేర్ కళిరళిత్త పేరాళా!" (97)** అని అంటూ సరోయోగి తమ ప్రబంధంలో గజేంద్రుడు భక్త్యంగం అయిన వైరాగ్యాన్ని లేనివాడై ఉన్నాడని వచించినందువల్ల, తదనుగుణంగా పూర్వాచార్యులు మొదటి నిర్వాహాన్నే, అంటే -ప్రపత్తి పరమైన నిర్వాహాన్నే ఆదరించారు.



అవ :- తనను ఆశ్రయించేవారు ప్రపన్నులైనా, ఉపాయాంతరనిష్ఠులైనా, అనన్య ప్రయోజనులైనా, ప్రయోజనాంతరపరులైనా- భగవానుడు వారికి తానే సులభుడై, వారి విరోధులను పోగొట్టి, ఇష్టప్రాప్తిని కల్గించి, వారి మనోరథానికి తగినట్లు వారివారిని రక్షిస్తాడు- అని అంటున్నారు.

**23. తాழ్న్దు వరఙ్గొణ్డు తక్క వకైకళాల్**
**వాழ్న్దు కழிవారై వాழ్విక్కుమ్- తాழ్న్ద**
**విళఙ్గనిక్కు క్కన్టెఱిన్దు వేఱ్ఱురువాయ్ ఞాలమ్**
**అళన్దడిక్కీழ్ క్కొణ్డవవన్**

తాழ్న్దు = (పండ్ల బరువువల్ల గెలలు) కిందకు వంగి ఉండే, విళా = వెలగచెట్టుయొక్క, కనిక్కు = పండ్లను రాలగొట్టడంకోసం, కన్టు ఎఱిన్దు = లేగదూడను (విసరికొట్టే కర్రగా గ్రహించి) విసరి కొట్టినవాడు, వేఱు ఉరు ఆయ్= (దానం ఇచ్చి, ఇచ్చి పొడుగైన చేతిని కల తనకు) తగని, యాచకుడైన వామనరూపాన్ని పొందినవాడై, ఞాలమ్ = భూమిని, అళన్దు = కొలిచి, అడి కోళ్ =తన శ్రీచరణాల కింద, కొణ్డ = అడగి ఉండేటట్లు గ్రహించినవాడైన, అవన్ = ఆ స్వామి, తాழ్న్ద = తన శ్రీపాదాలలో నమస్కరించి, వరమ్ కొణ్డు= తన కృపను పొంది, తక్క వకైకళాల్ = (తమ తమ స్థితికి) తగిన విధంలో, వాழ్న్దు= ఐశ్వర్యాన్ని కాని, కైవల్యాన్ని కాని, భగవత్ప్రాప్తిని కాని పొంది, కழிవారై= ఇంకా ఇంకా సుఖాన్ని మిక్కిలిగా పొందాలని ఉండే ఆయా అధికారులను, వాழ்విక్కుమ్ = ఉజ్జీవింపచేస్తాడు.

తనదైన భూమిని తానే కొలిచి, తన శ్రీచరణాలకింద పెట్టుకొన్న ఆ సర్వేశ్వరుడు ఉజ్జీవింపచేస్తాడని అన్వయం.

అవ :- ఈ జీవునకు, ఇతడు అభిలషించిన ఫలాన్ని ఇచ్చి రక్షిస్తాడు- అన్నది గొప్ప కాదు. ఇతని సత్తకుకూడా కారణమై, మొదటినుండి అన్నిటినీ ఇతనికి చేసేవాడేకదా ఆ సర్వేశ్వరుడు- అని ఇందులో అంటున్నారు.

**24. అవన్ కణ్డాయ్ నన్నెఞ్జే! ఆరరుళుమ్ కేడుమ్**
**అవన్ కణ్డాయ్ ఐమ్బులనాయ్ నిన్టాన్- అవన్ కణ్డాయ్**

**కార్ఱ్రు త్తీనీర్వాన్ కరువరై మణ్- కారోత**
**చ్చీర్ఱ్రత్తీయావానుమ్ శెన్డు**

నల్ నెఞ్జే = ఓ మంచి మనసా!, ఆర్ అరుళుమ్ = భగవానుని పరిపూర్ణ కృపతో కలుగవలసిన మోక్షం!, కేడుమ్ = భగవానుని నిగ్రహంతో కలుగదగిన సంసారం, (అనే ఈ రెండింటికి నిర్వాహకుడు), అవన్ కణ్డాయ్ = ఆ భగవానుడే కాగలడు, ఐమ్బులన్ = పంచేంద్రియాలు, కార్ఱ్రు తీ నీర్ వాన్ మణ్ ఆయ్ నిన్డాన్ అవన్ కణ్డాయ్ = పంచభూతాలు మొదలైనవానితో ఏర్పడే శరీరమై ఉండేవాడుకూడా సర్వేశ్వరుడే, కరు వరై = నల్లని పర్వతాలు, (అతడే సుమా), శెన్డు = (ఈ ప్రపంచాన్ని లయం చేయాలనే భావన) ప్రసరించి, కార్ ఓదమ్ శీఱ్ఱమ్ తీ ఆవానుమ్ = నల్లని సముద్రాన్ని వేడితో ఇంకించగల బడబాముఖాగ్ని అయినవాడు, అవన్ కణ్డాయ్ = ఆ స్వామే సుమా!

ఈవిధంగా సత్త మొదలుకొని సంహారంవరకు అన్నీ అతనికి అధీనాలయినపుడు, అతడు తనను ఆశ్రయించినవారికి వారి కోరికలను తీర్చి, రక్షిస్తాడు - అన్నది ఏమీ ఆశ్చర్యం కాదని భావం.

అవ :- ఆత్మలకు అన్నిటికీ సమానంగా చేసే స్వామి రక్షణాలనుగూర్చి గత పాశురంలో చెప్పారు. తన దాసులపట్ల తనకుండే పక్షపాతంతో వారికి చేసే విశేష రక్షణాలనుగూర్చి ఈ పాశురంలో ఆళ్వార్లు అనుసంధిస్తున్నారు. ఉత్పత్తి మొదలైనవి అతని అధీనాలని గత పాశురంలో అన్నారు. ఉత్పత్తి అయినవానికి కలిగే విరోధులను పోగొట్టి రక్షించేవాడూ అతడే- అని ఇందులో అంటున్నారు - అనికూడా చెప్పవచ్చు.

**25. శెన్డతు ఇలఙ్గైమేల్ శెవ్వే తన్ శీఱ్ఱత్తాల్**
**కొన్డతిరావణనై క్కూఱుజ్గాల్- నిన్డతువుమ్**
**వేయోఙ్గు తణ్ శారల్ వేఙ్గడమే విణ్ణవర్తమ్**
**వాయోఙ్గు తొల్పుకழాన్ వన్దు**

విణ్ణవర్తమ్ వాయ్ = దేవతల నోటితో స్తుతించదగిన, ఓఙ్గు తొల్ పుకழాన్ = ఉన్నతమైన, ప్రాచీనమైన (సహజమైన) గుణాలను కల భగవానుడు,



శెవ్వే = నేరుగా, శెన్డదు = కోపించి పోయినది, ఇలఙ్గై మేల్ = లంకానగరంపైన, తన్ శీఱ్ఱత్తాల్ = తన కోపంతో, కొన్డదు = సంహరించినది, ఇరావణనై = రావణుని, కూఱుజ్గాల్ = చెప్పేటపుడు, వన్దు నిన్డతువుమ్ = (చేతనులు ఏకాలంలో అయినా ఉజ్జీవించాలని భావించి) వచ్చి నిలచినది, వేయ్ ఓఙ్గు తణ్ శారల్ వేఙ్గడమే = వెదుళ్ళు ఉన్నతంగా పెరిగిన, చల్లని నీటిధారలను కల శ్రీవేంకటాచలమే.

ఈ పాశురంలో శ్రీరామావతారప్రస్తావం ఉన్నందువల్ల "విణ్ణవర్ తమ్" అనే ప్రయోగం రావణవధానంతరం స్వామిని పొగడిన బ్రహ్మరుద్రాదులను తెలుపుతున్నదని కూడా చెప్పవచ్చు.

అవ :- గత పాశురంలో తిరుమలనుగూర్చిన ప్రస్తావం రావడంవల్ల ఆ పర్వతవిషయంలో అభినివిష్టులై, దాని మహిమనుగూర్చి ఇందులో ఆళ్వార్లు పల్కుతున్నారు.

**26. వన్దిత్తవనై వழி నిన్డ వైమ్బూతమ్**
**ఐన్దు మకత్తడక్కి యార్వమాయ్ -ఉన్ది**
**ప్పడియమరర్ వేలైయాన్ పణ్డమరర్ క్కీన్ద**
**పడి యమరర్ వాழுమ్పతి**

పడి అమరర్ = భూలోకసురులైన శ్రీవైష్ణవులు, వాழுమ్ = నిత్యవాసం చేసే, పది = దివ్యక్షేత్రం అయిన తిరుమల, వழி నిన్డ = (భగవానుని ఆశ్రయించడానికి అడ్డుగా) దారిలో ఆటంకంగా నిలచి ఉండే, ఐమ్బూదమ్ ఐన్దుమ్ = పంచభూతాలను, పంచేంద్రియాలను, అకత్తు అడక్కి = బయటకు పోకుండా నియత్రించి, అవనై = ఆ భగవానుని, వన్దిత్తు = నమస్కరించి, ఆర్వమ్ ఆయ్ = భక్తి మూర్తీభవించినవారై, ఉన్ది= ఒకరిని ఇంకొకరు తోసుకొంటూ పైనబడి, పడి = వచ్చి నమస్కరించే, అమరర్= దేవతలకోసం, వేలైయాన్ = పాలసముద్రంలో ఉండే భగవానుడు, పణ్డు అమరర్క్కు ఈన్ద= పూర్వం దేవతలైన నిత్యసూరులకోసం ఇచ్చిన, పది= స్థలం.

పరమపదంలో సౌలభ్యసౌశీల్య వాత్సల్యకారుణ్యాది కల్యాణ గుణాలను అనుభవించే అవకాశం లేనందువల్ల నిత్యసూరులు ఆ గుణాల అనుభవం విషయంలో కొఱత కల్గి ఉంటారు. కాని, ఈలోకంలో ఆ కొఱత తీరేటట్లుగా ఆ గుణాలు ఏరులై ప్రవహించే క్షేత్రం అయిన తిరుమలను వారికి బహుమానంగా భగవానుడను గ్రహిస్తున్నాడు. వారుకూడా దానిని అలభ్యలాభంగా పొంది ఆనందిస్తున్నారు- అని భావం. "మన్ది పాయ్ వడవేఙ్గడమామలై వానవర్ కళ్ శన్ది శెయ్య" అని తిరుప్పాణ్ ఆళ్వార్లు, "తణ్ణరువి వేఙ్గడమే వానోర్క్కుమ్ మణ్ణోర్క్కుమ్ వైప్పు" అని తిరుమழிశై ఆళ్వార్లు, "కణ్ణావాన్ ఎన్నుమ్ మణ్ణోర్ విణ్ణోర్క్కు" అని నమ్మాళ్వార్లు - ఈవిధంగా పలువురు ఆళ్వార్లు ఈ అర్థాన్ని అనుసంధించారు. ఈ పాశురంలో "పది" అనే పదం గత పాశురంలో ప్రసక్తమైన తిరుమలను లక్షిస్తుంది.

అవ :- గత పాశురంలో ఆళ్వార్లు తిరుమలలో ఉండే సన్నివేశాన్ని అనుభవించారు. అక్కడ తాము తలచిన రీతిలో అనుభవించలేకపోవడంవల్ల, ఆశించిన రీతిలో అనుభవించే వీలున్న పరమపదంలో ఉండే పరమపదనాథుని నా మనస్సు అన్వేషిస్తున్నది- అని ఇందులో అంటున్నారు.

27. పతి యమైన్దు నాడి ప్పరుత్తెழுన్ద శిన్దై
మతియురిఞ్జి వాన్ ముకడు నోక్కి- కతి మికుత్త-
ఙ్గోల్ తేడి యోడుమ్ కొழுన్దతే పోన్టతే
మాల్ తేడి యోడుమ్ మనమ్

పతి = తిరుమలై అనే క్షేత్రంలో, అమైన్దు = అమరి ఉండి, నాడి = అన్వేషించి, పరుత్తు ఎழுన్ద శిన్దై = చాలా వృద్ధిఅయి, పైపైకి పెరిగిన మనోరథాన్ని కల్గినదై, మతి ఉరిఞ్జి = చంద్రలోకాన్నికూడా దాటి, వాన్ ముకడు నోక్కి= ఆవలివైపున అండభిత్తిని కూడ చూచి, అక్కడకూడా నిలువకుండా, మాల్ తేడి = పరమపదనాథుని అన్వేషిస్తూ, కతి మికుత్తు ఓడుమ్ = చాలా వేగంగా వెళ్ళే, మనమ్ = నా మనస్సు, అమ్ కోల్ తేడి ఓడుమ్ = అందమైన ఉపఘ్నాన్ని (పట్టు కొమ్మను) వెదకుతూ పాకి పోయే, కొழுన్దు అదు పోన్టదు = తీగతో సమానంగా ఉన్నది.



తీగ తగిన పట్టుకొమ్మను వెదుకుతూ దానిని ఆధారం చేసికొని పైకి పాకుతూ పోయేటట్లే, నా మనస్సుకూడా సుందరుడైన భగవానుని అన్వేషిస్తూ పరమపదంవరకూ పోతున్నది -అని పాశురంలో పిండితార్థం.

అవ :- ఆళ్వార్ల మనస్సు భగవానుడు నిత్యవాసం చేసే పరమపదాన్ని అన్వేషించి, వృద్ధి చెందిన ఆశతో వేగంగా పోవడానికి ప్రారంభించగానే, అతడు కూడా దానిపట్ల గొప్ప ఆశతో పరమపదం, శ్రీరంగం, తిరుమల- మొదలైన దివ్యదేశాలను అన్నిటినీ ఉపేక్షించి, తమ మనస్సును వెదకుతూ వచ్చాడు- అని ఇందులో అంటున్నారు.

28. మనత్తుళ్ళాన్ వేఙ్గడత్తాన్ మాకడలాన్ మఱ్ఱుమ్
నినైప్పరియ నీళరఙ్గత్తుళ్ళాన్- ఎనై ప్పలరుమ్
తేవాతితేవన్ ఎనప్పడువాన్ మున్నొరునాళ్
మా వాయ్ పిళన్ద మకన్

ఎనై పలరుమ్ = లెక్క లేనంతమంది వైదికపురుషులు, వేదపురుషుడు- అనే అందరిచేత, తేవాతి తేవన్ ఎన ప్పడువాన్ = దేవతలకు సైతం దేవుడు - అని ప్రసిద్ధంగా చెప్పబడేవాడు, మా కడలాన్ = విస్తరించిన క్షీరాబ్ధిలో పరుండి ఉన్నవాడు, మున్ ఒరు నాళ్ = పూర్వం ఒకానొక సమయంలో, (శ్రీకృష్ణుడై అవతరించినపుడు), మా వాయ్ పిళన్ద = అశ్వరూపాన్ని ధరించివచ్చిన కేశి అనే అసురుని నోటిని చీల్చిన, మకన్ = చిన్నపిల్లవాడు, మఱ్ఱుమ్ = మఱియు, వేఙ్గడత్తాన్ = (తిరుమలైలో సర్వసులభుడై) వేంచేసి ఉన్నవాడు, నినైప్పు అరియ నీళ్ అరఙ్గత్తు ఉళ్ళాన్ = భావించడానికి సాధ్యం కాని, భోగ్యత నిండుగా ఉండే శ్రీరంగంలో శయనించి ఉన్నవాడు, మనత్తు ఉళ్ళాన్= నా మనస్సులో నిత్యవాసాన్ని చేస్తున్నాడు.

నన్ను పొందడంకోసంగా పూర్వం తాను అభిలషించిన దేశాలైన పరమపదం, వ్యూహస్థలం అయిన క్షీరాబ్ధి, విభవస్థలాలు, అర్చావతార దివ్యదేశాలు- అన్నిటినీ ఉపేక్షించి, నా మనస్సును పొంది, ఇపుడు ఆ మనస్సులో అత్యంతాభినివేశంతో నిత్యవాసాన్ని చేస్తున్నాడు. ముందు నివసించినవి అన్నీ

బాలాలయాలు, నామనస్సే ప్రధానమైన ఆలయం - అని అంటూ వీరే **"వెళ్ళుత్తిళమ్ కోయిల్ కైవిడేల్"** అని అన్నారు కదా !

అవ :- **"మావాయ్ పిళన్ద మకన్"** అని అంటూ శ్రీకృష్ణావతారప్రసక్తి గత పాశురంలో రాగానే, అందటినీ లోబఱుచుకొనే సుడులను గల గొప్ప నదివలె ఉండే ఈ అవతారంలో ఆళ్వార్లు పూర్ణంగా నిమగ్నులవుతున్నారు - ఈ పాశురంలో.

**29.** మకనాక క్కొణ్డెడుత్తాళ్ మాణ్బాయ కొజ్గై
అకనార వుణ్బ నెన్నుణ్డు- మకనై త్తాయ్
తేఱాత వణ్ణమ్ తిరుత్తినాయ్ తెన్నిలజ్గై
నీఱాక వెయ్‌తళ్ళిత్తాయ్! నీ

తెన్ ఇలజ్గై = అందమైన దక్షిణదిక్కు లోని లంకాపురి, నీఱు ఆక =భస్మం అయి, నశించేటట్లుగా, ఎయ్‌దు = బాణాలను ప్రయోగించి, అళ్ళిత్తాయ్ = నశింపజేసినవాడా !, నీ= నీవు, మకన్ ఆక కొణ్డు ఎడుత్తాళ్ = నిన్ను పుత్రునిగా భావించి (ప్రేమను చూపి స్తన్యాన్ని ఇవ్వాలని) ఎత్తుకొన్న పూతనయొక్క, మాణ్బు ఆయ కొజ్గై = అందమైన స్తనాలు, అకన్ ఆర ఉణ్బన్ ఎన్ఱు ఉణ్డు = కడుపునిండా భుజిస్తాను- అని పల్కి (పాలతో పాటు ఆమె ఉసురునుకూడా) పీల్చిన, మకనై= పుత్రుడవైన నీ విషయంలో, తాయ్ = నీ తల్లి అయిన యశోద, తేఱాద వణ్ణమ్= నమ్మిక లేకుండా పోయేటట్లుగా, తిరుత్తినాయ్ = చేశావు.

**"కీర్తిభూతాం పతాకాం యో లోకే భ్రమయతి ప్రభుః"** అనే రీతిలో శ్రీరామావతారంలో పరువం వచ్చిన తరువాత ఆయుధాలను ధరించి, వీరకృత్యాలను చేసినందువల్ల సుమిత్ర మొదలైన తల్లులు విశ్వాసాన్ని కల్గి ఉన్నారు. శ్రీకృష్ణుడు వయస్సు నిండడానికి ముందే చేసిన సాహసకృత్యాలు కనుక, ఇతనికి ఏం జరుగుతుందో ? -అని అస్థానే భయాన్ని పొందుతున్నారు- అని భావం.

అవ :- గత పాశురంలో శ్రీకృష్ణునిగూర్చి, శ్రీరామునిగూర్చి ప్రస్తావించడం వల్ల, ఆ అవతారాలతో పలు రీతులలో సామ్యాన్ని కల మిగిలిన అవతారాలను,



ఆయా అవతారాలలో చేసిన లీలలను ఇందులో ఆళ్వార్లు అనుసంధించి, ఆనందిస్తున్నారు.

**30.** నీ యన్ఱులకళన్దాయ్ నీణ్డ తిరుమాలే !
నీయన్ఱు కిడన్దా యెన్బరాల్- నీయన్ఱు
కారోత మున్ కడైన్ఱు పిన్నడైత్తాయ్ మాకడలై
పేరోత మేని ప్పిరాన్!

పేర్ ఓద మేని పిరాన్ = గొప్ప సముద్రం వంటి తిరుమేనిని కల ఉపకారకుడా!, నీణ్డ తిరుమాలే = భావించడానికి అరుదైన గొప్పతనాన్ని కల శ్రియఃపతీ, నీ= ఈ విధంగా ఉండే నీవు, అన్ఱు = పూర్వం ఒకానొక సమయంలో, ఉలకు = లోకాలను, అళన్దాయ్= త్రివిక్రముడవై కొలిచావు (అని), నీ = నీవు, అన్ఱు= ఇంకా వేఱొక సమయంలో, ఉలకు = భూమిని, ఇడన్దాయ్ = (మహావరాహమై) అండభిత్తినుండి గుచ్చి ఎత్తావు (అని), నీ అన్ఱు= నీవు ఒకానొకపుడు, కార్ ఓదమ్ మా కడలై = (అటువంటి) గొప్పదైన సముద్రాన్ని, పిన్ = తరువాత (శ్రీరామావతారకాలంలో), అడైన్దాయ్ = ఆనకట్టను కట్టి, దాటావు (అని), ఎన్బర్ = మహర్షులు అంటారు, ఆల్ = ఇవి కూడా కొన్ని నీ ఆశ్చర్యకర లీలలుకదా!

ఈవిధంగా పలికేవారు సామాన్యులు కారు. నీస్వరూపరూపగుణ విభూతులను యథాతథంగా దర్శించిన, పరమప్రామాణికులైన వ్యాసపరాశరాది మహర్షులు.

అవ :- ఈ విధంగా లోకానికి ఆపద కల్గినపుడు అంతటా సహాయపడే సర్వేశ్వరుని శ్రీచరణాలను పూలు మొదలైన ఆరాధనోపకరణాలతో పూజించేవారు అప్రాకృతం అయిన అతని తిరుమేనిని ఆనందంతో అనుభవించగలరు - అని ఇందులో అంటున్నారు.

**31.** పిరానెన్ఱు నాళుమ్ పెరుమ్బులరి యెన్ఱుమ్
కురానళ్ళె ళ్ళుమ్బోతు కొణ్డు- వరాక

**త్తణియురువన్ పాతమ్ పణియుమవర్ కణ్డీర్**
**మణియురువమ్ కాణ్బార్ మకిఴ్న్దు**

పిరాన్ ఎన్ఱుమ్ = మహోపకారాలను చేసినవాడా! అని, పెరుమ్ పులరి ఎన్ఱుమ్= ఈనాడే సుప్రభాతం అని కీర్తిస్తూ, నాళుమ్ = దినం అంతా, నల్ = పరిమళం నిండిన, శెఴు = అందమైన, కురా పోదు కొణ్డు = **'కురా'** పుష్పాలను తీసికొని, వరాకత్తు అణి ఉరువన్ పాదమ్ = అందమైన, వరాహరూపాన్ని ధరించిన భగవానుని శ్రీచరణాలను, పణియుమవర్ కణ్డీర్ = కైంకర్యం చేసేవారే, మణి ఉరువమ్ = (ఆ భగవానుని) దివ్యమంగళవిగ్రహాన్ని, మకిఴ్న్దు కాణ్బర్= సంతోషంతో సేవిస్తారు.

లోకంలో శ్రమతో కూడిన సాధనానుష్ఠానాన్ని చేస్తే దానికి తగిన ఫలం లభిస్తుంది. కనుక సాధనానికి తగిన ఫలం - అని అంటారు. ఇక్కడ **"సుసుఖం కర్తు మవ్యయమ్"** అనే రీతిలో సాధనదశలో - సాధ్యదశలో భేదం లేకుండా మధురం అయినందువల్ల ఫలానికే ఫలం అనవచ్చు- అని పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్య.

అవ :- "ఈ ఉపదేశానుసారం మీరు కైంకర్యం చేశారా?'' అని అంటే, ఈ ఉపదేశాన్ని ఎదురు చూడకుండానే తమ మనోవాక్కాయాలనే త్రికరణాలు భగవద్విషయంలో అభినివిష్టాలు అయిన రీతిని ఆఴ్వార్లు ఇందులో తెలుపుతున్నారు. **"ముడియానే"** (3-8) అనే తిరువాయ్‌మొఴి దశకంలో నమ్మాఴ్వార్ల కరణాలు పడిన పాట్లవంటి పాట్లనే వీరి కరణాలు ఇందులో పడుతున్నాయి.

**32. మకిఴ్న్దతు శిన్దై తిరుమాలే! మఱ్ఱుమ్**
**మకిఴ్న్దతున్ పాతమే పోఱ్ఱి- మకిఴ్న్ద-**
**దళలాఴి శఙ్గమ్ అవై పాడి యాడుమ్**
**తొఴిలాకమ్ శూఴ్న్దు తుణిన్దు**

తిరు మాలే = లక్ష్మీపతీ!, శిన్దై = నా మనస్సు, శూఴ్న్దు = ఆశపడి, తుణిన్దు = నిశ్చయించుకొని, మకిఴ్న్దదు = ఆనందాన్ని పొందింది, మఱ్ఱుమ్= మనస్సుకు తరువాత ఉండే వాక్కు, ఉన్ పాదమే పోఱ్ఱి = నీ శ్రీపాదాలనే స్తుతించి, మకిఴ్న్దదు= ఆనందించింది. ఆకమ్ = నా దేహం, అఴల్ =శత్రువుల మీద అగ్నిని వెలువరిస్తున్న, ఆఴి= సుదర్శనాన్ని, శఙ్గమ్ = శ్రీపాంచజన్యాన్ని, అవై = ఇంకా ఉండే దివ్యాయుధాలను, పాడి ఆడుమ్ = కీర్తించేటట్లు ఆడడం అనే, తొఴిల్ = పనిలో, మకిఴ్న్దదు = ఆనందించింది.

శంఖచక్రాలు పాడి, ఆడడం అనే వ్యాపారంలో ప్రవేశించి, అందులో అగ్నమై ఆనందించాయి- అని పాశురంలోని క్రమాన్నే అనువరిస్తూ అప్పిళ్ళై అర్థం చెప్పారు.

అవ :- గత పాశురంలో చెప్పినట్లే అనుభవంతో ఆనందాన్ని పొందడమే కాక, అతనిని సంతోషంతో అనుభవించడంవల్ల తమ త్రికరణాలు వేఱెవ్వరి అధీనంలోను ఉండని రీతిలో నిశ్చయించుకొన్నాయి- అని ఆఴ్వార్లు ఇందులో అంటున్నారు.

**33. తుణిన్దతు శిన్దై తుఴాయలఙ్గల్, అఙ్గమ్**
**అణిన్దవన్ పేరుళ్ళత్తు ప్పల్ కాల్- పణిన్దతువుమ్**
**వేయ్ పిఱఙ్గు శారల్ విఱల్ వేఙ్గడవనైయే**
**వాయ్ తిఱఙ్గళ్ శొల్లుమ్ వకై**

శిన్దై = నామనస్సు, తుఴాయ్ అలఙ్గల్ (అఙ్గమ్) అణిన్దవన్ పేర్ = శ్రీతులసీ మాలను (తిరుమేనిలో) అలంకరించుకొన్న భగవానుని తిరునామాలను, పల్ కాల్= పలు మార్లు, ఉళ్ళత్తు = స్మరించడంలో, తుణిన్దదు = స్థిరమైన అధ్యవసాయాన్ని పొందింది, అఙ్గముమ్ = నా శరీరంకూడా, పల్ కాల్ = పలుమార్లు (ఎల్లప్పుడు), పణిన్దదు = సేవించింది, (నమస్కరించింది) వేయ్ పిఱఙ్గు శారల్ = వెదుళ్ళు నిబిడంగా ఉండే కొండచరియలను కల, విఱల్ వేఙ్గడవనైయే = బలాన్ని కల తిరుమలలోని భగవానునే, వాయ్ = నోరుకూడా (పల్ కాల్ = ఎల్లప్పుడూ), తిఱఙ్గళ్ = (అతని) స్వభావాలను, శొల్లుమ్ వకై = చెప్పే రీతిలో, తుణిన్దదు = నిశ్చయించుకొన్నది. (**"తుణిన్దదు"** అనే క్రియను మనస్సుకు, వాక్కుకు కూడా అన్వయించాలి.)

అవ:-''ఈ విధంగా త్రికరణాలు నీపట్ల అభినివేశాన్ని పొంది, ఆనందించి, నిశ్చయాన్ని పొంది, నీకే అధీనాలు అయేటట్లుండే నీ గొప్పతనం నీవు అవతారాదులద్వారా చేసిన ప్రయత్నాల ఫలం సుమా''- అని స్వామితో ఆళ్వార్లు అంటున్నారు.

**34.** వకైయా లవని యిరన్దళన్దాయ్ పాతమ్
పుకైయాల్ నఱు మలరాల్ మున్నే- మిక వాయ్న్ద
అన్బాక్కి యేత్తి అడిమైప్పట్టే నునుక్కు
ఎన్బాక్కియత్తా లిని

మున్నే = పూర్వకాలంలో, వకైయాల్ = ఉపాయంతో, అవని = భూమిని, ఇరన్దు (మహాబలివద్ద) యాచించి, అళన్దాయ్ = కొలిచిన నీయొక్క, పాదమ్= శ్రీచరణాలను, పుకైయాల్ = ధూపాలతోను, నఱు మలరాల్ = మంచి సువాసనను కల పుష్పాలతోను, మిక వాయ్న్ద అన్బు ఆక్కి = మిక్కిలిగా పొందికగా ఉండే భక్తిని కలవాడనై, ఏత్తి= స్తుతించి, ఇని= తరువాత ఉండే కాలం అంతా, ఎన్ పాక్కియత్తాల్ = నీవు నాపైన చూపిన విశేషకటాక్షం అనే భాగ్యంచేత, ఉనక్కు అడిమైప్పట్టేన్ = నీకు దాసుణ్ణి అయ్యాను.

లేక, "ఎన్ పాక్కియత్తాల్" అనే దానికి నా అప్రతిషేధం, ఆనుకూల్యం - అనే పుణ్యంతో - అని భావం. "వకైయాల్ అవని ఇరన్దళన్దాయ్"- అని అనడంద్వారా ఈ పుణ్యానికి మూలకారణం నీవు అవతారాదులద్వారా పడిన పాట్లే- అని తెలుపుతున్నారు.

అవ :- ఈ విధంగా జీవుని అప్రతిషేధాన్నే ఆలంబనంగా చేసికొని, తానే స్వయంగా అభినివేశాతిశయాన్ని ప్రదర్శించి, సర్వరక్షణాలను చేసే నిన్ను విడిచి చేతనులు ఇహలోకవిషయాలలో ఆసక్తిని పొంది అనర్థాన్ని పొందుతున్నారే! అయ్యో!- అని ఇందులో ఆళ్వార్లు గర్హిస్తున్నారు.

**35.** ఇనిదెన్బర్ కామమ్ అతనిలు మాఱ్ఱ
ఇనితెన్బర్ తణ్ణీరు మెన్దాయ్! - ఇని తెన్టు



కామనీర్ వేళాతు నిన్ పెరుమై వేట్పరేల్
శేమ నీరాకుమ్ శిఱితు

ఎన్దాయ్ = నాకు స్వామి అయినవాడా! (పామరులు), కామమ్ = అల్ప విషయాలను, ఇనిదు ఎన్బర్ = భోగ్యం అని అంటారు (గ్రహిస్తారు), (విరక్తులు కూడ) తణ్ణీర్ అతనిలుమ్ ఆఱ్ఱ ఇనితు ఎన్బర్ = ఆ శబ్దాదివిషయాలకంటే చల్లని నీరు చాలా భోగ్యమని అంటారు, కామమ్ నీర్= (పూర్వం చెప్పబడ్డ) శబ్దాది విషయాలలోని కామాలు, చల్లని నీరు, ఇనిదు ఎన్టు వేళాదు = భోగ్యాలుగా తలచి, వాని విషయంలో ఆశను పొందకుండా, నిన్ పెరుమై శిఱిదు వేట్పర్ ఏల్ = నీ భోగ్యతనే కొంచెం అయినా అభిలషించేవారైతే, (అది), శేమమ్ నీర్ ఆకుమ్ = (అన్ని స్థితులలోను) రక్షకం అయిన స్వభావాన్ని కల్గినది అవుతుంది.

అన్ని ఆశలు గాఢంగా ఉన్నా, లోకంలోని శబ్దాదివిషయాలు జీవుడు కోరినంతగా లభించవు. కాని, కొంచెం ఆశ ఉన్నా చాలు, భగవానుడు భక్తునకు పరమసులభుడు అవుతాడు- అనే అపూర్వార్థం ఇందులో తెలుపబడింది.

అవ :- "నిన్ పెరుమై శిఱిదు కేట్పరేల్ శేమనీరాకుమ్" అని అంటూ గత పాశురంలో అనుసంధించగానే, లోకులు పరమపురుషునిపట్ల కొంచెంకూడా అభినివేశాన్ని పొందకుండా, అన్యవిషయాలను, వాటిని పొందడంకోసం దేవతాంతరాలను ఆశ్రయించి ఉండడాన్ని తలచి తమ ఆళ్వార్లు మనస్సును సంబోధిస్తూ "లోకులు ఏ విధంగా చెడిపోతే నాకేమి? ఓ మనసా! నీవు మొట్టమొదటగా అతని దివ్యచేష్టితాలను అనుసంధించి, ఆనందించుసుమా!''- అని అంటున్నారు.

**36.** శిఱియార్ పెరుమై శిఱితిన్గణెయ్తుమ్
అఱియారుమ్ తామఱియారావర్- అఱియామై
మణ్ కొణ్డు మణ్ణుణ్డు మణ్ణుమిళ్న్ద మాయనెన్టు
ఎణ్ కొణ్డెన్నెఞ్జే! యిరు

శిఱియార్ = (సహజమైన గొప్పతనం కొంచెంకూడా లేని) అల్పులైన సంసారులయొక్క, పెరుమై = (నాకు సాటి వచ్చేవారు లేరు- అని అహంకరించడం వల్ల వచ్చే)పరత్వం, శిఱిదిన్ కణ్ ఎయ్దుమ్ = ఇంకా ఇంకా అధమత్వాన్నే కల్గిస్తుంది, అఱియారుమ్=మంచి చెడ్డలను వివేకించి తెలియలేని అవివేకులుకూడా (తమను సర్వజ్ఞులుగా తలచేవారైనా) తామ్ అఱియార్ ఆవర్= తాము మఱింత అజ్ఞులుగానే అయిపోతారు, ఎన్ నెఞ్జే = నా మనసా!, అఱియామై = ఇతరులు తెలియని రీతిలో, మణ్ కొణ్డు = ఆ భూమిని (ప్రళయంలో) ఉదరంలో పెట్టుకొన్నవాడు, మణ్ ఉమిழ్న్ద = తరువాత ఆ భూమిని వ్యక్తం చేసిన, మాయన్ ఎన్ఱు = ఆశ్చర్యభూతుడైన స్వామి అని, ఎణ్ కొణ్డు = నిరంతరం అనుసంధించి, ఇరు =(అతనిని ఆశ్రయించిన మనకు ఏ కొఱత లేదు అని) నిర్భయంగా ఉండు.

**"మా శుచః"** అని అంటూ శ్రీకృష్ణుడు అర్జునునకు అభయం ఇచ్చినట్లే, ఇక్కడ ఆழ்వార్లు తమ మనస్సుకు అభయం ఇస్తున్నారు.

అవ :- ఈ విధంగా సర్వేశ్వరుడై, సర్వశరణ్యుడై ఉండేవానిని ఆశ్రయించని జన్మలన్నీ వృథా, వృథా- అని ఇందులో అంటున్నారు.

**37. ఇరున్దణ్ కమలత్తు ఇరుమలరినుళ్ళే**
**తిరున్దు తిశైముకనై త్తన్దాయ్! - పొరున్దియ నిన్**
**పాతఙ్గళేత్తి ప్పణియావేల్- పల్ పిఱప్పుమ్**
**ఏతఙ్గళెల్లా మెమక్కు**

ఇరు = పెద్ద, తణ్ = చల్లని, కమలత్తు = తిరునాభీకమలంలో, ఇరు మలరిన్ ఉళ్ళే = గొప్పతనాన్ని పొందికగా కల (తామర) పూవులో, తిరున్దు = సామర్థ్యాన్ని కల, తిశై ముకనై = చతుర్ముఖుని, తన్దాయ్ =(సృష్టించి) ఉపకరించిన స్వామీ!, పొరున్దియ = అందఱితో పొందికగా ఉండే, నిన్ = నీయొక్క, పాదఙ్గళ్= శ్రీచరణాలను, ఏత్తి= నోరారా స్తుతించి, పణియా ఏల్= శిరసా ప్రణమిల్లడానికి ఉపయోగపడకపోతే, ఎమక్కు = మాకు, పల్ పిఱప్పుమ్ ఎల్లామ్ = పలు రీతులలో జన్మిస్తున్న మా జన్మలన్నీ, ఏతఙ్గళ్ = వ్యర్థాలే.



నీవు ఈ విధంగా జీవులను సృష్టించి రక్షించినా, వారు నిన్ను ఆశ్రయించక పోవడాన్ని చూసి వారందరూ సంసారంలో పడే పాట్లను చూచి నేనొక్కడనే వారిపట్ల నాకు గల కరుణవల్ల పడుతున్నాను - అని అంటున్నారని కూడా చెప్పవచ్చు. పరదుఃఖ దుఃఖిత్వం కదా కరుణ అంటే.

అవ :- అహంకారులకు అగ్నివలె చెడ్డను కల్గించే సంపదను చూచి చాలా గొప్ప ప్రయోజనకరం - అని భావించి భ్రాంతులు కాకుండా, శ్రీమన్నారాయణుని విషయంలో స్మరించడం, స్తుతించడం మొదలైన కృత్యాలను చేసి, అతని ఆశ్రయించడమే అందఱికీ కర్తవ్యం- అని ఇందులో అంటున్నారు.

**38. ఎమక్కెన్ఱిరు నితియమ్ ఏమాన్దిరాతే**
**తమక్కెన్ఱుమ్ శార్వ మఱిన్దు- నమక్కెన్ఱుమ్**
**మాతవనే! యెన్నుమ్ మనమ్బడైత్తు మఱ్ఱవన్పేర్**
**ఓతువతే నావినా లోత్తు**

ఇరు నిదియుమ్ = గొప్ప సంపదను, ఎమక్కు ఎన్ఱు = తమది (మాది) అని తలచి, ఏమాన్దు ఇరాదే = ఏమాఱిపోకుండా (భ్రాంతులు కాకుండా), తమక్కు ఎన్ఱుమ్ అఱిన్దు= తమకు ఎల్లప్పుడు రక్షకమై ఉండదగిన విషయాన్ని తెలిసికొని, నమక్కు ఎన్ఱుమ్ మాతవనే ఎన్నుమ్ మనమ్ పడైత్తు = మనకు అన్ని కాలాలలోను భగవానుడే అన్నీ- అని నిశ్చయించుకొన్న మనస్సును కలవారై, మఱ్ఱు = దానికి తరువాత, అవన్ పేర్= ఆ శ్రియఃపతి తిరునామాలను, ఓదువదే = సంకీర్తనం చేయడమే, నావినాల్ ఓత్తు = జిహ్వాకు వేదంవలె అభ్యసించదగినవిషయం.

దివ్యదంపతుల చేరికను తెలిపే శ్రీధర, మాధవాది నామాలను అనుసంధించడమే జిహ్వా ఉన్నందుకు ఫలం. అది వేదాధ్యయనంతో సమానం.

అవ :- "వేదాలలో ఇంద్రుడు మొదలైన ఇంకా పలువురు దేవతలు ఆశ్రయణీయులుగా చెప్పబడగా, వైదికులైన మీరు మాధవుడొక్కడే ఆశ్రయించదగినవాడని అనడం ఏవిధంగా సబబు?" అనే ప్రశ్న తల ఎత్తగా, "విధంగా అడిగేవారు వేదాలలో పైపైన స్ఫురించే అర్థాన్నే ఆశ్రయించి, దాని

సారార్థాన్ని తెలియకుండా దుఃఖపడుతున్నారు. లోకులు అన్యదైవాలనుగూర్చి పల్కడానికి కారణం వారు అతని విభూతిలోకి చేరి ఉన్నందువల్లనే. వారిని అందఱినీ సొత్తుగా కలవాడు, ముముక్షువులకు ఆశ్రయణీయుడై ఉండేవాడు శ్రీమన్నారాయణుడొక్కడే- అన్నదే వేదంలోని అంతరార్థం- అని ఇందులో అంటున్నారు.

**39. ఓత్తిన్ పొరుళ్ ముడివు మిత్తనైయే ఉత్తమన్‌పేర్**
**ఏత్తుమ్ తిఱమఱిమి నేழைకాళ్! - ఓత్తదనై**
**వల్లీరేల్ నన్ఱదనై మాట్టీరేల్ మాతవన్ పేర్**
**శొల్లువతే యోత్తిన్ శురుక్కు**

ఉత్తమన్ పేర్ = పురుషోత్తముడైన భగవానునియొక్క తిరునామాలతో, ఏత్తుమ్ తిఱమ్ = స్తుతించే ప్రకారం, ఇత్తనైయే = ఇంతమాత్రమే, ఓత్తిన్ పొరుళ్ ముడివుమ్= వేదార్థనిశ్చయంకూడా, ఓత్తు అదనై వల్లీరేల్ = వేదార్థాన్ని తెలియగల్గినవారైతే, అఱిమిన్= తెలిసికొనండి, ఏழைకాళ్ = జ్ఞానంలో అల్పులారా!, నన్ఱు అదనై మాట్టీరేల్ = చక్కగా ఆ అర్థాన్ని తెలియగల్గినవారు కాకపోతే, మాదవన్ పేర్ ఓదువదే = శ్రీమన్నారాయణుని తిరునామాలను ఉచ్చరించడమే, ఓత్తిన్ శురుక్కు = వేదార్థసంగ్రహం, అఱిమిన్ = దీనిని తెలిసికోండి.

ఈ పాశురానికి అప్పిళ్ళై అనే ఆచార్యులు తమ టీకలో ప్రసాదించిన అవతారిక ఈ విధంగా ఉన్నది.

గడచిన **"నావినాల్ ఓత్తు"** అనే పాశురంలో చెప్పిన విషయం రెండు విధాలైనది - అని వివరిస్తూ ఇందులో చూపుతున్నారు. సకలవేదసంగ్రహం అయిన తిరుమంత్రాన్ని అనుసంధిస్తూ, వేదాంతాలలో చెప్పబడ్డ రీతిలో సాధనభక్తితో భగవానుని పొందవచ్చునని, ఆ సాధనభక్తిని అనుష్ఠించలేనివారు ద్వయంలో చెప్పిన రీతిలోనే శ్రీమన్నారాయణుని నామాన్ని పల్కి, అతనిని శరణు పొందవచ్చును- అని రెండు విధాలైన అధికారులకు అనుగుణంగా జిహ్వతో భగవన్నామాన్ని అనుసంధించడాన్ని గూర్చి రెండు విధాలుగా అప్పిళ్ళై ఇందులో వివరించారు.



అవ :- గడచిన పాశురంలో చెప్పిన రీతిలోనే, అన్ని వేదాలకు అర్థభూతుడై ఉన్నవాడు శ్రీమన్నారాయణుడే. మీ ఆయుస్సును చూస్తే చాలా అది తక్కువగా ఉన్నది - అందువల్ల మీ అంతిమకాలం సమీపించడానికి ముందే అతని శ్రీపాదాలను ఆశ్రయించండి"- అని ఐహిక విషయాలలో నిమగ్నులైన సంసారులను ఉద్దేశించి ఇందులో ఆழ్వార్లు ఉపదేశిస్తున్నారు.

**40. శురుక్కాక వాఙ్గి శులావినిన్ఱు ఐయార్**
**నెరుక్కా మున్నీర్ నినైమిన్ కణ్డీర్- తిరుప్పొలిన్ద**
**ఆకత్తాన్ పాత మఱిన్దుమ్- అఱియాత**
**పోకత్తాలిల్లై పొరుళ్**

ఐయార్ = కఫం, శురుక్కాక వాఙ్గి = శరీరాన్ని కుంగదీసి, శులావి నిన్ఱు= శరీరం అంతా చుట్టుకొని ఉండి, నెరుక్కా మున్ = బాధించడానికి ముందే, తిరు ప్పొలిన్ద ఆకత్తాన్ పాదమ్ = లక్ష్మీదేవిచే ప్రకాశించే వక్షఃస్థలాన్ని కల గొప్పతనాన్ని కల్గినవాని శ్రీచరణాలను, నీర్ నినైమిన్ = మీరు భావించండి, అఱిన్దుమ్ = భగవద్విషయాన్ని తెలిసినవారై ఉండి కూడా, అఱియాద = తెలియనివారినిగానే మిమ్ములను చేయగల, పోకత్తాల్ = శబ్దాదిలౌకికభోగాలను అనుభవించడంవల్ల, పొరుళ్ ఇల్లై = మీకు ఏ ప్రయోజనమూ లేదు. (విషయ సుఖాలు మంచివి కావని తెలిసినా, వాటిని విడువలేనట్లుగా ఉండే ఈ విషయ భోగాలవల్ల ఏ ప్రయోజనమూ లేదు - అని కూడా భావం. విషయభోగాలను విడచి త్రివిక్రముని శ్రీచరణాలను ఆశ్రయించండని ఉపదేశ సారం.)

అవ :- గత పాశురంలో ఆழ்వార్లు తాము ఇతరులకు ఉపదేశించినది వారు సంస్కరింపబడడానికి ఉపయోగపడకుండా, తమ మనస్సు తేట పడడానికే ఉపయోగపడినందువల్ల, తమ మనస్సును ఉద్దేశించి, శ్రమహరం అయిన సర్వేశ్వరుని శ్రీచరణాలను నీవు మును ముందుగా ఓ మనసా! మఱువవద్దు- అని తమ మనస్సుతో అంటున్నారు.

**41. పొరుళా లమరులకమ్ పుక్కియలలాకాతు**
**అరుళా లఱమరుళు మన్తే - అరుళాలే**

మామఱైయోర్ క్కీన్ద మణివణ్ణన్‌పాతమే
నీ మఱవేల్ నెఞ్జే! నినై

అమర్ ఉలకమ్ = దేవకులాన్ని, పొరుళాల్ = ధనంతో, పుక్క ఇయలల్ ఆకాదు= పోయి చేరాలని ప్రయత్నించడం తగదు, అరుళాల్= కరుణయే మూర్తీభవించిన భగవానుడు, అఱమ్ = పుణ్యఫలం అయిన ఆ లోకాన్ని, అరుళుమ్ అన్ఱే = తన కృపతో లభింపజేస్తాడు కదా!, అరుళాలే = కృపతో, మా మఱైయోర్క్కు = పరమవైదికులకు, ఈన్ద = తననే అనుగ్రహించిన, మణి వణ్ణన్ పాదమే = నీలమణి వర్ణుడైన భగవానుని శ్రీచరణాలనే, నెఞ్జే = ఓ మనసా!, నీ మఱవేల్ = నీవు మఱువకు, నినై = ధ్యానిస్తూ ఉండు.

జ్ఞానానికి స్థానం అయిన నీవు జ్ఞానులు చేసే పనిని చేయాలని భావం. "మామఱై యోర్క్కు" అనే "ఱ" కారఘటితమైన వేఱొక పాఠాన్ని చూపి, దానిద్వారా మార్కండేయునకు నిత్యత్వాన్ని అనుగ్రహించిన వృత్తాంతం తెలుపబడినదని అప్పిళ్ళై తమ టీకలో వివరించారు.

అవ:- గడచిన పాశురంలో తమ మనస్సును ఉద్దేశించి భగవానుని ఆశ్రయించమంటూ ఉద్బోధించారు - అతనిని ఆశ్రయించినవారు ఈ జన్మలో సంసారంలో ఉండే అల్పానందాలను తొలగదోసి, మఱు జన్మలను పొందకుండా ఉంటారు- అని ఇందులో అంటున్నారు.

**42.** నినైప్పన్ తిరుమాలై నీణ్డతోళ్ కాణ
నినైప్పార్ పిఱప్పొన్ఱుమ్ నేరార్- మనైప్పాల్
పిఱన్దార్ పిఱన్దెయ్‌తుమ్ పేరిన్ప మెల్లామ్
తుఱన్దార్ తొழுతారత్తోళ్

తిరుమాలై = లక్ష్మీనాథుడవైన స్వామిని, నీణ్డ తోళ్ కాణ నినైప్పన్ = (అతని) భోగ్యమైన బాహువులను దర్శించి, అనుభవించాలని తలుస్తున్నాను, నినైప్పార్= ఈ విధంగా తలిచేవారు, పిఱప్పు ఒన్ఱుమ్ = ఏ విధమైన జన్మలను, నేరార్ = పొందరు, అత్తోళ్ = ఆ బాహువులను, తొழுవార్ = నమస్కరించే వారు, మనై ప్పాల్ పిఱన్దార్ పిఱన్దు ఎయ్‌దుమ్ పేర్ ఇన్బమ్ ఎల్లామ్ = సంసారంలో జన్మించినవారు జన్మ పొందినందువల్ల పొందే అల్పానందాలను అన్నిటినీ, తుఱన్దార్ = గర్హిస్తారు.

"పేరిన్బమ్" అనే పదం ఇక్కడ విపరీతలక్షణద్వారా నీచసుఖాన్ని తెలుపు తుంది. లేక, ఈ అల్పానందాన్నే మహానందంగా తలచేవారి అభిప్రాయాను సారంగా ప్రయోగింపబడిందని అనవచ్చు. **"తుఱన్దార్ అత్తోళ్ తొழுదార్"** అని అన్వయించి, "ఈ లౌకికమైన, తుచ్ఛమైన ఆనందాన్ని విడచినవారే అతని శ్రీచరణాలను అనుభవించగలరు'' అని అంటూ ముముక్షువునకు వైరాగ్యంయొక్క ఆవశ్యకతను గూర్చి తెలుపుతున్నారని చెప్పవచ్చు. ఈ భావాన్ని **"కడై యఱ ప్పాశఙ్గళ్ విట్టపిన్నై యన్ఱి అవనవై కాణ్ కొడానే"** అనే సూక్తి ద్వారా నమ్మాழ்వార్లు తెలిపారు. **"మనైప్పాల్ పిఱన్దార్ పిఱన్దెయ్‌తుమ్ పేరిన్బమదెల్లామ్ తుఱన్దు అత్తోళ్ తొழுదార్"** అని అన్వయించి, "తలుస్తాను'' అనే భావననే గొప్పగా భావించి ఆ పరమపురుషుడు తానే తనను సాక్షాత్కరింపజేయాలే తప్ప, ఎవరు తమ స్వప్రయత్నంతో ఈ అల్పానందా లను అన్నిటినీ తొలగదోసి, ఆ స్వామి బాహువులను నమస్కరించ గలరు?- అనే పరగత స్వీకారపరం అయిన అర్థాన్ని చెప్పవచ్చు.

అవ :- "నాకు భగవానుని బాహువులకు నమస్కరించాలనే భావం లేదు. ఆ విధంగా నమస్కరించేవారు నమస్కరిస్తే నమస్కరించనీ. అతని బాహువులను నమస్కరించేవారి బాహువులను సేవించడమే నాకు తగినది''- అని అనడంద్వారా భగవచ్ఛేషత్వానికంటే భాగవతశేషత్వానికి కల వైలక్షణ్యాన్ని తెలుపుతున్నారు.

**43.** తోళిరణ్డెట్టేழுమ్ మూన్ఱు ముడి యనైత్తుమ్
తాళిరణ్డుమ్ వీழ ச్చరన్దురన్దాన్- తాళిరణ్డుమ్
ఆర్ తొழுవార్ పాతమ్ అవై తొழுవతన్ఱే ఎన్
శీర్ కెழுతోళ్ శెయ్యుమ్ శిఱప్పు

తోళ్ ఇరణ్డు ఎట్టు ఏழுమ్ మూన్ఱుమ్ = రావణుని ఇరవై బాహువులు, ముడి అనైత్తుమ్ = మొలిచిన అన్ని శిరస్సులు, తాళ్ ఇరణ్డుమ్ = రెండు పాదాలు, వీழ = నశించేటట్లు, శరమ్ తురన్దాన్ = బాణాలను ప్రయోగించిన

స్వామియొక్క, తాళ్ ఇరణ్డుమ్= రెండు శ్రీచరణాలను, తొ*ఝు*వార్ ఆర్ = సేవించేవారెవరో(వారి), పాదమ్ అవై = శ్రీచరణాలను, తొ*ఝు*వదు అన్రే = సేవించడమే కదా!, ఎన్ శీర్ కె*ఝు* తోళ్ శెయ్యుమ్ శిఱప్పు= నా గొప్పతనం నిండిన బాహువులు నాకు చేసే సహాయం (గొప్పతనం).

అవ :- గడచిన పాశురంలో చెప్పిన రీతిలోనే తనను పొందినవారి సంబంధి సంబంధులను సైతం రక్షించగల భగవద్విషయాన్ని ఆశ్రయించకుండా మఱచిపోయేవారు జ్ఞానాన్ని కలవారు కానేకారు- అని అంటున్నారు.

**44.** శిఱన్దార్ క్కె*ఝు* తుణైయామ్ శెజ్గణ్మాల్ నామమ్
మఱన్దారై మానిడమా వైయేన్- అఱమ్ తాఙ్గుమ్
మాతవనే యెన్నుమ్ మనమ్బడైత్తు మ*ర్*ఱవన్ పేర్
ఓతువతే నావినా లుళ్ళు

(నెఞ్జే= మనసా!), శిఱన్దార్కు్క = శ్రీవైష్ణవోత్తములకు, ఎ*ఝు* తుణై ఆమ్= ఉజ్జీవించడానికి కారణం అయిన సహాయ అయిన, శెమ్ కణ్ మాల్ = ఎఱ్ఱని తామరలవంటి కన్నులను కల స్వామియొక్క, నామమ్ = తిరునామాన్ని, మఱన్దారై = మఱచినవారిని, మానిడమ్ ఆ = మానవజన్మను పొందినవారినిగా, వైయేన్ = నా మనస్సులో గ్రహించను, అఱమ్ తాఙ్గుమ్ మాదవనే ఎన్నుమ్ మనమ్ పడైత్తు = "ధర్మాన్ని స్థిరంగా ప్రతిష్ఠించే శ్రియఃపతీ!" అని పిలిచి ఆహ్వానించే మనస్సుతో, మ*ర్*ఱు = ఇంకా, అవన్ పేర్ = అతని తిరునామాన్ని, నావినాల్ ఓదువదే = జిహ్వాతో చెప్పడమే, ఉళ్ళు = (మనకు తగినది అని వాటిని) అనుసంధించు.

శ్రీమన్నారాయణుని చెప్పే ద్వయాన్ని జిహ్వాతో ఉచ్చరించాలని ఓమనసా! చింతించు - అని ఆ*ఝ్*వార్లు తమ మనస్సుకు ఉద్బోధిస్తున్నారు. "మనమే!" అనే పదాన్ని అధ్యాహరించు కోవాలి. గత పాశురంలో భగవద్భక్తులను ఆదరించారు. ఇందులో అతనిని భజించనివారిని అనాదరిస్తున్నారు.

అవ :- నిత్యసూరులుకూడా ఆశపడే పరమపురుషుని శ్రీచరణాలను స్తుతించేవారు అన్యవిషయాలను పొందడంవల్ల, పోగొట్టుకోవడంవల్ల కలిగే సుఖదుఃఖాలను ఎంతమాత్రం పొందరు- అని అంటున్నారు.



**45.** ఉళదెన్ఱిఱుమావార్ ఉణ్డిల్లై యెన్ఱు
తళర్తలతనరుకుమ్ శారార్- అళవరియ
వేతత్తాన్ వేఙ్గడత్తాన్ విణ్ణోర్ ముడి తోయుమ్
పాతత్తాన్ పాతమ్ పయిన్ఱు

అళవు అరియ వేతత్తాన్ = ఇంత అని పరిచ్ఛేదించడానికి వీలు కాని వేదంచేత ప్రతిపాదింపబడేవాడు, వేఙ్గడత్తాన్ = తిరుమలైకు వచ్చి నిలచినవాడు, విణ్ణోర్ ముడి తోయుమ్ పాతత్తాన్ = నిత్యసూరుల శిరస్సులు నమస్కరించే శ్రీపాదాలను కలవాడు అయిన భగవానుని, పాతమ్ = శ్రీపాదాలను, పయిన్ఱు= అనాదిగా సేవిస్తూ ఉండే వారు, ఉళదు ఎన్ఱు ఇఱుమావార్ = తమకు సంపద ఉన్నదని గర్వాన్ని పొందరు, ఉణ్డు ఇల్లై ఎన్ఱు = సంపద నిన్న ఉన్నది,ఇపుడు నశించిపోయింది- అని, తళర్తల్ అతన్ అరుకుమ్ శారార్ = దుఃఖాన్ని పొందే స్వభావం దగ్గరకుకూడా పోరు.

ఈ విధంగా అనంత-స్థిరరూప ఫలంగా ఉండే అతని శ్రీచరణాలను నిరంతరం సేవించేవారు అల్పాస్థిరాలైన ఈ లౌకికానందాల లాభనష్టాలవల్ల సుఖదుఃఖాలను పొందరు.

అవ :- గడచిన పాశురంలో పల్కిన రీతిలో సర్వేశ్వరుడు తనను ఆశ్రయించినవారిని అన్య సుఖాల వల్ల ఏర్పడే వికారాలను వేటినీ పొందకుండా చేసి, సర్వేశ్వరుడైన తనను ఆశ్రయించి అనుభవించడమనే భావం వీరికి సదా కలిగేటట్లుగా పలు దివ్యక్షేత్రాలలో తాను నిలచి, వీరికంటే తాను ఎక్కువగా పడరాని పాట్లను పడి వీరిని రక్షించే ప్రయత్నాన్ని చేస్తున్నాడని ఇందులో అంటున్నారు.

**46.** పయిన్ఱ తరఙ్గమ్ తిరుక్కోట్టి పన్నాళ్
పయిన్ఱతువుమ్ వేఙ్గడమే పన్నాళ్ - పయిన్ఱ
తణితిక*ఝు*మ్ శోలై అణినీర్ మలైయే
మణి తిక*ఝు*మ్ వన్తడక్కై మాల్

మణి తిక*ఝు*మ్ = నీలమణివలె ప్రకాశించేవాడు, వణ్ తడక్కై = ఉదారమైన, గొప్ప శ్రీహస్తాలను కలవాడు అయిన, మాల్ =సర్వాధికుడు

(స్వామి), పయిన్జదు = నిత్యవాసం చేయడం, అరఙ్గమ్ తిరుక్కోట్టి = శ్రీరంగం లోను, తిరుక్కోట్టియూర్‌లోను, పల్ నాళ్ = చిరకాలం, పయిన్జ తువుమ్= నిత్యవాసం చేయడం కూడా, వేఙ్గడమే = తిరుమలలోను, అణి తిక*ழு*మ్ శోలై = అందంతో వెలిగే తోటలను కల్గినది, అణి= ఈ భూలోకానికి అలంకారంవంటిది అయిన, నీర్ మలై= తిరునీర్‌మలై అనే దివ్యదేశంలోను.

నీలమణివలె దర్శించినవారి శ్రమ తీరేటట్లుగా ప్రకాశించే నల్లని తిరుమేనిని కలవాడై, ఆ దివ్యమంగళరూపాన్ని అందటికీ సర్వస్వదానాన్ని చేసే ఔదార్యాన్ని కలవాడై, దానం చేసి చేసి దీర్ఘమైన బాహువులను కలవాడు సర్వేశ్వరుడని భావం. ఇక్కడ కేవలం శ్రీరంగం, తిరుక్కోట్టియూర్, తిరుమలై, తిరునీర్‌మలై - అనే నాల్గు తిరుపతులను మాత్రమే ప్రస్తావించినా, అవి దివ్యదేశాలను అన్నిటిని ఉపలక్షిస్తాయి. పూర్వం తెల్పిన రీతిలో భగవానుడు అభిమానించి వసించే దివ్యదేశాలకు లెక్కలేదని భావం.

అవ :- అతడు ఈ రీతిలో పలు తిరుపతులలో ప్రవేశించి, తన పలు స్థితులలోని సన్నివేశాలను దర్శింపజేసి, మిమ్ములను పొందాలని ప్రయత్నించడం స్వభావంగా కల్గినవాడై ఉన్నాడు, మీరు అందఱు కృతజ్ఞతా పూర్వకంగా అతనిని ఆశ్రయించండి- అని అంటున్నారు.

**47.** మాలై యరియురువన్ పాత మలరణిన్దు
కాలై తొ*ழு*తె*ழு*మిన్ కైకోలి- ఞాలమ్
అళన్దిడన్దుణ్డుమి*ழ*్న్ద అణ్ణలై మ*ఱ్ఱ*ల్లాల్
ఉళమ్ కిడన్ద ఆ*ఱ్ఱా*లుణర్న్దు

ఞాలమ్ = భూమి సమస్తం, అళన్దు = (అవలీలగా) కొలిచి, ఇడన్దు = (వరాహరూపియై) ఉద్ధరించి, ఉణ్డు = (ప్రళయంలో) తన ఉదరంలోపల ఉంచుకొని, ఉమి*ழ*్న్ద = తరువాత వ్యక్తం చేసి- ఈ విధంగా పలు రీతుల్లో (రక్షణకార్యాన్ని) చేసిన, అణ్ణలై = సర్వస్వామి అయిన భగవానుని, మ*ఱ్ఱు* అల్లాల్ = పూర్వం తెల్పిన రీతిలోని రక్షణ కార్యాలనే కాక, ఉళమ్ కిడన్ద ఆ*ఱ్ఱా*ల్= (భక్తుల మనస్సును కఱగిస్తూ, వారి) మనస్సులో ఉండే రీతులతో



పాటు, ఉణర్న్దు = అనుసంధించి, (పూర్వం ఒకానొక సమయంలో ప్రహ్లాదునకు అనుగ్రహించడంకోసం) అరి ఉరువన్ = నృసింహమూర్తిగా ఆవిర్భవించిన ఆ స్వామియొక్క, పాద మలర్ = శ్రీపాదపద్మాలను, మాలై అణిన్దు = మాలికలతో అలంకరించి, కాలై =ప్రాతఃకాలంలో, కై కోలి తొ*ழு*దు = చేతులను జోడించి, నమస్కరించి, ఎ*ழு*మిన్ = ఉజ్జీవించండి.

**"మ*ఱ్ఱ*ల్లాల్"**- లోకాలను కొలిచి, ఉద్ధరించి, ఆరగించి, వెలువరించి -అని సకలజీవులకు సాధారంగా చేసే ఈ లీలలకు మించి, విలక్షణంగా ప్రత్యేకంగా భక్తులకు చేసే కార్యాలను ఈ ప్రయోగం తెలుపుతున్నదని అనవచ్చు. అపుడు **"ఉళమ్ కిడన్ద ఆ*ఱ్ఱా*ల్ ఉణర్న్దు"** అనే ప్రయోగానికి - భక్తులు "ఇదికూడా ఒక సౌశీల్య గుణమా!'' అని వారి మనస్సు ద్రవించేటట్లు వారి మనస్సులో నాటుకొని ఉండే గుణాలు, లీలలు, మొదలైనవానితో పాటు తెలిసికొని, అనుసంధిస్తూ, భక్తునికోసమే ఆవిర్భవించిన నృసింహుని ఆశ్రయించి, తరించండి'' అని అంటున్నారని భావం.

అవ :- **"ఉళమ్ కిడన్ద ఆ*ఱ్ఱ*ల్"** అని అనే రీతిలో "భక్తులకు మఱువరాని విధంగా నేను చేసిన లీలలు ఏవి?'' అని అంటే, "అందఱూ నిన్ను తెలిసికొనే టట్లుగా ఉండే నీ లీలలకు ఒక ఎల్ల ఉన్నదా స్వామీ!''- అని ఇందులో అంటున్నారు.

**48.** ఉణర్న్దాయ్ మఱై నాన్గుమ్ ఓతినాయ్ నీతి
మణన్దాయ్ మలర్మకళ్‌తోళ్ మాలే! - మణన్దాయ్ పోయ్
వేయిరుమ్ శారల్ వియలిరు ఞాలమ్ శూ*ழ*్
మాయిరుమ్ శోలైమలై

మాలే = ఆశ్రితవ్యామోహాన్ని కలవాడా !, మఱై నాన్గుమ్ = నాల్గు వేదాలను, ఉణర్న్దాయ్ = (ప్రతిప్రళయంలోను) జ్ఞాపకం పెట్టుకొని తరువాత వ్యక్తం చేస్తున్నావు, నీతి = ఆ వేదాల అర్థాలను వివరించగల స్మృత్యాది వేదోప బృంహణాలను,ఓదినాయ్= (మన్వాది మహర్షులమూలంగా) అనుగ్రహిస్తున్నావు, మలర్ మకళ్ = తామరపూవులో జన్మించిన లక్ష్మీదేవియొక్క, తోళ్ = బాహువులతో, మణన్దాయ్ = కలసి ఆనందిస్తున్నావు, వేయ్ ఇరుమ్ శారల్ =

వెదుళ్ళతో నిండిన పర్వతసానువులను కల్గినది, వియల్ = అద్భుతమైనది, ఇరు ఞాలమ్ శూఴ్ = విశాలమైన ఈ భూమిలో ఉండేవారిచే ప్రదక్షిణం చేయబడేది అయిన, మా ఇరుమ్ శోలై మలై పోయ్= తిరుమాలిరుమ్‌శోలైకు వచ్చి, మణన్దాయ్ = మనస్సులో సంతోషించి, నిత్యవాసం చేస్తున్నావు.

సంసారులుకూడా అనుభవించేటట్లుగా వారితో కలసి వర్తించడంకోసం, వెదుళ్ళు నిండుగా ఉండే కొండచరియలను కల్గినది, ఆశ్చర్యకరమైనది, విస్తారమైన భూమండలంలో నివసించేవారిచేత ప్రదక్షిణం చేయబడేది, ఉన్నత మైన, బాగా పెరిగిన ఉద్యానవనాలను కల్గినది అయిన తిరుమాలిరుఞ్జోలైను చేరి, ఉన్నావు. ఈ విధంగానీ భక్తులు మరువలేని రీతిలో నీవు చేసిన లీలలు అంతులేనివి కదా !- అని భావం.

అవ :- "ఓ మనసా! అతడు మనకోసం ఈ విధంగా తిరుమాలిరుమ్‌శోలై పర్వతాన్ని అభిలషించి, సులభుడై ఉన్నపుడు "నేను అతనిని పొందడానికి నా అనాది పాపాలు ఆటంకంగా ఉన్నాయి కదా!'' అని భయపడకుండా, లోకం అంతా ప్రతిధ్వనించేటట్లుగా అతని పేరును చెబుతూ పిలు'' - అని ఆఴ్వార్లు తమ మనస్సుతో అంటున్నారు.

**49. మలై యేఴుమ్ మానిలఙ్గళేఴు మతిర**
**కులైశూఴ్ కురైకడల్‌క ళేఴుమ్- ములై శూఴ్న్ద**
**నఞ్జురత్తు ప్పెణ్ణై నవిన్‌ఱుణ్డ నావనెన్ఱు**
**అఞ్జాతెన్నెఞ్జే! యఴై**

ఎన్ నెఞ్జే = నా మనసా!, మలై ఏఴుమ్ = ఏడు కులపర్వతాలు, మా నిలఙ్గళ్ ఏఴుమ్ = ఏడు ద్వీపాలు, కులై శూఴ్ కురై కడల్‌కళ్ ఏఴుమ్ = తీరంచే పరివేష్ఠితాలై, ధ్వనించే ఏడు సాగరాలు, అదితిర = ప్రతిధ్వనించేటట్లు, ములై శూఴ్న్ద నఞ్జు ఉరత్తు పెణ్ణై = స్తనంలో వ్యాపించిన విషంవల్ల కల్గిన క్రౌర్యాన్ని కల (పూతన అనే) పిశాచస్త్రీని, నవిన్ఱు = (స్తన్యాన్ని తాగేటపుడు అపుడపుడు మధురమైన వాక్కులను) పల్కుతూ, ఉణ్డ= ఆరగించి, వధించిన, నావన్ ఎన్ఱు = పెదవిని (నాలుకను) కలవాడా!- అని పల్కి, అఞ్జాతు = (ఆటం



కాలను చూచి) భయపడకుండా, అఴై = నోఱు తెఱచి పిలు. (లోకం అంతా ప్రతిధ్వనించేటట్లు పిలు - అని అన్వయం.)

అవ :- ఈవిధంగా భగవానుని పిలువమని పల్కి మనస్సును నియ మించిన ఆఴ్వార్లు శ్రీకృష్ణావతారప్రస్తావం రాగానే, ఆ అవతారంలో రేపల్లెలోని గోపికలు అతని తిరునామాలను తమ ప్రేమాతిశయంవల్ల కల్గిన ఆర్తి స్ఫురించే టట్లుగా పల్కినట్లే, తమ మనస్సుకంటే ముందుగా తామే ముందుగా ఆక్రందిస్తున్నారు.

**50. అఴైప్పన్ తిరుమాలై అఙ్గవర్‌కళ్ శొన్న**
**పిఴైప్పిల్ పెరుమ్బెయరే పేశి- ఇఴైప్పరియ**
**వాయవనే! యాతవనే! యెన్ఱవనై యార్ ముకప్పుమ్**
**మాయవనే యెన్ఱు మతిత్తు**

ఇఴైప్పు అరియ = భావించడానికి అరుదైన, ఆయవనే = గోపాలుడై పుట్టినవాడా!, యాతవనే = యాదవవంశంలో (వసుదేవునకు సుతుడై) అవతరించినవాడా!, ఎన్ఱు = అని, పల్కి, మాయవనే ఎన్ఱు = గుణచేష్టితాలతో ఆశ్చర్యభూతుడా! అని, మతిత్తు= అనుసంధిస్తూ, అఙ్గు అవర్‌కళ్ శొన్న = ఆ రేపల్లెలో ఉన్నవారు పలికి పిల్చిన, పిఴైప్పు ఇల్ పెరు పెయరే పేశి = అనుసంధించినవారిని అభినివిష్టులనుగా చేసి, ఆహ్వానించే గొప్ప తిరునామాలనే పల్కి, యార్ ముకప్పుమ్ = అందరి సమక్షంలో, తిరుమాలై అవనై = శ్రియః పతి అయిన అతనిని, అఴైప్పన్ = పిలుస్తున్నాను.

**"నెఞ్జే! యఴై"** అని నియమించిన మనస్సుకంటే ముందుగానే నేను పిలుస్తున్నాను - అని భావం. రేపల్లెలో గోపికలపట్ల కరుణను చూపించినట్లే, మన విషయంలోకూడా దయ చూపిస్తాడని పిలుస్తున్నాను- అని హార్ద భావం.

అవ :- గడచిన పాశురంలో **"పిఴైప్పిల్ పెరుమ్ పెయర్"** అన్నట్లు దోషం లేని స్వామి గొప్ప తిరునామాన్ని అనుసంధించాలని ముందుకు వచ్చినందున కలతతో బాధపడ్డారు. "మనసా! నీవు నావలె కలతచెంది, బాధపడకుండా, అతని అందం మొదలైనవానిని ప్రత్యేకంగా ధరించి నిలచి, అనుభవించాలని చూడు''- అని అంటున్నారు.

51. మతిక్కణ్డాయ్ నెఞ్జే ! మణివణ్ణన్ పాతమ్
మతిక్కణ్డాయ్ మఱ్ఱవన్ పేర్‌తన్నై- మతిక్కణ్డాయ్
పేరాழி నిన్ఱు పెయర్‌న్దు కడల్ కడైన్ద
నీరాழிవణ్ణన్ నిఱమ్

నెఞ్జే = మనసా!, మణి వణ్ణన్ పాతమ్ = నీలమణివర్ణుడైన భగవానుని శ్రీపాదాలను, మతికణ్డాయ్ = మనస్సులో దర్శించు, మఱ్ఱు = మఱియు, అవన్ పేర్ తన్నై = ఆ స్వామి తిరునామాలను, మతి కణ్డాయ్ = మనస్సులో అనుసంధించు, పేర్ ఆழி నిన్ఱు పెయర్‌న్దు = గొప్ప పాలసముద్రంలోనుండి నిద్ర లేచి, కడల్ కడైన్ద= (దేవతలు కోరిన అమృతాన్ని ఇవ్వడం కోసం) ఆ సముద్రాన్ని చిలికిన, నీరాழி వణ్ణన్ నిఱమ్ = సముద్రవర్ణుడైన ఆ స్వామి యొక్క తిరుమేని వర్ణాన్ని, మతికణ్డాయ్ = మనసులో ధ్యానించు.

నిండుగా నీటిని కల సముద్రంయొక్క వర్ణంవంటి వర్ణాన్ని కల దివ్య మంగళ రూపాన్ని కలవాని వర్ణాన్ని దేవతలవలె ప్రయోజనాంతరాలలో ఆసక్తుడవు కాకుండా స్వయం ప్రయోజనంగా అనుభవించు. ఈవిధంగా మెల్లిమెల్లిగా అనుభవించాలే తప్ప ఉజ్జీవించే దారి నీకు వేఱే లేదు.

అవ :- తమకంటే ముందంజ వేసి నిలిచే తమ మనస్సుకుకూడా ఉపదేశించ గల జ్ఞానగౌరవాన్ని కల్గిన తమను కూడా కాళ్ళు గడగడలాడేటట్లు, మనస్సు నీరయేటట్లు, కళ్ళు సుడులు తిరిగేటట్లు చేసిన శ్రీమన్నారాయణుని రూపసౌందర్యాన్ని, లక్ష్మీదేవితో పాటు కలసి ఉండే ఆ చేరికవల్ల కల్గిన ఆ గొప్ప కరుణను అనుసంధించి, ఈ కృపను పరిచ్ఛేదించి తెలియడానికి ఎవరికీ వీలు కాదుసుమా! - అని అంటున్నారు.

52. నిఱక్కరియన్ శెయ్య నెడుమలరాళ్ మార్వన్
అఱమ్బెరియ నారతఱివార్- మఱమ్బురిన్ద
వాళరక్కన్ పోల్వానై వానవర్‌కోన్ తానత్తు
నీళిరుక్కైక్కుయ్‌త్తాన్ నెఱి

నిఱమ్ కరియన్ = నీరు నిండిన మేఘంవలె నల్లని వర్ణాన్ని కలవాడు, శెయ్య నెడు మలరాళ్ మార్వన్ = ఎఱ్ఱని వర్ణాన్ని కల్గినదై, పెద్ద తామరపూవును



నివాసస్థానంగా కల్గిన లక్ష్మీదేవిని వక్షఃస్థలంలో కలవాడైన స్వామి, అఱమ్ పెరియన్ = కృపలో గొప్పవాడు, మఱమ్ పురిన్ద = పగను మనస్సులో కల్గిన, వాళ్ అరక్కన్ పోల్‌వానై = చేతిలో ఖడ్గాన్ని కల రావణునివంటి మహాబలిని, (రావణునివలెనే శిరచ్ఛేదం చేయవలసి ఉన్నా, ఆ విధంగానే చేయకుండా), వానవర్ కోన్ తానత్తు = దేవేంద్రుని లోకం అయిన స్వర్గంలో, నీళ్ ఇరుక్కైక్కు= చాలా కాలం ఉజ్జీవించడానికి తగినట్లు, నెఱి = పాతాళలోకంలో, ఉయ్‌త్తాన్= ప్రవర్తించిన ఆ స్వామియొక్క, అతు = వాచామగోచరం అయిన ఆ కృపా ప్రకారాన్ని, ఆర్ అఱివార్ = ఎవరు ఇంతటిది అని పరిచ్ఛేదించి తెలిసి కొనగలరు?

**"వానవర్‌కోన్ తానత్తు నీళిరుక్కైక్కు..... ఆర్ అఱివార్"** - బలి ఆశపడ్డ ఇంద్రపదవిని రాబోయే మన్వంతరం పూర్తిగా ఇతడే పొందేటట్లుగా ఇపుడు పాతాళలోకంలో గొప్ప భోగాన్ని అనుగ్రహించాడు. ఇటువంటివాని కరుణను ఇంతటిది అని పరిచ్ఛేదించి తెలియడం ఎవరికి సాధ్యం?- అని పెరియ వాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్య. దేవాధిదేవుడైన ఇంద్రుని స్వర్గంవలె చాలా గొప్పదై ఉండే పాతాళలోకంలో, ఆ ఇంద్రునివలె రాజ్యాన్ని కోల్పోయి దుఃఖించనక్కరలేకుండా ఉండేటట్లుగా చిరకాలం ఉండేటట్లు చేసిన సర్వేశ్వరుని ఆ కృపాప్రకారాన్ని ఎవరు తెలియగలరు? - అని అప్పిళ్ళై నిర్వాహం. **"వానవర్‌కోన్ తానత్తు"** అనే ప్రయోగం ఇంద్రలోకాన్ని తెలిపినా ఇక్కడ అది దానివలె గొప్పదైన పాతాళరాజ్యాన్ని లక్షిస్తుంది. **"నెఱి"** అనే పదం పెరియవాచ్చాన్ పిళ్ళైవ్యాఖ్యలో పాతాళాన్ని, అప్పిళ్ళైవ్యాఖ్యలో కృపామార్గాన్ని తెలుపుతుంది. ఈ రీతిలో ఈ రెండు నిర్వాహాలలోను భగవానుని అంతులేని కృపావైభవం ప్రతిపాదింప బడింది.

అవ :- ఈ విధంగా అసురులపట్ల దాక్షిణ్యాన్ని చూపేవాడు మనం అందఱం కన్నులతో చూడగలిగేటట్లుగా ఇక్కడకు వచ్చి నిత్యవాసం చేసే తిరుమలైయే మనం ఆదరించే దివ్యదేశం- అని అంటున్నారు.

53. నెఱియార్ కుழల్‌కఱ్ఱై మున్నిన్ఱు పిన్ తాழ்న్దు
అఱియాతిళమ్ గిరి యెన్ఱెణ్ణి- పిరియాతు

పూఙ్గొడిక్కళ్ వైకుమ్ పొరు పునల్ కున్ఱెన్నుమ్
వేఙ్గడమే యామ్ విరుమ్బుమ్ వెఱ్పు

నెఱియార్ అఱియాదు = వీరు తిరుమలై దారినే ఆశ్రయించుకొని ఉన్నవారు అని (అచేతనాలైన పూల తీగలు) తెలియక, కు*ழల్* క*ఱ్ఱై* మున్ నిన్ఱు పిన్ తా*ழ్*న్దు = వారి కేశపాశాన్ని ముందునుండి ముడివేసి, వెనుకకు వేలాడదీసికొని (ఉండడంవల్ల), ఇళమ్ కిరి ఎన్ఱు ఎణ్ణి = ఇది ఒక చిన్న పర్వతం అని భావిస్తూ, పూమ్ కొడికళ్ = పూలతీగలు, పిరియాదు = అక్కడినుండి విడిచిపోకుండా, వైకుమ్ = నిత్యవాసం చేసే, పొరు పునల్ కున్ఱు ఎన్నుమ్ = అలలు లేచే కొండవాగులను కల, తిరుమలై అని ప్రసిద్ధమైన, వేఙ్గడమే = శ్రీవేంకటాచలమే, యామ్ విరుమ్బుమ్ = భగవత్ప్రావణ్యాన్ని కల మేము ఆశపడడానికి తగిన, వెఱ్పు = కొండ.

అవ :- ఈ విధంగా, ఆ*ழ్*వార్లు అతనిని (భగవానుని) ఆశపడడంతో మాత్రమేకాకుండా, అతడు ఆదరంతో నివసించే తిరుమలైనుకూడా ఆదరించడం ప్రారంభించగానే, సర్వేశ్వరుడు, పాలసముద్రంలోను, రెండు తిరుమలైలలోను (వేంకటాచలంలో, తిరుమాలిరుమ్ శోలైలో - అనే రెండిటిలో) చూపే ఆదరాన్ని వీరి మనస్సులోనే కల్గి ఉన్నవాడై, అత్యంతం అభినివేశాన్ని కలవాడు కావడాన్ని గమనించి, 'స్వామీ! బాలాలయాలవంటి వీటిని (క్షీరాబ్ధిని, రెండు తిరుమలలను) విడువకూడదు సుమా!'' అని ఈ పాశురంలో అంటున్నారు.

**54.** వెఱ్పెన్ఱిరుఞ్జోలై వేఙ్గడ మెన్ఱివ్విరణ్డుమ్
నిఱ్పెన్ఱు నీ మతిక్కుమ్ నీర్మైపోల్- నిఱ్ప
న్ఱుళఙ్గోయిల్ ఉళ్ళమ్ వైత్తుళ్ళినేన్ వెళ్ళ
త్తిళఙ్గోయిల్ కైవిడే లెన్ఱు

వెఱ్పు ఎన్ఱ = తిరుమలై అనబడే, ఇరుమ్ శోలై = తిరుమాలిరుమ్ శోలై, వేఙ్గడమ్ = శ్రీవేంకటాచలం, ఎన్ఱ = అనే ఈ రెండు దివ్యదేశాలలో, నిఱ్పు ఎన్ఱు = నేను ఆదరంతో వేంచేసి ఉండే చోటు- అని, నీ మతిక్కుమ్ నీర్మైపోల్= నీవు మనస్సులో ఆదరాన్ని కల్గి ఉన్నట్లే, ఉళమ్ కోయిల్ = (నా) హృదయం



అనే కోవెలను, నిఱ్పు ఎన్ఱు = నేను సంతోషంతో నివసించే చోటు- అని, ఉళ్ళమ్ వైత్తు = నీ మనస్సులో భావించడాన్ని తెలిసికొని, వెళ్ళత్తు ఇళమ్ కోయిల్ = క్షీరాబ్ధి అనే బాలాలయాన్ని, కై విడేల్ ఎన్ఱు = చేయి విడువకు అని, ఉళ్ళినేన్ = ప్రార్థించాను.

ఇక్కడ చెప్పబడ్డ పాలకడలి మిగిలిన దివ్యదేశాలను అన్నిటినీ లక్షిస్తుంది. "స్వామీ! క్షీరాబ్ధి అనే స్థానం నా మనస్సు అనే గొప్ప కోవెల లభించడానికి ముందు నీకు కోవెలగా ఉండేది- అనే కృతజ్ఞతచేత, నేను అభిమానించినది అయినందువల్ల నీవు విడువరాదుసుమా! అని ప్రార్థించాను. ఈ దేశవాసం వల్లనేకదా నేను ఇతనిని పొందగలిగాను- అని క్షీరాబ్ధి నీకు చేసిన ఉపకారాన్ని అనుసంధించి అయినా నీవు దానిని విడువవద్దు. ఇదేకదా నన్ను సర్వేశ్వరుడు పొందడానికి తగిన చోటు అయింది - అనే అనుసంధానంతో నేను క్షీరాబ్ధిని అభిమానించి నందువల్లకూడా నీవు దానిని విడువవద్దు- అని భావం.

అవ :- "ఈ విధంగా నీవు నా విషయంలో ఆదరాన్ని కల్గి ఉండి, అనాదికాలంగా ప్రయత్నించి, నిన్ను భావించడమన్నదే అరుదుగా ఉండే ఈ సంసారంలో, నిన్నే భావించేటట్లుగా నన్ను చేశావే! ఇట్టి జ్ఞానాన్ని పొందించిన నీవే తత్ఫలం అయిన నీ అనుభవాన్నికూడా నాకు ప్రసాదించాలి స్వామీ!'' అని అంటున్నారు.

**55.** ఎన్ఱు మఱన్దఱియేన్ ఏ*ழ్* పిఱప్పు మెప్పొ*ழు*తుమ్
నిన్ఱు నినైప్పొ*ழి*యా నీర్మైయాల్ -వెన్ఱి
అడలా*ழి* కొణ్డ అఱివనే! ఇన్బ
క్కడలా*ழి* నీ యరుళి క్కాణ్

వెన్ఱి = జయాన్నే పొందేది, అడల్ = శత్రువులతో పోరాడే స్వభావాన్ని కల్గినదైన, ఆ*ழి* = చక్రాన్ని, కొణ్డ =చేతిలో ధరించిన, అఱివనే = సర్వజ్ఞుడవైన స్వామీ!, నీ = ఈ విధంగా ఉండే నీవు, ఏ*ழ్* పిఱప్పుమ్ = అన్ని జన్మలలోను, ఎప్పొ*ழు*దుమ్ = అన్ని స్థితులలోను, నిన్ఱు నినైప్పు ఒ*ழி*యా నీర్మైయాల్= స్థిరంగా ఉండి, నన్ను గూర్చిన స్మరణ తప్పకుండా ఉన్నందున, ఎన్ఱుమ్

మఱన్దఱియేన్= నిన్ను ఏనాడూ మఱచినవాడను కాను, ఇన్బమ్ కడల్ ఆ*ழி*= ఆనందమహాసముద్రాన్ని, అరుళి క్కాణ్ = నాకు అనుగ్రహించాలి.

**“కడల్, ఆ*ழி*”** - అనే పదాలు రెండూ ఒకే అర్థాన్ని ఇచ్చేవి. ఈరెండూ వెంటవెంటనే ప్రయోగింపబడినందువల్ల “చాలా గొప్ప'' అనే అర్థం సూచింపబడింది. **“ఏష హ్యేవానందయాతి”** అని అంటూ వేదం తెలిపినందువల్ల, పరమపదానికి వెళ్ళి, పరిపూర్ణంగా నిన్ను అనుభవించడంద్వారా కలిగే చాలా గొప్ప ఆనందాన్ని నీవే నాకు అనుగ్రహించాలి- అని భావం.

అవ :- ముందు పాశురంలో చెప్పినట్లుగా ఫలం ఆ భగవానునివల్లనే కల్గుతుందని నిశ్చయించుకొని ఉండే మీరు, భగవానుడు మిమ్ములను కృపజేసే సమయంవరకు మీ శేషత్వానుగుణంగా సహించి ఉండవలసిఉండగా, **“అరుళి క్కాణ్”** అని స్వామి ఒడిని పట్టి నిర్బంధించ వచ్చునా?'' అనే ప్రశ్న లేవగా, “అధికమైన ఆశవల్ల నా స్వరూపాన్ని గమనించలేని నాకు, పురుషకారభూతురాలైన అయిన పిరాట్టికూడా అక్కడే స్వామి చెంతనే ఉన్నపుడు ఆలస్యాన్ని సహించి ఉండడం సాధ్యమా!'' అని ఈ పాశురంలో అంటున్నారు.

**56.** **కాణ క్క*ழி*కాతల్ కైమిక్కు క్కాట్టినాల్**
**నాణప్పడు మెన్టాల్ నాణుమే- పేణి**
**క్కరుమాలై ప్పొన్ మేని కాట్టామున్ కాట్టుమ్**
**తిరుమాలై నఙ్గళ్ తిరు**

తిరు మాలై కాణ క్క*ழி* కాతల్ = “భగవానుని సేవించాలి'' అనే తీవ్రమైన కోఱికను, కైమిక్కు క్కాట్టినాల్ = ఇంకా ఇంకా పొందినట్లయితే, నాణప్పడుమ్ ఎన్టాల్= సహించి ఉండాలి - అని అంటే, నాణుమో = సహించడం సాధ్యమా, కరు మాలై = నల్లని వర్ణాన్ని కల ఆ శ్రియఃపతి, పొన్ మేని కాట్టా మున్ = అతని అందమైన తిరుమేనిని దర్శింపజేయడానికి ముందే, నఙ్గళ్ తిరు = మనకు పురుషకారభూత అయిన లక్ష్మి, కాట్టుమ్ = దర్శింపజేస్తుంది.

తన బిడ్డలు అయిన మనపట్ల గల వాత్సల్యంచేత మనలను ఆదరించి వచ్చి, నేరుగా దర్శింపజేస్తుంది. **“న కశ్చి న్నాపరాధ్యతి”** అని అంటూ తానే



ముందుకు వచ్చి స్వామితో మనలను చేర్పించే పురుషకారభూత అయిన లక్ష్మి కూడా అక్కడ ఉన్నపుడు “అతనిని పొందాలని త్వరపడడం మనస్వరూపానికి విరుద్ధం'' అని లజ్జించి, అణగి ఉండడం సాధ్యం కాదని భావం.

అవ :- ఈ రీతిలో పురుషకారస్వరూపిణి అయిన లక్ష్మితో కూడిఉండే పరమపురుషుడే అందఱికి ఆశ్రయణీయుడు- అని అంటున్నారు.

**57.** **తిరుమఙ్గై నిన్డరుళుమ్ తెయ్‌వమ్ నా వా*ழ்*త్తుమ్**
**కరుమమ్ కడైప్పిడిమిన్ కణ్డీర్ - ఉరిమైయాల్**
**ఏత్తినోమ్ పాతమ్ ఇరున్దడక్కై యెన్దైపేర్**
**నా*ఱ్ఱి*శైయుమ్ కేట్టీరే నామ్**

తిరు మఙ్గై = లక్ష్మీదేవి, నిన్దరుళమ్ తెయ్‌వమ్ = నిత్యవాసం చేసే స్వామియే, నా వా*ழ்*త్తుమ్ కరుమమ్ = జిహ్వాతో కీర్తించడం అనే కార్యాన్ని, కడై ప్పిడిమిన్ కణ్డీర్ = స్థిరంగా ఆశ్రయించండి, నామ్ = మేమయితే, ఇరు తడ కై ఎన్దై = చాలా దీర్ఘమైన బాహువులను కలవాడైన భగవానునియొక్క, పాదమ్ = శ్రీచరణాలను, పేర్ = తిరునామాలతో, ఉరిమైయాల్ = స్వరూపప్రాప్తితో (సహజసంబంధంతో), ఏత్తినోమ్ = స్తుతించేవారమై ఉన్నాము, (ఈ విషయాన్ని) నాల్ తిశైయుమ్ = నాల్గు దిక్కులలో ఉండే వారుకూడా, కేట్టీరే = విన్నారా!

“సభలో సాధారణంగా చెప్పిన మాట'' అని అనుకోకుండా, మీకు ఒక్కొక్కరికి ప్రత్యేకంగా చెప్పిన మాట - అని గ్రహించి అనుష్ఠించండి- అని ఉత్తర భాగంతో అన్వయించి అర్థం చెప్పవచ్చు.

అవ :- మనకు ఈ మంచి అంతా సర్వేశ్వరుని కటాక్షంవల్లనే కల్గినది - అని ఇందులో అంటున్నారు.

**58.** **నాన్ పె*ఱ్ఱ* నన్మైయుమ్ నామఙ్గై నన్నెఞ్జత్తు**
**ఓమ్బి యిరున్దెమ్మై యోతువిత్తు- వేమ్బిన్**
**పొరుళ్ నీర్మై యాయినుమ్ పొన్నా*ழி* పాడెన్టు**
**అరుళ్ నీర్ మై తన్దవరుళ్**

వేమ్బు పొరుళ్ నీర్మై ఆయినుమ్ = (భగవానుని కీర్తించడం అన్నది) వేప అనే వస్తువుయొక్క స్వభావంవలె చాలా చేదుగా తోచినా, పొన్ ఆ౫ి = అందమైన శ్రీసుదర్శనాన్ని కలవానిని, పాడు ఎన్ఱు = పాడు, కీర్తించు - అని, నా మజ్ఞై = సరస్వతీదేవి, నల్ నెఞ్జత్తు = మన మంచిమనస్సుతో, ఓమ్బి ఇరున్ద = ఆదరించి ఉండి, ఎమ్మై = మనకు, ఓ దువిత్తు = భగవద్విషయాన్ని చెప్పగా, నామ్ పెఱ్ఱ నన్మైయుమ్ = మనం పొందిన, కవిత్వం చెప్పడమనే మంచిని, అరుళుమ్ నీర్మై తన్ద అరుళ్ = కృపనే సహజంగా కల సర్వేశ్వరుని అనుగ్రహంవల్ల కల్గింది.

రాజపుత్రులు మహారాజు గొప్పతనాన్ని తెలిసినవారైనా, దానిని మాటలతో వర్ణించడం వారికి తెలియనపుడు, ఇష్టం లేనపుడు, రసహీనంగా ఉండే వాటినికూడా తమ వాగ్బలంతో రసవంతంగా చేసి చూపగల్గినది, తమ స్వరూపానికి తగినట్లుగా సౌశీల్యంతో ప్రవర్తించేది, ఆ రాజపుత్రులకు మహారాజుయొక్క గొప్పతనాన్ని వర్ణించి చెప్పే తీరునుగూర్చి నేర్పించే ముదుసలి దాసివలె, సరస్వతికూడా ఈ ఆళ్వార్లకు భగవద్విషయాన్ని పాడడం చేదుగా తోచే స్థితిని పోగొట్టి, ఆ విషయాన్ని వర్ణించడమే జీవనవృత్తిగా ఉండేటట్లు చేసింది-అని పెరియవాచ్చాన్పిళ్ళై వ్యాఖ్య. ఈ రీతిలో సరస్వతీదేవి నేర్పించగా, మనం అరుదైన ఫలంగా పొందిన భగవద్విషయస్తుతికి కారణం అయిన ఈ హితంకూడా, అనుగ్రహించడాన్నే స్వభావంగా కల సర్వేశ్వరుడు నిర్హేతుకంగా నా పట్ల ప్రవహించిన కృపాప్రవాహంవల్ల కల్గింది- అని ఈ పాశురాన్ని అప్పిళ్ళై వివరించారు. ఆ వివరణం **"వేమ్బిన్... పాడు ఎన్ఱు ఓదు విత్తు"** అనే అన్వయాన్ని అనుసరించి వేయబడింది. **"వేమ్బిన్ .......పాడెన్ఱు అరుళ్ నీర్మైక్కు తన్ద అరుళ్"** అని పాశురంలో ఉండే క్రమాన్నే అనుసరిస్తూ పెరియవాచ్చాన్పిళ్ళై వివరించారు. "నా విషయంలోని ఈ స్తుతి వేపవలె నీకు చేదుగా తోచినా, దీన్నే పాడు'' అని పల్కి, నన్ను కరుణిస్తే తప్ప నిలువలేని ఆ సర్వేశ్వరుని కృపవల్ల సరస్వతీదేవి నా మనస్సులో నిలచి, భగద్వైభవాన్ని పాడే క్రమాన్ని నాకు నేర్పించింది. అందువల్లనే నేను ఈ హితాన్ని పొందాను'' అని పెరియవాచ్చాన్పిళ్ళై వ్యాఖ్యలోని భావం. సరస్వతీదేవి సహాయపడడానికి కూడా భగవత్కృపే కారణమని భావం.



అవ:- సర్వేశ్వరుడు నిర్హేతుకంగా నన్ను కటాక్షించినందువల్ల, నేను అతని శ్రీపాదాలనే ప్రాప్యప్రాపకాలుగా ఆశ్రయించాను- అని ఇందులో అంటున్నారు.

**59. అరుళ్ పురిన్ద శిన్దై అడియార్మేల్ వైత్తు**
**పొరుళ్ తెరిన్దుకాణ్ కుఱ్ఱవప్పోతు- ఇరుళ్ తిరిన్దు**
**నోక్కినేన్ నోక్కి నినైన్దే నతొణ్కమలమ్**
**ఓక్కినే నెన్నైయు మఙ్గోర్న్దు**

అరుళ్ పురిన్ద శిన్దై = దయను చూపడంలో స్థైర్యాన్ని కల మనస్సును, అడియార్ మేల్ వైత్తు = దాసులమైన మాపై నిలిపి, పొరుళ్ తెరిన్దు = ఒక వస్తువు కాని మమ్ములను ఒక వస్తువుగా భావించి, కాణ్ కుఱ్ఱ అప్పోతు = కటాక్షించే కాలంలో, ఇరుళ్ తిరిన్దు= అజ్ఞాన తమస్సు తొలగి, నోక్కినేన్ = జీవ-పరస్వరూపాలను తెలిసికొన్నాను, నోక్కి = ఆ విధంగా పరిశీలించి తెలిసి కొని, ఒణ్ కమలమ్ అతు = అందమైన తామరపూలు - అనే రీతిలో ఉండే ఆ శ్రీచరణాలను, నినైన్దేన్ = (ప్రాప్యంగా) అనుసంధించాను, ఓర్న్దు = (ఈ శ్రీపాదాలు తప్ప మనకు వేఱే గతి లేదు- అని) తెలిసికొని, ఎన్నైయుమ్= ఆత్మను కూడా, అఙ్గు = ఆ శ్రీపాదాలలో, ఒక్కినేన్ = సమర్పించాను.

తన ప్రాప్తికి తానే సాధనం అయిన ఆ స్వామి శ్రీచరణాలలో నా ఆత్మను సమర్పించాను. ఉపేయం అయిన భగవానుని చరణాలనే ఉపాయమని అధ్యవసించానని భావం. **"త్వమేవోపాయ భూతో మే భవేతి ప్రార్థనామతిః శరణాగతిః"** అనే పాంచరాత్ర ప్రమాణానుసారం ఇదే కదా శరణాగతి. ఇందువల్ల, తన కరుణచేత ప్రేరేపింపబడ్డ మనస్సును కల భగవానుడు ఏ ఉపాయానుష్ఠానాన్ని ఎదురు చూడకుండా ఈ ఆళ్వార్లను అనుగ్రహించిన రీతిని, ఆ కటాక్షంవల్ల స్వరూపం, ప్రాప్యం, ప్రాపకం- మొదలైనవానిని వీరు తెలిసిన రీతిని, అతనిని పొందాలనే ఆర్తిని "అతడే ప్రాప్యం'' అనే అధ్య వసాయం కల్గిన రీతిని ఆళ్వార్లు తెలిపినట్లయింది.

అవ :- అతినీచుణ్ణి అయిన నా నైచ్యాన్ని, చాలా గొప్పవాడైన సర్వేశ్వరుడు తన పరత్వాన్ని చూడకుండా, నన్ను రక్షించి, నానుండి కైంకర్యాన్ని స్వీకరించాడు-

అని అంటూ భగవానుని సౌలభ్యాన్ని గత పాశురంలో ఆళ్వార్లు అను సంధించారు. అందువల్లనే "నిరంకుశస్వాతంత్ర్యాన్ని కల్గినవాడై ఉండడం అనే పరత్వం అతనికి స్థిరమైన రూపం కాదు. భక్తపారతంత్ర్యమే స్థిరమైన రూపం" అని తెలిసినవారే ఈ లోకాన్ని అన్ని కాలాలలోను రక్షించగలరు" - అని ఈ పాశురంలో అంటున్నారు.

**60.** **ఓరురువ నల్లై ఒళియురువమ్ నిన్నురువమ్**
**ఈరురువ నెన్బరిరునలత్తోర్- ఓరురువమ్**
**ఆతియామ్ వణ్ణమ్ అఱిన్దారవర్‌కణ్డీర్**
**నీతియాల్ మణ్ కాప్పార్ నిన్ఱు**

ఓర్ ఉరువన్ అల్లై = (స్వామీ !) సాటి లేకుండా ఉండడమే (పరత్వమే) రూపంగా ఉన్నవాడవు కావు నీవు, ఒళి ఉరువమ్ = భక్తులకు పరతంత్రమై ఉండే స్వరూపమే, నిన్ ఉరువమ్ = నీరూపం, (ఆ విధంగా ఆశ్రితపార తంత్ర్యమే రూపంగా కల్గిన నిన్ను), ఇరు నిలత్తోర్ = ఈ విశాలమైన భూమండలంలో ఉన్నవారు, ఈర్ ఉరువన్ ఎన్బర్ = (పరత్వం అనే) గొప్ప రూపాన్ని కలవానినిగా చెబుతున్నారు, ఓర్ ఉరువమ్= (ఆశ్రితపారతంత్ర్యం) అనే సాటి లేని రూపమే, ఆది ఆమ్ వణ్ణమ్ = అందఱికీ ఉజ్జీవనహేతువై ఉంటుంది- అనే దాన్ని, అఱిన్దారవర్ కణ్డీర్ = తెలిసికొనేవారే, నీతియాల్ = న్యాయానుసారం, నిన్ఱు =నిలకడగా నిలిచి, మణ్ కాప్పార్ = లోకాన్ని రక్షించగల్గినవారు.

గడచిన పాశురంలో చెప్పిన రీతిలో తాము భగవత్ప్రవణులై ఉండడం అర్చావతారపర్యంతమైన స్వామి చేసిన అవతారాల కృషిఫలమే కనుక, ఆ అవతారాల గొప్పతనాన్ని ఈపాశురంలో తెలుపుతున్నారు- అనే ఇంకొక అవతారికను అప్పిళ్ళై- అనే ఆచార్యులు ఈ పాశురానికి తెలిపారు.

అవ:- పూర్వపాశురంలో కీర్తింపబడ్డ అవతారరూపాలలో ఒక అవతారం గొప్పతనాన్ని తెలుపుతున్నారు- అని గాని, గడచిన పాశురంలో చెప్పబడ్డ ఆశ్రితపారతంత్ర్యాన్ని భగవానుడు ఆచరించి చూపిన రీతిని తెలుపుతున్నారు-



అని గాని గడచిన పాశురానికి తెలుపబడ్డ అర్థాలకు తగినట్లుగా రెండు విధాలైన అవతారికలను ఈ పాశురానికి కూడా పూర్వాచార్యులు తెలిపారు.

**61.** **నిన్ఱతోర్ పాతమ్ నిలమ్బుతైప్ప నీణ్డతోళ్**
**శెన్ఱళన్దతెన్బర్ తిశైయెల్లామ్- అన్ఱు**
**కరుమాణియాయిరన్ద కళ్వనే ఉన్నై**
**ప్పిరమాణిత్తార్‌పెత్త పేఱు**

అన్ఱు = పూర్వ ఒకానొక సమయంలో, కరు మాణి ఆయ్ = నల్లని వర్ణాన్ని కల బ్రహ్మచారియై మహాబలివద్దకు వెళ్ళి, ఇరన్ద = (మహాబలి దగ్గర మూడడుగుల నేలను) యాచించిన, కళ్వనే = వంచకుడవైన ఓ స్వామీ!, నిన్ఱదు ఓర్ పాదతమ్ = (భూమిని కొలిచేదిగా) నిలచిన (నీ) ఒక అద్వితీయమైన శ్రీచరణం, నిలమ్ = భూమండలాన్ని, పుతైప్ప=ఆవరించగా, (దానికి పిమ్మట), నీణ్డ తోళ్= ఉన్నతంగా వర్ధిల్లిన (నీ) దీర్ఘమైన భుజాలు, తిశై ఎల్లామ్ శెన్ఱు = దిక్కులు అన్నిటిలోను వ్యాపించి, అళన్దతు ఎన్బర్ = (పై లోకాన్ని) కొలిచింది- అని (జ్ఞానులు) అంటున్నారు, (ఈవిధంగా నీవు కార్యాన్ని చేయడం) ఉన్నై పిర మాణిత్తార్ పెఱ్ఱ పేఱు = నిన్ను నమ్మినవారు అందఱు పొందిన గొప్ప ఫలం.

నీ స్వరూపాన్ని కుంచింపచేసికొని, యాచకుడవై, మహాబలి అధీనంలో ఉండే భూమిని ఇంద్రునకు తిరిగి ఇచ్చిన ఈ లీల అనేది ఇంద్రుడొక్కడు మాత్రం పొందిన ఫలం కాదు. "భక్తుల కోసం తన స్వరూపాన్ని కుంచింపచేసికొని యాచించడం, వంచించడం, దూతగా వెళ్ళడం, సారథ్యాన్ని చేయడం- ఇంకా ఇటువంటి పలు కృత్యాలను చేసి వారిని రక్షిస్తాడు" అనే నీపట్ల నమ్మికను కలవారంతా గుండెలపై చేయిపెట్టుకొని నిద్రపోయే రీతిలో పొందిన ఫలం కదా ఇది. వారికి అందరికీ చలువపందిరి వంటిది కదా ఈ లీల- అని అంటున్నారు.

అవ :- గడచిన రెండు పాశురాలలో సర్వేశ్వరుని ఆశ్రితపారతంత్ర్యాన్ని సదృష్టాంతంగా చూపి వివరించారు. ఈవిధంగా దాసులకు వశమై ఉన్నవాడు,

నప్పిన్నైను వివాహం చేసికోవడంలో ఉండే అవరోధాలను దాటి, ఆమెను తన దానినిగా చేసికొన్నట్లే, మన అంతరాయాలను పోగొట్టి అనుగ్రహిస్తాడు- అని ఈ పాశురంలో అంటున్నారు.

**62. పేఱొన్ఱు మున్నఱియేన్ పెఱ్ఱుఱియేన్ పేతైమైయాల్**
**మాఱెన్ఱు శొల్లి వణఙ్గినేన్ - ఏఱిన్**
**పెరుత్తెరుత్తమ్‌కోడొశియ ప్పెణ్‌నశైయిన్ పిన్పోయ్**
**ఎరుత్తిఱుత్త నల్లాయరేఱు**

పెణ్ నశైయిన్ పిన్ పోయ్ = నప్పిన్నైపిరాట్టి విషయంలో ఉండే ఆశకు వశుడై, ఏఱిన్ =ఏడు ఎద్దుల, పెరుత్త ఎరుత్తమ్=బలిసిన మూపురాలు, కోడు= కొమ్ములు, ఒశియ = భగ్నమయే రీతిలో, ఎరుత్తు = ఆ ఎద్దుల కంఠాలను, అఱుత్త = భగ్నం చేసిన, నల్ ఆయర్ ఏఱు = గొప్ప గోపాలకులకు నాయకుడైన శ్రీకృష్ణుడు, మాఱు= మన పాపాలను అన్నిటికీ, ప్రత్యర్థిగా ఉండేవాడు, ఎన్ఱు శొల్లి= అని పల్కి, (తలచి), వణఙ్గినేన్ =అతనిని ఆశ్రయించాను, మున్ = దీనికి ముందు, పేఱు ఒన్ఱు అఱియేన్= ఇటువంటి సాటి లేని పురుషార్థం ఉందని తెలియనివాడనై ఉన్నానే!, పేతైమైయాల్ = నా అజ్ఞానంవల్ల, పెఱ్ఱు అఱియేన్ = ఇంతవరకు దానిని పొందకుండా కోల్పోయాను అయ్యో!

**"సమానానా ముత్తమశ్లోకః"** అన్నట్లు, **"వారణ మాయిరమ్ శూழ"** అన్నట్లు వయస్సు, అందం- మొదలైన వానిలో తనతో సాటివచ్చే గోపాలుర కందరికీ నాయకుడై ఉండే గొప్పతనాన్ని కల శ్రీకృష్ణుడే కదా, ఈ అరుదైన కృత్యాన్ని నప్పిన్నై కోసం చేశాడు. అతనినే కదా, నేను అతనిని పొందడానికి అడ్డుగా ఉండేవానిని అన్నిటినీ తీర్చుకోవడంకోసం ఉపాయంగా ఆశ్రయించాను. ఇటువంటి ఫలాన్ని అనాదికాలంగా తెలియకుండా ఉండి చాలా కోల్పోయానే! అయ్యో! - అని అంటున్నారు.

అవ:- "తానే ఈశ్వరుడు" అనే అభిమానాన్ని కల రుద్రుని దుఃఖాన్ని తీర్చినందువల్ల కూడా శ్రీమన్నారాయణుడే అందరికీ ఆశ్రయించదగినవాడు- అని అంటున్నారు.



**63. ఏఱేழుమ్ వెన్ఱడర్త్త వెన్దై ఎరియురువ**
**త్తేఱేఱే పట్టవిడు శాపమ్- పాఱేఱి**
**యుణ్డతలైవాయ్ నిఱైయ క్కోట్టఙ్గై యొణ్‌కురుతి**
**కణ్డ పొరుళ్ శొల్లిల్ కతై**

ఏఱు ఏழుమ్ = ఏడెద్దులను, వెన్ఱు = జయించి, అడర్త్త = వాటిని నశింపజేసిన, ఎన్దై = స్వామి అయిన శ్రీకృష్ణుడు, ఎరి ఉరువత్తు ఏఱు ఏఱి పట్ట= నిప్పులాంటి రూపాన్ని కలవాడు, ఎద్దును వాహనంగా కలవాడైన రుద్రుని పొందినదై, విడు శాపమ్= బ్రహ్మచే ఇవ్వబడ్డ శాపాన్ని (పోగొట్టడం కోసం), పాఱు ఏఱి ఉణ్డ తలైవాయ్ నిఱైయ= రాబందులుఎక్కి, తిన్న కపాలం నిండేటట్లుగా, కోడు = భిక్షను పెట్టేటపుడు వంచిన శ్రీహస్తంతో, (గీఱి తీసి ఇచ్చిన), ఒణ్ కురుతి = అందమైన రక్తంవల్ల, కణ్డ పొరుళ్ = (ఆ కపాలం చేతినుండి విడివడి కిందపడడం) చూచిన వృత్తాంతాన్ని, శొల్లిల్ = చెప్పడం ప్రారంభిస్తే, కతై = గొప్ప మహాభారతకథే అవుతుంది.

దీనిని వివరిస్తే ఇంకో మహాభారతమే అవుతుంది. శిరచ్ఛేదాన్ని పొందినవారు (బ్రహ్మ), శిరచ్ఛేదం చేసి శాపాన్ని పొందినవారు (శివుడు) -అనే ఇద్దఱు పరతత్త్వం ఎంతమాత్రం కాబోరు. ఆ శాపాన్ని తీర్చినవాడే పరతత్త్వం అనే కథాసారాన్ని అందరూ గ్రహించాలని భావం.

అవ :- తనను ఈశ్వరునిగా అభిమానించే రుద్రునకు సహాయపడవలసిన నీవు, నిన్ను దర్శిస్తే తప్ప నిలువలేని నేను నీ తిరునామాలను అనుసంధించి, పరిపూర్ణంగా అనుభవించేటట్లుగా చేయాలి- అని అంటున్నారు. లేక, గత పాశురంలో **"కతై"** అని ఇతిహాసపురాణాల ప్రస్తావం చేయబడినందున, ఆ ఇతిహాసపురాణాల తాత్పర్యం ఆశ్రితపరతంత్రుడైన పరపురుషుని తిరునామాన్ని అనుసంధించడమే - అని అంటున్నారనికూడా చెప్పవచ్చు.

**64. కతైయుమ్ పెరుమ్బొరుళుమ్ కణ్ణా! నిన్ పేరే**
**ఇతయ మిరున్దవైయే యేత్తిల్- కతైయుమ్**

తిరుమొழிయాయ్ నిన్ఱ తిరుమాలే ! ఉన్నై
ప్పరుమొழிయాల్ కాణ ప్పణి

కణ్ణా = శ్రీకృష్ణా !, కతైయిన్ = ఇతిహాసపురాణాల, పెరు పొరుళుమ్ = గొప్ప అర్థాలు, ఇతయమ్ = వాటి హృదయం (తాత్పర్యం), ఇరున్దవైయే = యథాతథంగా, ఏత్తిల్ = తెలిసికొని స్తుతిస్తే, నిన్ పేరే = (అవి అన్నీ), నీ తిరునామాలే సుమా!, కతైయుమ్ తిరుమొழి ఆయ్ నిన్ఱ తిరుమాలే = గొప్పదిగా చెప్పబడే, అందమైన వేదాల రూపంలో ఉండే శ్రియఃపతీ!, ఉన్నై = నిన్ను, పరు మొழிయాల్ కాణ =గొప్ప వేదశబ్దాలతో దర్శించి, అనుభవించేటట్లు, పణి = చేయాలి. (అనుగ్రహించాలి.)

"తద్విష్ణోః పరమం పదమ్, సదా పశ్యంతి సూరయః" అనే రీతిలో పరమపదంలో దర్శించి ఆనందించి, ఆ ఆనందానికి పరీవాహరూపంగా **"హావు హావు హావు"** అని, "అహ మన్న మహ మన్న మహ మన్నమ్" అని గొంతెత్తి గట్టిగా ఉచ్చరిస్తూ కాలక్షేపాన్ని చేసేటట్లు చేయాలి. ఈ ఫలాన్ని నీవు నీ నిర్హేతుకకృపతో పొందించాలి తప్ప, నా ప్రయత్నంతో నేను దీనిని పొందలేనని భావం.

అవ :- "పరు మొழிయాల్ కాణ ప్పణి - అనే రీతిలో పరమపదంలో పొందగోరే ప్రయోజనం తప్ప, ఇపుడు మీరు పొందగోరిన ప్రయోజనం ఏదీలేదా మఱి?'' అని భగవానుని అభిప్రాయంగా తలచి, ఇపుడు పొందగోరిన ప్రయోజనాన్ని గూర్చి పల్కి, ఈ ప్రయోజనాన్ని పరమపదంలోకూడా నిరంతరం అనుభవించాలి - అనే అభినివేశాన్ని ఇందులో ఆழ்వార్లు తెలుపుతున్నారు. ఇది తిరుమలనంబి నిర్వాహం.

65. పణిన్దేన్ తిరుమేని పైజ్ఞమలమ్ కైయాల్
అణిన్దేనున్ శేవడిమేలన్బాయ్ -తుణిన్దేన్
పురిన్దేత్తి యున్నై ప్పుకలిడమ్ పార్త్తు ఆజ్గే
ఇరున్దేత్తి వాழுమితు



తిరు మేని = (ఓ శ్రియఃపతీ !) నీ తిరుమేనిని, పణిన్దేన్ = సేవించాను, ఉన్ శే అడిమేల్ = నీ ఎఱ్ఱని శ్రీపాదాలలో, పై కమలమ్ = అందమైన తామరపూవును, అన్బు ఆయ్ = భక్తిపూర్వకంగా, కైయాల్ అణిన్దేన్ = చేతితో సమర్పించాను, ఉన్నై = నిన్ను, పురిన్దు ఏత్తి = అభిలషించి స్తుతించి, పుకల్ ఇడమ్ పార్త్తు = పరమపదంలో ఉండే సన్నివేశాన్ని దృష్టిలో పెట్టుకొని, ఆజ్గే ఇరున్దు ఏత్తి వాழுమ్ ఇతు తుణిన్దేన్ = అక్కడే ఉండి మంగళాశాసనం చేసి, పొందే ఉజ్జీవనమే ఉజ్జీవనం- అని నిశ్చయించుకొన్నాను.

"తద్విప్రాసో విపన్యవో జాగృవాంసః సమింధతే" అని, **"శూழ்న్దిరున్దు ఏఱ్ఱువర్ పల్లాణ్డే"** అని చెప్పే రీతిలో నిత్యముక్తుల నడుమ ఉండి పల్లాండు పాడుతూ ఉజ్జీవించే రీతిని పొందాలని నిశ్చయించుకొన్నాను - అని భావం.

అవ :- **"ఏత్తి వాழு మిదు పణిన్దేన్"** అని అంటూ గత పాశురంలో తమకు పరమపురుషునిపట్ల ఉండే అభినివేశాన్నిగూర్చి ఆழ்వార్లు తెలిపారు. ఇంత మాత్రం చాలదు. చెడ్డనే కల్గించే సాంసారిక విషయాల దోషాన్ని బాగా గ్రహించి, వాటిలో ఆసక్తి లేకుండా ఉంటేనే, మనకు ఆటంకాలు తొలగి, మనకు పరమపదప్రాప్తి కల్గుతుంది- అని ఇందులో అంటున్నారు. పరమపురుషునిపట్ల అభినివేశం (అభిలాష) ఘనంగా ఉన్నా, అన్యవిషయాలలో రుచి ఉన్నట్లయితే, అది భగవానుని విషయంలోని అభిలాషను కూడా నశింపజేస్తుంది కదా! అంతటి ప్రమాదకరమైనది కదా ఐహిక భోగాభిలాష!

66. ఇతు కణ్డాయ్ నన్నెఞ్జే! యిప్పిఱవియావతు
ఇతు కణ్డా యెల్లామ్ నాముఱ్ఱతు- ఇతు కణ్డాయ్
నారణన్ పేరోతి నరకత్తరుకణైయా
కారణముమ్ వల్లైయేల్ కాణ్

నల్ నెఞ్జే = మంచి మనసా!, ఇప్పిఱవి ఆవతు ఇతు కణ్డాయ్ = ఈ సంసారం కాఠిన్యం ఇటువంటిదే సుమా!, నామ్ ఉఱ్ఱతు ఎల్లామ్ ఇతు కణ్డాయ్= (ఈ సంసారంలో) మనం అనుభవించిన దుఃఖాలన్నీ ఇటువంటివే సుమా!, నారణన్= శ్రీమన్నారాయణుని, పేర్ = తిరునామాలను, ఓతిది =

నోరార పల్కి, నరకత్తు = సంసారం అనే నరకంయొక్క, అరుకు = సమీపంలో కూడా, అణైయా కారణముమ్= మనం నిలువకూడదు - అని గర్హించడానికి కారణం కూడా, ఇతు కణ్డాయ్ = ఈ సంసారంలోని దోషమేసుమా! (ఈ విధంగా ఒక్కొక్కటి చెప్పవలసిన అవసరం లేకుండా), వల్లై ఏల్ = నీవే తెలిసికోగల్గితే, కాణ్ =(సంసారంలోని నైచ్యాన్ని నీవే) గమనించు.

లౌకిక విషయాలను పైపైన గమనించినపుడు వాటిలో తోచే మంచిలో పసలేదు. దోషమే వాటి సహజరూపం- అనే దానిని స్థిరంగా తెలియగల్గితే నేను చెప్పినది తగినదే- అని గమనిస్తారు. **"నన్నెఞ్జే!"** అని అంటూ మనస్సులోని విషయవైరాగ్యాన్ని కీర్తించిన అదే క్షణంలో **"వల్లైయేల్"** (సాధ్యం అయితే) అని సందేహించి చెప్పే రీతిలో కదా విషయాల ఆకర్షణలోని బలం ఉంటుంది- అని భావం. లేక, వైరాగ్యం ఉన్నా, వాసనారుచులు విడచిపెట్టనందువల్ల "విషయాల నైచ్యాన్ని అనుభవిస్తూ ఉన్నానే వాటి వాసనారుచులు విడువకుండా ఉండడం అనేది మనం చేసిన పాపంవల్ల. ఆ పాపం, వాసనారుచులు పోయే టట్లుగా ఈ సంసారంలోని దోషాన్ని నిరంతరం అనుసంధించు'' అని అంటున్నారని కూడా చెప్పవచ్చు.

అవ :- ఆళ్వార్లు తమ మనస్సును ఉద్దేశించి "సంసారదోషాన్ని సాధ్యమైతే గమనించి చూడు'' అని అనగానే, భగవానుడు ఆ మాటను సహించలేక, నిర్హేతుకంగానే తనను దర్శింపజేయగా, మానససాక్షాత్కారాన్ని పొంది, దానిని ఈ పాశురంలో ఆళ్వార్లు సానందంగా వివరిస్తున్నారు.

**67.** కణ్డేన్ తిరుమేని యాన్ కనవిల్ అజ్గవన్కై
క్కణ్డేన్ కనలుమ్ శుడరాழி- కణ్డేన్
ఉఱునోయ్ వినైయిరణ్డుమ్ ఓట్టువిత్తు పిన్నుమ్
మఱునోయ్ శెఱువాన్ వలి

యాన్ = దాసుణ్ణి అయిన నేను, కనవిల్ = కలవంటి మానసానుభవంలో, తిరు మేని= అందమైన దివ్యమంగళవిగ్రహాన్ని, కణ్డేన్ = సేవించగలిగాను, అజ్గు = అపుడు, అవన్ కై = అతని శ్రీహస్తంలో, కనలుమ్ శుడర్ ఆழி కణ్డేన్= అగ్నిని ఉమిసే జ్యోతిర్మయం అయిన శ్రీసుదర్శనాన్ని దర్శించాను, ఉఱు నోయ్ వినై ఇరణ్డుమ్= (ఆత్మలో) కలసి ఉండే వ్యాధులవంటి పుణ్యాపాపరూపద్వివిధకర్మలను, ఓట్టు విత్తు = పోగొట్టి, పిన్నుమ్ = తరువాత, మఱు నోయ్ శెఱువాన్ = మాటిమాటికి తిరిగి మొలిచి వృద్ధిచెందే వాసనా, రుచులను పోగొట్టే భగవానుని, వలి = బలాన్ని, (సామర్థ్యాన్ని), కణ్డేన్ = చూడగలిగాను.

వేరుతో పాటు నఱికినా, తిరిగి చిగురించి పెరిగే చెట్టువలె, కర్మలను రెండిటిని తీర్చుకొన్నా తిరిగి పెరిగి దుఃఖాలను కల్గించే వ్యాధివంటి వాసనా రుచులను పోగొట్టి నశింపజేయగలవాని బలాన్ని దర్శించాను. **"శెఱువాన్ వలి"** అని వాసనను పోగొట్టడంకోసం మనం ఆశ్రయించే బలమైన తిరుమేనిని దర్శించాను- అని అంటున్నారని కూడా చెప్పవచ్చు. ఇందువల్ల గడచిన పాశురంలో ''వీలయితే దర్శించు'' అని చెప్పడానికి మూలం అయిన వాసనారుచులు, శుభాస్పదం అయిన స్వామి దివ్యరూపాన్ని దర్శించగానే నశించాయని చెప్పినట్లయింది. ఈ అర్థాన్ని గీతలో **"తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః"** (విషయాలలో రుచిని కల్గిఉండడం వల్ల జయించడానికి సాధ్యం కాని ఆ అన్ని ఇంద్రియాలను విషయాలనుండి లాగిపట్టి, శుభాస్పదం అయిన తిరుమేనితో కూడిన నాపట్ల అభినివేశాన్ని పొంది, చిత్తసమాధానాన్ని పొంది ఉండాలి.) అని శ్రీకృష్ణుడు వచించాడు కదా !

అవ :- భగవానుని పొంది, విషయవాసనారుచులను పోగొట్టుకోకుండా, ఉప్పు చారు (క్షారసారం) వంటి అమృతాన్ని అభిలషించిన దేవతలకోసం తన శరీరాన్ని శ్రమపెట్టుకొని, సముద్రాన్ని చిలికి, వారి కార్యాన్ని సఫలం చేసినవాడితడే - అని ఇందులో అంటున్నారు.

**68.** వలిమిక్క వాళెయిఱ్ఱు వాళవుణర్ మాళ
వలిమిక్క వాళ్వరై మత్తాక-వలిమిక్క
వాణాకమ్ శుఱ్ఱి మఱుక క్కడల్ కడైన్దాన్
కోణాకమ్ కొమ్బొశిత్త కో

వలి మిక్క = మహాబలశాలులై, వాళ్ ఎయిఱు = కత్తులవంటి కోరపళ్ళను కలవారై, వాళ్ = ఖడ్గమనే సాధనాన్ని కల్గిన, అవుణర్ = అసురులు, మాళ = నశించడంకోసం, వలి మిక్క వాళ్ వరై మత్తు ఆక = గొప్ప బలాన్ని కల్గినదై, కాంతిని కల్గినదైన మందరపర్వతాన్ని కవ్వంగా చేసికొని, వలి మిక్క వాళ్ నాకమ్ = అధికమైన శక్తిని, తేజస్సును కల వాసుకి అనే సర్పాన్ని, శు*ఱ్ఱి* = కవ్వపు దారంగా చుట్టి, కడల్ మఱుక కడైన్దాన్ = సముద్రం బురద అయేటట్లుగా చిలికినవాడు (ఎవరంటే), కోళ్ నాకమ్ = శక్తిని కల్గిన, కువలయాపీడం అనే మదపుటేనుగుయొక్క, కొమ్బు = దంతాలను, ఒశిత్త = (అవలీలగా) విఱిచిన, కో = స్వామి

అందఱికీ మూలాధారం అయిన సర్వేశ్వరుని నశింపజేయడం ద్వారా మనలను అందఱినీ నశింపజేయాలని వచ్చిన, బలాన్ని కల్గిన కువలయాపీడం అనే ఏనుగుయొక్క దంతాన్ని అవలీలగా విఱిచి, ఆ గజాన్ని వధించి, తనను మనకు అనుగ్రహించిన సర్వేశ్వరుడుకదా. సముద్రమథనాన్ని చేశాడని భావం. **"కోళ్"** - అంటే బలం. **'నాకమ్'** అనే పదం సంస్కృతపదం. ఏనుగు, సర్పం అనే అర్థాలను ఇస్తుంది. **"వాళ్ నాకమ్"** అన్నపుడు సర్పాన్ని, **"కోళ్ నాకమ్"** అనేటపుడు ఏనుగును తెలుపుతుంది. ఈ పాశురంలో తమ విరోధిని పోగొట్టి స్వామి తమను జయించాడని ఆ*ళ్వా*ర్లు తెలిపినట్లయింది.

అవ :- గత పాశురంలో పల్కిన రీతిలో, స్వర్గంలో జీవించే దేవతలు ఇతనిని ఆశ్రయించి, అమృతమథనం మొదలైన కార్యాలతో తాము కోఱిన ఫలాన్ని పొందడం మాత్రమేకాదు; ఈ భూలోకంలోని రాజులు, ఇతనిని ఆశ్రయించే తాము పదవులను పొంది, ఎంతో వైభవంతో వెలుగుతున్నారు సుమా! - అని అంటున్నారు.

**69.** **కోవాకి మానిలమ్ కాత్తు నఙ్గణ్ ముకప్పే**
**మావేకి చ్చెల్కిన్ఱ మన్నవరుమ్- పూమేవుమ్**
**శెఙ్గమల నావియాన్ శేవడిక్కే యే*ళ్* పిఱప్పుమ్**
**తణ్కమల మేయ్న్దార్ తమర్**



కో ఆకి = ప్రభువులకు ప్రభువులై, మా నిలమ్ కాత్తు= విస్తరించిన భూమండలాన్ని పాలించి, నమ్ కణ్ ముకప్పే= మన కంటిముందే, మా ఏకి శెల్కిన్ఱ = గుఱ్ఱాలను ఎక్కి తిరిగే, మన్నవరుమ్ = ప్రభువులుసైతం, శెమ్ కమల ప్పూ మేవుమ్ = ఎఱ్ఱ తామరపూవు పొందికగా ఉండే, ఉన్దియాన్ = నాభిని కల స్వామియొక్క, శే అడిక్కే= అందమైన శ్రీచరణాలకే, ఏ*ళ్* పిఱప్పుమ్= పలు పలు జన్మలలో, తణ్ కమలమ్ = చల్లని తామరపూవును, ఏయ్న్దార్= సమర్పించినవారైన, తమర్ = భక్తులు.

ఈ సర్వేశ్వరుని శ్రీచరణాలలో ఆ శ్రీచరణాల సౌకుమార్యానికి తగిన చల్లని తామరపూవులను సమర్పించి, పలు జన్మలలో కొలిచిన భక్తులే ఇపుడు మనం చూచే చక్రవర్తులుగా, వైభవంతో వెలుగుతున్నారని భావం. **"ఏయ్న్దారుడైయ తమర్"** అనే అర్థాన్ని చెప్పి, ఈ రీతిలో పలు జన్మలలో సర్వేశ్వరుని శ్రీచరణాలలో సేవించినవారి దాసులే ఈనాడు చక్రవర్తులై విలసిల్లుతున్నారని కూడా అర్థాన్ని చెప్పవచ్చు.

అవ :- ఈవిధంగా దేవతలవలె, ప్రభువువలె క్షుద్రఫలాలను పొందడం కోసంగా ఇతనిని ఆశ్రయించకుండా, ఇతనినే ప్రయోజనంగా భావించి, ఇతనిని ఆశ్రయించినవారి మనస్సులు, అభిమానదివ్యస్థలాలు అన్నీ ఒక ఎత్తు అయితే, ఇది ఒక ఎత్తు అనేటట్లు, వాటికంటే ఎక్కువగా సర్వేశ్వరుడు అభిలషించి ఆనందిస్తున్నాడు- అని అంటున్నారు.

**70.** **తమరుళ్ళమ్ తఞ్జై తలైయరఙ్గమ్ తణ్కాల్**
**తమరుళ్ళమ్ తణ్పొరుప్పు వేలై -తమరుళ్ళుమ్**
**మామల్లై కోవల్ మతిళ్ కుడన్దై యెన్బరే**
**ఏవల్ల వెన్దైక్కిడమ్**

తమర్ ఉళ్ళమ్ = భక్తుల మనస్సు, తఞ్జై = తంజమామణి క్కోయిల్ అనే దివ్యదేశం, తలై అరఙ్గమ్ = (దివ్యదేశాలలో) గొప్పదైన శ్రీరంగం, తణ్ కాల్ = తిరుత్తణ్కాల్ అనే దివ్యదేశం, తమర్ ఉళ్ళుమ్ = భక్తులు (తమ సర్వస్వంగా) భావించే, తణ్ పొరుప్పు = చల్లని తిరుమలై, వేలై = క్షీరాబ్ధి,

తమర్ ఉళ్ళుమ్ = భక్తులు చింతించే, మా మల్లై = తిరుక్కడల్ మల్లై - అనే దివ్యదేశం (మహాబలిపురం), కోవల్ = తిరుక్కోవలూర్, మతిళ్ కుడన్దై = గొప్ప ప్రాకారాలను కల కుంభఘోణం (తిరుక్కుడన్దై) అనే ఈ దివ్యదేశాలన్నీ, ఏ వల్ల ఎన్దైక్కు ఇడమ్ ఎన్బర్ = బాణప్రయోగంలో సిద్ధహస్తుడైన చక్రవర్తి కుమారుడు శ్రీరామునకు నివాసస్థానం - అని అంటారు.

అవ :- గత పాశురంలో భక్తుల కోసం భగవానుడు వేంచేసి ఉండే దివ్య దేశాలు చెప్పబడ్డాయి. ఈ పాశురంలో ఇతనిని అభిలషించే దాసులలో (భక్తులలో) గొప్పవారైన నిత్యసూరులు, ఈ లోకంలో ఉండే భక్తులకోసం ఇతడు త్రివిక్రముడై లోకాన్ని కొలిచినపుడు ఇతని సౌకుమార్యాదులను అనుభవించి, భక్తితో 'ఏమి కీడు మూడుతుందో! ఏమో!'' అని అస్థానే భయశంకను పొంది పడిన పాట్లు తెలుపబడుతున్నాయి.

**71. ఇడఙ్గై వలమ్బురి నిన్డార్ప్ప ఎరికా**
**న్ఱడఙ్గార్ ఒడుఙ్గవిత్త దాళి- విడఙ్గాలుమ్**
**తీవాయరవణైమేల్ తోన్ఱల్ తిశై యళప్పాన్**
**పూవారడి నిమిర్ త్తపోదు**

విడమ్ కాలుమ్ = విషాన్ని ఉమిసే, తీ వాయ్ = భయంకరం అయిన నోటిని కల్గిన, అరవు = ఆదిశేషుడనే, అణైమేల్ = శయనంపై , (పరుండి ఉండే), తోన్ఱల్= సర్వేశ్వరుడు, తిశై = అన్ని లోకాలను, అళప్పాన్ = కొలువడంకోసం, పూ ఆర్ అడి = పూవువలె సుకుమారం అయిన శ్రీచరణాన్ని, నిమిర్త్త పోదు = ఉన్నతంగా ఎత్తి కొలిచిన సమయంలో, వలమ్ పురి = పాంచజన్యం, ఇడమ్ కై = ఎడమ చేతిలో, నిన్ఱు = స్థిరంగాఉండి, ఆర్ప్ప = మోగగా, ఆళి = శ్రీసుదర్శనం, ఎరి కాన్ఱు = నిప్పులను వెలువరిస్తూ, అడఙ్గార్= చేష్టలుడిగినవారినిగా చేసింది.

అవ :- "సర్వజ్ఞులైన నిత్యసూరులు సైతం ఈవిధంగా తలమునకలు వేసే భగవానుడనే ఈ విషయాన్ని అల్పజ్ఞులం అయిన మనకు దరి చేరడానికి సాధ్యమా?'' అని వెనుకంజవేసిన తమ మనస్సును ఉద్దేశించి, "తిరుమలైలో



వానరాలు సైతం ఆశ్రయించేటట్లుగా సులభుడై స్వామి ఉండేటపుడు నీవు వెనుకంజ వేయవద్దు. అతనినే ఆశ్రయించు''- అని అంటున్నారు.

**72. పోతఱిన్దు వానరఙ్గళ్ పూఞ్జునై పుక్కు ఆఙ్గలర్న్ద**
**పోతరిన్దు కొణ్డేత్తుమ్బోతు ఉళ్ళమ్- పోతు**
**మణి వేఙ్గడవన్ మలరడిక్కే శెల్ల**
**అణి వేఙ్గడవన్ పేరాయ్న్దు**

వానరఙ్గళ్ = వానరాలు, పోదు అఱిన్దు = ప్రాతఃకాలంలో కళ్ళు తెఱచి (నిద్ర లేచి), పూ శునై పుక్కు = పూలు పూచిన జలాశయాలలో ప్రవేశించి, (స్నానం చేసి), ఆఙ్గు అలర్న్ద = అపుడే వికసించిన, పోతు = పూవులను, అరిన్దు కొణ్డు= కోసికొని వచ్చి సమర్పించి, ఏత్తుమ్ = స్తుతి చేస్తున్నవి, ఉళ్ళమ్= ఓ మనసా!, పోతు = (నీవుకూడా ఆ విధంగా చేయడానికి) బయలు దేరు, అణి వేఙ్గడవన్ = లోకానికి ఆభరణంవలె ఉన్న, తిరుమలైలో ఉండే భగవానుని, పేర్ = తిరునామాలను, ఆయ్న్దు = అనుసంధిస్తూ, వేఙ్గడవన్ మలర్ అడిక్కే శెల్ల = ఆ వేంకటాద్రి విభుని శ్రీచరణ కమలాలనే చేరేటట్లుగా, పోతుమ్ = పూవులను, అణి = సమర్పించు (అలంకరించు).

**"ఉళ్ళమ్ పోదు"** అని మానసికకైంకర్యం, **"అణి వేఙ్గడవన్ పేర్ ఆయ్న్దు"** అని వాచికకైంకర్యం, **"వేఙ్గడవన్ మలరడిక్కే శెల్లప్పోదుమ్ అణి"** అని కాయిక కైంకర్యం- ఈవిధంగా త్రివిధకైంకర్యాలు ఇక్కడ సూచింపబడ్డాయి. **"మణి వేఙ్గడవన్"** అని అన్నపుడు నీలమణివలె దర్శించేవారి నేత్రాలకు చల్లగా, శ్రమహరంగా ఉండే దివ్యమంగళ రూపాన్ని కల వేంకటేశ్వరుడని భావం.

అవ :- జాతిచేత, ప్రవర్తనచేత, జ్ఞానంచేత ఎంతో అధములైనవారు కూడా, వారు ఆశ్రయించదగినవాడైన భగవానుని శ్రీపాదాలలో తాము త్రికరణాత్మ కంగా నిత్యకైంకర్యం చేయాలని నిశ్చయించుకొన్న రీతిని ఇందులో తెలుపు తున్నారు. గడచిన పాశురంలో ఆశపడ్డ కైంకర్యం నిత్యమై, కొనసాగాలని నిర్ణయించుకొంటున్నారు- **"ఒழివిల్ కాల మెల్లామ్ ఉడనాయ్ మన్ని వழువిలా వడిమై శెయ్యవేణ్డుమ్ నామ్, తెழికురలరువి త్తిరువేఙ్గడత్తు ఎழిల్ కొళ్ శోది ఎన్దై తన్దై తన్దైక్కే'** అనే నమ్మాழ్వార్ల సూక్తి వంటిదే ఇది.

73. ఆయ్న్దురైప్ప నాయిరమ్బేర్ అతి నడు వన్దివాయ్
వాయ్న్ద మలర్ తూవి వైకలుమ్- ఏయ్న్ద
పిఱైక్కోట్టు చ్చెఙ్గణ్ కరి విడుత్త పెమ్మాన్
ఇఱైక్కాట్పడ త్తుణిన్ద యాన్

పిఱై ఏయ్న్ద కోడు = చంద్రరేఖవంటి దంతాన్ని, శెమ్ కణ్ = ఎఱ్ఱని కళ్ళను కల, కరి= గజేంద్రుని, విడుత్త= మొసలినోటినుండి విడిపించిన, పెమ్మాన్ = సర్వేశ్వరుడైన, ఇఱైక్కు = శ్రీమన్నారాయణునకు, ఆళ్ పడ= కైంకర్యం చేయాలని, తుణిన్ద యాన్ = నిశ్చయించుకొన్న నేను, ఆతి నడు అన్ది వాయ్ వైకలుమ్ = ప్రాతఃకాలం, పగలు, సాయంకాలం- మొదలైన అన్ని కాలాలలోను, వాయ్న్ద మలర్ = చేతికి లభించిన పూలను, తూవి = క్రమవివక్ష లేకుండా సమర్పించి, ఆయిరమ్ పేర్= వేయి తిరునామాలను, ఆయ్న్దు ఉరైప్పన్ = మనస్సులో నిలుపుకొని అనుసంధిస్తాను.

కువలయాపీడాన్ని వధించినట్లే, నా విరోధులను నశింపజేసి నన్ను పరిగ్రహించాడని భావం.

అవ :- ఈ విధంగా త్రికరణాలతోను సర్వదేశ-సర్వకాల -సర్వావస్థోచిత సకలవిధకైంకర్యాలను చేయడంవల్ల కలిగే ఆనందంతో "అతని గొప్పతనానికి తగినట్లుగా కవిత్వం చెప్పే రీతిలోని పుణ్యాన్ని కలవాడను నేనే'' - అని అంటున్నారు. "**వీఱ్ఱిరున్దేఴులకుమ్**" (తిరువాయ్మొఴి-4-3) అనే దశకం ఈ పాశురానికి వివరణం.

74. యానే తవమ్ శెయ్దేన్ ఏఴ్ పిఱప్పు మెప్పొఴుతుమ్
యానే తవముడైయే నెమ్బెరుమాన్- యానే
ఇరున్దమిఴ్ నన్మాలై యిణైయడిక్కే శొన్నేన్
పెరున్దమిఴ నల్లేన్ పెరితు

ఎమ్బెరుమాన్ = నా స్వామీ!, ఏఴ్ పిఱప్పుమ్ = అన్ని జన్మలలోను, ఎప్పొఴుదుమ్ = అన్ని స్థితులలోను, తవమ్ =తపస్సును చేసినవాడను, యానే= నేనే, తవమ్ ఉడైయేన్ యానే = తపస్సుయొక్క ఫలాన్ని పొందినవాడనూ నేనే,



ఇరు తమిఴ్ నల్ మాలై = గొప్ప ద్రావిడ భాషలోనిర్మించిన మంచి వాఙ్మాలను, ఇణై అడిక్కే = (నీ) రెండు చరణాలలో, శొన్నేన్ = చెప్పి, సమర్పించాను, పెరు తమిఴన్= గొప్ప ద్రావిడభాషాశాస్త్రాలలో పండితుడనై, పెరితు= చాలా, నల్లేన్= గొప్పతనాన్ని కలవాడై ఉన్నవాడను, యానే = నేనే.

గొప్ప తమిళపండితులైనా భగవానునిపట్ల అభినివేశం లేని కేవలతమిళ పండితుడు కాకుండా, భగవద్విషయంలో అత్యంతప్రావణ్యం కల్గి, ఆప్రావణ్యం వల్ల కాళ్ళు తడబడి, మనస్సు ద్రవించే గొప్పవాడను నేను. "అతనిని స్తుతించడానికి తగిన చోటయిన పరమపదంలో ఉండి "**ఏతత్ సామ గాయన్నాస్తే**" అని అన్నట్లు గానం చేసి గానం చేసి, కైంకర్యం చేసే నిత్యసూరులవలె కాకుండా, అతనిని స్తుతించని ఈ లోకంలోనే ఉండి అతనిని గానం చేయడంవల్ల ఆ నిత్యముక్తుల కంటే చాలా గొప్పవాడనై ఉండే నేను- అని హార్ద భావం. ఆఴ్వార్లు ఈ రీతిలో తమ గొప్పతనాన్ని తామే చెప్పుకో వచ్చునా?- అని అంటే, అప్రాప్తవిషయాలలో తమ కుండే సంబంధాన్నిగూర్చి తమ గొప్పతనాన్ని చెప్పుకోవడం నిషిద్ధం కాని, ప్రాప్తవిషయం అయిన భగవద్విషయంలో తమకుండే సంబంధాన్ని పురస్కరించుకొని తమ గొప్పతనాన్ని చెప్పుకోవడం స్వరూపానురూపం కనుక దోషం కాదు. "**యావర్ నికర్ నల్ వానత్తే**" అని నమ్మాఴ్వార్లు కూడాఅన్నారు కదా !

అవ :- "**పెరున్తమిఴ నల్లేన్ పెరితు**" - అని అంటూ మిమ్ముల‌ను మీరే ప్రశంసించుకొంటున్నారే! ఈ గొప్పతనానికి తగినట్లుగా ఒక పాశురాన్ని చెప్పండి చూద్దాం'' అనే భగవానుని భావాన్ని భావించి, లోకంలోని కవితలను అన్నిటినీ మించగల ఒక అద్భుతమైన పాశురాన్ని ఆఴ్వార్లు అనుగ్రహిస్తున్నారు. ఈ పాశురవైభవాన్ని గమనించి, నాలుకవిప్పెరుమాళ్ (చతుర్విధకవీశ్వరులు) అయిన తిరుమఙ్గై ఆఴ్వార్లుకూడా "**వరై శెయ్ మాక్కళిఱు ఇళవెదిర్ వళర్ ముళై అళైమికు తేన్ తోయ్త్తు ప్పిరశవారి తన్ ఇళమ్ పిడిక్కు అరుళ్ శెయ్యుమ్**" (పెరియ తిరుమొఴి-1-2-5)అనే బదరికాశ్రమ దశకంలోని పాశురంతో ఈ పాశురాన్ని వివరించారు.

75. పెరుకు మత వేఴమ్ మాప్పిడిక్కు మున్నిన్ఱు
ఇరుకణిళ మూఙ్గిల్ వాఙ్గి- అరుకిరున్ద
తేన్ కలన్దు నీట్టుమ్ తిరువేఙ్గడమ్ కణ్డీర్
వాన్ కలన్ద వణ్ణన్ వరై

పెరుకుమ్ = స్రవించే, మతదమ్ = మదజలాన్ని కల్గిన, వేఴమ్ = ఏనుగు, మా పిడిక్కు మున్ నిన్ఱు = (తన) గొప్ప ఆడ ఏనుగు ముందు నిలిచి, ఇరు కణ్ ఇళ మూఙ్గిల్ వాఙ్గి = రెండు కణుపులను కల లేత వెదురుకొమ్మను విఱిచి, అరుకు ఇరున్ద తేన్ కలన్దు= (ఆ వెదురుకొమ్మకు) దగ్గరలో ఉండే తేనెలో ముంచి, నీట్టుమ్= (ఆడ ఏనుగుకోసం) తొండాన్ని ముందుకు చాచి ఇచ్చే, తిరు వేఙ్గడమ్ కణ్డీర్ = తిరుమలైయే కదా, వాన్ కలన్ద వణ్ణన్ వరై = మేఘాన్ని పోలిన వర్ణాన్ని కల్గిన స్వామి నివాసస్థానం అయిన పర్వతం.

(మగ ఏనుగు ఆడఏనుగుకు కోరినదానిని ఇచ్చి సంతోషింపజేసే చోటు అయిన వేంకటాద్రిలో నివసించేవాడు - అని ఆఴ్వార్లు అనడంలో ఏమి ఆంతర్యం? అని అంటే, **"కణ్ణావాన్ ఎన్నుమ్ మణ్ణోర్ విణ్ణోర్క్కు"** అనే రీతిలో ఉభయవిభూతులలో ఉండేవారిని అందఱిని ఇతడు తిరుమలలో నిలచి ఉండి రక్షించే టట్లే, ఈ తిరుమలలో ఉండే ఏనుగులు మొదలైన తిర్యక్కులు సైతం తమ రక్ష్యవర్గాన్ని రక్షించడం స్వభావం కల్గినవి - అని దీని ద్వారా సూచింప బడింది.

అవ :- ఈ రీతిలో కవిత్వాన్ని చెప్పి వాచికకైంకర్యాన్ని చేయడంతో నిలువ కుండా, కాయికమైన కైంకర్యంకూడా చేయడానికి తగిన శ్రేష్ఠమైన ద్రవ్యాలను అన్వేషిస్తూ, మనకు కారణభూతుడై, ప్రాప్తశేషియై, సౌలభ్య సౌకుమార్యాదులను కలవాడైన భగవానుని శ్రీచరణాలలో కాయికకైంకర్యాన్ని చేయడమే ఈ ఆత్మకు స్థిరమైన హితం- అని ఇందులో దివ్యసూరి అంటున్నారు.

76. వరై చ్చన్దన క్కుఴమ్బుమ్ వాన్ కలనుమ్ పట్టుమ్
విరై ప్పొలిన్ద వెణ్ మల్లికైయుమ్-నిరైత్తు క్కొణ్డు
అతిక్కణ్ నిన్ఱ అఱివనడియిణైయే
ఓతి ప్పణివతుఱుమ్



వరై శన్దనమ్ కుఴమ్బుమ్ = మలయపర్వతంలో పుట్టిన చందనపంకాన్ని, వాన్ కలనుమ్ = గొప్ప నగలను, పట్టుమ్ = పట్టు పీతాంబరాన్ని, విరై పొలిన్ద= పరిమళం అతిశయించిన, వెణ్ మల్లికైయుమ్ = తెల్లని మల్లికామాలికలను, నిరైత్తు క్కొణ్డు = సేకరించుకొని, ఆతి క్కణ్ నిన్ఱ అఱివన్ = ఆదికాలంలో సకల జగత్కారణభూతుడై ఉండే సర్వజ్ఞుడైన భగవానుని యొక్క అడి ఇణైయే= రెండు శ్రీపాదాలనే, ఓతి = నోరార స్తుతించి, పణివతుదు = శిరస్సుతో నమస్కరించడం, ఉఱుమ్ = (చేతనుని స్వరూపానికి) తగినది.

అవ :- ఈవిధంగా శ్రేష్ఠమైన వస్తువులతో భగవానుని పూజించి, ఆశ్రయించాలని ప్రారంభించిన ఆఴ్వార్లు, అది తమకు చాలా భోగ్యంగా ఉన్నందున "అనుభవవేళలో కంటే ఆశ్రయణసమయంలో కలిగే ఆనందమే చాలు' అని మనస్సును ఉద్దేశించి ఇందులో పలుకుతున్నారు.

77. ఉఱుఙ్కణాయ్ నన్నెఞ్జే! ఉత్తమన్ నఱ్పాతమ్
ఉఱుఙ్కణ్డా యొణ్ కమలన్దన్నాల్ -ఉఱుఙ్కణ్డాయ్
ఏత్తి ప్పణిన్దవన్పేర్ ఈరైఞ్ఞూఱెప్పొఴుతుమ్
శాత్తి యుఱైత్తల్ తవమ్

నల్ నెఞ్జే. = ఓ మంచి మనసా!, ఉత్తమన్ = పురుషోత్తముని, నల్ పాదమ్ = గొప్ప శ్రీపాదాలను, ఆశ్రయించడం, ఉఱుమ్ కణ్డాయ్ = తగినదిసుమా! (ఆ శ్రీపాదాలను), ఒణ్ కమలమ్ తన్నాల్ = అందమైన తామర పూలను, (అలంకరించి, అర్చించడం) ఉఱుమ్ కణ్డాయ్ = మనకు తగినది సుమా!, శాత్తి = (ఆ తామరపూలను చేతులతో) సమర్పించి, పణివదు = (శిరస్సుతో) నమస్కరించి, ఏత్తి = నోరార స్తుతించి, అవన్ పేర్ ఈర్ ఐఞ్ఞూఱు= అతని సహస్రనామాలను, ఎప్పొఴుదుమ్ = అన్ని సమయాలలో, ఉరైత్తల్ = సంకీర్తనం చేయడం అనే, తవమ్ = తపస్సు, ఉఱుమ్ కణ్డాయ్ = తగినదిసుమా!

భగవానుని సహస్రనామాలను అన్ని కాలాలలోను అందఱూ తెలిసేటట్లుగా అనుసంధించడం అనే తపస్సును చేయడం తగినదే సుమా!- అని భావం. **"తవమ్"** అంటే సాధనం. సాధనమైనా **"సుసుఖం కర్తుమ్"** అని అన్నట్లు చాలా

సుఖంగా ఉండే తిరునామసంకీర్తనం చేయడంతగినది సుమా! ఉపాయబుద్ధితో నామసంకీర్తనం చేస్తే, చేతన-ఈశ్వరులిద్దరి భావానుగుణంగా తిరునామ సంకీర్తనానికి ఉపాయత్వం ఉన్నది. స్వయంప్రయోజనంగానో, యాదృచ్ఛికంగానో, సాంకేతికంగానో, పరిహాసంగానో, అర్థరహితంగానో, హేళనగానో- ఇతడు తిరునామ సంకీర్తనం చేసినా, "నా పేరునుకదా చెప్పాడు వీడు!'' అని స్వామి సుకృతంగా లెక్కిస్తాడు. అందువల్ల అపుడు కూడా ఈ చేతనుని భావంలో దీనికి ఉపాయత్వం లేకపోయినా, ఈశ్వరుని భావంలో ఫలకరణోపాయత్వం ఉన్నది. దానినిబట్టికూడా తిరునామసంకీర్తనాన్ని **"తవమ్"** అని అంటున్నారు.

అవ :- ఈ విధంగా ఉండే తపస్సును అనుష్ఠించి, సర్వేశ్వరుని శ్రీపాదాలను సులభంగా పొందినవాడు చతుర్ముఖుడే కదా! అని ఇందులో అంటున్నారు.

**78.** తవమ్ శెయ్‌తు నాన్ముగనే పె*ఱ్ఱా*న్ తరణి
నివర్న్దళప్ప నీట్టియ పొఱ్పాతమ్- శివన్ద తన్
కైయనైత్తు మార క్క*ళు*వినాన్ కఙ్గైనీర్
పెయ్‌తనైత్తు ప్పేర్ మొ*ళి*న్దు పిన్

తరణి = భూమిని, అళప్ప నిమిర్న్దతు = స్పృశించి కొలువడానికి ప్రారంభించి, త్రివిక్రముడై పెరిగి, నీట్టియ= ఉన్నతంగా ఎత్తిన, పొన్ పాతమ్= గొప్ప శ్రీపాదాన్ని, కఙ్గై నీర్ పెయ్‌తు = గంగాజలంగా ప్రవహించిన ధర్మమనే తీర్థాన్ని సమర్పించి, అనైత్తు పేర్ మొ*ళి*న్దు = (పరమాత్మ యొక్క) అన్ని తిరునామాలను నోరార పల్కి, పిన్ =తరువాత, తన్ శివన్ద కై అనైత్తుమ్ ఆర= తన అందమైన శ్రీహస్తాలు అన్నీ ప్రయోజనాన్ని కల్గినవి అయేటట్లుగా, క*ళు*వినాన్ = శ్రీపాదాలను కడిగినవాడైన, నాన్ ముకనే = బ్రహ్మ ఒక్కడే, తవమ్ శెయ్‌తు పె*ఱ్ఱా*న్ = తిరునామసంకీర్తనమనే తపస్సుయొక్క ఫలాన్ని పొందినవాడయ్యాడు.

"తవమ్ శెయ్‌దు నాన్ముకనే పె*ఱ్ఱా*న్" అనే మొదటి పాదానికి వివరణంగా మిగిలిన మూడు పాదాలు గ్రహించి అర్థం చెప్పడం ఒక తీరు.



ఆవిధంగా కాకుండా - "తరణి నివర్న్దళప్ప నీట్టియ పొఱ్పాదమ్ కఙ్గైనీర్ **పెయ్‌దు తన్ శివన్ద కై యనైత్తుమ్ ఆర క్క*ళు*వినాన్, పిన్ అనైత్తు ప్పేర్ మొ*ళి*న్దు తవమ్ శెయ్‌దు నాన్ముకనే పె*ఱ్ఱా*న్"** అని అన్వయించి, ఈ విధంగా తన అందమైన చేతులకు సాఫల్యం కలిగేటుట్లగా స్వామి శ్రీపాదాలను శోధించి, ఆ తరువాత స్వామి నామాలను అన్నిటినీ అనుసంధించడమనే తపస్సును ఏ కొఱతా లేకుండా చేసి, చతుర్ముఖుడొక్కడే ఈ తిరునామ సంకీర్తనం యొక్క ఫలంగా తన ఆయుస్సు చివరలో మోక్షాన్ని చేరి, ఆ స్వామి శ్రీచరణాలనే ఫలంగా పొందాడు - అని చెప్పవచ్చు. ఇతడు స్వయం ప్రయోజనంగా తిరునామ సంకీర్తనాన్ని చేయగా అతడు తన పేరును అనుసంధించినట్లుగా లెక్కించి, మహాఫలం అయిన తన శ్రీచరణకైంకర్యాన్ని భగవానుడు అనుగ్రహించాడని కూడా భావం. **"వణ క్కుడై త్తవ నెఱి"** (తిరువాయ్ 1-3) అని అంటూ నమ్మా*ళ్వా*ర్లు నమస్కారాదులను చేతనుడు స్వయం ప్రయోజనంగా చేసినా, సర్వేశ్వరుడు వాటిని తపస్సుగా (ఉపాయంగా) లెక్కించి, ఫలాన్ని ప్రసాదిస్తాడని అన్నారు కదా!

అవ :- తన పరత్వాన్ని గమనించకుండా లోకాలను కొలిచే కార్యాన్ని చేసిన శ్రీవామనమూర్తియొక్క ఈ లీల, తల్లి కౌసల్య ప్రార్థించినా నిరాకరించి, రాళ్ళు ముళ్ళు నిండిన అరణ్యానికి పోయిన శ్రీరామచంద్రుని లీలతో సాటివస్తుంది- అని అంటున్నారు.

**79.** పిన్నిన్ఱు తాయిరప్ప క్కేళాన్ పెరుమ్బణైత్తోళ్
మున్నిన్ఱు తానిరప్పాళ్ మొయ్‌మలరాళ్- శొల్ నిన్ఱ
తోళ్‌నలన్దాన్ నేరిల్లా త్తోన్ఱల్ అవనళన్ద
నీణిలన్దానత్తనైక్కుమ్ నేర్

తాయ్ = తల్లి అయిన కౌసల్య, పిన్ నిన్ఱు = వెంబడించి, ఇరప్ప = (నన్ను విడచి నీవు అడవికి పోవద్దు-అని) ప్రార్థించినా కాని, కేళాన్ = దానిని విననివాడుగాను, పెరు పణై తోళ్ = గొప్ప వెదుళ్ళవంటి బాహువులను కల్గినదై, మొయ్ మలరాన్ తాన్= అందమైన తామరపూవుతో జనించిన లక్ష్మియొక్క అంశభూతురాలైన సీతాదేవి, మున్ నిన్ఱు = (అరణ్యానికి వెళ్ళాలని) ముందుకు

వచ్చి, ఇరప్పాళ్ = (నన్నుకూడా పిలుచుకొని వెళ్ళాలి- అని) ప్రార్థించినా, (దానిని ఆదరించనివాడుగాను), శొల్ నిన్ద = శ్రీరామాయణమనే గ్రంథానికి ప్రతిపాద్యుడై ఉన్నవాడు, తోళ్ నలమ్ తాన్= భుజబల విషయంలో, నేర్ ఇల్లా తోన్దల్=సాటి లేని స్వామి అయిన శ్రీరాముని, అత్తనైక్కుమ్= (అరణ్యంయొక్క కాఠిన్యాన్ని చూడకుండా ధైర్యంగా అరణ్యానికి వేంచేసిన) ఆ లీలకు, అవన్ అళన్ద నీళ్ నిలమ్ తాళ్ నేర్ = ఆస్వామి చాలా గొప్పదైన ఈ లోకాన్ని కొలిచిన ఆ లీలమాత్రమే సాటి వస్తుంది.

స్వామి సౌకుమార్యాన్ని చూచి "అరణ్యానికి పోవద్దు'' అనే తల్లి కౌసల్య మాటను కాదని, తాను వెంట వస్తాననే సీతాదేవి ప్రార్థనను కాదని, తన తిరుమేని సౌందర్యాన్ని ఏమాత్రం లెక్కపెట్టకుండా, తాను సంచరించబోయే అరణ్యంయొక్క కాఠిన్యాన్ని చూడకుండా, తండ్రి మాటను నిజం చేయాలి- అనే భావంలోని స్థిరమైన అభిప్రాయంతో చక్రవర్తిత్వాన్ని తోసిరాజని, అరణ్యవాసాన్ని **"వనవాసో మహోదయః"** అని ఆదరించిన శ్రీరాముని ఆ లీలకు- **"ఇడక్కై వలమ్బురి నిన్దార్ప్ప" (71)** అనే పాశురంలో ఈ దివ్యసూరే పల్కిన రీతిలో, భక్త్యుత్కర్షను కలవారిలో అగ్రగణ్యులైన సుదర్శనపాంచ జన్యాలు, ఆదిశేషుడు పొందిన అస్థానే భయశంక, తన పూవువంటి సుకుమారాలైన శ్రీచరణాలు, మిట్టపల్లాలుగా ఉండే భూమి కాఠిన్యం, అసురులైన నముచి (బలికుమారుడు) మొదలైనవారు తన పాదాలను గట్టిగా పట్టుకొని లోకాలను కొలువనీయకుండా అడ్డగించడం మొదలైనవానిని ఏమాత్రం లెక్కచేయకుండా, తన భక్తుడైన ఇంద్రుని ప్రార్థనను సఫలం చేయడంకోసంగా కఠినమైన ఈ భూమిని కొలిచిన ఈ వామనమూర్తి లీల సమానం అవుతుంది. రావణాదులను సంహరించిన బాహుబలం మొదలైనవానికి, నముచి మొదలైన వారికి అణచిన బాహుబలం మొదలైనవి సాటి వస్తాయి. శ్రీరాముని ధర్మరక్షణ దీక్షకు శ్రీవామనుని ఆశ్రితరక్షణ దీక్ష సమానం- అని భావం.

అవ :- "ఇటువంటి అతని శ్రీచరణాలలో కైంకర్యాన్ని అభిలషించి, వాటిని భావించినంతమాత్రంలోనే వాటిలో నేను అభినివేశాన్ని పొందడం చూస్తే,



పూర్వకాలంలో అతని రూపసౌందర్యాన్ని దర్శించి, అనుభవించగల్గినవారు అపుడు ఏమి పాట్లు పడ్డారోకదా!'' - అని అంటున్నారు.

**80.** నేర్న్దే నడిమై నినైన్దేన్ అతొణ్కమలమ్
ఆర్న్దే మున్శేవడిమేలన్బాయ్-ఆర్న్ద
అడిక్కోలమ్ కణ్డవర్క్కెన్కొలో మున్నై
ప్పడిక్కోలమ్ కణ్డ పకల్

అడిమై నేర్న్దేన్ = (నీ శ్రీచరణాలలో) కైంకర్యం చేయాలని అధ్యవసాయ పూర్వకంగా ప్రారంభించాను, ఒణ్ కమలమ్ అతు నినైన్దేన్ = అందమైన తామరపూవువంటి ఆ శ్రీపాదాలను అనుసంధించాను, ఉన్ శే అడి మేల్ = నీ ఆ శ్రీపాదాల విషయంలో, అన్బు ఆయ్ ఆర్న్దేన్ = ప్రేమే రూపొందినవాడనై, పూర్ణత్వాన్ని పొందాను, ఆర్న్ద = లోకాలను కొలిచిన (పూర్ణమైన) శ్రీచరణాల అందాన్ని, కణ్డవర్క్కు = సేవించగల్గినవారికి, పడి కోలమ్ కణ్డ మున్నై ప్పకల్ ఎన్కొలో = సహజం అయిన అలంకారాలను సేవించగల్గిన పూర్వకాలం గొప్పది అవుతుందా!

త్రివిక్రమావతారంలో ఆభరణాలు లేకుండా ఆ స్వామి శ్రీపాదాల సహజమైన అందాన్ని సేవించగల్గినవారికి అంతకు పూర్వకాలం దానిని అలంకారాలతో అలంకరింపబడినపుడు సేవించడం ఆనందాన్ని కల్గించదు- అని భావం.

ఈ శ్రీచరణాలలో వాలడానికి హేతువు, అనాది సిద్ధం అయిన తిరుమేని యొక్క అందాన్ని, ఏ అంగాన్ని విడువకుండా మొత్తం దర్శించి అనుభవించిన సమయంలో భక్తులు ఏమి పాట్లను పడ్డారో? అని భావం. లేక, **"ఆర్న్ద అడిక్కోలమ్ కణ్డవర్"** అనే ప్రయోగం శ్రీచరణాలకు సేవచేసే స్వభావాన్ని సూచిస్తున్నదని భావించి, "పూర్ణమైన శ్రీచరణాల సౌందర్యాన్ని చూచే ఇంత అభినివేశాన్ని పొందితే రూపసౌందర్యం మొత్తాన్ని చూచినవారు ఏమి పాట్లను పడ్డారో? - అని కూడా చెప్పవచ్చు. లేక, **"ఆర్న్ద అడి"** అని అన్నది త్రివిక్రముడైనపుడు లోకాన్ని కొలిచిన శ్రీచరణంగా గ్రహించి, అపుడు ఆ శ్రీచరణల యొక్క

సహజమైన అందాన్ని దర్శించినవారికి, దానికి ముందు ఆ శ్రీచరణాలను ఆభరణాలతో అవి ఆచ్ఛాదింపబడినపుడు సేవించినవారి కాలం సాటి వస్తుందా?- అని చెప్పవచ్చు. **"పడి కోలమ్"** సహజంగా పొందికగా ఉండే ఆభరణాల అందం - అని అర్థం. త్రివిక్రమావతారకాలంలో ఆభరణాలు లేకుండా ఉండే శ్రీచరణాల సహజసౌందర్యాన్ని సేవించినవారికి దానికి ముందు కాలంలో అవి ఆభరణాలచే కప్పబడి ఉన్నపుడు సేవించడం రుచించదు- అని భావం. **"ఆభరణస్యాభరణమ్"** అనే రీతిలో ఆభరణానికి సైతం అందాన్ని ఇచ్చే విషయం కదా ఇది! **"సర్వభూషణభూషార్హాః"** అని హనుమానుడన్నాడు కదా!

అవ :- గడచిన పాశురంలో **"ఎన్కొలో మున్నై ప్పడిక్కోలమ్ కణ్డ పకల్"** అని పూర్వకాలంలో అతనిని దర్శించి అనుభవించగల్గినవారు ఏమి పాట్లు పడ్డారో కదా!- అని ఆశ్చర్యపడ్డారు. ఈవిధంగా పాడుబావిని తవ్వాలా? ఇపుడు నేను అతనిని దర్శించి పడే పాట్లు చాలవా!- అని ఈ పాశురంలో అంటున్నారు.

**81.** పకల్ కణ్డేన్ నారణనై క్కణ్డేన్ కనవిల్
మిక క్కణ్డేన్ మీణ్డవనై మెయ్యే- మిక క్కణ్డేన్
**ఊన్ తికழుమ్ నేమి ఒళి తికழுమ్ శేవడియాన్**
**వాన్ తికழுమ్ శోతి వడివు**

పకల్ కణ్డేన్ = రాత్రికాలం కలవకుండా కేవలం పగటికాలంగా ప్రవర్తించే గొప్ప ప్రభాతాన్ని దర్శించాను, (దానికి మూలంగా) నారణనై కణ్డేన్ = శ్రీమన్నారాయణుని (అనే అస్తమించని సూర్యుని) దర్శించాను, మీణ్డు = మళ్ళీ, కనవిల్= మానస సాక్షాత్కారం కంటే, మిక మెయ్యే = చాలా స్పష్టంగా, అవనై కణ్డేన్ = అతనిని దర్శించాను, ఊన్ తికழுమ్ నేమి = తిరుమేనిలో ప్రకాశించే శ్రీసుదర్శనాన్ని కలవాడు, ఒళి తికழுమ్ శే అడియాన్ = ప్రకాశం మిక్కిలిగా కల శ్రీచరణాలను కలవాడు అయిన ఆ స్వామియొక్క, వాన్ తికழுమ్ = పరమపదంలో ప్రకాశిస్తున్న, శోతి వడివు = జోతిర్మయం అయిన తిరుమేనిని, మిక కణ్డేన్ = (ఇక్కడ) చక్కగా దర్శించగలిగాను.



ఈ విధంగా ఉండేది, సర్వేశ్వరునకు చెందినది, **"పరమే వ్యోమన్"** అని ఉపనిషత్తులలో పరమాకాశంగా కీర్తింపబడే పరమపదంలో ప్రకాశించే జ్యోతిర్మయమైనది అయిన స్వామి, తిరుమేనిని ముందు తెల్పిన రీతిలో స్ఫుటంగా దర్శించాను - అనే ఈ భావంలో - **"వాన్"** అంటే - పరమపదం. లేక, **"వాన్"** అనే పదానికి ఆకాశంలోని మేఘంగా గ్రహించి, **"వాన్ తికழுమ్ శోతి వడివు"** అనే ప్రయోగానికి - మేఘంవలె భాసించే తిరుమేని - అని అర్థం చెప్పవచ్చు.

అవ :- నేను దర్శించినది బ్రహ్మచారి నారాయణుని కాదు; శ్రీమన్నారాయణుని మాత్రమే- అని ఇందులో అంటున్నారు.

**82.** పడిక్కోల వాళ్నెడుఙ్గణ్ మామలరాళ్ శెవ్వి
ప్పడిక్కోలమ్ కణ్డకలాళ్ పన్నాళ్- అడిక్కోలి
ఞాలత్తాళ్ పిన్నుమ్ నలమ్పురిన్దతెన్కొలో
కోలత్తాలిల్లై కుఱై

పడి కోలమ్ = వడి కట్టిన (సారభూతమైన) అందాన్ని కల్గినది, నెడు కణ్= కాంతి నిండిన, మిక్కిలి భోగ్యం అయిన తిరునేత్రాలను కల్గినది, మా మలరాళ్ = ఎఱ్ఱని తామరపూవులో పుట్టినది అయిన లక్ష్మీదేవి, శెవ్వి పడి కోలమ్ = తగిన వయస్సును సహజంగా కల అతని అందాన్ని, కణ్డు = కళ్ళతో దర్శించి, పల్ నాళ్ అకలాళ్ = క్షణకాలం అయినా విడిచి ఉండకుండా, నిత్యం కూడి ఉంటుంది, పిన్నుమ్ = భగవానుని అందంలో లక్ష్మీదేవి అభినివిష్టయై, నిమగ్నురాలైన రీతిని చూచినా, ఞాలత్తాళ్ = భూదేవి, అడి క్కోలి = ఆశపడుతూ, నలమ్ పురిన్దదు ఎన్కొలో = (ఆ భగవానుని విషయంలో) ఆశను ఇంకా ఇంకా వృద్ధిచేసి కోవడం ఏమోకదా !, కోలత్తాల్ కుఱై ఇల్లై = (ఎంతమంది అనుభవించినా కీర్తించదగిన) అందంలో కొఱతలేదుకదా!

భగవానుని వద్దగల అందం అంతం లేనిది, కనుక పలువురు ఆశ పడడంలో అడ్డు లేదు. లౌకికవిషయాలను అనుభవించేవారు పలువురు అయినపుడు ఆ విషయాలలోని భోగ్యత పరిమితం కనుక వారిమధ్య స్పర్ధ

కలుగవచ్చు. భగవానుని అందం అలౌకికం. కనుక ఎంత మంది అనుభవించినా తరగదు కనుక వారు కీర్తించేట్లే ఉంటుంది.

అవ :- డెబ్బైనాల్గవ పాశురంలో "నిస్సమాభ్యధికుడైన పరమాత్మనుగూర్చి కవిత్వాన్ని చెప్పగల్గినందువల్ల నాతో పోలినవారు లేరు, నేను గొప్ప తమిళ పండితుణ్ణి. గొప్ప అదృష్టాన్ని కలవాడను నేను" అని అన్నారు. ఇపుడు **"పడిక్కోల వాళ్ నెడుఙ్కణ్ మామలరాళ్"** అని ప్రారంభం అయిన గత పాశురంలో, ఆ పరతత్త్వాన్నే అతనికంటే మించిన రూపగుణవైభవాలను కల్గిన లక్ష్మీదేవితో, భూదేవితో చేరి ఉన్నవానినిగా అనుసంధించగానే, "అయ్యో! తప్పుగా చెప్పానే! నేనా గొప్ప తమిళపండితుణ్ణి! నేనా గొప్ప అతిశయాన్ని కలవాణ్ణి! ఈ భగవానుడనే గొప్ప విషయాన్ని నా అల్పవాక్కులతో వర్ణించడానికి ప్రారంభించడం సాహసమే కదా- అని ఈ పాశురంలో నైచ్యానుసంధానాన్ని చేస్తున్నారు.

**83.** కుఱైయాక వెమ్ శొఱ్కళ్ కూఱినేన్ కూఱి
మఱైయాఙ్గెన ఉరైత్త మాలై - ఇఱైయేనుమ్
ఈయుఙ్గొలెన్ఱే ఇరున్దే నెనైప్పకలుమ్
మాయన్కణ్ శెన్ఱ వరమ్

మఱై= వేదాలు, ఆఙ్గు ఎన ఉరైత్త మాలై = (ఇటువంటివాడు - అని ఇదమిత్థంగా అనకుండా), అటువంటివాడు - అని మాత్రమే చెప్పిన భగవానుని గూర్చి (అల్ప జ్ఞానిని అయిన నేను), కుఱై ఆక = కొఱత కలిగేటట్లు, వెమ్ శొఱ్కళ్ = చెవులు చుర్రుమనే కఠినోక్తులతో, కూఱినేన్ = పలికాను, కూఱి = ఆవిధంగా పలుకడమేకాకుండా, మాయన్ కణ్ శెన్ఱ వరమ్ = ఆస్వామి వద్ద స్థిరంగా ఉండే కృపలో, ఇఱైయేనుమ్ = కొంచెం అయినా, ఈయుమ్ కొల్ ఎన్ఱే = (మనకు) అనుగ్రహిస్తాడా ! అని (ఫలాన్ని ఎదురుచూస్తూ), నినై ప్పకలుమ్= చిరకాలంగా రాత్రి పగలు, ఇరున్దేన్ = ఉన్నాను.

ఆశ్చర్యాన్ని కల్గించే గుణాలను, లీలలను కల ఆ స్వామిలో పొందికగా ఉండే కరుణను గడచిన కాలంలో అతనిని ఆశ్రయించి, కవిత్వాన్ని చెప్పినవారికి అతడు అనుగ్రహించిన రీతిని స్మరించి, "ఆకరుణలో ఏకొంచెం అయినా నా బాల్య, అల్ప కవిత్వానికి బహుమానంగా అనుగ్రహించడా!" అని చాలాకాలం నా కవిత్వానికి ప్రతిఫలాన్ని ఎదురుచూస్తూ ఉన్నాను. కవిత్వం చెప్పడానికి ఆరంభించిన విషయం అయిన శ్రియఃపతియొక్క మహిమను, తమ వాక్కుయొక్క నైచ్యాన్ని, దానికి ప్రతిఫలాన్ని ఆశించే తక్కువదనాన్ని తలచి, ఆళ్వార్లు "ఎంతటిమూర్ఖుణ్ణి!" అని పశ్చాత్తాప పడుతున్నారు. "అయితే, ఈ ఆళ్వార్లు కూడా ఏదో ఒక ప్రయోజనాన్ని ఆశించి కవిత్వాన్ని చెప్పారా!" అని అంటే, ఒక క్షుద్రపురుషార్థాన్ని ఆశించి వీరు కవిత్వాన్ని చెప్పలేదు. "స్వామి తమ కవిత్వాన్ని మెచ్చి ఒక సారి తల పంకించి, చల్లగా కటాక్షిస్తే, అదే తమ స్వరూపానికి తగిన, యుక్తమైన గొప్ప ఫలం"- అని తలచేవారు వీరు. అందువల్ల ప్రయోజనాంతరాలను ఆశించడమనే నైచ్యం వీరికి లేదు. అయితే, తరువాత వీరు అనుతాపాన్ని పొందడం ఎందుకు? - అని అంటే, అటువంటి గొప్ప విషయానికి (స్వామికి) తగని తక్కువ, నీచకవిత్వాన్నిపాడి, దానికి ప్రతిఫలింగా అతని మహనీయమైన కృపను ఆశించడం ఎంత మాత్రం తగదు- అని భావించేవారు. కనుక అనుతపించడంలో అడ్డు లేదు. **"మాయన్ కణ్ శెన్ఱ వరమ్"**- ఆశ్చర్యభూతుడైన అతనిలో పొందికగా ఉండే గొప్ప కరుణ- అని దీని భావం. లేక, గొప్ప వస్తువును చెప్పే **"వరమ్"** అనే పదం అతని గొప్ప మాటను తెలుపుతున్నదని భావించి, "ఆశ్చర్యభూతుడైన అతనివద్దకు వెళ్ళినపుడు, చెప్పవలసిన గొప్ప మాటను ఏ కొంచెం అయినా పలుకడా? అని ఎదురుచూస్తూ ఉన్నాను"- అని అంటున్నారని కూడా చెప్పవచ్చు.

అవ :- భగవానుడనే గొప్ప విషయంయొక్క మహిమకు నా వాక్కు తగనిదే అయినా, ఆ విషయంయొక్క భోగ్యతయే నన్ను నిర్బంధించి, ఆ విధంగా పాడేటట్లుగా చేస్తున్నది- అని అంటూ, ఇంకా ఆ స్వామినే కవితతో కీర్తిస్తున్నారు.

**84.** వరమ్ కరుతి త్తన్నై వణఙ్గాత వన్మై
ఉరమ్ కరుతి మూర్క్కత్తవనై -నరమ్ కలన్ద
శిఙ్గమాయ్ క్కీణ్డ తిరువ నడియిణైయే
అఙ్గణ్మాల్ ఞాలత్తముతు

వరమ్ కరుతి = (దేవతలవల్ల పొందిన) వరాన్ని (గొప్పగా) భావించి, తన్నై వణఙ్గాత = (సర్వేశ్వరుడైన) తనను నమస్కరించనివాడు, వన్మై ఉరమ్ కరుతి = (తన) వరబలాన్ని, శరీరబలాన్ని తలచి, మూర్క్కత్తవనై = మూర్ఖతను కల్గినవాడైన హిరణ్యకశిపుని, నరమ్ కలన్ద శిఙ్గమ్ ఆయ్ కీణ్డ = నరరూపం కలిసిన సింహమై (అతని వక్షస్సును) చీల్చిన, తిరువన్ = అందాన్ని కలవాని యొక్క, అడి ఇణైయే = రెండు శ్రీపాదాలనే, అమ్ కణ్ మా ఞాలత్తు=అందమైన ప్రాంతాలను కల ఈ భూమండలంలో, అముతు=(భోగ్యత నిండిన) అమృతం.

ఒకదానితో ఇంకొకటి సాటి వచ్చే సౌసాదృశ్యాన్ని కల ఆ సుందరుని, శ్రీచరణాలే, మోక్షానందంవలె ఒక దేశవిశేషం అయిన పరమపదం చేరి, అనుభవించదగినదిగా కాకుండా, అందమైన, విశాలమైన ఈభూమిలోనే, ఇక ఏ విషయంలోను దృష్టి పెట్టకుండా, మేము అనుభవించదగిన, చాలా తీయని అమృతంగా ఉంటాయి - అని భావం. **"అమ్కణ్ మా ఞాలత్తు అముదు"** - దేవలోకంలో దేవతలు అనుభవించే, ఉప్పు సారంగా చెప్పదగిన అమృతంకంటే దీనికి ఉండే అతిశయాన్ని ఈ ప్రయోగం చెబుతున్నదని కూడా అనవచ్చు. **"కుఱైయాక వెమ్ శొల్కళ్ కూఱినేన్"** అని అంటూ కవిత్వం చెప్పడంనుండి విరమించిన నన్ను ఈ అమృతం ఇంకా ఇంకా కవిత్వం చెప్పేటట్లు చేసింది- అని భావం.

అవ :- భగవంతుడనే విషయంలోని భోగ్యత నిర్బంధించగా కవిత్వాన్ని చెప్పడం ప్రారంభించిన ఆళ్వార్లు, ఆ భోగ్యతను అనుసంధించగానే, అది అలౌకిక భోగ్యవిషయాన్ని ఆశ్రయించినది కావడంవల్ల, మన హీనమైన కఠినోక్తులు కూడా అమృతంవంటి వాఙ్మాలలు అయ్యాయి- అని ఇందులో అంటున్నారు.

**85. అముతెన్టుమ్ తేనెన్టుమ్ ఆழியానెన్టుమ్**
**అముతన్టు కొణ్డుకన్దా నెన్టుమ్- అముదన్న**
**శొన్మాలై యేత్తి త్తొழுతేన్ శొలప్పట్ట**
**నన్మాలై యేత్తి నవిన్టు**



అముతు ఎన్నుమ్ = అమృతంవంటివాడని, తేన్ ఎన్టుమ్ = తేనెవంటి వాడని, ఆழியాన్ ఎన్టుమ్ = శ్రీసుదర్శనాన్ని ధరించినవాడని, అన్టు అముతు కొణ్డు ఉకన్దాయ్ ఎన్టుమ్ = ముందుకాలంలో (సముద్రాన్ని చిలికి దేవతలకు) అమృతాన్ని ఉద్ధరించి అనుగ్రహించి ఆనందించినవాడని, ఏత్తి = స్తుతించి, శొల ప్పట్ట = (శాస్త్రాలలో ఈ విధంగా) చెప్పబడ్డ, నల్ మాలై = మిక్కిలి గొప్ప వాడైన భగవానుని, అముతు అన్న శొల్ మాలై = అమృతంవంటి ఈ పాశురా లలో, ఏత్తి నవిన్టు తొழுదేన్ = పలు మార్లు స్తుతించి పల్కి, నమస్కరించాను.

"భక్త్యతిశయం చేత పలుమార్లు పొగడి, స్తుతించి" - అనే భావాన్ని **"అముదన్న శొన్మాలై ఏత్తి త్తొழுదేన్"** అని అన్వయించి చెప్పాలి.

అవ :- **"నన్మాలై యేత్తి నవిన్టు శొన్మాలై ఏత్తి త్తొழுదేన్"** అని అంటూ ఆళ్వార్లు గడచిన పాశురంలో తాము గొప్ప మహిమ గల భగవానుని స్తుతించి పల్కి, అమృతంవంటి పాశురమాలికతో కొలిచిన రీతిని పలుకగానే, ఉపాయబుద్ధితో భగవానుని స్తుతించి పల్కి కొలిచేవారినిగూర్చిన స్మరణ ఆళ్వార్లకు కల్గి, ఆ విధంగా సాధనానుష్ఠానం చేసి, భగవానుని దర్శించాలని కోరేవారు, అతడే స్వయంగా తనను దర్శింపజేయగా దర్శించినవారితో సాటి వస్తారా!- అని ఇందులో అంటున్నారు.

**86. నవిన్టురైత్త నావలర్కళ్ నాణ్మలర్ కొణ్డు ఆఙ్గే**
**పయిన్టతనాల్ పెఱ్ఱ పయనెన్కొల్?- పయిన్టార్తమ్**
**మెయ్త్తవత్తాల్ కాణ్బరియ మేకమణివణ్ణనై యాన్**
**ఎత్తవత్తాల్ కాణ్బన్ కొలిన్టు**

నవిన్టు ఉరైత్త = (సాధన బుద్ధితో భగవానుని తిరునామాలను) పలుమార్లు అనుసంధించే, నా వలర్కళ్ = గొప్ప కవులు, నాణ్ మలర్ కొణ్డు = అపుడే విరిసిన పూవులను తీసికొని, ఆఙ్గే పయిన్టు = ఆ సర్వేశ్వరునివద్ద దృఢంగా ఆశ్రయించి, అతనాల్ పెఱ్ఱ పయన్ ఎన్కొల్ = దానివల్ల వారు పొందిన ఫలం ఏమోకదా! (భగవానుడు తానే తనను దర్శింపజేస్తే తప్ప వారి స్వప్రయత్నంతో ఏమి ఫలం పొందడానికి సాధ్యం? అని భావం), పయిన్టార్ తమ్= సాధనానుష్ఠానాన్ని చేసేవారి, మెయ్ తవత్తాల్ = శరీరం శ్రమపడి చేసే

తపస్సుతో, కాణ్బు అరియ = దర్శించడానికి వీలు కానివాడు, మేకమ్ మణివణ్ణనై = నీలమేఘంవంటి, నీలమణివంటి వర్ణాన్ని కలవాడైన స్వామిని, యాన్ = నేను, ఇన్రు = ఇపుడు, ఎత్తవత్తాల్ కొల్ కాణ్బన్ = ఏ తపస్సుతో దర్శిస్తాను?

అతడే దర్శింపజేస్తే దర్శిస్తాను తప్ప, ఏ తపస్సును (స్వప్రయత్నాన్ని) చేసి నేను దర్శించలేను- అని భావం.

చాలా అధముణ్ణి అయిన నేను ఇపుడు ఏ తపస్సును చేసి భగవానుని దర్శిస్తాను? అతడే తన నిర్హేతుకకృపతో తన రూపసౌందర్యాన్ని చూపిస్తే తప్ప, నేనిపుడు ఏ తపస్సును చేసి అతనిని దర్శించగలను? భగవానుని నేను ఉపాయంగా ఆశ్రయించనందువల్ల, అతడు నాకు ఇంకొక సాధనానుష్ఠాన శ్రమను కలగనీయకుండా తానే తనను దర్శింపజేశాడు - అని భావం. తరువాత పాశురంలో భగవానుని గర్భవాసంలోనే దర్శించినట్లుగా ఆ*ళ్వా*ర్లు పల్కడం చేత, "ఏ తపస్సును చేసి నేను అతణ్ణి ఇపుడు దర్శించ గలను?" అనే అర్థాన్ని గ్రహించడం పొసగదు, ఆ*ళ్వా*ర్లు **"యాన్"** అని తమ నైచ్యాన్ని అనుసంధించారని అప్పిళ్ళైవ్యాఖ్య. **"యావర్ నికర్ అవర్ వానత్తే"** (తిరువాయ్-4-5-8) **"వానక్కోనై క్కవి శొల్లవల్లేఱ్కు ఇని మాఱుణ్డే"** అనే సందర్భంలోవలె" అతని ద్వారానే అతనిని దర్శించిన తమ సాటిలేని గొప్పతనానికి ఆ*ళ్వా*ర్లు తెలుపుతున్నారని పెరియవాచ్చాన్‌పిళ్ళై అభిప్రాయం.

అవ :- ఏదైనా ఒక సాధనానుష్ఠానాన్ని చేసి, భగవానుని పొందాలని ఆశించేవారి అధమత్వాన్నిగూర్చి గత పాశురంలో పలికారు. మీ ప్రయోజనానికి గల గొప్పతనం ఏమి?- అనే ప్రశ్న తల ఎత్తగా, ఉపాయానుష్ఠానంలో ఏమాత్రం యోగ్యత లేని గర్భవాస స్థితిలోనే అతనిచే కటాక్షింపబడి, అతనికి కైంకర్యాన్ని చేసి, అతని స్వరూపరూపగుణవిభూతుల వైభవాన్ని అనుభవించగల్గిన గొప్పఫలం కదా నాది - అని ఇందులో అంటున్నారు.

**87.** **ఇన్రా వఱికిన్రే నల్లేన్ ఇరునిలత్తై**
**చ్చెన్రాఙ్గళన్ద తిరువడియై- అన్రు**
**కరుక్కోట్టియుళ్ కిడన్దు కైతొ*ళు*తేన్ కణ్డేన్**
**తిరుక్కోట్టి యెన్దై తిఱమ్**

అన్రు కరు కోట్టియుళ్ కిడన్దు = పూర్వం గర్భవాసంలో ఉండి, తిరుక్కోట్టి ఎన్దై తిఱమ్ = తిరుక్కోట్టియూర్‌లోని స్వామియొక్క స్వభావాలను (ప్రకారాలను), కణ్డేన్= దర్శించి, అనుభవించగలిగాను, కై తొ*ళు*తేన్ = (అనుభవించి, ఆ అనుభవ పరీవాహంగా) చేతులను జోడించగలిగాను, (అందువల్ల), ఇరు నిలత్తై= వైశాల్యం నిండిన ఈ భూలోకాన్ని, ఆఙ్గు శెన్రు అళన్ద తిరు అడియై = (త్రివిక్రమావతార కాలంలో) అక్కడే తానే వ్యాపించి కొలిచిన శ్రీచరణాన్ని, ఇన్రు ఆ అఱికిన్రేన్ అల్లేన్ = ఈ నాటికే తెలిసికొన్నాను- అనే విషయం లేదు (గర్భవాసస్థితి నుండి ఆరంభించి నేను మఱచిపోయినది లేదు.)

పరమపదనాథుడా నన్ను కటాక్షించాడు? సౌలభ్యానికి పరాకాష్ఠ అయిన తిరుక్కోట్టియూర్‌లోని స్వామి కదా నాకు తన జాయమానకటాక్షాన్ని ప్రసరించేశాడు. దానివల్ల ఇంతవరకు నేను అతనిని మఱువకుండా ఉన్నాను- అని భావం.

అవ :- అతడే స్వయంగా దర్శింపజేయగా దర్శించినవారు అతనిని పొందవచ్చునే తప్ప, తమ ప్రయత్నంతో అతనిని దర్శించాలని అనుకొనేవారు అతనిని ఎప్పటికీ పొందలేరు - అని పల్కుతూ, గడచిన రెండు పాశురాలలో తెలుపుతున్న అర్థాన్ని ఇందులో ఆ*ళ్వా*ర్లు పూర్తిచేస్తున్నారు.

**88.** **తిఱమ్బి*ఱ్ఱి*ని యఱిన్దేన్ తెన్నరఙ్గత్తెన్దై**
**తిఱమ్బా వ*ళి* శెన్రార్క్కల్లాల్- తిఱమ్బా**
**చ్చెడినరకై నీక్కి త్తాన్ శెల్వతన్మున్ వానోర్**
**కడినకర వాశల్కతవు**

తెన్ అరఙ్గత్తు ఎన్దై = అందమైన (దక్షిణదిక్కులోని) శ్రీరంగంలో శయనించి ఉండే నాస్వామి అనే, తిఱమ్బా వ*ళి* =తప్పి పోని మార్గంలో, (అతనినే ఉపాయంగా చేసికొని), తామ్ = తాముగానే, తిఱమ్బా శెడి నరకై

నీక్కి = ఛేదించడానికి సాధ్యం కాని ముళ్ళపొదవంటి సంసారక్రూరనరకాన్ని ఛేదించుకొని, శెల్వతన్ మున్ = పోవడానికి ముందే, వానోర్ = నిత్యసూరులకు చెందినది, కడి = (అరణై) కోటలను కల్గినది అయిన, నకరమ్ = వైకుంఠమహా నగరం యొక్క, వాశల్ కతవు = వాకిటి తలుపులు, తిఱమ్బిగ్ఱు = మూసికొనిపోతాయి, ఇని అఱిన్దేన్ = (దీనిని) ఇపుడు తెలిసికొన్నాను.

ఈ పాశురం ద్వారా మనం భగవానుని అతనికి కలిగే ఉపాయంగా పరిగ్రహించినందువల్ల అతనికి కలిగే అతని సంతోషంచేత పరమపదాన్ని పొందవచ్చు తప్ప, మన ప్రయత్నంతో అతనిని పొందలేమని తెలుపబడింది. భక్తినిష్ఠులు కూడా అతనినే ఉపాయంగా ఆశ్రయించి, తమ అవరోధాలను తొలగించుకొనే అతనిని పొందుతున్నారని గ్రహించాలి.

అవ :- "నేను అపేక్షానిరపేక్షంగా భక్తుల కార్యాలను చేస్తాను" అని మీరు (ఆళ్వార్లు) అనే మాటకు ఏదయినా ప్రమాణం ఉన్నదా? ఆ విధంగా ఇంతకు ముందు నేను ఎవరికైనా సహాయపడిన సందర్భం ఉన్నదా?" అని భగవానుని భావంగా తలచిన ఆళ్వార్లు, భక్తుల విరోధులను పోగొట్టి, చక్కని ఉపాయాలతో వారి కార్యాలను సఫలం చేసి, వారికి భగవానుడు సహాయపడిన సందర్భాలను మూడింటిని ఇందులో ప్రస్తావించి, "నీవు ఇటువంటివాడవుకదా స్వామీ!" అని అంటున్నారు.

**89.** కతవి క్కతమ్ శిఱన్ద కఞ్జనై మున్ కాయ్న్దు
అతవిప్పోర్ యానై యొశిత్తు- పతవియాయ్
పాణియాల్ నీరేగ్ఱు ప్పణ్డొరుకాల్ మావలియై
మాణియాయ్ క్కణ్డిలైయే మణ్

కతమ్ తిఱన్ద = కోపం అతిశయించిన, కఞ్జనై = కంసుని, మున్ కతవి కాయ్న్దు= అతని కంటిముందే కోపించి, అతనిని చంపి, పోర్ యానై = పోరాడడం కోసం వాకిటివద్ద నిలుపబడ్డ కువలయాపీడం అనే ఏనుగును, అతవి= నిరోధించి, ఒశిత్తు = దాని కొమ్ములను విఱిచి, పణ్డు ఒరు కాల్ =పూర్వం ఒకానొక సమయంలో, పతవియాయ్= సౌలభ్యాన్ని కలవాడవై, మాణి ఆయ్= బ్రహ్మచారివై, మా వలియై = మహాబలివద్ద, పాణియాల్ = శ్రీహస్తంతో, నీర్ ఏగ్ఱు = దానజలాన్ని గ్రహించి, మణ్ కొణ్డిలైయే=భూమిని పొందలేదా!



యాచకవృత్తిలో కరుడు కట్టిన బ్రహ్మచారివై, నీ సొత్తే అయిన భూమిని మహాబలిదగ్గర యాచించి పొందావుకదా! యాచించినపుడు నీ ఐశ్వర్యం స్ఫురించే టట్లుగా యాచించావా? యాచనే సహజగుణంగా కల బ్రహ్మచారిగా అనే రీతిలో వచ్చి యాచించావు కదా! నిన్ను ఆశ్రయించిన వసుదేవుడు, దేవకి, ఇంద్రుడు- అనే వీరి విరోధిని పోగొట్టి, వీరి కార్యాన్ని పూర్తిచేయాలేదా? దీనిని నీవు మఱుగుపరచగలవా! - అని భావం.

అవ :- "నేను భక్తులకోసం చేసిన కార్యాలు ఒకవైపు ఉండనివ్వండి. మీరు పొందగోరిన ఫలాన్ని గూర్చి చెప్పండి" అని భగవానుడనగా, "నిన్నే ఆశ్రయించి నపుడే పొందడానికి అరుదైన ఫలాలను అన్నిటినీ పొందానుకదా! ఇక పొందవలసినది ఏమున్నది స్వామీ!" అని ఆళ్వార్లు అంటున్నారు.

**90.** మణ్ణులక మాళేనే వానవర్క్కుమ్ వానవనాయ్
విణ్ణులకమ్ తన్నకత్తు మేవేనే- నణ్ణి
త్తిమాలై శెఙ్గణెడియానై ఎజ్గళ్
పెరుమానై క్కైతొ్ళుత పిన్

తిరుమాలై = లక్ష్మీదేవికి స్వామియై, శెమ్ కణ్ = ఎఱ్ఱ తామరలవంటి తిరునేత్రాలను కలవాడై, నెడియానై = సర్వేశ్వరుడైన, ఎజ్గళ్ పెరుమానై = భగవానుని, నణ్ణి =సమీపించి, కై తొ్ళుత పిన్ = అంజలిని చేసి, ఆశ్రయించిన తరువాత, మణ్ ఉలకమ్ ఆళేనే = ఈలీలావిభూతిని నా వశంగా చేసికొని నిర్వహించలేనా?, వానవర్క్కుమ్ వానవన్ ఆయ్ = నిత్యసూరులకుకూడా నాయకుడై ఉండి, విణ్ ఉలకమ్ తన్ అకత్తు = నిత్యవిభూతిలో అన్ని చోట్ల, మేవేనే = నిలచి ఉండి, మహానందాన్ని అనుభవించలేనా?

భగవానుని సమీపించి ఒక అంజలిని మాత్రమే నేను చేసిన పని. ఈ అంజలి అకారవాచ్యుడైన అతనిని నీటిబుగ్గలా కఱగించి, అతని సర్వస్వాన్ని నాశనం చేసేటట్లుగా చేసింది - చమత్కారంగా అని అంటున్నారు. స్తోత్రరత్నం

లోని "త్వదంఘ్రి ముద్దిశ్య" అనే శ్లోకంలో కాయిక ప్రపత్తి అయిన ఈ అంజలి గొప్పతనాన్నిగూర్చి యామునులు తెలిపారు. అందువల్ల భగవద్విషయంలో కొంచెం ఆనుకూల్యం ఉన్నా, తావన్మాత్రంతో ఉభయ విభూతులను ఏలడం అరుదుకాదు. అందుచేతనే భోగమోక్షాలు అనే రెండు నాకు వశమయ్యాయి - అని భావం. ముముక్షువు అయిన ఈ ఆళ్వార్లు "భూలోకాన్ని ఏలుతాను - మణ్ణులకమ్ ఆళేనే" - అని అనడం "తాను పొందే ముక్తిలో ఇదికూడా అంతర్భవించి ఉన్నది'' అనే భావంతో. "అర్థత శ్చ మయా ప్రాప్తా దేవరాజ్యా దయో గుణాః, హతశత్రుం విజయినం రామం పశ్యామి సుస్థితమ్" (శత్రువులను వధించి, ప్రకాశించే శ్రీరాముని చూచిన, నాచే స్వర్గాది సమస్తభోగాలు పొందబడ్డాయి) అని హనుమానుడు అన్నట్లే ఇది కూడా, లేక, "అడజ్గెళ్ళిల్ శమ్బత్తు అడజ్గ క్కణ్డు ఈశన్ అడజ్గెళ్ళిల్ అంహితెన్డు అడజ్గుక ఉళ్ళే" (తిరువాయ్-1-2-7) అని అంటూ ఆళ్వార్లు పల్కినట్లే "ఆ స్వామికి సంబంధించినది'' అనే అనుసంధానంలో జీవునకు లీలావిభూత్యనుభవంకూడా ఉన్నది కదా! దానిని ఇక్కడ తెలుపుతున్నారని కూడా చెప్పవచ్చు.

అవ :- ఇక, ఇటువంటి ఫలాన్ని సంసారులు కోల్పోకూడదు - అనే తమ పరమ కరుణతో, ఇక నాల్గు పాశురాలతో భగవానుని ఆశ్రయించమని లోకులను ఉద్బోధించి, ఆళ్వార్లు ఉపదేశిస్తున్నారు. ఈ పాశురంలో మొదటగా "మీరు ప్రకృతికి పరవశులై ఉన్నందున, శరీరం పతనం కాగానే మీరు నరకాన్ని పొందడం తథ్యం. ఆ విధంగా నరకాన్ని పొందకుండా ఉండాలంటే, అతని శ్రీచరణాలను సేవించాలని ప్రయత్నించండి'' అని ఉపదేశిస్తున్నారు.

**91.** **పిన్నా లరునరకమ్ శేరామల్ పేతుఱువీర్**
**మున్నాల్ వణజ్గ ముయల్మినో- పన్నూల్**
**అళన్దానై క్కార్క్కడల్ శూళ్ ఞాలత్తై ఎల్లామ్**
**అళన్దానవన్ శేవడి**

పిన్నాల్ = శరీరం పతనం చెందిన తరువాత, అరు నరకమ్ = క్రూర నరకాన్ని, శేరామల్ = పొందకుండా ఉండడం ఏ విధంగా? అని, పేతుఱువీర్= మనస్సు కలత చెందిన మానవులారా!, పల్ నూల్ = పలు రీతులలోని శాస్త్రాలతో, అళన్దానై = నిశ్చయింపబడ్డవాడు, కార్ కడల్ శూళ్ ఞాలత్తై ఎల్లామ్ అళన్దాన్ అవన్ = నల్లని సముద్రంతో చుట్టబడి ఉండే భూమిని అంతటినీ కొలిచినవాడు అయిన భగవానుని యొక్క, శే అడి = ఎఱ్ఱని శ్రీపాదాలను, మున్నాల్ = ఈ పొద్దే (ఇపుడే), వణజ్గ = నమస్కరించడానికి, ముయల్మిన్= ప్రయత్నించండి.



**"వణజ్గ"**- ఈపదం ఇక్కడ భక్తిని గాని, లేక ప్రపత్తిని కాని తెలుపు తున్నదనవచ్చు. ఆస్తికులైనవారు నరకం మొదలైన అనిష్టాలను పోగొట్టుకోవడం కోసం భగవానుని నమస్కరించడమే యుక్తమని చెప్పినట్లయింది.

అవ :- పురుషార్థం అనిష్టనివృత్తి అని, ఇష్టప్రాప్తి - అని రెండు విధాలుగా కదా ఉంటుంది. అనిష్టనివృత్తిని కోరినవారైతే, అతనినే ఆశ్రయించండి- అని అన్నారు గత పాశురంలో. ఈ పాశురంలో, ఇష్టప్రాప్తిని కోరినా అతనినే స్తుతించాలి- అని అంటున్నారు.

**92.** **అడియాల్ మున్ కఞ్జనై చ్చెత్తు అమరరేత్తుమ్**
**పడియాన్ కొడిమేల్ పుళ్కొణ్డాన్- నెడియాన్దన్**
**నామమే యేత్తుమిన్గళ్ ఏత్తినాల్ తామ్ వేణ్డుమ్**
**కామమే కాట్టుమ్ కడితు**

మున్ = అతడు (కంసుడు) హాని చెడ్డచేయడాకి ముందే, అడియాల్ = శ్రీపాదంలో, కఞ్జనై = కంసుని, శెత్తు = కిందకు పడదోసి చంపినవాడు, అమరర్ ఏత్తుమ్ పడియాన్ = దేవతలు స్తుతించేటట్లుగాఉన్నవాడు, కొడి మేల్ పుళ్ కొణ్డాన్ = ధ్వజం పై గరుడుడు అనే పక్షిని కలవాడు, నెడియాన్ తన్ = తన వైపు రెండడుగులు సానుకూలంగా వేసిన వారినిగూర్చి దీర్ఘంగా భావించే స్వభావం కలవాడైన సర్వేశ్వరుని, నామమే = తిరునామాలనే పల్కి, ఏత్తుమిన్కళ్= స్తుతించండి, ఏత్తినాల్ = ఆ విధంగా స్తుతిస్తే, తామ్ వేణ్డుమ్ కామమ్ = తాముకోరే ఫలాన్ని, కడితు= శీఘ్రంగా (ఝటితి), కాట్టుమ్ = (ఆ తిరునామం) పొందిస్తుంది.

భగవానుని స్తుతి, తెఱచిన నోరు మూసే లోగానే చాలా వేగంగా కోరినదానిని లభింపజేస్తుంది. భగవానుడు ద్రౌపదికి వస్త్రదానం చేయడం ప్రత్యక్షసిద్ధంకదా! దీనివల్ల అన్యదైవాలను ఆశ్రయించేవారికి ఫలం ఆలస్యంగా సిద్ధించే రీతి, ఈ విషయంలో లేదు- అని తెలుపబడింది. **"కడితు ఏత్తుమిన్కళ్"** అని అన్వయించి, **"మిన్నిన్ నిలై యిల మన్నుయిరాక్కైకళ్"** అనే అర్థాన్ని చెప్పవచ్చు. ఈవిధంగా ఈ పాశురంలో, ఆస్తికులై ప్రయోజనాంతరాలను ఆశించినవారుకూడా అతనినే స్తుతించాలి- అని తెలిపినట్లయింది.

అవ :- "మాకు ఏ కోరిక అక్కఱ లేదు. ఈ లౌకికజీవనమే మీరు చెప్పే మోక్షంకంటే భోగ్యంగా, ఆనందప్రదంగా ఉన్నది. అందువల్ల, మేము భగవానుని స్తుతించవలసిన అవసరం లేదు'' అని కొందఱు లోకులు అనగా, "పాపులారా! ఇక్కడ మీకేమీ అక్కఱ లేకపోయినా, ఈ శరీరం నశించిన తరువాత అయినా, మీరు పొందబోయే నరకాన్ని లేకుండా చేసికోవడంకోసమైనా అతనిని స్తుతించండి'' అని అంటున్నారు. రాబోయే భయంకరనరకయాతనలను తలిస్తే, విరోధినిరసన శీలుడు, పరమభోగ్యుడు అయిన అతనిని స్తుతిస్తే తప్ప నిలువడం మీకు సాధ్యం కాదు - అని భావం. గడచిన రెండు పాశురాలలో ఆస్తికులై, ప్రయోజనాంతరాలను కోరేవారు అనిష్టనివృత్తికోసం, ఇష్టప్రాప్తికోసం అతనినే ఆశ్రయించాలి- అని అన్నారు. ఈ పాశురంలో - "ప్రత్యక్షం ఒక్కటే ప్రమాణం, ఇక్కడ పొందేదే నిజం''- (**"కణ్డదే కాట్చి, కొణ్డతే కోలమ్"**- అని ద్రావిడసామెత) అని భావించే లోకాయతికులైన నాస్తికులుకూడా నరకాన్ని పోగొట్టుకోవాలంటే అతనినే స్తుతించాలి- అని అంటున్నారు. ఆస్తికశ్రేష్ఠులైన ముముక్షువులు తమవలె అతనినే ప్రాప్య-ప్రాపకం భావించి ఆశ్రయించాలి- అని తరువాత పాశురంలో అంటున్నారు. అందువల్ల ఈ పాశురాలు అర్థంలో పునరుక్తి దోషం లేదు.

**93.** కడితు కొడు నరకమ్ పిఱ్కాలుమ్ శెయ్కై
కొడితెన్ఱతు కూడామున్న- వడి శఙ్గమ్
కొణ్డానై క్కూన్దల్వాయ్ కీణ్డానై క్కొఙ్గై న
ఞ్జుణ్డానై యేత్తుమినో వుఱ్ఱు



కొడు నరకమ్ = క్రూరమైన నరకం, కడితు = చూడడానికి సాధ్యం కానట్లు ఘోరంగా ఉంటుంది, పిఱ్కాలుమ్ = దానికి తరువాత, శెయ్కై = (అక్కడ యమకింకరులు చేసే) బాధలను కల్గించే, పనులు, కొడితు = సహించడానికి వీలు కానివిగా ఉంటాయి, ఎన్ఱు = అని తెలిసికొని, అతు కూడా మున్నమ్ = ఆ నరకవేదన ప్రాప్తించడానికి ముందే, వడి శఙ్గమ్ కొణ్డానై= శత్రువులను నశింపజేసే పదునైన ధ్వనిని కల శ్రీపాంచజన్యాన్ని కలవాడు, కూన్దల్ వాయ్ కీణ్డానై = కేశి అనే అసురుని నోటిని చీల్చినవాడు, కొఙ్గై నఞ్జు ఉణ్డానై = (పిశాచియొక్క), స్తన్యంలో పూయబడ్డ విషాన్ని ఆరగించినవాడు అయిన స్వామిని, ఉఱ్ఱు = ఆశ్రయించి, ఏత్తుమిన్ = కీర్తించండి.

ప్రత్యక్షం ఒక్కటే ప్రమాణం అనే నాస్తికులను నిరసించి, "ఇతడు నరకభయాన్ని తీరుస్తాడో! తీర్చడో! అనే అపనమ్మికను పెట్టుకోకుండా, మనః పూర్వకంగా భగవానుడే విరోధినవర్తకుడనే విశ్వాసాన్ని కల్గి ఉండి స్తుతించండి. కనుక, నాస్తికులు పరలోకంలో తాము అనుభవించబోయే నరకాల కాఠిన్యాన్ని అనుసంధిస్తే, వాటిని పోగొట్టగల అతనిని ఆశ్రయించి, స్తుతించి తీరుతారు - అని అంటున్నారు. నాస్తికులు భగవత్సమాశ్రయణాన్ని చేయడానికి ఉపాయం నరకభయాన్ని అనుసంధించడమే- అని భావం.

అవ :- ఇక, ఈ పాశురంలో, తమవలె ముముక్షువులై ఉండేవారిని చూచి, "లోకాన్ని రక్షించడమే స్వభావంగా కలవాడై, చాలా భోగ్యుడైనవానిని నా మనస్సు స్తుతించేటట్లే మీరుకూడా స్తుతించండి' అని అంటున్నారు. తండ్రి తాను ముందు నమస్కరించి చూపి, పిల్లవానికి నమస్కారం చేయడం నేర్పేటట్లే ఆళ్వార్లు తమ స్థితిని(ఆచరణను) చూపిస్తూ, ముముక్షువులకు నేర్పుతున్నారు.

**94.** ఉఱ్ఱు వణఙ్గి త్తొழுమిన్ ఉలకేழுమ్
ముఱ్ఱుమ్ విழுఙ్గుమ్ ముకిల్వణ్ణన్- పఱ్ఱి
ప్పొరున్దాతాన్ మార్విడన్దు పూమ్బాడకత్తుళ్
ఇరున్దానై ఏత్తు మెన్నెఞ్జు

ఉలకు ఏ౻ుమ్ ముఱ్ఱుమ్ వి౻ుఙ్గమ్ = లోకాలను అన్నిటినీ (ప్రళయం గ్రహించకుండా ఉండేటట్లు) దేనినీ విడువకుండా అన్నిటినీ ఆరగించినవాడు, ముకిల్ వణ్ణనై = మేఘంవంటి రూపాన్ని కలవాడు, పొరున్దాతాన్ = తనతో విరోధించిన హిరణ్యకశిపుని, పఱ్ఱి= పట్టుకొని, మార్బు= అతని వక్షస్సును, ఇడన్దు = చీల్చినవాడు, పూ పాడకత్తుళ్ ఇరున్దానై= అందమైన **"తిరుప్పాడకమ్"** అనే తిరుపతిలో వేంచేసి ఉన్నవాడు అయిన స్వామిని, ఎన్ నెఞ్జు = నా మనస్సు, ఏత్తుమ్ = స్తుతిస్తుంది. (మీరు కూడా ఆవిధంగానే) ఉఱ్ఱు వణఙ్గి తొ౻ుమిన్ = (తొలగిపోకుండా), సమీపించి, అతనిని నమస్కరించి, ఆశ్రయించండి.

"నా మనస్సు భగవానుని సర్వరక్షత్వం, ఆశ్రితవిరోధినిరసనశీలత్వం, నిరతిశయ భోగ్యత్వం -అనే మూడు స్వభావాలను కీర్తిస్తున్నది. అదేవిధంగా మీరుకూడా సమీపించి ఆశ్రయించాలని చూడండి- అనే అన్వయాన్ని ఇందులో గ్రహించాలి''.

అవ :- గడచిన నాల్గు పాశురాలతో పరోపదేశాన్ని చేసి, లోకులను సంస్కరించిన ఆ౻్వార్లు, ఇక ఈ ప్రబంధం పరిసమాప్తి వరకు స్వానుభావాన్ని గూర్చి పల్కుతున్నారు. అందులో ముందుగా, ఈ పాశురంలో లోకానికి సాక్షాత్తు కారణభూతుడై, సర్వశరణ్యుడై, హస్తిగిరిలో వేంచేసి ఉండే వరదరాజ స్వామి, చాలా అధముణ్ణి అయిన నా అన్ని అవయవాలలోను వచ్చి ప్రవేశించి నన్ను అనుభవిస్తున్నాడు- అని అంటున్నారు. **"పాఠక్రమా దర్ధక్రమో బలీయాన్"** (పాఠక్రమం కంటే అర్థక్రమం బలీయం అనే న్యాయంలో) **"మున్నమ్ శేయ్ ఊ౻ియాన్, ఊ౻ి పెయర్త్తాన్, ఉలకేత్తుమ్ ఆ౻ియాన్, తానవనై వన్నెఞ్జమ్ కొణ్డ మణివణ్ణన్ అత్తియూరాన్ ఎన్నెఞ్జమ్ మేయాన్ ఎన్ శెన్నియాన్'** అనే క్రమంలో అన్వయించి అర్థాన్ని చెప్పాలి. ఆ౻్వార్ల పాశురాలలో సామాన్యంగా పాఠక్రమం, అర్థక్రమం - రెండూ ఒకటిగానే ఉంటాయి. అయితే, ఆవిధంగా ఒకటిగా ఉండని కొన్ని సందర్భాలలో అన్వయాన్నిమార్చి అర్థాన్ని గ్రహించడాన్ని కూడా అపుడపుడు పూర్వాచార్యులు చేశారు. ఈ సందర్భం అటువంటిది వాటిలో ఒకటి.



**95. ఎన్నెఞ్జమేయాన్ ఎన్ శెన్నియాన్ తానవనై**
**వన్నెఞ్జమ్ కీణ్డ మణివణ్ణన్ -మున్నమ్ శేయ్**
**ఊ౻ియాన్ ఊ౻ి పెయర్త్తాన్ ఉలకేత్తుమ్**
**ఆ౻ియా నత్తియూరాన్**

తానవనై = (హిరణ్యకశిపుడనే) అసురుని, వల్ నెఞ్జమ్ = కఠినమైన వక్షస్సును, కీణ్డ =చీల్చినవాడు, మణి వణ్ణన్ = నీలమణి వంటివర్ణాన్ని కలవాడు, మున్నమ్ శేయ్ ఊ౻ియాన్ = పూర్వం సృష్టికాలంలో జగత్తు సమస్తంగా ఉన్నవాడు, ఊ౻ి పెయర్త్తాన్ = ప్రళయకాలంలో సంహరించినవాడు, ఉలకు ఏత్తుమ్ ఆ౻ియాన్ = లోకులచే స్తుతింపబడేవాడై, పాలకడలిలో పరుండి ఉన్నవాడు, అత్తియూరాన్ = హస్తిగిరిలో వేంచేసి ఉన్నవాడు అయిన స్వామి, ఎన్ నెఞ్జమ్ మేయాన్ = నా మనస్సులో పొందికగా నిలచి ఉన్నాడు, ఎన్ శెన్నియాన్ = నా శిరస్సుపై వేంచేసి ఉన్నాడు.

చాలా గొప్పవాడైన స్వామి చాలా నీచుణ్ణి అయిన నా మనస్సులో వాసం చేయడంతో తృప్తి పడకుండా, **"తలైమేల్ తాళిణైకళ్... నిలై పేరాన్ ఎన్ నెఞ్జత్తు"** (తిరువాయ్-10-6-6) అనే రీతిలో చాలా తక్కువవాణ్ణి అయిన నాతలపై కూడాఎంతో సంతోషంతో వేంచేసి ఉన్నాడు- అని భావం. ఇక్కడ శిరస్సు ఆ౻్వార్ల మిగిలిన అవయవాలకు అన్నిటికీ ఉపలక్షణమై, **"ఇవైయుమ్ అవై యుమ్"** అనే తిరువాయ్మొ౻ి (1-9)దశకంలో వలె మెల్లిమెల్లిగా అనుభవాన్ని జీర్ణించుకొనేటట్లు అనుగ్రహించే సర్వేశ్వరుడు, సౌభరిమహర్షి పలుపురు పత్నులతో భోగాన్ని అనుభ వించడంకోసం పలు రూపాలను పరిగ్రహించినట్లే, ఈ ఆ౻్వార్లను అనుభ వించడంకోసం పలు రూపాలను ఎత్తి, వీరి అన్ని అవయవాలలో సంశ్లేషించడాన్ని తెలుపుతున్నారని చెప్పవచ్చు. పాశురంలోని మిగిలిన భాగాలతో సర్వేశ్వరుని గొప్పతనాలను అన్నిటినీ పల్కి, **"ఎన్నెఞ్జమ్ మేయాన్ ఎన్ శెన్నియాన్"** అని అంటూ ఇటువంటి గొప్పతనాన్ని కలవాడు చాలా తక్కువాణ్ణి అయిన నా విషయంలో చూపించే ప్రేమ ఎంత గొప్పది! అని ఆశ్చర్యపడుతున్నారు - అని చెప్పవచ్చు.

అవ :- ఈవిధంగా నన్ను అభిలషించే స్వామి ఉభయవిభూతినాథుడై ఉండడం అనే గొప్ప అతిశయాన్ని కలవాడుకదా!- అని ఇందులో అంటున్నారు. **"అత్తియూరాన్"** అనే పదం మొదట ఉన్నా, అర్థాన్నిబట్టి చివరలో అన్వయించడం సరసం.

**96. అత్తియూరాన్ పుళ్ళైయూర్వాన్ అణిమణియిన్**
**తుత్తిశేర్ నాకత్తిన్ మేల్ తుయిల్వాన్- ముత్తీ**
**మఱైయావాన్ మాకడల్ నఞ్జుణ్డాన్దనక్కుమ్**
**ఇఱైయావా నెజ్గళ్ పిరాన్**

పుళ్ళై ఊర్వాన్ = గరుడుని వాహనంగా కల్గినవాడై, అణి మణి ఉన్ తుత్తి శేర్ నాకత్తిన్ మేల్ తుయిల్ వాన్ = అందమైన మాణిక్యాలను, భోగ్యమైన పడగలలోని చిహ్నాలను కల్గిన ఆదిశేషునిపై పరుండి ఉన్నవాడై, ముత్తీ మఱై ఆవాన్ =గార్హపత్య, ఆహవనీయ, దక్షిణాగ్నులనే మూడు అగ్నులను తెలిపే వేదంతో తెలుపబడేవాడై, మా కడల్ నఞ్జు ఉణ్డాన్ తనక్కుమ్ ఇఱై ఆవాన్ = గొప్ప సముద్రంలోనుండి పుట్టిన హాలాహలమనే విషాన్ని గ్రసించిన రుద్రునకు స్వామి అయినవాడు, ఎజ్గళ్ పిరాన్ = మా స్వామి కావడంకోసం, అత్తియూరాన్= హస్తిగిరిలో వేంచేసి ఉన్నాడు.

ఈ విధంగా గొప్పవాడై ఉండేవాడుకదా ! మాకు ఉపకరించడంకోసం హస్తిగిరిలో వేంచేసి ఉన్నాడు- అని భావం. **"ఎజ్గళ్"** అనే బహువచనంతో **"కేశవన్ తమర్ కీ*ழ్* మేల్ ఎమర్ ఏ*ழ్*ఏ*ழ్*ు పిఱప్పుమ్"** అనే రీతిలో తమ సంబంధి సంబంధుల వరకు తెలుపుతున్నారు. "ఎన్ నెఞ్జమేయాన్ ఎన్ శెన్నియాన్" అని అతనిని ఆశపడడం మాత్రమే కాకుండా, నాతోనే నేరుగాను, పరంపరగాను సంబంధం కలవారికి అందరికీ ఉపకారం చేయడం కోసమే హస్తిగిరిలో వేంచేసి ఉన్నాడని అంటున్నారు.

అవ :- స్వామీ! నిత్యవిభూతినాయకుడవై, సర్వేశ్వరుడవైన నీవు నిత్యసంసారిగా ఉండే నన్నుకూడా నీ కింకరునిగాచేసికోవడం కోసం హస్తిగిరిలో వేంచేసి ఉండడమే కాక, తిరుక్కుడన్దై అనే తిరుపతిలో ఆదిశేషునిపై



అతిసులభుడవై పరుండి ఉన్నావు కదా! అని ఆశ్చర్యపడుతున్నారు. మాకు స్వామివి కావడంకోసం హస్తిగిరిలో నిలచి ఉండడమే కాక, సంసారాన్ని సమూలంగా నశింపజేస్తే తప్ప లేచి పోను- అనే రీతిలో తిరుక్కుడన్దైలో పడుకను పఱచుకొని పరుండి ఉండడంకూడా చేశావే- అని హార్దంగా అంటున్నారని కూడా చెప్పవచ్చు.

**97. ఎజ్గళ్ పెరుమాన్ ఇమైయోర్తలైమకన్ నీ**
**శెజ్గణెడుమాల్ తిరుమార్పా!-పొజ్గు**
**పడమూక్కి లాయిరవాయ్ ప్పామ్బణైమేల్ శేర్న్దాయ్**
**కుడమూక్కిల్ కోయిలా క్కొణ్డు**

తిరు మార్పా = లక్ష్మీదేవి వక్షఃస్థలంలో కలవాడా!, శెమ్ కణ్ నెడు మాల్= ఎఱ్ఱని తిరునేత్రాలను కల సర్వేశ్వరుడవై, ఇమైయోర్ తలై మకన్ = నిత్యసూరులకు నాథుడవై, ఎజ్గళ్ పెరుమాన్ నీ = మాకు స్వామివిఅయిన నీవు, కుడ మూక్కు ఇల్ = కుంభఘోణక్షేత్రాన్ని, కోయిల్ ఆ కొణ్డు = కోవెలగా మనస్సులో భావించి, పొజ్గు పడమ్ మూక్కిన్ = ఉన్నతమైన పడగలను, ముక్కును కలవాడు, ఆయిరమ్ వాయ్= వేయి నోళ్ళను కలవాడైన, పామ్బు= ఆదిశేషుడనే, అణై మేల్ = పడుకపై, శేర్న్దాయ్= శయనించి ఉన్నావు.

మాకు స్వామివి కావడంకోసం హస్తిగిరిలో వేంచేసి ఉండడమేకాక, పరత్వ సౌలభ్యాలను, తిరుమేని సౌందర్యాన్ని దర్శింపజేసి, సంసారాన్ని సమూలంగా నాశనం చేస్తే తప్ప లేచిపోను- అనే అభిప్రాయాన్ని కల వానివలె తిరక్కుడన్దై అనే క్షేత్రంలో పడుకను పరచుకొని పరుండడం కూడా చేశావు - అన్నది పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యలోని భావం. హస్తిగిరిలో నిలచి ఉండే అందాన్ని చూపి మమ్ములను వశీకరించుకొన్నట్లే, తిరుక్కుడన్దైలో శయనించి, ఆ అందాన్ని చూపి, మాకు స్వామివి అయ్యావు- అన్నది అప్పిళ్ళైవ్యాఖ్యానంలోని భావం.

అవ :- "ఈ రీతిలో అర్చామూర్తివై ఉండి, నన్ను నీ వశం చేసికోవడంతో పాటుగా, చిన్నబిడ్డరూపంలో లోకాలను అన్నిటినీ ఆరగించిన అఘటితఘటనా సామర్థ్యం, కుంభనృత్యం చేయడం- మొదలైన అందమైన లీలలను చూపి, నన్ను లోబరచుకొని, పాలించావు'' - అని ఇందులో అంటున్నారు.

98. కొణ్డువళర్క్క కుౘ్ఴవియాయ్ త్తాన్ వళర్న్దతు
ఉణ్డతులకేఴు ముళ్ళొడుఙ్గ- కొణ్డు
కుడమాడి క్కోవలనాయ్ మేవి ఎన్నెఞ్జమ్
ఇడమాక క్కొణ్డ విఱై

కోవలన్ ఆయ్ = గోపాలుడై అవతరించి, కుడమ్ కొణ్డు ఆడి = కుండలను తలపైన, భుజాలపైన పెట్టుకొని నాట్యమాడి, (ఆ సన్నివేశంతో), ఎన్ నెఞ్జమ్ మేవి = నాహృదయంలో పొందికగా నిలచి, ఇడమ్ ఆక కొణ్డ ఇఱై = (నా మనస్సునే) స్థిరమైన కోవెలగా చేసికొన్న స్వామి, కొణ్డు వళర్క్క = కొందఱు తమ చేతులతో ఎత్తుకొని, ముద్దాడి పెంచే రీతిలో, కుఴవి ఆయ్ = చిదిమితే (పాలుకారే) శిశువై, తాన్ వళర్న్దతు= తాను పెరిగాడు. (అపుడు), ఉళ్ ఒడుఙ్గ= తనలో (ఒకమూలలో) ఒదిగి ఉండేటట్లుగా, ఉణ్డదు = భోజనంగా ఆరగించినది, ఉలకు ఏఴుమ్= ఏడు లోకాలను. (ఏం ఆశ్చర్యం!)

పాలు కారే శిశువై, లోకాలను అన్నిటిని ఆరగించాడు. "ఏఴులకు" అనేది ఈ సంసారమండలంలోని అన్ని లోకాలను లక్షిస్తుంది. "ఇది జీర్ణం అవుతుంది, ఇది కాదు''- అని చూడకుండా, కన్పించిన దానిని అంతటినీ నోటిలో ఎత్తి వేసుకొనే శైశవ వయస్సుకు తగినట్లుగా అన్ని లోకాలను నోటిలో పెట్టుకొన్నాడు- ఈ బాలుడు. రక్షకుడు చేసిన పని కాబట్టి, ఇది రక్షణమై పర్యవసించింది. అంతే. తనకోసం రక్షకులు కావలసివచ్చే వయస్సులో స్వామి లోకరక్షకు డయ్యాడు. ఇదేం ఆశ్చర్యం! - అని ఆఴ్వార్లు విస్మయ పడుతున్నారు. "పాలన్ తనదురువాయ్"(9) అని అంటూ సరోయోగి తమ అన్దాదిప్రబంధంలో ఈ పాలు కారే శిశుప్రాయంలో చేసిన అఘటితఘటనా కృత్యానికి అభినిష్టులైనట్లే, వీరుకూడా ఈ శిశువు దాల్చిన చాలా చిన్న రూపాన్ని, ఈ లోకాలన్నీ ఈ చిన్ని బొజ్జలోని ఒక మూలలో అణగి ఉండడాన్ని చూచి ఇదేమి ఆశ్చర్యం! అని సాశ్చర్యంగా ఆనందిస్తున్నారు.

అవ :- ఈ విధంగా తననే కోరే అనన్యప్రయోజనులను రక్షించడంకోసం పడరాని పాట్లను పడడంతో పాటుగా, తనను ఫలంగా కోరకుండా అల్ప ఫలాలను పొందాలని కోరేవారినికూడా క్రమక్రమంగా సంస్కరించడంకోసం



ఎన్నో పాట్లను పడి, వారి కార్యాలను సాధించిపెట్టాడు కదా స్వామి - అని ఇందులో అంటున్నారు.

99. ఇఱై! యెమ్బెరుమాన్! అరుళెన్ఱు ఇమైయోర్
ముఱై నిన్ఱు మొయ్ మలర్కళ్ తూవ -అఱై కఴల
శేవడియాన్ శెఙ్గణెడియాన్ కుఱళురువాయ్
మావడివిల్ మణ్ కొణ్డాన్ మాల్

ఇమైయోర్ = (కనురెప్పపాటు లేని బ్రహ్మ, శివుడు మొదలైన), దేవతలు, ఎమ్ పెరుమాన్ = మాకు ప్రాప్తశేషి అయిన, ఇఱై =సర్వేశ్వరా !, అరుళ్ ఎన్ఱు= (మాపట్ల) దయ చూపాలి. అని ప్రార్థించి, ముఱై నిన్ఱు = (వారి) దాస్యక్రమానికి అనుగుణంగా నిలిచి, మొయ్ మలర్కళ్ = అందమైన పూలను, తూవ = క్రమవివక్ష లేకుండా సమర్పించగా, అఱై కఴల్ శే అడియాన్ = ధ్వనించే వీరకడియాలను కలవాడై, నెడియాన్ = సర్వాధికుడై, మాల్ = ఆశ్రితులపట్ల అమితమైన వ్యామోహాన్ని కలవాడైన శ్రియఃపతి, కుఱళ్ ఉరు ఆయ్ = వామనరూపిగా వచ్చి అవతరించి, మా వలియై = మహాబలిదగ్గరనుండి, మణ్ కొణ్డాన్ = భూమిని గ్రహించాడు.

"శురుక్కువారై యిన్ఱియే శురుక్కినాయ్ శురుఙ్గియుమ్ పెరుక్కువారై యిన్ఱియే పెరుక్క మెయ్తు పెఱ్ఱినాయ్" అని తిరుచ్చన్దవిరుత్తంలో తిరుమఴిశైప్పిరాన్ పల్కినట్లే, ఒకరి ప్రేరేపణతో కాకుండా తన ఇచ్ఛతోనే ఈ విధంగా చిన్న రూపాన్ని, పెద్ద రూపాన్ని స్వామి పరిగ్రహించాడని భావం.

అవ :- "అన్యఫలాలను అభిలషించేవారు నన్ను పొందే రీతిని, నేను వారికి కార్యాన్ని సాధించి పెట్టే రీతిని చెప్పారు. సరే. మీకు నేను చేయవలసిన పని ఇది అని చెప్పండి చేస్తాను'' అని భగవానుని అభిప్రాయంగా తలచి, ఉపఘ్నాన్ని (పట్టుకొమ్మను) పట్టుకోవడం కోసం పాకే తీగవలె, నా భక్తి (ప్రేమ) నాస్వరూపాన్ని మించి వృద్ధిచెంది, శ్రమను కల్గించి, నిన్ను అనుభవించనీయ కుండా అడ్డుతున్నది. ఆ ప్రేమను దాసుడనైన నేను భరించేటట్లుగా నియంత్రించు'' - అని అంటున్నారు.

**100. మాలే! నెడియోనే! కణ్ణనే!- విణ్ణవర్క్కుమ్**
**మేలా వియన్ తుళాయ్ క్కణ్ణియనే!- మేలాల్**
**విళవిన్కాయ్ కన్టినాల్ వీళ్త్తవనే! ఎన్టన్**
**అళవన్టాల్ యానుడైయ వన్బు**

మాలే = భక్తులపట్ల వ్యామోహాన్ని కలవాడా!, నెడియోనే = పరిచ్ఛేదించి తెలిసికోవడానికి వీలు కాని రీతిలోఉండే సర్వాధికుడా !, విణ్ణవర్క్కుమ్ మేలా= నిత్యసూరినాథా!, వియన్ తుళాయ్ కణ్ణియనే = తులసీమాలను అలంకరించు కొన్నవాడా!, మేలాల్ = (అసురావేశాన్ని కల) వెలగకాయను, కన్టినాల్ = (ఆవిధంగానే అసురావేశాన్ని కల) లేగదూడతో, వీళ్త్తవనే = రాలగొట్టినవాడా!, యాన్ ఉడైయ = (నీ విషయంలో) నేను పెట్టుకొన్న, అన్బు = ప్రేమ, ఎన్టన్ అళవు అన్టు = నా పరిమితిలో అణగి ఉన్నదిగా లేదు.

నాకు నీ విషయంలో ఉండే ప్రేమ-(భక్తి), పట్టుకొమ్మను (ఉపఘ్నాన్ని) పూర్తిగా పాకిన తీగవలె, నా పరిమితిలో అణగి ఉండడం లేదు. అందువల్ల **"కాలాళుమ్ నెఞ్జళియుమ్"** (పెరియతిరువ-34), **"శిత్తముమ్ శెవ్వే నిల్లాతు"** (తిరుక్కుఱు-10) అనే రీతిలో నా అంగాలలోను, మనస్సులోను ఆర్తిని కల్గించినందువల్ల నిన్ను అనుభవించలేకుండా తడబడుతున్నాను. **"పత్తిమైక్కన్బు డైయే నావతే పణియాయ్ ఎన్దాయ్!"** (తిరుక్కుఱు-10) అనే రీతిలో ఈ తడబాటు పోయేటట్లుగా, నా భక్తి నా పరిమితిలో అణగి ఉండేటట్లుగా సంకోచింపచేయాలి - అని భావం. ఈ విధంగా, ఈ ఆళ్వార్లు **"అన్బే తకళియా"** అని ప్రారంభించి - ఇంకా ఇంకా అధికంగా వృద్ధి చెందిన తమ భక్తిని పరిమితం చేయాలని భగవానుని ప్రార్థిస్తూ ప్రబంధనిగమనాన్ని చేశారు.

**పూదత్తాళ్వార్ తిరువడిగళే శరణమ్**

**ఇరణ్డామ్ తిరువన్దాది టీకా వివరణలు సంపూర్ణం**





# మూన్టామ్ తిరువన్దాది

## - టీకా తాత్పర్యాలతో -



### కురుకైకావలప్పన్ అనుగ్రహించిన తనియన్

**శీరారుమ్ మాడ త్తిరుక్కోవలూరతనుళ్**
**కారార్ కరుముకిలై క్కాణ ప్పుక్కు- ఓరా**
**త్తిరుక్కణ్డే నెన్టురైత్త శీరాన్కళలే**
**ఉరై క్కణ్డాయ్ నెఞ్జే ! యుకన్దు**

నెఞ్జే = ఓ మనసా!, శీర్ ఆరుమ్ మాడమ్ =అందం పొందికగా నిండి ఉండే మిద్దెలను కల, తిరుక్కోవలూర్ అదనుళ్ = తిరుక్కోవలూర్ లోని గృహం మధ్యభాగంలో (వసారాలో), కార్ ఆర్ కరు ముకిలై = వర్షాకాలంలోని నల్లని మేఘంవంటి స్వామిని, కాణ పుక్కు = సేవించాలని, (ప్రారంభించి) ప్రయత్నించి, ఓరా = మనస్సు అనే ఆంతరనేత్రంతో అనుసంధించి, తిరు క్కణ్డేన్ ఎన్టు ఉరైత్త = "తిరు క్కణ్డేన్" అని ప్రారంభించి, నూఱు పాశురాలను అనుగ్రహించిన, శీరాన్ = గొప్పతనం నిండుగా కల పేయాళ్వార్ల, కళలే = శ్రీపాదాలనే, ఉకన్దు ఉరై = ఆనందించి పల్కు.

ఈ తనియన్ద్వారా, పరమపురుషుని దర్శించినవారు, ఆ దర్శనాన్ని సంసారులు అనుభవించేటట్లుగా తమ శ్రీసూక్తులను అనుగ్రహించినవారు, భగవద్దర్శనమనే సంపదను కలవారైన పేయాళ్వార్ల శ్రీచరణాలే సదా అనుసంధేయాలు- అని చెప్పబడింది.



అవ :- లోకాలను అన్నిటిని శరీరంగా కల్గిన భగవానునియొక్క స్సాక్షాత్కారంలో ఆళ్వార్లు వాటిని అన్నిటినీ దర్శించినవారే అయినా, భక్త్యుత్కర్ష వల్ల అతని అంతరంగసంపదలను (ఐశ్వర్యాలను) కొన్నిటిని "దీనిని చూచాను,

దానిని చూచాను'' అని అంటూ తాము అనుభవించిన రీతినిగూర్చి ఈ మొదటి పాశురంలో పేయాళ్వార్లు పల్కుతున్నారు.

1. తిరు క్కణ్డేన్ పొన్మేని కణ్డేన్ తిక*ళు*మ్
అరుక్క వణినిఱముమ్ కణ్డేన్- శెరుక్కిళరుమ్
పొన్నా*ళి* కణ్డేన్ పురిశఙ్గమ్ కైక్కణ్డేన్
ఎన్నా*ళి*వణ్ణన్ పాలిన్రు

ఇన్రు = ఇపుడు, ఎన్ ఆ*ళి* కణ్ణన్ పాల్ = సముద్రవర్ణుడైన నా స్వామివద్ద పార్శ్వంలో, తిరు = లక్ష్మీదేవిని, కణ్డేన్ = దర్శించగలిగాను, పొన్ మేని = అందమైన తిరుమేనిని కూడా, కణ్డేన్ = సేవించగలిగాను, తిక*ళు*మ్ = ప్రకాశించే, అరుక్కన్ = సూర్యునివంటి, అణి = అందమైన, నిఱముమ్ = కాంతినికూడా, కణ్డేన్ = దర్శించగలిగాను,శెరు = యుద్ధభూమిలో, కిళరుమ్ = కోపించి విజృంభించే, పొన్ ఆ*ళి* = అందమైన శ్రీసుదర్శనాన్ని, కై = కుడిచేతిలో, కణ్డేన్= దర్శించగలిగాను, పురి శఙ్గమ్ = దక్షిణావర్తశంఖమైన పాంచజన్యాన్ని ఇంకొక బాహువులో, కణ్డేన్ = దర్శించగలిగాను.

లక్ష్మీదేవికి, సకలరత్నాలకు నివాసస్థానం అయిన సముద్రంవలె ఉండే స్వామిలో వాటిని అన్నిటినీ దర్శించాను - అని అంటూ తమ పరమభక్తితో ప్రారంభంలోనే భగవానుని పేయాళ్వార్లు అనుభవించారు.

అవ :- "ఈ భగవనుభవానికి ఆటంకాలు పలు ఉన్నాయే!" అనే భయం, సందేహం ఆళ్వార్లను వెంటనే కలుగగా, అవి కన్పించిన క్షణంలోనే భగవదను భవానికి అడ్డంగా ఉండే అవి అన్నీ సూర్యుని చూచిన మంచువలె, నిప్పుకణాలలో పడిన దూదిమూటవలె నశించిపోతాయి. అని ఇందులో అంటున్నారు.

2. ఇన్రే క*ళ*ల్ కణ్డేన్ ఏ*ళ్*పిఱప్పుమ్ యా నఱుత్తేన్
పొన్తోయ్ వరైమార్విల్ పూన్దు*ళా*య్- అన్రు
తిరు క్కణ్డుకొణ్డ తిరుమాలే! ఉన్నై
మరుక్కణ్డుకొణ్డెన్ మనమ్



పొన్ తోయ్ = స్వర్ణమయాలైన ఆభరణాలు చేరిన (అలంకరింపబడ్డ), వరై = పర్వతంవంటి, మార్విల్ = వక్షఃస్థలంలో, పూమ్ తు*ళా*య్= అందమైన తులసిని కలవాడవై, అన్రు = సముద్రాన్ని చిలికిన ఆ కాలంలో, తిరు = లక్ష్మీదేవిని, కణ్డు కొణ్డ = అనుభవించేటట్లుగా పొందిన, తిరుమాలే = లక్ష్మీవల్లభా!, ఎన్ మనమ్ = దాసుడైన నామనస్సు, ఉన్నై మరు క్కణ్డు కొణ్డు = పొందికగా కూడి ఉన్నది. (అందువల్ల), యాన్ = నేను, ఇన్రే = ఈనాడు, క*ళ*ల్ = నీ శ్రీపాదాలనే, కణ్డేన్ = దర్శించి ఆనందాన్ని, అనుభవించగలిగాను, ఏ*ళ్* పిఱప్పుమ్ = (నా అన్ని) జన్మలను, అఱుత్తేన్= (ఇకపై అనువర్తించకుండా ఉండేటట్లు) నశింప జేసికొన్నాను, (ఛేదించాను)

ఇక నాకు రాబోయే జన్మలను అన్నిటినీ సమూలంగా లేకుండా చేసికొన్నాను అన్నది నిశ్చయం - అనిభావం.

అవ :- గడచిన పాశురంలో తమ మనస్సు భగవానుని పట్ల స్థిరంగా నిలచి ఉన్న రీతిని గూర్చి ఆళ్వార్లు తెలిపారు. దీనినే ఆధారంగా చేసికొని భగవానుడు తమ మనస్సు తప్ప మిగిలినదానిని దేనినీ తెలియనివాడైనాడు - అని ఈ పాశురంలో అంటున్నారు.

3. మనత్తుళ్ళాన్ మాకడల్ నీరుళ్ళాన్ మలరాళ్
తనత్తుళ్ళాన్ తణ్డు*ళా*య్ మార్వన్- శినత్తు
చ్చెరునర్ ఉక చ్చెఱ్ఱుకన్ద తేజ్గోతవణ్ణన్
వరు నరకమ్ తీర్క్కుమ్ మరున్దు

మా కడల్ నీర్ ఉళ్ళాన్ = గొప్ప క్షీరాబ్ధిలోని జలంలో నిద్రించేవాడు, మలరాళ్ తనత్తు ఉళ్ళాన్ = లక్ష్మీదేవి స్తనతటాలలో నిలచి ఉన్నవాడు, తణ్ తు*ళా*య్ మార్బన్ = చల్లని తులసిని వక్షఃస్థలంలో అలంకరించుకొన్నవాడు, శెరునర్ = శత్రువులు, ఉక =నశించేటట్లుగా, శినత్తు = కోపంతో, శెఱ్ఱు = వధించి, ఉకన్దు = ఆనందించినవాడు, తేజ్గు ఓతమ్ వణ్ణన్ = నిండైన సముద్రంవంటి రూపాన్ని కలవాడు, వరు నరకమ్ తీర్క్కుమ్ మరున్దు = తీర్చుకోవడానికి వీలు లేని, అనివార్యమైన సంసారం అనే నరకాన్ని పోగొట్టగల

మందువంటివాడు అయిన సర్వేశ్వరుడు, మనత్తు ఉళ్ళాన్ = నా మనస్సులోకి వచ్చి (ఇక విడిచి పోలేని రీతిలో) స్థిరంగా ఉన్నాడు.

స్వామి, క్షీరాబ్ధి మొదలైనవానిని మఱచిపోయి, నా మనస్సును పొందిన తరువాత దానిలోనే నిలచి ఉన్నాడు, అని భావం. ఇటువంటి భావాన్నే నమ్మాళ్వార్లు, **"తిరుమాలిరుఞ్జోలై మలైయే"** (10-7-8), **"తలైమేల్ పునైన్దేన్"** (10-4-4) **"కల్లుమ్ కనైకడలుమ్"** (పెరియతిరువ-68) ఇత్యాది పాశురాలలోను, తిరుమழிశైప్పిరాన్, **"నాకత్తణై క్కుడన్దై"** (నాన్ముకన్ తిరు-36) అనే పాశురంలో, పూదత్తాழ்వార్లు, **"వెఱ్పెన్ఱిరుఞ్జోలై"** (ఇరణ్డామ్ తిరు-54) అనే పాశురంలో, **"పనిక్కడల్ పళ్ళికోళై"** (5-4-9) అనే పాశురంలో పెరియழ்వార్లు వ్యక్తం చేశారు. అప్పిళ్ళై తమ టీకలో **"మనత్తుళ్ళాన్"** అనే పదం తరువాత **"వరు నరకమ్ తీర్క్కుమ్ మరున్దు"** అనే ప్రయోగాన్ని అన్వయించి అర్థం చెప్పారు. **"మా కడల్ నీర్"** (గొప్ప సముద్రం) మొదలైనచోట్ల పూర్వం స్వామి ఉండడం- తమ మనస్సులో చోటు చేసికోవడంకోసమే - అని, తమ మనస్సులో ఉండడం -తమ **"వరు నరకమ్ తీర్క్కుమ్ మరున్దు"** (అనివార్యాలైన నరకాలను తీర్చే ఔషధం) కావడంకోసం - అని భావం.

అవ :- సర్వరక్షకుడైన అతని శ్రీపాదాలే నాకు ఉపాయంగాను, ఉపేయం గాను అయినవి- అని ఇందులో అంటున్నారు.

**4.** మరున్దుమ్ పొరుళుమ్ అముతముమ్ తానే
తిరున్దియ శెఙ్గణ్మాలాఙ్గే - పొరున్దియ
నిన్ఱులక ముణ్డుమిழ்న్దు నీరేఱ్ఱు మూవడియాల్
అన్ఱులకమ్ తాయో నడి

తిరున్దియ = (ఇతడే పరమపురుషుడని స్పష్టంగా దర్శించి గ్రహించదగిన) చిహ్నాన్ని కల్గిన, శెమ్ కణ్ = ఎఱ్ఱటితామరలవంటి తిరునేత్రాలను కల, మాల్ = ఆశ్రితవ్యాముగ్ధుడు, ఆఙ్గే = లోకాన్ని రక్షించడం అనే ఆ కార్యంలోనే, నిన్ఱు పొరున్దియ= స్థిరంగా నిలచి, పొందికగా ఉన్నవాడు, ఉలకమ్ = లోకాలను, ఉణ్డు = (ప్రళయం లయం చేయకుండా ఉండేటట్లుగా) ఆరగించి, ఉమిழ்న్దు=



తరువాత వానిని వ్యక్తం చేసి, అన్ఱు = పూర్వం ఒకానొక సమయంలో, నీర్ ఏఱ్ఱు = మహాబలి దగ్గర దానజలాన్ని గ్రహించి, మూ అడియాన్ ఉలకమ్ తాయోన్ = మూడడుగులతో లోకాలను అన్నిటిని తడవి కొలిచినవాడైన భగవానుని, అడి తానే = శ్రీపాదాలే, మరున్దుమ్ = ఔషధంవలె సంసారవ్యాధిని తీర్చేవిగా, పొరుళుమ్ = ధనంవలె కోరినవానిని పొందించేవిగా, అముదముమ్= అమృతంవలె భోగ్యంగా ఉన్నాయి.

స్వామి శ్రీచరణాలు వ్యాధిని తీర్చే మందువలె సంసారమనే వ్యాధిని తీర్చేవై, అభిమతార్థాన్ని లభింపజేసే అర్థమై - ధనమై, మనకు ఇష్టమైన మోక్షాన్ని పొందించేవై, సహజంగానే అత్యంతమధురంగా ఉండే అమృతంవలె చాలా మధురంగా ఉన్నవి. ఉపాయం అనేది అనిష్టాన్ని తీర్చేదిగాను, ఇష్టాన్ని అనుగ్రహించేదిగాను - రెండు విధాలుగా ఉంటుంది. ఈ రెండు ఆకారాలు స్వామి శ్రీచరణాలకు ఉన్నాయనే విషయం - **"మరున్దుమ్ పొరుళుమ్"** అనే పదాలతోను, ఉపేయమై ఉన్నదనే విషయం **"అముదమ్"** అనే పదంద్వారా చెప్పబడ్డాయనికూడా చెప్పవచ్చు. లేక, ఔషధమే అనిష్టం అయిన వ్యాధిని తీర్చేది గాను, ఇష్టం అయిన దేహబలాన్ని ఇచ్చేదిగాను ఉంటుంది కనుక, **"మరున్దు"** అనే పదమే రెండు అకారాలను కల ఉపాయంగా స్వామి పాదాలు ఉండడాన్ని స్వామి పాదాలు తెలుపుతున్నదనవచ్చు. అపుడు **"పొరుళుమ్, అముదమ్"** అనే ప్రయోగం రెండు విధాలైన ఆకారాలను కల ఉపేయాన్ని తెలుపుతుందని చెప్పాలి. అంటే - మిగిలినవానిని పొందడంలో సాధనంగా ఉంటూ, స్వయంగా ఉపేయంగా ఉండే ధనం వలె, తానే సహజంగా భోగ్యమై ఉంటుంది కనుక ఉపేయంగా ఉండే అమృతంవలె- ఈవిధంగా రెండు విధాలుగా ఉపేయంగా ఉన్నవి- భగవానుని శ్రీచరణాలే- అని భావం. త్రివిక్రముని వృత్తాంతంలోనే భగవానుడు మందుగా, ధనంగా, అమృతంగా అయిన రీతిని అప్పిళ్ళై తమ టీకలో వివరించారు. నముచి మొదలైన విరోధులను నిరసించడంవల్ల మందుగా, తానే యాచకుడై మహాబలిదగ్గరకు వచ్చి యాచించి అతని ఔదార్యగుణాన్ని వ్యక్తం చేసినందువల్ల ధనంగా, తన శ్రీచరణాలను అతని శిరస్సుపై పెట్టడంవల్ల అమృతంగా స్వామి శ్రీపాదాలు అయ్యాయి. ఈ పాశురంలో భగవానుని శ్రీచరణాలే ప్రాప్య, ప్రాపకాలు - అనే సారం తెలుప బడింది.

అవ :- లోకాలను కొలిచిన వృత్తాంతాన్ని గడచిన పాశురంలో కీర్తించడం ప్రారంభించగానే, ఆఴ్వార్లు అందులో అత్యంతాభినివేశాన్ని పొంది ఆ త్రివిక్రమ మూర్తి అందాన్ని ఈ పాశురంలో అనుభవిస్తున్నారు.

5. **అడి వణ్ణమ్ తామరై అన్ఱులకమ్ తాయోన్**
**పడివణ్ణమ్ పాఱ్కడల్ నీర్వణ్ణమ్- ముడి వణ్ణమ్**
**ఓరాఴి వెయ్యోన్ ఒళియు మఃతన్ఱే**
**ఆరాఴి కొణ్డాఱ్కఴకు**

అన్ఱు = (మహాబలి జలధారా పూర్వకంగా మూడడుగులను దానం ఇచ్చిన) అపుడు, ఉలకమ్ తాయోన్ = లోకాలను తడవి, కొలిచిన స్వామియొక్క, అడి వణ్ణమ్ = శ్రీపాదాల కాంతి, తామరై =తామరపూవువలె ఎఱ్ఱగా ఉన్నది, పడి వణ్ణమ్ = తిరుమేని కాంతి, పార్ కడల్ నీర్ వణ్ణమ్ = భూమిని చుట్టి ఉండే సముద్రంలోని నీటివర్ణంవలె నల్లనిదై, చల్లనిదై ఉన్నది, ముడి వణ్ణమ్ = కిరీట కాంతి, ఓర్ ఆఴి వెయ్యోన్ = ఏకచక్రాన్ని కల రథాన్ని అధిరోహించేవాడు, వేడి కిరణాలను కల వాడైన సూర్యునివర్ణంవంటిది, ఒళియుమ్ = ఆ స్వామియొక్క తేజస్సుకూడా, అదు అన్ఱే = ఆ సూర్యుని తేజస్సువంటిదే కదా!, ఆర్ ఆఴి కొణ్డాఱ్కు అఴకు = అందం పొందికగా ఉండే శ్రీసుదర్శనాన్ని శ్రీహస్తంలో ధరించి ఉండే భగవానుని అందం ఇటువంటిది. (ఇంతటి వైలక్షణ్యాన్ని కల్గినది).

**"ఆర్"** అనే పదానికి పూర్ణంగా ఉండే- అనే అర్థాన్ని చెప్పి, స్వామి శ్రీహస్తంలో సుదర్శనాన్ని ధరిస్తే ఇంకొక ఆభరణం ఏదీ అవసరం లేనట్లుగా నిండుగా ఉంటుంది - అనే అర్థాన్ని చెప్పవచ్చు.

అవ :- అనంతుని అందంలో తలమునకలు వేసేవారుకదా ఆఴ్వార్లు. అందువల్ల గత పాశురంలో ఆ స్వామి అందాన్ని గూర్చిన ప్రస్తావం రాగానే, "అతని వర్ణం, లీలలు, శ్రీపాదాలు - అనేవి అన్నీ అందం మూర్తీభవించి నట్లుగా కదా ఉన్నాయి''- అని ఈ పాశురంలో ఆనందంతో తలమునకలు వేస్తున్నారు.

6. **అఴకన్ఱే యాఴియాఱ్కు ఆఴినీర్ వణ్ణమ్**
**అఴకన్ఱే అణ్డమ్ కడత్తల్- అఴకన్ఱే**



**అఙ్గై నీరేత్తార్క్కు అలర్మేలోన్ కాల్ కఴువ**
**కఙ్గై నీర్ కాన్ఱ కఴల్**

ఆఴియాఱ్కు = శ్రీసుదర్శనాన్ని కల సర్వేశ్వరునకు, ఆఴినీర్ వణ్ణమ్ = సముద్రజలంయొక్క వర్ణంవంటి వర్ణం, అఴకు అన్ఱే = అందమే మూర్తీభవించినటున్నది కదా!, అణ్డమ్ కడత్తల్=లోకాలను కొలిచిన లీల, అఴకు అన్ఱే = అందమే మూర్తీభవించినట్లున్నది కదా!, అమ్ కై = అందమైన శ్రీకరంలో, నీర్ ఏఱ్ఱార్క్కు = మహాబలియొక్క దానజలాన్ని గ్రహించిన భగవానునకు, అలర్ మేలోన్ = తిరునాభీకమలంలో ఉండే బ్రహ్మ, కాల్ కఴువ = శ్రీచరణాలను కడుగగా (అభిషేకించగా), (అపుడు), కఙ్గై నీర్ = గంగాజలాన్ని, కాన్ఱ = వ్యక్తం చేసిన, కఴల్= ఆ శ్రీపాదం, అఴకు అన్ఱే = అందమే మూర్తీభవించి నట్లున్నది కదా!

ఆ నీటిని గంగాజలంగా ప్రవహింపజేసిన శ్రీపాదాలు, - శివుడు మొదలైన వారిని పరిశుద్ధం చేసిన గంగకు జన్మస్థానమైనందుకు పావనత్వాన్ని మాత్రమే కల్గి ఉన్నవా! **"మేల్ నిన్ఱ విశుమ్బిల్ వెణ్ తుకిల్ కొడియొన విరిన్దు వలన్తరు మణినీర్ క్కఙ్గై"** (పెరియతిరు-1-4-3) అనే రీతిలో ఆకాశంలో తెల్లని వర్ణాన్ని కల వస్త్రంతో చేయబడ్డ కేతనంవలె విస్తరించిన గంగజలాల తెలుపు, స్వామి శ్రీపాదాల ఎఱుపు - ఈ రెండు వర్ణాల కలయికను చూస్తే అందమే రూపు దిద్దుకొన్నట్లుంటుంది కదా! అతని (భగవానుని) వర్ణం సముద్రవర్ణంవలె ఉండే స్థితిని, అతడు లోకాలను కొలవడం అనే అరుదైన లీలను చేశాడని, పరమపావనం అయిన గంగను అతని శ్రీపాదాలు ఉత్పత్తి చేశాయి - అని లోకులు అంటారే తప్ప, ఆ రంగు, ఆ లీల, ఆ పాదాలు - అందమే మూర్తీభవించినట్లున్న రీతిని భావించి హార్దంగా పలికేవారే లేరే! **"మధురాధిపతే రఖిలం మధురమ్"** అనే రీతిలో అతనిది అంతా. అందమే మూర్తీభవించినట్లుగా ఉండడాన్ని తలచి మనస్సులో ద్రవించి పలుకవద్దా- అని హార్ద భావం.

అవ :- ఈ రీతిలో భగవానుని అందంలో అభినివేశాన్ని పొంది, తమను స్వామికి వశం చేసికొన్న ఆఴ్వార్లు, ఈ పాశురంలో తమ మనస్సును ఉద్దేశించి,

"అతని శ్రీచరణాలలో నేను దాస్యాన్ని చేసి ఉజ్జీవించేటట్లుగా ఓ మనసా ! నీవు నాతో సహకరించి రా'' అని అంటున్నారు.

**7. కఴల్ తొఴుతుమ్ వా నెఞ్జే ! కార్క్కడల్ నీర్వేలై**
**పొఴిలళన్ద పుళ్ళూర్తి చ్చెల్వన్- ఎఴిలళన్ద అ**
**జ్గణ్ణఱ్కరియానై యెప్పొరుట్కుమ్ శేయానై**
**నణ్ణఱ్కరియానై నామ్**

నెఞ్జే = ఓమనసా!, మా కార్ కడల్ నీర్ =నల్లని సముద్రంలోని నీటితో కూడిన, వేలై = తీరాన్ని కల్గిన, పొఴిల్ = భూమిని, అళన్ద = కొలిచినవాడు, పుళ్ ఊర్ది= గరుడుని వాహనంగా కలవాడు, శెల్వన్ = సంపద్రూపిణి అయిన లక్ష్మీదేవిని కలవాడు, ఎఴిల్ అళన్దు ఎణ్ణఱ్కు అరియానై = అందంయొక్క అవధిని చూచి "ఇంత'' అని భావించడానికి వీలు కానివాడు, ఎప్పొరుట్కుమ్ శేయానై = ఏ వస్తువుకు అయినా చాలా దూరంలో ఉన్నవాడు, నణ్ణఱ్కు అరియానై= (ఎవరికీ తమ స్వప్రయత్నంతో) దరిచేరడానికి వీలుకానివాడై ఉన్నవాడైన భగవానుని, కఴల్= శ్రీచరణాలను, నామ్ తొఴుదుమ్ = మనం నమస్కరిస్తాము, వా = నీవు కూడా అంగీకరించి, సహకరించి రా. (కైంకర్యరుచిని తెలిసి, నాకు వశంలో ఉండే ఓ మనసా! కైంకర్యం చేయడం కోసం రా)

అవ :- "భగవత్కైంకర్యం చేయడానికి రా'' అని ఆఴ్వార్లు తమ మనస్సును గత పాశురంలో పిలిచారు. ఒక ఇంద్రియంతో ఒక విధమైన కైంకర్యాన్ని చేస్తే చాలదు, అన్ని ఇంద్రియాలతో భగవానుని అనుభవించి, పలు రీతులలోని కైంకర్యాలను అతనికి చేయాలి - అని ఆ మనసుకు ఈ పాశురంలో ఉపదేశిస్తున్నారు.

**8. నామమ్ పలశొల్లి నారాయణా వెన్ఱు**
**నా మఙ్గైయాల్ తొఴుతుమ్ నన్నెఞ్జే ! వా- మరువి**
**మణ్ణులక ముణ్డుమిఴ్న్ద వణ్డుఴాయుమ్ తణ్డుఴాయ్**
**కణ్ణనైయే కాణ్గ నఙ్గణ్**

నల్ నెఞ్జే = భగవద్విషయంలో (నాకంటే ముందడుగు వేసే) మంచి మనసా!, పల నామమ్ శొల్లి = పలు తిరునామాలను అనుసంధించి, నారాయణా ఎన్ఱు = అన్నిటిలోను ముఖ్యం అయిన నారాయణ నామాన్ని పల్కి, అమ్ కైయాల్ = అందమైన హస్తంతో, నామ్ తొఴుదుమ్ = మనం అంజలిని ఘటిద్దాం, మరువి వా = దీనికి నీవుకూడా ఒడంబడికతో రా (అంగీకరించి రా), మణ్ ఉలకమ్ = భూమిమొదలైన లోకాలను, ఉణ్డు ఉమిఴ్న్ద = ప్రళయకాలంలో ఆరగించి, సృష్టికాలంలో వ్యక్తం చేసినవాడు, వణ్డు అఱైయుమ్ తణ్ తుఴాయ్ = తుమ్మెదలు చేరి ధ్వనించే చల్లని తులసీమాలను కలవాడైన, అణ్ణనైయే = శ్రీకృష్ణునే, నమ్ కణ్ = మన కన్నులు, కాణ్గ = దర్శించి, ఆనందించాలి. (మనకు విధేయంగా ఉండే కన్నులు "అతనినే దర్శించాలి'' అనే ఆశ తీరేటట్లు దర్శించి, ఆనందించాలి ఆఴ్వార్లు అని భావం.)

అవ :- **"కణ్ణనైయే కాణ్గ నమ్ కణ్"** అని ఆఴ్వార్లు ఆశపడిన తరువాతకూడా, ఆశ్రితపరతంత్రుడైన శ్రీకృష్ణుడు తన దర్శనాన్ని ప్రసాదించకుండా ఉండడు కదా! అతడు తనను తానే దర్శింపజేయగా దర్శించి, అతని అందాన్ని ఇందులో అనుభవిస్తున్నారు.

**9. కణ్ణుమ్ కమలమ్ కమలమే కైత్తలముమ్**
**మణ్ణళన్ద పాతముమ్ మఱ్ఱవైయే- ఎణ్ణిల్**
**కరుమా ముకిల్వణ్ణన్ కార్క్కడల్ నీర్వణ్ణన్**
**తిరుమామణివణ్ణన్ తేశు**

కరు మా ముకిల్ వణ్ణన్ = నల్లని పెద్ద మేఘంవంటి రూపాన్ని (స్వభావాన్ని) కలవాడు, కార్ కడల్ నీర్ వణ్ణన్ = నల్లని నీటి రంగువంటి రంగును, సముద్రపు స్వభావాన్ని కలవాడు, తిరు మా మణి వణ్ణన్ = అందమైన, గొప్ప వెలను కల మణివంటి వర్ణాన్ని స్వభావాన్ని కలవాడైన భగవానుని, తేశు = అందాన్ని, ఎణ్ణిల్= లెక్కిస్తే, కణ్ణుమ్ = అతని తిరునేత్రాలు, కమలమ్ = తామరపూలవంటివి, కైత్తలముమ్ = కరతలాలు, కమలమే = ఆ తామరపూలను పోలినవే, మఱ్ఱుమ్= ఇంకా, మణ్ అళన్ద పాదముమ్ = లోకాలను కొలిచిన శ్రీపాదాలు, అవైయే = ఆ తామరపూలవంటివే.

ఆ అందానికి, సౌకుమార్యానికి జితులై పడేది పాదాలపై. అరణ్యాలతో, మిట్టలతో నిండిన భూమిని కొలిచిన ఆ శ్రీపాదాలు కమలం వలె గొప్ప

సౌకుమార్యాన్ని కల్గినవి. కఠినమైన భూమిని పూవువంటి ఆ శ్రీపాదాలతో స్వామి కొలువడమా! అని ఆళ్వార్లు అస్థానే భయశంకతో కడుపు మోదుకొంటున్నారు.

అవ :- ఏ కొఱత లేని అందాన్ని కలవాడైన భగవానుని అందాన్నిగూర్చి పల్కి, అనుభవించాలంటే మనకు కొన్ని గొప్పతనాలు (యోగ్యతలు) కావాలి కదా! వాటిని మేము ఏవిధంగా పొందడం? అని కొందఱు ప్రశ్నించగా, మనం అతని తిరునామాలను చెప్పడం ప్రారంభించినపుడే అన్ని గొప్పతనాలు తాము సార్థకం కావడంకోసం తమకు తాముగానే వచ్చి మనలను పొందుతాయి సుమా- అని ఇందులో ఆళ్వార్లు అంటున్నారు.

**10. తేశుమ్ తిఱలుమ్ తిరువు మురువముమ్**
**మాశిల్ కుడిప్పిఱప్పుమ్ మ*ఱ్ఱ*వైయుమ్- పేశిల్**
**వలమ్ పురిన్ద వాన్శఙ్గమ్ కొణ్డాన్ పేరోత**
**నలమ్బురిన్దు శెన్దడైయుమ్ నన్గు**

వలమ్ పురిన్ద వాన్ శఙ్గమ్ కొణ్డాన్ = కుడివైపున ఆవర్తాలను (సుడులను) కల, తెల్లని పాంచజన్యాన్ని ధరించిన భగవానుని, పేర్ ఓద = తిరునామాలను పల్కితే, పేశిల్ = (దాని ప్రయోజనాలను) చెప్పడం ప్రారంభిస్తే, తేశుమ్ = తేజస్సు, తిఱలుమ్= ప్రత్యర్థులను ఓడించే సామర్థ్యం, తిరువుమ్ = సంపద, ఉరువముమ్ = అందమైన రూపం, మాశు ఇల్ కుడి పిఱప్పుమ్ = దోషం లేని సత్కులజన్మ, మ*ఱ్ఱ*వైయుమ్ = ఇంకా మిగిలిన, నలమ్ పురిన్దు నన్గు శెన్దు అడైయుమ్ = గొప్పతనాలు తామే ఆశపడి చక్కగా వచ్చి చేరుతాయి.

గొప్పతనాలు అన్ని మనోరథాలను తీర్చి, చక్కగా వచ్చి మనలను చేరతాయి- అని భావం. **"నలమ్"** అంటే కోరిక. "ఇతని దగ్గరకు మనం వచ్చి చేరితే మనకు మంచిది'' అని భావించేటట్లు గొప్పతనాలు ఇతని వద్దకు స్వయంగా కోరి వచ్చి చేరతాయి. "చెడ్డవారి దగ్గరకు చేరితే సద్గుణంకూడా గౌరవింపబడ నందువల్ల, సత్పురుషులైన వీరిని ఆశ్రయిస్తేనే మనం సద్గుణాలుగా లెక్కింపబడతాం'' అని అవి భావించాయా! అని శంకించేటట్లుగా ఈ గుణాలు వీరిని అన్వేషించి స్వయంగా ఆశ్రయిస్తాయని భావం.



అవ :- గడచిన పాశురంలో "తన తిరునామాలను చెప్పేవారికి భగవానుడు తనను తానే దర్శింపజేసి, అన్ని ఫలాలను అనుగ్రహిస్తాడు'' అని అన్నారు. అనన్య భక్తులు కానివారికి తెలియడానికి అరుదైనవాడు భగవానుడు -అనే విషయాన్ని నిదర్శనం చూపి ఈ పాశురంలో వివరిస్తున్నారు.

**11. నన్గోతుమ్ నాల్ వేదత్తుళ్ళాన్ నఱవిరియుమ్**
**పొఙ్గోతరువి పునల్వణ్ణన్- శఙ్గోత**
**ప్పాఱ్కడలాన్ పామ్బణైయిన్ మేలాన్ పయిన్దురైప్పార్**
**నూఱ్కడలాన్ నుణ్ణఱివినాన్**

నన్గు ఓదుమ్ నాల్ వేదత్తు ఉళ్ళాన్ = దోషరహితంగా అధ్యయనం చేయబడే నాల్గు వేదాలచే ప్రతిపాదింపబడేవాడు, నఱవు ఇరియుమ్ = తేనె స్రవించేటట్లున్న భోగ్యతను కల్గినదై, పొఙ్గు ఓదమ్ అరువి పునల్ = పొంగే సముద్రంవంటి, కొండవాగుల నీరువంటి, వణ్ణన్ = తిరుమేనిని కలవాడు, శఙ్గు ఓదమ్ పాల్ కడలాన్= శంఖాలను కల అలలు కల్గిన క్షీరాబ్ధిలో శయనించి ఉండేవాడు, పామ్బు అణైయిన్ మేలాన్ = శేషశయనంలో శయనించి ఉండేవాడు, పయిన్దు ఉరైప్పార్ నూల్ కడలాన్= అభ్యసించి తెలియబడే వైదికుల, సముద్రంవంటి అనంతాలైన శాస్త్రాలచే చెప్పబడేవాడు అయిన స్వామి, నుణ్ అఱివినాన్ = (తమ ప్రయత్నంలో తెలిసేవారికి) తెలియరానివాడు.

స్వప్రయత్నంతో తెలియాలని తలచేవారికి భగవానుడు తెలియరానివాడని ఇచటి భావం. గత పాశురంలో చెప్పిన రీతిలోనే అతడు స్వయంగా తనను దర్శింపజేస్తే దర్శించగలమే తప్ప, స్వప్రయత్నంతో దర్శించాలని అనుకొనేవారికి తెలియరానివాడని సారం. **"నుణ్ణఱివినాన్"**- జ్ఞానానికి సూక్ష్మమైనవాడని అర్థం. లేక, సూక్ష్మమైన జ్ఞానంతో తెలియదగినవాడు, అతడు అని అర్థం తనను తానే దర్శింపజేసేవారికే అర్థం కాగలడు - అని, సూక్ష్మమైన జ్ఞానాన్ని కలవారు మాత్రమే అతనిని తెలియవచ్చునే తప్ప, "మన ప్రయత్నంతో అతనిని తెలియవచ్చు'' అనే స్థూలమైన జ్ఞానాన్ని కలవారికి అతడు అర్థంకాడని భావం.

అవ :- "స్వప్రయత్నంలో అతనిని తెలియడానికి ఎవరికీ సాధ్యం కాదా? ఉపాయాంతరనిష్ఠులు అతనిని ప్రయత్నించి దర్శిస్తున్నట్లుగా శాస్త్రాలు తెలుపు

తున్నారే!'' అనే సందేహం కొందఱికి రాగా, "ఇంద్రియనిగ్రహం మొదలైన పలు పడరాని పాట్లను పడి, ప్రయత్నించి, భక్తియోగం చేజిక్కించుకొన్నవారు ఒక వేళ దర్శిస్తే ఎపుడైనా దర్శించవచ్చునేమో! ఆ విధంగా దర్శించడంలోని వైఫల్యాన్ని గమనించి (అరుదైన విషయం అనే విషయాన్ని చూచి) గత పాశురంలో "స్వప్రయత్నంతో దర్శించలేనివాడు'' అని చెప్పబడింది - అని ఈ పాశురంలో అంటున్నారు.

12. అఱి వెన్నుమ్ తాళ్ కొళువి ఐమ్బులనుమ్ తమ్మిల్
శెఱి వెన్నుమ్ తిణ్ కతవమ్ శెమ్మి- మఱై యెన్ఱుమ్
నన్గోది నన్గుణర్‌వార్ కాణ్బరే నాడోఱుమ్
పైఙ్గోత వణ్ణన్ పడి

మఱై =వేదాన్ని, ఎన్ఱుమ్ = నిరంతరం, నన్గు ఓదు = చక్కగా అధ్యయనం చేసి, అఱివు ఎన్నుమ్ = (ఆత్మ- పరమాత్మ) జ్ఞానం అనే, తాళ్ కొళువి = తాళాలను పెట్టి, ఐమ్బులనుమ్ = అయిదు ఇంద్రియాలను, తమ్మిల్ శెఱివు ఎన్నుమ్ = తమకు తగిన విషయాలలో అణచి ఉంచడమనే, తిణ్ కతవమ్ శెమ్మి = దృఢమైన తలుపులను మూసి, నన్గు ఉణర్‌వార్ = చక్కగా ధ్యానించేవారు, పైఙ్కోదమ్ వణ్ణన్ పడి = పచ్చని సముద్రవర్ణంవంటి వర్ణాన్ని కలవాడైన భగవానుని స్వభావాలను, నాళ్ తోఱుమ్ = ప్రతిదినం, కాణ్బర్ = సాక్షాత్కరించుకొంటారు.

**"సదా పశ్యంతి"** అనే రీతిలో ఈనాడు- ఆనాడు అనే భేదం లేకుండా ఎల్లప్పుడూ దర్శించగలరు - అని భావం. ఉపాయాంతరనిష్ఠులు అతనిని తెలియ డానికి పడే పాట్లను వివరించడంతోపాటు, గడచిన పాశురంలో **"నుణ్ణఱివినాన్"** అనే సూక్తిద్వారా తమ ప్రయత్నంతో తెలియడానికి సాధ్యం కానివాడని పల్కిన విషయాన్నే ఇక్కడ వివరించినట్లయింది.

అవ :- గత పాశురంలో చెప్పిన రీతిలోనే, తమ ప్రయత్నంతో అతనిని చూడాలని ప్రయత్నించేవారికి క్లేశం కల్గుతుంది తప్ప, అతడే తన గొప్పతనాలను దర్శింపజేయగా దర్శించిన తాము ఏ క్లేశం లేకుండా దర్శిస్తాము- అని అంటూ, ఒక లీలను తాము దర్శించిన రీతినిగూర్చి ఇందులో పల్కుతున్నారు.



13. పడివట్ట త్తామరై పణ్డులకమ్ నీరేఱ్ఱు
అడివట్టత్తాలళప్ప నీణ్డ-ముడివట్టమ్
ఆకాయ మూడఱుత్తు అణ్డమ్బోయ్ నీణ్డతే
మాకాయమాయ్ నిన్ఱ మాల్కు

పణ్డు = పూర్వం ఒకానొక సమయంలో, ఉలకమ్ నీర్ ఏఱ్ఱు = (మహాబలి దగ్గర) భూమిని దానంగా పరిగ్రహించి, తామరై పడి వట్టమ్ = తామరపూవు పూచినట్లుగా గుండ్రంగా ఉండే భూమి, అడి వట్టత్తాల్ అళప్ప = శ్రీపాద వలయంతో కొలువడంకోసం, మా కాయమ్ ఆయ్ నిన్ఱ మాల్కు = గొప్ప తిరుమేనిగా (త్రివిక్రముడై) పెరిగిన భగవానుని, నీణ్డ ముడి వట్టమ్ = దీర్ఘమైన కిరీటవలయం, ఆకాయమ్ ఊడు అఱుత్తు = పైలోకాల మార్గంలో పయనించి, అణ్డమ్ పోయ్ నీణ్డదే = అండకటాహంవరకు వృద్ధి చెందింది కదా! ఇదేమి ఆశ్చర్యం!

**"స భూమిం విశ్వతో వృత్వా, అధ్యతిష్ఠ ద్దశాంగులమ్"** అనే రీతిలో రక్షకుని అభినివేశాతిశయం రక్ష్యవస్తువు పరిమితి మాత్రంలోనే అణగి ఉండనందున, అండభిత్తివరకు చేరి దానిని అతిక్రమించి ఆవలివైపు కూడా పోయిందే! ఇదేమి ఆశ్చర్యం!- అని విస్మితులవుతున్నారు.

అవ :- **"అఱివెన్నుమ్ తాళ్ కొళువి"** అనే పాశురంలో- **"ఐమ్బులనుమ్ తమ్మిల్ శెఱి వెన్నుమ్ తిణ్ కతవుమ్ శెమ్మి"** అని యోగాభ్యాసంతో శుభా శ్రయమైన అంతర్యామిరూపంలో మనస్సును ప్రవర్తింపజేసేవారికి ఇంద్రియాలను జయించవచ్చునని, ఆ విధంగా ఇంద్రియాలను జయించిన వారికి తప్ప ఇంకొకరికి అతనిని దర్శించడం సాధ్యం కాదు - అని అన్నారు. "ఈ విధంగా యోగాభ్యాసం చేయలేని అశక్తులు శుభాశ్రయమైన తిరుమేనిలో మనస్సు లగ్నం చేయలేరు కనుక, వారు ఇంద్రియాలను జయించడం, అతనిని దర్శించడం అరుదుకదా!'' - అనే ప్రశ్న తల ఎత్తగా, "ఈ యోగాభ్యాసంతో అంతర్యామిని దర్శించి, ఇంద్రియాలను జయించేటట్లుగా శుభాశ్రయమైన తిరుమేనితో భగవానుడు తిరుమలైలో అర్చావతారంగా వచ్చి నిలచి సులభు డయ్యాడు.

అందువల్ల తమవలె, అతడే తానుగా దర్శింపజేయగా దర్శించడం కాకుండా, అశక్తులు కూడా అతనిని సులభంగా ఆశ్రయించి తరించవచ్చును'' అని ఈ పాశురంలో అంటున్నారు.

**14. మాఱ్పాల్ మనమ్ శుழிప్ప మఙ్గైయర్‌తోళ్ కైవిట్టు**
**నూఱ్పాల్ మనమ్ వైక్క నొయ్‌వితామ్- నాఱ్పాల**
**వేతత్తాన్ వేఙ్గడత్తాన్ విణ్ణోర్ ముడి తోయుమ్**
**పాతత్తాన్ పాతమ్ పణిన్దు**

నాఱ్పాల వేదత్తాన్ = నాల్గుగా విభాగింపబడ్డ వేదాలలో చెప్పబడేవాడు, వేఙ్గడత్తాన్= తిరుమలలో నిలచిన సౌలభ్యాన్ని కలవాడు, విణ్ణోర్ ముడి తోయుమ్ పాతత్తాన్ = నిత్యసూరుల కిరీటం పొందికగా ఉండే శ్రీచరణాలను కల స్వామియొక్క, పాదమ్ = శ్రీచరణాలను,పణిన్దు = ఆశ్రయించి, మాల్ పాల్ = ఆ సర్వేశ్వరుని పట్ల, మనమ్ శుழிప్ప = మనస్సు చుట్టుకోగా (అభినివేశాన్ని పొందగా), (అందువల్ల), మఙ్గైయర్ తోళ్ కై విట్టు = వనితల అందమైన బాహువులు ఆలిగనం చేసికోవాలి- అనే ఆశను విడిచిపెట్టి, నల్ పాల్ = వేదం మొదలైన శాస్త్రాలలో, మనమ్ వైక్క = మనస్సు ప్రవర్తింపజేయడానికి, నొయ్‌విదు ఆమ్ = సులభం అవుతుంది.

"పూర్వం తెల్పిన రీతిలో లౌకిక విషయానుభవాలు తీరగానే, వేదం మొదలైన శాస్త్రాలలో కొంచెమైనా మనస్సును నిలువడానికి వీలవుతుంది. మనస్సును అగ్నం చేయగానే తగిన ఉపాయాన్ని అనుష్ఠించి, అతని పొందడం సులభం'' - అని భావం.

అవ :- గడచిన పాశురంలో - భగవానుని పొందడానికి దుర్లభమైన దారిని, సులభమైన దారిని రెండిటిని చూపారు. "మఱి ఈ మార్గాలలో ఏ దారిలో మీరు ప్రయత్నించి, అతనిని దర్శించారు?'' అనే ప్రశ్న తల ఎత్తగా, భగవానుడు తానే నా మనసులో ప్రవేశించి, నిర్హేతుకంగా తనను దర్శింపజేయగా దర్శించిన నాకు ఈ రెండు దారులలోను కలిగే శ్రమ ఏ కొంచెంకూడా లేదు - అని అంటున్నారు.



**15. పణిన్దుయర్న్ద పౌవ ప్పడుతిరైకళ్ మోత**
**పణిన్ద పణమణికళాలే- అణిన్ద-**
**ఙ్గనన్దనణై క్కిడక్కు మమ్మాన్ అడియేన్**
**మనన్దనణై క్కిడక్కుమ్ వన్దు**

పణిన్దు ఉయర్న్ద = (భగవానుని స్పృశించాలనే ఆరాటంతో) పడుతూ, పైకి లేస్తూ ఉండే, పౌవమ్ పడు తిరైకళ్ = సముద్రంలోని కెఱటాలు, మోద = అన్నివైపులా తాకుతూ ఉండగా, పణిన్ద = (ఆ అలల నీటి కణాలు తిరుమేనిపై పడకుండా ఉండేటట్లు గొడుగుపట్టినట్లుగా, విస్తరించిన, పణమ్ = పడగలపై ఉండే, మణికళాలే = మాణిక్యాలతో, అణిన్ద = అలంకరింపబడ్డ, అనన్దన్= అనంతుడనబడే, అణై= శయ్యపై, కిడక్కుమ్ = శయనించి ఉండే, అమ్మాన్ = సర్వేశ్వరుడు, (అ పడుకపై పొందికగా పరుండ లేకుండా), అఙ్గు = అక్కడనుండి, వన్దు = బయలుదేరి, అడియేన్‌తన్ = దాసుని, మనమ్ అణై = మనస్సు అనే పడుకలో, కిడక్కుమ్ = నిద్రిస్తున్నాడు.

ఆదిశేషుడనే పెద్దపడుకపై శయనించి ఉండే స్వామి, ఆదిశేషునివలె తన విషయంలో అభినివేశాన్ని కల్గి ఉండనివాడను, అసౌకుమార్యం, చల్లదనం, సౌగంధ్యం- వాడనైన మొదలైన శయనానికి ఉండదగిన గుణాలు ఏవీ లేని, నా కఠినమైన మనస్సులో నిలచాడు. గతంలో ఎక్కడ పరుండి ఉండేవాడు ఇపుడు ఎక్కడ శయనించాడు! ఉండడానికి చక్కని చోటును, శయనించడానికి పడుకను లేనివానికి అంతఃపురంలో మెత్తని పంచశయనం లభించినట్లుగా, ఆ అరుదైన ఆదిశేషుడనే శయ్యాన్ని వీడి ఈ రాతి మనస్సును శయనంగా ఆదరించాడే! అయోధ్యాపురవాసులు "అయోధ్యకు తిరిగి వేంచేయాలి'' అని భగవానుని శరణు వేడినపుడు, వారిని విడిచిపెట్టి **"ఆవాసం త్వహ మిచ్ఛామి"** (నాకొక నివాసాన్ని కోరుతున్నాను) అని అంటూ ఋషులవద్ద ప్రార్థించినట్లుగా ఉన్నది ఇది -అని హార్ద భావం. ఈ విధంగా అత్యంతాభినివేశంతో అతడు నన్ను అన్వేషించి వచ్చినందువల్ల అతనిని ప్రయత్నించి పొందే ఆ దారిలో నేను ఏ శ్రమ పడలేదు- అని తెల్పినట్లయింది.

అవ :- "ఈ రీతిలో తాము పరగతస్వీకారానికి విషయం కావడానికి కారణం ఏమి?" అని అంటే - "పాలసముద్రంనుండి భగవానుడు లేచి వచ్చి-ఎవడైనా ఒక చేతనుడు లభించడా!" అనే ఆశతో తిరువళ్ళిక్కేణికి వేంచేసినపుడు- "ఇదిగో! ఈ క్షేత్రానికి సమీపంలో జన్మించిన ఇతనిని కటాక్షించాలి" అని అంటూ లక్ష్మీదేవి పురుషకారం చేయడమే- అని అంటున్నారు.

16. వన్దుదైత్త వెణ్ తిరైకళ్ శెమ్బవళ వెణ్ ముత్తమ్
అన్ది విళక్కు మణివిళక్కామ్-ఎన్దై
ఒరువల్లి త్తామరైయాళ్ ఒన్టియ శీర్ మార్వన్
తిరువల్లిక్కేణియాన్ శెన్ఱు

ఒరు అల్లి తామరైయాళ్ = సాటి లేని, అందమైన రేకులను కల తామర పూవును నివాసంగా కల లక్ష్మీదేవి, శెన్ఱు ఒన్టియ శీర్ మార్వన్ = వచ్చి పొందికగా నిలచి ఉండే అందమైన వక్షస్సును కలవాడు, వెణ్ తిరైకళ్ వన్దు ఉదైత్త శెమ్ పవళమ్ వెణ్ ముత్తమ్ =తెల్లని అలలు తాకగా గెంటబడ్డ ఎఱ్ఱని పగడాలు, తెల్లని ముత్యాలు, అన్ది విళక్కుమ్ అణి విళక్కుమ్ ఆమ్ = సాయం సమయాన్ని ప్రకాశింపజేసే మంగళదీపాలు కాగా, తిరువల్లిక్కేణియాన్ = తిరువల్లిక్కేణిలో వేంచేసి ఉండేవాడు, ఎన్దై = నాకు స్వామి.

లక్ష్మీదేవి స్వయంగా ఆశపడి వచ్చి చేరిన వక్షఃస్థలాన్ని కలవాడు, తిరువల్లి క్కేణిలో నిత్యవాసాన్ని స్వామి చేస్తున్నాడు. ఆమె చేసినపురుషకారంయొక్క ఫలంవల్లనే నేను స్వామిచే ఆదరింపబడి, విషయీకరింపబడ్డాను. ఆ తల్లి స్వయంగా అన్వేషించి అతనిని చేరి, నేనుండే చోటుకు వెదకివచ్చేటట్లు అతనిని చేసింది కదా! అని ఆశ్చర్యపడు తున్నారు.

అవ :- "ఈ విధంగా లక్ష్మీదేవితోపాటు భగవానుడు కూడి ఉండడంవల్ల నేను ఫలం పొందడంలో ఏ కొఱతా లేదు. ఈ విధంగా అతడు మనవద్ద అభినివేశాన్ని పొందినవాడు - అని తెలిసే ఒకనాడు సంభవిస్తే, దానికి ముందు వెనుక ఉండే అన్ని దినాలు ఫలవంతాలు అవుతాయి. ఇక, నానోరు పొద్దు పుచ్చడానికి వీలుగా అతనిని విడువకుండా నిత్యం స్తుతించాలి"- అని అంటున్నారు.



17. శెన్ఱనాళ్ శెల్లాత శెఙ్గణ్మాల్ ఎఙ్గళ్మాల్
ఎన్ఱనాళ్ ఎన్నాళుమ్ నాళాకుమ్- ఎన్ఱుమ్
ఇఱవాత వెన్దై యిణైయడిక్కే యాళాయ్
మఱవాతు వాఴ్త్తుక ఎన్ వాయ్

శెమ్ కణ్ మాల్ ఎఙ్గళ్ మాల్ ఎన్ఱ నాళ్ = పుండరీకాక్షుడు నాపట్ల అంతు లేని ప్రేమను కలవాడై ఉన్నాడు - అని చెప్పబడే నాళ్ళు (దినాలు) ఉంటే, శెన్ఱ నాళ్ = గతంలో గడచిన కాలం, శెల్లాద (నాళ్)= ఇకపై రాబోయే దినాలు-అనే, ఇన్నాళుమ్ = అన్ని కాలాలు, నాళ్ ఆకుమ్ = మంచి కాలమే అవుతుంది, ఎన్ఱుమ్ ఇఱవాత ఎన్దై = ఏనాడూ నాశనం లేని తండ్రి అయిన భగవానుని, ఇణై అడిక్కే = రెండు శ్రీచరణాలకే, ఆళ్ ఆయ్ = సేవకులమై, మఱవాదు = మఱువకుండా, ఎన్ వాయ్ వాఴ్త్తుక = నానోరు స్తుతించాలి.

"నా వాగింద్రియం క్షణంకూడా మఱవకుండా స్వామికి మంగళాశాసనాన్ని చేయాలి" అని భావం. ఆఴ్వార్లు ఇక్కడ తమ వాక్కు మంగళాశాసనం చేయడాన్ని గూర్చి ప్రస్తావించడం- మిగిలిన రెండు కరణాలైన మనస్సు, శరీరం, వాటికి సంబంధించిన రీతులలో కైంకర్యాన్ని చేయడానికి ఉపలక్షణం. అందువల్ల ఫలంలో ఏ కొఱత లేదు కనుక, త్రికరణాలద్వారా కైంకర్యాన్ని చేయడమే అధికారికృత్యం- అని చెప్పబడినట్లయింది.

అవ :- ఈ రీతిలో కైంకర్యాన్ని చేయడానికి కూడా అతని అంగీకారం ఆవశ్యకం కనుక, "నీ సొత్తును ఏకొంచెం కూడా జారవిడువని నీవు, శ్రీపాదాలలో నాకు నిత్యకైంకర్యాన్ని అనుగ్రహించి, దానికి అడ్డు అయిన సంసారభయాన్ని తీర్చాలి" అని స్వామిని ఇందులో ప్రార్థిస్తున్నారు.

18. వాయ్ మొழిన్దు వామననాయ్ మావలిపాల్ మూవడి మణ్
నీ యళన్దుకొణ్డ నెడుమాలే! - తావియ నిన్
ఎఞ్జా విణైయడిక్కే యేழ் పిఱప్పు మాళాకి
అఞ్జా తిరుక్క వరుళ్

వామనన్ ఆయ్ = వామనరూపియై, మా వలి పాల్ = మహాబలివద్దకు పోయి, వాయ్ మొ*ళి*న్దు = (బాల్యాన్ని వ్యక్తం చేసే కొన్ని) పలుకులను పల్కి, మూ అడి మణ్ = మూడు అడుగుల నేలను (యాచించి పొంది), అళన్దు కొణ్డ= దానిని కొలిచిన, నెడుమాలే = సర్వేశ్వరా!, ఎఞ్జా = (అందంలో) ఏ మాత్రం సంకోచం లేనిదై, తావియ = లోకాలను కొలిచిన, నిన్ ఇణై అడిక్కే = నీ శ్రీచరణాలకే, ఏ*ళ్* పిఱప్పుమ్ = అన్ని జన్మలలో, ఆళ్ ఆకి = నేను దాసుడనై, అఞ్జాదు ఇరుక్క = భయం లేకుండా ఉండేటట్లు, నీ అరుళ్ = నీవు కృపజేయాలి.

"ఆ కైంకర్యానికి లోపం కలుగకుండా ఏం చేయగలను?" అని నేను భయపడకుండా, ఏ సంకోచం, క్లేశం లేకుండా ఉండేటట్లుగా నన్ను చేయడమే నీవు నాకు చేయవలసినది. ఈకృపను నీవు చేసేటట్లయితే, ఎన్ని జన్మలను ఈ తమోమయ లోకంలో నేను ఎత్తినా నాకు అది మోక్షంతో సమానం అవుతుంది- అని హార్ద భావం. **"తూఙ్గార్ పిఱవిక్కళ్ ఇన్నమ్ పుకప్పెయ్దు వాఙ్గాయ్ ఎన్ఱు శిన్దిత్తు నాన్ అదఱ్కు అఞ్జి పామ్బోడు ఒరు కూరైయిలే పయిన్ఱాప్పోలే తాఙ్గాదుళ్ళమ్ తళ్ళుమ్ ఎన్ తామరైక్కణ్ణా!"** (పెరియతిరు-11-8-3) అనే రీతిలో సంసారంలో జన్మ ఎత్తడం సర్పంతో సహవాసం చేయడంవలె భయంకరమైనది- అని జ్ఞానులు అంటూ ఉండగా, జన్మలు ఎత్తాలని ఆ*ళ్*వార్లు ఆశపడడం తగునా? అని అంటే, సర్పవిషాన్ని తీర్చే మూలికలను తిని, శరీరాన్ని బలిష్ఠంగా చేసికొన్నవాడు భయం ఏమీ లేకుండా పాము నోట్లో చేయిపెట్టడాన్ని లోకంలో గమనిస్తున్నాము. అదే రీతిలో, సంసారమోక్షస్థితిబంధహేతువు అయిన అతని కృప అనే ఔషధం దొరికితే, సంసారమనే కాలసర్పం నోటిలో ప్రవేశించి బయటకు రావడంలో అడ్డులేదు కదా! అతని కృప లభిస్తుందా, లభించదా - అని భయపడినపుడు జన్మలు భయంకరాలుగా ఉంటాయి. అతని కృప లభించడం తథ్యం - అని స్పష్టమైనపుడు భయం తీరి, ఆ జన్మలే ఉద్దేశ్యాలు అవుతాయి -అని గ్రహించాలి.

అవ :- **"అఞ్జాదిరుక్క అరుళ్"** అని భగవానుని నిర్బంధించినపుడు, అతడు మనలను కృప జేయకుండా ఉంటాడా! మన యోగ్యతారాహిత్యాన్ని గమనించి, మనలను అతడు అలక్ష్యం చేసినా చేయవచ్చు. బలమైన పాపాన్ని చేసిన మనం మన కార్యాన్ని చేయడంలో శక్తి లేనివారమై ఉండవచ్చు" అని మనస్సు వెనుకంజ



వేయడం ఆరంభించగానే, "అతడు మన కార్యాన్ని చేయడానికి తగిన శక్తిని కలవాడే". మన యోగ్యతారాహిత్యాన్ని చూచి, మన చేయి విడువడులే" అని తమ మనస్సుకు ఊఱటను కల్గించే మాటలను ఇందులో ఆ*ళ్*వార్లు పల్కుతున్నారు.

**19. అరుళాతొ*ళి*యుమే యాలిలైమేల్ అన్ఱు**
**తెరుళాద పిళ్ళైయాయ్ చ్చేర్న్దాన్- ఇరుళాత**
**శిన్దైయరాయ్ చ్చేవడిక్కే శెమ్మలర్తూయ్ క్కైతొ*ళు*తు**
**మున్దైయరాయ్ నిఱ్పార్క్కు మున్**

ఇరుళాద శిన్దైయర్ ఆయ్ = అజ్ఞానాంధకారం చేరని మనస్సును కలవారై, శే అడిక్కే= ఎఱ్ఱని శ్రీపాదాలకే, శెమ్ మలర్ తూయ్ = అందమైన పుష్పాలను సమర్పించి, కై తొ*ళు*దు = అంజలి చేసి, మున్దైయర్ ఆయ్ నిఱ్పార్క్కు = (భగవద్విషయంలో) ముందంజ వేసి నిలిచే భక్తులకు, అన్ఱు = పూర్వ ఒకానొక సమయంలో, తెరుళాద పిళ్ళై ఆయ్ = ఏమీ తెలియని చిన్న శిశువై, ఆల్ ఇలై మేల్ శేర్న్దాన్ = మఱ్ఱి చిగురుటాకుపై నిద్రించిన స్వామి, మున్ అరుళాదు ఒ*ళి*యుమే =ముందడుగు వేసి మనలను కృపజేయకుండా పోతాడా! (అతని విషయంలో మనం ముందుకు వస్తే మనలను కృపజేయడానికి అతడు ముందడుగు వేస్తాడు కదా- అని కూడా భావం.)

అవ :- "ప్రయోజనాంతరపరులై, నిన్ను ప్రార్థించేవారికికూడా నీ స్వభావాన్ని మార్చుకొని, వారి కార్యాన్ని చేసే నీవు అనన్యప్రయోజనులమైన మా కార్యాన్ని చేయవా?"- అని ప్రశ్నిస్తున్నారు.

**20. మున్నులక ముణ్డుమి*ళ్*న్దాయ్క్కు అవ్వులక మీరడియాల్**
**పిన్నళన్దు కోడల్ పెరితొన్ఱే-ఎన్నే**
**తిరుమాలే ! శెఙ్గణెడియానే ! ఎఙ్గళ్**
**పెరుమానే ! నీ యితనై ప్పేశు**

మున్ = పూర్వం ఒకానొక సమయంలో, ఉలకమ్ = లోకాలను అన్నిటినీ, ఉణ్డు = తన ఉదరంలో పెట్టుకొని, ఉమి*ళ్*న్దాయ్క్కు = అనంతరం

బయటపఅచిన నీకు, అవ్వులకమ్ = ఆ లోకాలను, పిన్ = తరువాత ఒకానొక సమయంలో, ఈఱ్ అడియాల్ = రెండు శ్రీపాదాలతో, అళన్దు కోడల్ = కొలువడం అనేది, పెరిదు ఒన్ఱే = అది ఒక పెద్ద కార్యం అవుతుందా? (కానే కాదు), తిరుమాలే = ఓ శ్రియఃపతీ!, శెమ్ కణ్ నెడియానే =ఎఱ్ఱని తిరునేత్రాలను కల సర్వాధికా!, ఎజ్గళ్ పెరుమానే = మాకు స్వామి అయినవాడా!, నీ ఇదనై పేశు= నీవు దీనిని నాకు తెలిసేటట్లుగా చెప్పాలి, ఎన్నే! = ఇదేమి ఆశ్చర్యం! (అందఱికంటే గొప్పవాడైన నీవే దీనిని చెప్పాలి.)

"ఎత్తిఱమ్" అని అన్న నమ్మాళ్వార్లవలె ఇక్కడ సౌలభ్యగుణంలో పేయాళ్వార్లు అభినివేశాన్ని పొందుతున్నారు. ప్రయోజనంతరపరుడైన ఇంద్రుడు "నేను కోల్పోయిన రాజ్యాన్ని సాధించి ఇవ్వాలి" అని ప్రార్థించగా, నీ ఆశ్రితపక్ష పాతంవల్ల ఆ కార్యాన్ని చేసిన నీవు, అనన్య ప్రయోజనులం అయిన మా కార్యాన్ని తప్పక తీరుస్తావులే - అని భావం.

అవ :- పూర్వం, వసిష్ఠ- చండాలతారతమ్యం లేకుండా అందరి శిరస్సులను తన శ్రీచరణాలతో తడవిన త్రివిక్రమునిగూర్చి ప్రస్తావించడంవల్ల, అతనివలె ఏ వ్యత్యాసాన్ని చూడకుండా స్త్రీ- బాలురకుకూడా కట్టడానికి, కొట్టడానికికూడా వీలయేటట్లుగా తనను వారివశం చేసికొన్న శ్రీకృష్ణునిగూర్చి ఆళ్వార్లు ప్రస్తావిస్తూ "ఆ స్వామిని పరిచ్ఛేదించి పల్కడం ఎవరికీ సాధ్యం అయే పని కాదు సుమా!" అని ఇందులో అంటున్నారు.

**21. పేశువార్ ఎవ్వళవు పేశువర్ అవ్వళవే**
**వాశమలర్ త్తుళాయ్ మాలైయాన్- తేశుడైయ**
**శక్కరత్తాన్ శజ్గినాన్ శార్జ్గత్తాన్ పొజ్గరవ**
**వక్కరనై క్కొన్ఱాన్ వడివు**

వాశమ్ మలర్ తుళాయ్ మాలైయాన్ = సువాసన నిండుగా ఉండే పూవులతో కూడిన తులసీమాలను అలంకరించుకొన్నవాడు, తేశు ఉడైయ శక్కరత్తాన్ = కాంతిని కల్గిన శ్రీసుదర్శనాన్ని ధరించినవాడు, శజ్గినాన్ = శ్రీపాంచ జన్యాన్ని ధరించినవాడు, శార్జ్గత్తాన్ = శార్జ్గమ్ అనే వింటిని ధరించినవాడు, పొజ్గు అరవమ్ వక్కరనై = గొప్ప కలవరాన్ని చేస్తూ వచ్చిన దంతవక్త్రుడనే అసురుని, కొన్ఱాన్ = సంహరించినవాడైన భగవానుని, వడివు = స్వభావాలు, (ఎటువంటివి ? అని అంటే),పేశువార్ ఎవ్వళవు పేశువర్ అవ్వళవే =కీర్తించేవారు తాము ఎంతవరకు కీర్తించగలరో తావన్మాత్రమే అవి కాగలవు.

జ్ఞానంలో అధికులైనా, తక్కువవారైనా- అందఱూ భగవానుని రూపాన్ని యథాతథంగా పూర్ణంగా వర్ణించలేకపోవడమనే విషయంలో సమానులే - అని ఈ పాశురసారం. ఈ అంశాన్ని ఆళవందార్ స్తోత్రరత్నంలో **"యద్వా శ్రమావధి"** అనే శ్లోకంద్వారా అనుసంధించారు.

అవ :- అతని స్వరూపస్వభావాలు పరిచ్ఛేదించి పలుకడానికి సాధ్యం కానివి అయిన తరువాత, "అతడు తానే తనను దర్శింప జేస్తే, అందంగా దర్శించాలి అనే కోటికను కల్గి ఉండు" అని అంటూ తమ మనస్సును ఉద్దేశించి ఆళ్వార్లు అనుగ్రహిస్తున్నారు.

**22. వడివార్ ముడికోట్టి వానవర్కళ్ నాళుమ్**
**కడియార్ మలర్ తూవి క్కాణుమ్- పడియానై**
**శెమ్మైయాలుళ్ళురుకి చ్చెవ్వనే నెఞ్జమే!**
**మెయ్మ్మైయే కాణ విరుమ్బు**

నెఞ్జమే = ఓ మనసా!, వానవర్కళ్ = నిత్యసూరులు, వడివు ఆర్ = అందం నిండిన, ముడి = కిరీటాలను, కోట్టి = నమస్కరించేటట్లుగా చేసి, కడి ఆర్ మలర్ = సువాసన నిండిన పూవులను, నాళుమ్ =ప్రతిదినం, తూవి = (క్రమ వివక్ష లేకుండా) సమర్పించి, కాణుమ్ పడియానై = సదా దర్శించదగిన తిరుమేనిని కలవాడైన స్వామిని, శెమ్మైయాల్ = శేషశేషిభావక్రమానుసారంగా, ఉళ్ ఉరుకి = మనస్సులో కఱగి, శెవ్వనే = ఋజువైన మార్గంలో, మెయ్మ్మైయే = యథాతథంగా (నిజంగా), కాణ = సేవించడానికి, విరుమ్బు =ఆశపడు.

ఏదో ఒక గుణాన్ని అతడు ప్రదర్శించినంతమాత్రంతో చాలు- అని భావించకుండా, పరిపూర్ణంగా అన్ని గుణాలను సాక్షాత్కరించుకోవాలని ఆశపడు. **"మెయ్మ్మైయే"** అంటే - పరిపూర్ణంగా- అని అర్థం. లేక, ఇంకొక ప్రయోజనాన్ని

ఆశించి, అతనిని దర్శించాలని అనుకోవడం అసత్యదర్శనంగా గ్రహించి, వేఱొక ఏ ప్రయోజనాన్ని ఆశించకుండా, అతనిని దర్శించడమే పరమ ప్రయోజనంగా భావించి, దర్శించే నిజమైన దర్శనాన్ని దర్శించాలని చూడు- అని కూడా చెప్పవచ్చు. **"నెఞ్జమే"** అనే సంబోధనకు- నాకంటే ముందడుగు వేసే మనసా! అని, శేషశేషిభావాన్ని బాగా తెలిసిన మనసా! అని, స్వప్రయత్నంతో భగవానుని ఎవరూ తెలియలేరని భాగా గ్రహించిన మనసా! అని - ఈ విధంగా పలు విధాలుగా భావాలను ప్రకరణానుగుణంగా చెప్పవచ్చు. కనుక, అతడు, తనకు తానే తనను దర్శింపజేయాలి- అని ఆశపడి, తన ప్రయత్నంనుండి విరమించడమే ప్రపన్నుని స్వరూపం - అని ఇక్కడ తెలుపబడింది.

అవ :- **"కాణ విరుమ్బు"** అని అంటూ వీరు ఉపదేశించి, ముగించడానికి ముందే, వీరి మనస్సు భగవానుని శ్రీపాదాలలో గొప్ప భక్తిని కల్గి ఉన్న రీతినిగూర్చి ఆళ్వార్లు ఇందులో ఆశ్చర్యపడుతున్నారు.

**23.** విరుమ్బి విణ్ మణ్ణళన్ద అఞ్జిఱైయ వణ్డార్
శురుమ్బు తుళైయిల్ శెన్దూత -అరుమ్బుమ్
పునన్దు*ళ్ళా*య్ మాలైయాన్ పొన్నఙ్గ*ళ*ల్కే
మనమ్ తు*ళ్ళా*య్ మాలాయ్ వరుమ్

అమ్ శిఱైయ వణ్డు = అందమైన రెక్కలను కల ఆడు తుమ్మెదలు, ఆర్ శురుమ్బు = వాటిని విడువకుండా ఉండే మగ తుమ్మెదలు, తుళైయిల్ శెన్దు ఊద = వెదురు గొట్టాలలో దూరి ధ్వనించగా, (దానివల్ల), అరుమ్బుమ్ = వికసించిన, పునమ్ తు*ళ్ళా*య్ మాలైయాన్ = తోటలో ఉన్నప్పుడు వికాసం మాఱని తులసీమాలను అలంకరించుకొన్న భగవానునియొక్క, విరుమ్బి విణ్ మణ్ అళన్ద అమ్ క*ళ*ల్కే = ఆశపడి ఆకాశాన్ని, భూలోకాన్ని కొలిచిన, చాలా అందమైన స్వామి శ్రీపాదాల విషయంలో, మనమ్ = నా మనస్సు, తు*ళ్ళా*య్ = పరిపూర్ణంగా, నిమగ్నమై, మాల్ ఆయ్ వరుమ్ = అంతు లేని వ్యామోహాన్ని కల్గి ఉన్నది. (లేక, ఆశపడి తులసీమాలగా పరిణమిస్తున్నది- అని కూడా చెప్పవచ్చు).



మనస్సు స్వామి పాదాల పట్ల ఆశపడి, ఆ ఆశతో ముందడుగు ఏదో తెలియక, నిలుచున్న చోటులో తడబడుతూ, మైకమే మూర్తీభవించిందా అనేటట్లుగా ఆ శ్రీచరణాలలో వ్యామోహాన్ని పొందుతున్నది - అని భావం. అందువల్ల **"కాణ విరుమ్బు"** అని ఉపదేశించగానే, మనోరథం యొక్క ఉన్నతదశలో తమ మనస్సు ఉండడాన్ని చూచి, ఆశ్చర్యపడి ఈ పాశురాన్ని ఆ*ళ్వా*ర్లు అనుగ్రహించారు.

అవ :- "ఓ మనసా! అంతు లేని ప్రేమను కల్గి ఉండి, భగవానునివద్ద అభినివేశాన్ని పొందాము. ఇక చేయవలసినది ఏదీ లేదు.'' అనే గర్వాన్ని పొందకుండా, భగవానుని విషయంలో ఉత్కటమైన ప్రేమలో నిమగ్నమై అతనిని ఆశ్రయించి, దానివల్ల కల్గిన అనుభవానికి విచ్ఛేదం లేకుండా ఉండేటట్లు నిరంతరం అతనిని అనుభవించాలని చూడు'' అని అంటూ తమ మనస్సును చూచి, ఆ*ళ్వా*ర్లు ఉపదేశిస్తున్నారు.

**24.** వరుఙ్గా లిరునిలనుమ్ మాల్ విశుమ్బుమ్ కా*ఱ్ఱు*మ్
నెరుఙ్గు తీ నీరురువు మానాన్- పొరున్దుమ్
శుడరా*ళి* యొన్ఱుడైయాన్ శూ*ళ్*క*ళ*లే నాళుమ్
తొడరా*ళి* నెఞ్జే ! తొ*ళు*తు

ఆ*ళి* నెఞ్జే=సముద్రంవలె గాంభీర్యాన్ని, కల ఓమనసా!, ఇరు నిలముమ్= విస్తృతిని కలభూమి, మాల్ విశుమ్బుమ్ = (ఆ భూమివలెనే) కొలువడానికి సాధ్యం కానట్లున్న చాలా పెద్దదైన ఆకాశం, కా*ఱ్ఱు*మ్ = ఆ భూమిలో, ఆకాశంలో ఉండేవారికి ప్రాణాలను ఇచ్చే వాయువు, నెరుఙ్గు తీ = భూమి, వాయువువలె సంతతిరూపంగా ఉన్నా, విడదీసి చూడడానికి వీలు లేని రీతిలో చాలా స్నిగ్ధంగా ఉండే (దగ్గరగా చేరి ఉండే) తేజస్సు, నీర్ = వీటిని అన్నిటిని ఒకటిగా చేర్చే జలం-అనే, ఉరువుమ్ ఆనాన్ = పంచభూతాలకు (అన్నిటికి) అంతర్యామి అయినవాడు, పొరున్దుమ్ శుడర్ ఆ*ళి* ఒన్ఱు ఉడైయాన్ = తన అప్రాకృతరూపానికి తగిన, సాటి లేని జ్యోతిని కల చక్రాయుధాన్ని కలవాడైన భగవానుని యొక్క, శూ*ళ్* క*ళ*లే = భక్తులను వశీకరించుకొనే శ్రీచరణాలనే, వరుఙ్గాల్ నాళుమ్=

ఇకపై రాబోయే కాలం అంతా, తొళుదు = నమస్కరించి, తొడర్=అనుసరించి ఆశ్రయించు.

రాబోయే కాలంలో అంతా ఒక్కక్షణం కూడా వ్యర్థం కాకుండా, దినం అంతా ఆ శ్రీచరణాలనే అనుసరించి ఆశ్రయించి, అనుభవించు. ఇంతకు ముందు అనాదిగా భగవానుని దివ్యరూపాన్ని స్మరించకుండా అనర్థాన్ని పొందినది చాలు. ఇక నీవైనా నిరంతరం క్రమానుసారంగా ఆశ్రయించు - అని తమ మనస్సుకు ఉద్భోదిస్తు న్నారు.

అవ :- ఆళ్వార్లు ఈరీతిలో ఉపదేశించినా, అనాదికాలంగా ఈ భగవానుని శ్రీచరణాన్ని ఆశ్రయించడానికి ఏర్పడిన అంతరాయాలను తలచి, "ఇకపై ఇంకా ఏమేమి ఆటంకాలు కల్గుతాయో! ఏమో!" అని భయపడే తమ మనస్సును ఉద్దేశించి, "అతనిని నీవు అనుసరించి ఆశ్రయించిన తరువాత అన్ని అంతరాయాలు తొలగిపోతాయి. నీకు ఏ కొఱత లేదు; భయపడకు" అని అంటూ దానిని తేటపరుస్తున్నారు.

**25. తొళుతాల్ పళుదుణ్డో? తూ నీరులకమ్**
**ముళుతుణ్డు మొయ్కుళలాళాయ్చ్చి-విళుతుణ్డ**
**వాయానై మాల్విడైయేళ్ శెఱ్ఱానై వానవర్క్కుమ్**
**శేయానై నెఞ్జే! శిఱన్దు**

తూ నీర్ ఉలకమ్ = పరిశుద్ధం అయిన నీటిని కల సముద్రంచేత పరివేష్ఠితం అయిన భూమి మొదలైన లోకాలను, ముళుదుమ్ = మొత్తం, ఉణ్డు = ఆరగించినవాడు, (కడుపులో పెట్టుకొని రక్షించినవాడై) మొయ్ కుళలాళ్ ఆయ్చ్చి= దట్టమైన (నిబిడం అయిన) కేశపాశాన్ని కల యశోదయొక్క, విళుదు= వెన్నను, ఉణ్డ వాయానై= ఆరగించిన నోటిని కలవాడు, మాల్ విడై ఏళ్ శెఱ్ఱానై= బలిసి పొగరు పట్టిన ఏడు ఎద్దులను చంపినవాడు, వానవర్క్కుమ్ శేయానై = బ్రహ్మ మొదలైన దేవతలకు కూడా అందనివాడై ఉండే స్వామిని, నెఞ్జే =ఓ మనసా!, శిఱన్దు = అందంగా, (గొప్పగా), తొళుదాల్ = నమస్కరిస్తే, పళుదు ఉణ్డే = కొఱత ఉన్నదా?



భగవానునకు - మనకు మధ్య ఉండే సంబంధాన్ని తెలిసికొని, మన శేషత్వస్వరూపానికి తగిన రీతిలో నమస్కరిస్తే నీకు ఏ ఆటంకం వస్తుంది? మన ఆపత్కాలంలో మనలను తన కడుపులో పెట్టుకొని స్వామి కాపాడే రీతిని, భక్తులకు సులభుడై ఉండే రీతిని, భక్తులను చేరడానికి అడ్డుగా ఉండే వాటిని పోగొట్టే స్వభావాన్ని కలవాడై ఉండడాన్ని, సులభులైన వారిలో అత్యంతసులభుడై ఉండే తీరును అనుసంధిస్తే, "అంతరాయాలు వస్తాయో! ఏమో !" అని కలత పడడానికి అవకాశం లేనే లేదు- అని అంటూ ఇందులో తమ మనస్సును ఆళ్వార్లు ఆశ్వాసించారు.

అవ :- ఈ రీతిలో భగవానుని దరిచేరి ఆశ్రయించిన తమ మనస్సును, నిత్యసూరుల కంటే, అభిమానదివ్యదేశాలకంటే ఎక్కువగా భగవానుడు అభిమానించిన రీతిని ఇందులో తెలుపుతున్నారు.

**26. శిఱన్ద వెన్ శిన్దైయుమ్ శెఙ్గణరవుమ్**
**నిఱైన్దశీర్ నీళ్కచ్చియుళ్ళుమ్- ఉఱైన్దతువుమ్**
**వేఙ్గడముమ్ వెంఃకావుమ్ వేళుక్కై ప్పాడియుమే**
**తామ్ కడవార్ తణ్డుళాయార్**

తణ్ తుళాయార్తామ్ = చల్లని తులసీమాలను అలంకరించుకొన్న స్వామి, కడవార్ = ఏనాడూ విడచి ఉండనివాడై, ఉఱైన్దదువుమ్ = నిత్యవాసం చేసే చోట్లు (ఏవి? అంటే,) శిఱన్ద ఎన్ శిన్దైయుమ్ = అన్నిటికంటే గొప్పదైన నా మనస్సులో, శెమ్ కణ్ అరవుమ్ = ఎఱ్ఱని నేత్రాలను కల ఆదిశేషునిపై, నిఱైన్ద శీర్ = నిండైన సంపదను కల, నీళ్ = గొప్ప, కచ్చియుళ్ళుమ్ = కాంచీనగరంలోను, వేఙ్గడముమ్ = తిరుమలలోను, వెంఃకావుమ్ = తిరువెంఃకాలోను, వేళుక్కైప్పాడి యుమే = తిరువేళుక్కై - అనే దివ్యక్షేత్రంలోను.

తిరువేంకటాచలం, తిరువెంఃకా, తిరువేళుక్కై- అనే దివ్యదేశాలను, "వీటికి నిర్వాహకుణ్ణి అయిన నేను వీటిని విడిచిపెట్టలేనే!" అని వాటిని తనకు సొత్తుగా తలచి, తాను వాటికి స్వామిగా ఉండే సంబంధాన్ని చూచి వాటిని విడచిపెట్టకుండా ఉంటాడు. అందువల్ల వేంకటాద్రి, వెంఃకా, వేళుక్కైప్పాడివంటి ఒక్కొక్క

తిరుపతులు ఉన్న ప్రదేశాల కంటే, పలు తిరుపతులు నిండుగా ఒకచోటే ఉండే కాంచీపురం, నిత్యసూరులలో గొప్పవాడైన ఆదిశేషుడు, సాధనస్థలాలైన వీటితో సాధింపబడే (పొందబడే) సాధ్యస్థలం అయిన తమ మనస్సు- అనే వీనిలో చాలా గొప్ప ఆదరాన్ని కల్గి ఉంటాడు, భగవానుడు, దీనికి కారణం - ఆశ్రితరక్షణం కోసం తులసీమాలను ధరించి ఉండడమే- అని ఇందులో తెలిపారు.

అయితే, ఇంకో రీతిలో కూడా అన్వయించి, పాశురానికి అర్థాన్ని చెప్పవచ్చు. **"నిఱైన్ద శీర్ నీళ్ కచ్చియుళ్ళుమ్ వేఙ్గడముమ్, వెంఃకావుమ్, వేళుక్కైప్పాడియుమే ఉఱైన్దదువుమ్ తణ్ తుழాయార్ తామ్ శిఱన్ద ఎన్ శిన్దైయుమ్ శెఙ్గణరవుమ్ తామ్ కడవార్"** - కాంచీనగరంలోను, వేంకటాద్రిలోను, తిరువెంఃకాలోను, తిరువేళుక్కైలోను తప్పదు కనుక భగవానుడు నివసించి ఉన్నాడు - అంతే. ఆశ్రితరక్షణకోసం విలక్షణమైన మాలను ధరించినవాడు ఆదరించిన శయ్య అయిన ఆదిశేషునివలె నా గొప్ప మనస్సును అతిక్రమించలేకుండా ఉన్నాడని భావం. ఈ నిర్వాహంలో **'నీళ్ కచ్చి'** అనేపదం కాంచీనగరంలో ఉన్నది, తిరువెంఃకాను, తిరువేళుక్కైను - మించినదైన ఒక దివ్యదేశాన్ని తెలుతుంది. **"తామ్ కడవార్"** అనే పదానికి "తమది అని అభిమానిస్తారు'' - అనే అర్థాన్ని చెప్పవచ్చు. ఈ రీతిలోని మూడువిధాలైన నిర్వాహాలలోను- తిరుపతులకంటే, నిత్యసూరులకంటే తమ మనస్సునే స్వామి చాలా ఆదరించాడు - అని తెల్పి నట్లయింది.

అవ :- భగవానుని స్వభావం ఇటువంటిది అయినపుడు అతనిని ఆశ్రయించినవారిలో ఎవరైనా ఒకరు తాము చేసిన పాపాలకు ఫలమైన దుఃఖాన్ని అనుభవించారు - అని ఎవరూ వినలేదు, తెలిసికోలేదు - అనే విషయంలో ఆశ్చర్యం ఏమాత్రం లేదని అంటున్నారు.

**27.** ఆరే తుయరుழన్దార్ తున్బుఱ్ఱారాణ్డైయార్
కారే మలిన్ద కరుఙ్గడలై-నేరే
కడైన్దానై క్కారణనై నీరణైమేల్ పళ్ళి
అడైన్దానై నాళు మడైన్దు



కార్ (ఏ) మలిన్ద కరు కడలై = (నీటిని గ్రహించడంకోసం చేరిన) మేఘాలతో నిండిన నల్లని సముద్రాన్ని, నేరే కడైన్దానై = తానే ముందు నిలిచి, చిలికినవాడు, కారణనై = సర్వజగత్కారణుడు, నీర్ అణైమేల్ పళ్ళి అడైన్దానై = క్షీరాబ్ధిలో (ఆదిశేషుడనే) పడుకపై పరుండి ఉండేవాడైన స్వామిని, అడైన్దు = ఆశ్రయించి, (ఉన్నవాడు) నాళుమ్ తుయర్ ఉழన్దార్ ఆర్ = ఏనాడు అయినా దుఃఖాన్ని పొందినవారు ఎవరు? తున్బు ఉఱ్ఱార్ ఆణ్డైయార్ = ఆవిధంగా భగవానుని ఆశ్రయించి దుఃఖాలను అనుభవించివారు ఏదేశంలో ఎక్కడ ఉన్నారు?

భగవానుని ఆశ్రయించి క్లేశపడినవారు ఏ దేశంలో ఉన్నారు? బ్రహ్మరుద్రాదు లను ఆశ్రయించి క్లేశపడినవారు పలు దేశాలలో అనేకకాలాలలో ఉన్నారు అనేది హిరణ్య-రావణభస్మాసురాది అసుర- రాక్షసుల కథలలో వింటున్నాము. అచ్యుతుడైన ఇతనిని ఆశ్రయించి ఎవడూ బాధపడినట్లుగా ఏ దేశంలోను వినలేదే!- అని భావం. "భగవానుని ఆశ్రయించినవాడు దుఃఖాన్ని అనుభవించాడు'' అని అనడం "నిప్పుతో తడుపుతున్నాడు'' అని అనడంవలె జరగని పని- అని భావం.

అవ :- భగవానుని ఆశ్రయించినవారు దుఃఖాన్ని పొందడం- పంచ పాండవులకు, తమ శత్రువులను తామే సంహరించేటట్లుగా స్వామి విడిచిపెట్టినపుడు కదా, - అని అంటున్నారు. అంటే, తనను ఆశ్రయించిన పంచపాండవుల శత్రువులను తానే స్వయంగా నాశనం చేసి వారిని కాపాడినట్లే, తనను ఆశ్రయించినవారి దుఃఖాలను తీర్చి, స్వామి వారిని తప్పక కాపాడుతాడని భావం. ఈ పాశురంలో పాండవులను జీవస్థానంలోను, కౌరవులను వారు చేసే పాపకర్మల స్థానంలోను గ్రహించి ఆழ్వార్లు పల్కడం గమనించదగిన అంశం.

**28.** అడైన్దతరవణైమేల్ ఐవర్క్కాయ్ అన్దు
మిడైన్దతు పారత వెమ్బోర్- ఉడైన్దతువుమ్
ఆయ్చ్చిపాల్ మత్తుక్కే అమ్మనే ! వాళెయిఱ్ఱు
పేయ్చ్చిపాలుణ్డ పిరాన్

వాళ్ ఎయిఱు = కత్తివంటి (పదునైన) దంతాలను కల్గిన, పేయ్చ్చి = పిశాచి అయిన పూతనయొక్క, పాల్ = స్తన్యాన్ని, ఉణ్డ = ఆరగించి, ఆమె ప్రాణాలను తీసినవాడైన, పిరాన్ = ఉపకారకుడు, అడైన్దదు = శయనించినది, (ఎక్కడ? అంటే), అరవణైమేల్= శేషశయనంపై, అన్రు = పూర్వ ఒకానొక సమయంలో, ఐవర్క్కు ఆయ్ = పంచపాండవులకోసం, మిడైన్దదు = తనను శ్రమపెట్టుకొని, బాణప్రయోగాలను సహించి, నిబిడంగా నిర్వహించినది, (దేనిని? అంటే), వెమ్ పారతమ్ పోర్ = కఠినమైన భారతయుద్ధాన్ని, ఉడైన్దదువుమ్ = భయపడి, జంకినది (దేనివల్ల అంటే), ఆయ్చ్చి పాల్= గోపిక అయిన యశోదాదేవిపట్ల ఉండే, మత్తుక్కే = అనురాగం వల్లనే, అమ్మనే= ఏమి ఆశ్చర్యం!

వయస్సు నిండని, పాలు కారే శైశవంలోనే, కత్తులవంటి పదునైన దంతాలను కల పిశాచి పూతనవిషం కలసిన స్తన్యాన్ని తల్లిస్తన్యం కాదని గ్రహించి, విషంతో పాటు, పాలతో పాటు, ఆమె ప్రాణాలతో పాటు- అన్నిటినీ ఆరగించి, తనను వధించాలని తలచిన ఆమెను వధించి లోకాలకు స్వామి అయిన తనను మనకు ప్రసాదించిన ఉపకారకుడే కదా - ఈ సౌలభ్యాన్ని తెలిపే లీలను చేశాడు. వయస్సు నిండనపుడే ఒక పిశాచిని చంపినవాడు ఒక తల్లికి భయపడి, ఏమీ చేయలేనివాడై, నిలబడి పోవడమా! కొందఱికి దూత్యసారథ్యాలను చేయడమా! అని ఆశ్చర్యపడు తున్నారు. ఈవిధంగా, భక్తులకు తన దివ్యతిరుమేనిని దర్శింప జేసేవాడై, వారికోసం తనను శ్రమపెట్టుకొని, తక్కువచేసికొని అయినా వారి కార్యాన్ని సఫలం చేసేవాడై, వారు కొట్టినా, తిట్టినా ఏమీ చేయలేనివాడై, వారి శత్రువులను అవలీలగా నశింపజేసేవాడైన ఇతనిని ఆశ్రయించినవారికి ఏ దుఃఖంకూడా సంభవించదు- అని అంటూ గత పాశురంలోని అర్థాన్ని ఇందులో వివరించారు.

అవ :- గడచిన పాశురంలో **"ఉడైన్దదువుమ్ ఆయ్చ్చిపాల్ మత్తుక్కే"** అని అన్నట్లు యశోదాదేవివద్ద భగవానుడు భయపడిన వృత్తాంతం ప్రస్తుతం అయినందువల్ల, "ఆ యశోదపట్ల భయాన్ని కల్గి ఉండే విషయంలో ఇతనికి సాటి ఎవరూ లేనట్లుగా, ఇతనిపట్ల ప్రేమను కల్గి ఉండే విషయంలో ఈమెకు (యశోదకు) సాటి ఎవరూ లేరు'' అని అంటూ ఆమె గుణంలో అభినివిష్టు లవుతున్నారు.



**29. పేయ్చ్చిపాలుణ్డ పెరుమానై ప్పేర్న్దెడుత్తు**
**ఆయ్చ్చి ములై కొడుత్తాళఞ్జాతే- వాయ్త్త**
**ఇరుళార్ తిరుమేని యిన్బవళ చ్చెవ్వాయ్**
**తెరుళా మొழிయానై చ్చేర్న్దు**

పేయ్చ్చి = పిశాచి అయిన పూతనయొక్క, పాల్ = స్తన్యం, ఉణ్డ= ఆరగించిన, పెరుమానై = సర్వేశ్వరుడై, వాయ్త్త ఇరుళ్ ఆర్ తిరు మేని = దట్టమైన చీకటివంటి తిరుమేనిని కలవాడై, ఇన్ పవళమ్ శెమ్ వాయ్ = భోగ్యమైన పగడంవంటి పెదవిని కలవాడై, తెరుళా మొழிయానై = రూపు తెలియని, ముద్దు ముద్దు మాటలను పలికే చిన్నబిడ్డ అయిన శ్రీకృష్ణుని, శేర్న్దు = సమీపించి, ఆయ్చ్చి = యశోద, పేర్న్దు ఎడుత్తు = చేతులార కౌగలించుకొని, ఎత్తుకొని, అఞ్జాదే = కొంచెంకూడా భయపడకుండా, ములై కొడుత్తాళ్ = తన స్తన్యాన్ని తాగడంకోసం ఇచ్చింది.

పూతన మరణించినపుడు అంతటి ఘోరదృశ్యాన్ని చూచిన తరువాత భయపడి మూర్ఛపోవలసి ఉండగా, కొంచెంకూడా భయపడకుండా, పూతన ఇచ్చిన విషమిశ్రితక్షీరానికి విరుగుడుగా యశోదాదేవి తన స్తన్యాన్ని ఇచ్చింది. అందులోను, కుడిచేయి ఏదో, ఎడమచేయి ఏదో తెలియని గోపకులంలో పుట్టిన యశోదకదా ఈ పని చేసింది. ఈమెకు ఇతనివల్ల ఉండే వాత్సల్యమే కదా! ఈమెను ఇటువంటి పనిని చేసేటట్లుగా చేసినది - ఇటువంటి వాత్సల్యం కూడా ఒకటి ఉంటుందా! అని ఆழ்వార్లు ఆశ్చర్యపడుతున్నారు.

అవ :- "భగవానుడు యశోదకు ఆవిధంగా సులభుడై ఉన్నందువల్ల ఆమె అతనిపట్ల ఆ రీతిలో ప్రేమను కల్గి ఉన్నది. కాని, మనకతడు అంత సులభుడుగా లేడే!'' - అనే ప్రశ్న తల ఎత్తగా, అంతకంటే సులభుడై ఉన్న సందర్భాలను కొన్నిటిని ఇందులో ఆழ்వార్లు ప్రస్తావిస్తున్నారు.

**30. శేర్న్ద తిరుమాల్ కడల్ కుడన్దై వేఙ్గడమ్**
**నేర్న్ద వెన్ శిన్దై నిఱైవిశుమ్బు- వాయ్న్ద**
**మఱైపాడక మనన్దన్ వణ్డుழாయ్ క్కణ్ణి**
**ఇఱైపాడియాయ వివై**

కడల్ = పాలకడలి, కుడన్దై = తిరుక్కుడన్దై అనే దివ్యదేశం, వేఙ్గడమ్ = శ్రీవేంకటాద్రి, నేర్న్ద ఎన్ శిన్దై = (వీటి అన్నిటికంటే అతనికి ఆదరణీయంగా) లభించిన నా మనస్సు, నిఱై విశుమ్బుమ్ = అన్నివిధాల పరిపూర్ణతను కల పరమపదం, వాయ్న్ద మఱై = (అపౌరుషేయం కనుకనే భ్రమ విప్రలంభాది దోషరాహిత్యాన్ని కల్గి ఉండడమనే) అతిశయాన్ని కల వేదం, పాడకమ్ = తిరుప్పాడకమ్ అనే దివ్యదేశం, అనన్దన్ = ఆదిశేషుడు, ఆయ ఇవై = అనే ఇవి అన్నీ, వణ్ తుழாయ్ కణ్ణి = అందమైన తులసీ మాలను అలంకరించుకొనే, తిరు మాల్ శేర్న్ద = శ్రీమన్నారాయణుడు ఆదరంతో, అభిమానంతో పొందికగా వేంచేసి ఉండే, ఇఱై పాడి = రాజధానులు.

అందమైన తులసీమాలచే అలంకరింపబడ్డవాడై, దానివల్లనే తాను సర్వస్వామి అనే విషయం ప్రకటింపబడ్డవాడైన శ్రియఃపతి ఎంతో ఆదరంతో చేరి నివసించే రాజధానులు ఇవి - అని భావం. ఈ విధంగా భగవానుడు సులభుడై, నివసించే చోట్లను తెలిపినట్లయింది.

అవ :- "ఈ ప్రదేశాలకు వచ్చి నిలచి ఉన్నవాడు భక్తుల విరోధులను పోగొట్టేవాడై, దురహంకారాన్ని కల్గినవారితో సైతం ఏ తేడా లేకుండా ఒకే నీరుగా (నీరు నీటితో కలసినట్లు) కలిసే సౌశీల్యగుణాన్ని కల్గినవాడు కదా! - అని ఇందులో అంటున్నారు.

31. ఇవైయవన్ కోయిల్ ఇరణియనతాకమ్
ఆవై శెయ్తరియురువ మానాన్ - శెవి తెరియా
నాకత్తాన్ నాల్వేదత్తుళ్ళాన్ నఱవేఱ్ఱ్
పాకత్తాన్ పాఱ్కడలుళాన్

ఇరణియనదు = హిరణ్యకశిపుని, ఆకమ్ = వక్షఃస్థలాన్ని, అవై శెయ్దు = భిన్నం చేయడంకోసం, అరి ఉరువమ్ ఆనాన్ = నృసింహరూపిగా అవతరించిన వాడు, శెవి తెరియా నాకత్తాన్ = "చక్షుఃశ్రవః" అనే నామాన్ని కల్గి ఉండడంవల్ల చక్షురింద్రియంతో శ్రోత్రేంద్రియకార్యాన్ని కూడా నిర్వహించగల్గినవాడు కనుక, చెవిద్వారా ఏర్పడే జ్ఞానం లేనివాడైన ఆదిశేషుని తిరుమేనిలో పరుండి ఉన్నవాడు,



నఱవు ఏఱ్ఱ్ పాకత్తాన్ = తేనెవంటి తీయని గంగను ధరించిన రుద్రుని తన తిరుమేనిలోని ఒక భాగంలో కల్గినవాడు, పాఱ్కడలుళాన్ = క్షీరాబ్ధిలో పరుండి ఉన్నవాడైన, అవన్ = ఆ స్వామియొక్క, కోయిల్ ఇవై = నివాసాలు ముందు పాశురంలో చెప్పబడ్డ దివ్యస్థలాలు.

క్షుద్రప్రయోజనాలను పొందడంకోసం అయినా దేవతలు తన వద్దకు రాకుండా పోతారో! అని ఎదురు తెన్నులు చూస్తూ, వారి పిలుపులను వినే చోటు అయిన క్షీరాబ్ధిలో శయనించి ఉండేవాడు. ఇన్నిచోట్లలో ఇంతటి శీలగుణాన్ని కలవాడై భగవానుడు మనకోసం ఆదరంతో ఉన్నపుడు ఓ మనసా ! నీవు అతనిని విడచి పోవచ్చునా?- అని భావం.

అవ :- పూర్వం ప్రస్తావించిన దేశాలు మాత్రమేనా ? గొప్ప సౌశీల్యగుణాన్ని కలవాడై, అతడు వేంచేసి ఉండే దేశాలకు ఒక అంతు లేదు కదా ! అని ఇందులో అంటున్నారు.

32. పాఱ్కడలుమ్ వేఙ్గడముమ్ పామ్బుమ్ పని విశుమ్బుమ్
నూఱ్కడలుమ్ నుణ్ణూల తామరైమేల్- పాఱ్ప
ట్టిరున్దార్ మనముమ్ ఇడమాక క్కొణ్డాన్
కురున్దొశిత్త కోపాలకన్

కురున్దు = అసురావిష్టం అయిన బండి గురివింద చెట్టును, ఒశిత్త = విఱిచిన, కోపాలకన్ = గోవుల మందను కాచే (విరోధినిరాసాన్ని చేయడం స్వభావంగా కల) శ్రీకృష్ణుడు, పాల్ కడలుమ్ = భక్తుల ప్రార్థనలను వినే చోటు అయిన క్షీరాబ్ధిని, వేఙ్గడముమ్ = **"కానముమ్ వానరముమ్ వేడుముడై వేఙ్గడమ్"** అని కీర్తింపబడ్డ వేంకటాచలాన్ని, పామ్బుమ్ = **"శెన్ఱాల్ కుడైయామ్"** అనే రీతిలో సర్వవిధకైంకర్యాలను చేసే ఆదిశేషుడు, పని విశుమ్బుమ్ = (సంసారంలో ఉండే తాపత్రయాలు ఏవీ లేనందువల్ల) చల్లని మంచువంటి శీతలస్వభావాన్ని కల భోగ్యమైన పరమపదాన్ని, నూల్ కడలుమ్ = శ్రుతి-స్మృతి- ఇతిహాస -పురాణాలనే సముద్రంవంటి అంతులేని శాస్త్రాలను, నుణ్ నూల్ తామరైమేల్ పాల్ పట్టిరున్దార్ మనముమ్ = సూక్ష్మం అయిన ఆ శాస్త్రాలలో **"పద్మకోశప్రతీకాశగ్ం హృదయం**

**చాప్యధోముఖమ్"** ఇత్యాదిగా చెప్పబడే హృదయమనే తామరపూవులో తమ సకలేంద్రియాలు అభినివేశాన్ని పొందేటట్లు యోగసమాధిలో స్థిరంగా కల్గి ఉండే పరమయోగుల మనస్సును, **ఇడమ్ ఆక కొణ్డాన్** = తన నివాసదేశాలుగా పరిగ్రహించాడు.

ఇన్ని చోట్లలో తనను భక్తులకు పరతంత్రునిగా చేసికొని అతడు వేంచేసి ఉన్నపుడు అతని సౌలభ్యంలో సందేహపడే అవకాశ లేశం ఏమాత్రం లేదు.

అవ :- "భగవానుడు భక్తసులభుడు అయితే కావచ్చు, మనం పొందాలని కోరుకొన్న ఫలాలను మనకు అనుగ్రహిస్తాడా!" - అని అంటే, "మనం మన హితాన్ని కోరుకొనని కాలంలోకూడా మనకు హితాన్ని చేసేవాడై, నీచమైన ఫలాలను ఆశించేవారికి సైతం తన దేహాన్ని శ్రమపెట్టుకొని, వారి కార్యాన్ని సాధించి, వారి అతడు కోటికలను అన్నిటినీ అనుగ్రహించేవాడై కదా ఉన్నాడు"- అని అంటున్నారు.

**33.** **పాలకనాయ్ ఆలిలైమేల్ పైయ ఉలకెల్లామ్**
**మేలొరునాళుణ్డవనే మెయ్మ్మైయే- మాలవనే**
**మన్దరత్తాల్ మానీర్క్కడల్ కడైన్దు వానముతమ్**
**అన్దరత్తార్క్కీన్దాయ్ నీ యన్ఱు**

మేల్ ఒరు నాళ్ = మన రక్షణను మనం కోరుకోని పూర్వం ఒకానొక సమయంలో, పాలకన్ ఆయ్ = చిన్న శిశురూపాన్ని కలవాడై, ఆల్ ఇలై మేల్ = అపుడే విరిసిన చిన్న మఱ్ఱి చిగురుటాకుపై, ఉలకు ఎల్లామ్ = ఏ వస్తువు చెదఱిపోకుండా లోకాలను అన్నిటినీ, పైయ = ఆ విధంగా లోపలకు గ్రసించే సమయంలో ఏ వస్తువుకు బాధ, సంకోచం కలుగకుండా ఉండే రీతిలో మెల్లగా, మెయ్మ్మైయే = ఇంద్రజాలాన్ని చేసేవాని కార్యంవలె అసత్యప్రదర్శన కాకుండా, నిజంగానే, ఉణ్డవనే =లోకాలను అన్నిటినీ నీ చిన్నబొజ్జలో ఉంచుకొన్నవాడా!, మాలవనే = (ఈ ఘటితఘటనా సామర్థ్యంతో నీ గొప్పతనం వ్యక్తం అయే టట్లుండే) సర్వాధికుడా!, నీ = ఇటువంటి శక్తిని కల నీవు, అన్ఱు = (దేవతలు అమృతాన్ని సాధించి ఇవ్వాలని నిన్ను ప్రార్థించిన) ఆ సమయంలో, మన్దరత్తాల్= మందరపర్వతంతో (కవ్వంగా చేసికొని), మా నీర్ కడైన్దు = గొప్ప నీటిని కల సముద్రాన్ని చిలికి, వాన్ అముదమ్ = గొప్పదైన అమృతాన్ని, అన్దరత్తార్క్కు= ఆకాశంలో ఉండే దేవతలకు, ఈన్దాయ్ = ఇచ్చావు.

ఇటువంటివాడు అనన్య ప్రయోజనులమైన మన మనోరథాలను తప్పక తీరుస్తాడని భావం.

అవ :- ఈ విధంగా తన సత్తాస్థితి ప్రవృత్తులను అన్నిటినీ తన భక్తుల కోసమై వారి వశం చేసికొనేటపుడు, అతనిపట్ల భక్తిని కల్గి ఉండి, అతనిని దర్శించాలనే ఆశను కల్గి ఉండవద్దా ! - అని ఇందులో తమ మనస్సును ఉద్దేశించి ఆళ్వార్లు అంటున్నారు.

**34.** **అన్ఱివ్వులకమ్ అళన్ద వశైవేకొల్**
**నిన్ఱిరున్దు వేళుక్కై నీణకర్ వాయ్-అన్ఱు**
**కిడన్దానై క్కేడిల్ శీరానై మున్కఞ్జై**
**క్కడన్దానై నెఞ్జమే ! కాణ్**

నెఞ్జమే = ఓ మనసా !, అన్ఱు = మనం అపేక్షించని ఆ సమయంలోనే, నిన్ఱు = నిలచి, ఇవ్వులకమ్ = ఈ లోకాలను అన్నిటినీ, అళన్ద = తన శ్రీచరణంతో కొలిచినందువల్ల కల్గిన, అశైవే కొల్= శ్రమంవల్ల కాబోలు!, వేళుక్కై = తిరువేళుక్కై అనే దివ్యదేశంలో, ఇరున్దు = వేంచేసి ఉండి, నీళ్ నకర్ వాయ్ = **"తిరువెంఃకా"** అనే గొప్ప దివ్యదేశంలో, అన్ఱు = అపుడు ఒకానొక సమయంలో, కిడన్దానై =పరుండి ఉన్నవాడై, కేడు ఇల్ శీరానై = ఏనాడూ నాశం లేనివి, ఏదోషం లేనివి అయిన అనంతకల్యాణ గుణాలను కలవాడై, మున్ = పూర్వం ఒకానొక సమయంలో, కఞ్జై = తనను పలు విధాలుగా చంపాలని ప్రయత్నించిన, దుర్బుద్ధి అయిన కంసుని, కడన్దానై = సంహరించినవాడైన స్వామిని, కాణ్ = అనుసంధించాలని చూడు.

అవ :- గడచిన పాశురంలో **"నెఞ్జమే కాణ్ !"** అని తమ మనస్సును ఉపదేశించి, వీరు మౌనంగా ఉండడానికి ముందే మనస్సుకు వశం అయిన కళ్ళు మొదలైన బాహ్యేంద్రియాలుకూడా తామే ముందడుగు వేసి, వాటికి

నియామకులైన తమను కూడా నియమిస్తూ, భగవద్విషయంలో అత్యంతం అభినివేశాన్ని పొందిన రీతిని చూచి ఆ*ళ్వా*ర్లు ఆశ్చర్యపడుతున్నారు.

**35.** కాణ్ కాణెన విరుమ్బుమ్ కణ్గళ్ కతిరిలకు
పూణ్డారకత్తాన్ పొన్మేని-పాణ్ కణ్
తొకిల్ పాడి వణ్డఱైయుమ్ తొఙ్గలాన్ శెమ్బొ
ఱ్క*ళ*ల్ పాడి యామ్ తొ*ళు*తుమ్ కై

కణ్గళ్ = నా వశంలో ఉండవలసిన నా నేత్రాలు, (నాకంటే ముందంజ వేసి చేతనసమాధితో భగవానుని దర్శించాలి ! దర్శించాలి ! అనే ఆశతో), కదిర్ ఇలకు = ప్రకాశాన్ని విరజిమ్ముతూ, పూణ్ = ఆభరణాలను, తార్ = వైజయంతీ వనమాలను కల, అకలత్తాన్ = వక్షఃస్థలంలో కల్గిన, పొన్ మేని = బంగారు వలె ఆశపడదగినట్లుగా, ఆకర్షణీయంగా ఉండే (భగవానుని) తిరుమేనిని, కాణ్ కాణ్ ఎన విరుమ్బుమ్ = దర్శించు! దర్శించు! అని అభినివేశాన్ని పొందుతున్నాయి, వణ్డు= తుమ్మెదలు, అఱైయుమ్ = ధ్వనించే, తొఙ్గలాన్ = మాలను కల ఆస్వామియొక్క, తొ*ళి*ల్ = అతిమానుష లీలలతోను, పాణ్ కణ్ పాడి = రాగంలో మేళవించి పాడి, శెమ్ పొన్ క*ళ*ల్ = ఎఱ్ఱని బంగారంవంటి శ్రీచరణాలను, యామ్ = మేము, కై = చేతులతో, పాడి తొ*ళు*దుమ్ = కీర్తించి, నమస్కరిస్తాము.

నోరారా పాడి, చేతులారా నమస్కరిస్తాము. కంటికి, జిహ్వాకు ఎరను ఇచ్చినట్లుగానే, చేతులకు కూడా ఎరను ఇస్తాము - అనిభావం.

అవ :- గడచిన పాశురంలో "పాడాలి" అని ఆశపడిన రీతిలోనే అతని త్రివిక్రమావతారంలోని గొప్పతనాన్ని ఈ పాశురంలో పాడి ఆనందిస్తున్నారు.

**36.** కైయ కనలా*ళి* కార్క్కడల్ వాయ్ వెణ్శఙ్గమ్
వెయ్య కతై శార్ఙ్గమ్ వెఞ్జుడర్ వాళ్- శెయ్య
పడై పరవై పా*ళి* పనినీరులకమ్
అడి యళన్ద మాయరవర్క్కు



పని నీర్ ఉలకమ్ = చల్లని నీటిని కల సముద్రంచేత చుట్టబడి ఉండే భూమిని, అడి = తన చరణాలతో, అళన్ద = కొలిచిన, మాయర్ అవర్క్కు = ఆశ్చర్యచేష్టితుడైన ఆ స్వామికి, కైయ = శ్రీహస్తంలో ఉండే, కనల్ ఆ*ళి* = శత్రువులపై నిప్పును ఉమిసే సుదర్శనచక్రం, కార్ కడల్ వాయ్ వెణ్ శఙ్గమ్ = నల్లని వర్ణాన్ని కల సముద్రంలో పుట్టిన తెల్లని వర్ణాన్ని కల పాంచజన్యం అనే శంఖం, వెయ్య కతై = శత్రువులకు భీషణమైన కౌమోదకి అనే గద, (వెయ్య), శార్ఙ్గమ్ = శత్రువులకు తాపాన్ని కల్గించే శార్ఙ్గమనే విల్లు, వెమ్ శుడర్ వాళ్ = పదునును కల్గి ఉండడంవల్ల మెఱిసే నందకమనే ఖడ్గం- అనే, శెయ్య పడై = అందమైన దివ్యాయుధాలు, పరవై = క్షీరసముద్రం, పా*ళి* = శయ్య (ఈవిధంగా కూడా ఇంత అందమైన ఆయుధాలను కల్గి ఉన్నాడా! ఇటువంటి పడుకను కల్గి ఉన్నాడా! అని ఆశ్చర్యపడుతున్నారు- అని కూడా చెప్పవచ్చు.)

అవ :- ముప్పై అయిదవ పాశురంలో తాము ఆశపడిన రీతిలో భగవానుని కీర్తించడంతో ఆగకుండా ఆ*ళ్వా*ర్లు అంజలిని ఘటించడం మొదలైన శేషవృత్తులను (కైంకర్యాలను కూడా) చేయడం ప్రారంభించగానే, భగవానుడు కూడా తన గొప్పతనాన్ని గణించకుండా, తమ విషయంలో గొప్ప ఆదరాన్ని కలవాడై, పలు రూపాలను ధరించి, తమను అనుభవించడం ప్రారంభించాడు- అని ఈ పాశురంలో ఆ*ళ్వా*ర్లు అంటున్నారు. **"వారి క్కొణ్డు ఉన్నై వి*ళు*ఙ్గువన్ కాణిల్ ఎన్ఱు ఆర్వు*ఱ్ఱ* ఎన్నై యొ*ళి*య ఎన్నిల్ మున్నమ్ పారిత్తు త్తాన్ ఎన్నై ము*ఱ్ఱ* ప్పరుకినాన్"** (తిరువాయ్మొ*ళి*-9-6-10) అనే పాశురంలో నమ్మా*ళ్వా*ర్లకు కల్గిన అనుభవంవంటిదే - ఈ పాశురంలో పేయా*ళ్వా*ర్లకు కల్గిన అనుభవం.

**37.** అవఱ్కడిమై ప్పట్టేన్ అకత్తాన్ పుఱత్తాన్
ఉవర్క్కుమ్ కరుఙ్గడల్ నీరుళ్ళాన్- తువర్క్కుమ్
పవళవాయ్ ప్పూమకళుమ్ పన్మణి ప్పూణారమ్
తిక*ళు*మ్ తిరుమార్వన్తాన్

అవఱ్కు = వాఙ్మనస్సులకు అందని అటువంటి గొప్పతనాన్ని కల ఆ స్వామికి, అడిమై పట్టేన్ = అంజలిని చేయడం మొదలైన రీతులలో కైంకర్యం

చేయడం ప్రారంభించినవాడను అయ్యాను, ఉవర్క్కుమ్ కరుమ్ క్కడల్ నీర్ ఉళ్ళాన్ = (తరువాత) లవణపూర్ణం అయిన నల్లని సముద్రపు నీటిలో శయనించి ఉన్నవాడై, తువర్క్కుమ్ పవళమ్ వాయ్ పూ మకళుమ్ = ఎఱ్ఱని పగడంవంటి పెదవిని కల్గిన లక్ష్మీదేవి, పల్ మణి ప్పూణ్ = పలు రీతులలోని రత్నాలను కల ఆభరణాలను, ఆరమ్ = హారాలను, తికழுమ్ = ప్రకాశించే, తిరు మార్బన్ తాన్ = వక్షఃస్థలాన్ని కలవాడైన స్వామి, అకత్తాన్ పుఱత్తాన్ = నాలోపల, బయట అంతటా కలసి ఉన్నాడు.

ఎఱ్ఱని పగడం వంటి పెదవిని కల్గినదై, తామర పూవులోని సారం అంతా ఒక రూపాన్ని ధరించిందా? అనే రీతిలో తామరపూవులో వేంచేసి ఉండే లక్ష్మీదేవిని, పలువిధాల రత్నాలను కల ఆభరణాలను, హారాలను ప్రకాశించే వక్షస్సును కలవాడు కదా భగవానుడు. అతడు పాలసముద్రం అనే ఆ నివాసస్థానాన్ని అనుభోక్త్రిగా, అనుభావ్యగా ఉండే లక్ష్మీదేవిని, అనుభావ్యాలైన పలు రత్నాభరణాలను సైతం ఆశపడకుండా వాటిని కాదని, ఏ వైలక్షణ్యాన్ని లేని నన్ను విడువలేని రీతిలో ఆశపడి, పలురీతులను పరిగ్రహించి నాతో కలసి అనుభవిస్తున్నాడు - అని పూర్వార్ధంతో అన్వయించి అర్థాన్ని చెప్పవచ్చు. "తువర్క్కుమ్" అనే పదం భోగ్యతను తెలిపే పదం కాదు. "తువరాడై" అనేచోట వలె ఎఱ్ఱని రంగును తెల్పుతుంది. నల్లని సముద్రం మొదలైన నివాసస్థలాలను భగవానుడు కాలదన్ని నట్లుగా ఇక్కడ పాశురంలో శబ్దతః తెలుపబడక పోయినా, ఈ పాశురాన్ని వివరించే ఆழ்వార్లలో కొందఱు "అనన్దన్ పాలుమ్ కరుడన్ పాలుమ్, ఐదు నొయ్‌దాకవైత్తు ఎన్ మనన్దనుళ్ళే వన్దువైకి వాழ்చ్చెయ్‌దాయ్ ఎమ్బిరాన్", "పనిక్కడవిల్ పళ్ళికోళైప్పழக విట్టుఓడి వన్దెన్ మనక్కడవిల్ వాழ்వల్లమాయమణాళ నమ్బి", "వడతడముమ్ వైకున్దముమ్ మదిళ్ తువరా పదియుమ్, ఇడైవకైకళ్ ఇకழ்న్దిట్టెన్ పాల్ ఇడవకై కొణ్డనైయే" (పెరియాழ்వార్ తిరు-5-4-8, 9, 10), "కల్లుమ్ కనైకడలుమ్ వైకున్ద వానాడుమ్ పుల్లెన్ఱొழிన్దనకొల్ ఏ పావమ్! వెల్లనెడియాన్ తీఱుమ్ కరియాన్ ఉళ్ పుకున్దు నీఙ్గాన్ అడియేన దుళ్ళత్తమ్" (పెరియతిరు-68) అని పల్కినందున ఇక్కడ కూడా ఆవిధంగానే అర్థాన్ని గ్రహించాలి.



అవ :- ఈ విధంగా నాపట్ల గొప్ప అభినివేశంతో ఉండే స్వామి ఏ గొప్పతనం లేని సామాన్యుడు కాదు. తనతో ఏ సాటి మేటి లేని సర్వేశ్వరుడు సుమా! అని అంటున్నారు.

**38. తానే తనక్కువమన్ తన్నురువే యెవ్వురువుమ్**
**తానే తవ వురువుమ్ తారకైయుమ్- తానే**
**ఎరిశుడరుమ్మాల్ వరైయుమ్ ఎణ్డిశైయుమ్ అణ్డ**
**త్తిరు శుడరుమాయ విఱై**

ఎవ్వురువుమ్ = "యస్యాత్మా శరీరమ్", "యస్య పృథివీ శరీరమ్" అనేరీతిలో తనకంటే వేఱయిన చేతనాచేతనాలలో ఏ పదార్థం అయినా, తన్ ఉరువే = తనకు శరీరంగానే ఉంటుంది, తవమ్ ఉరువుమ్ = తపస్సుచేసి పుణ్య శరీరాలను పొందిన బ్రహ్మమొదలైన వారు, తారకైయుమ్ = నక్షత్రాలు, తానే = ఆ స్వామి రూపాలై ఉంటార. ('తాను' అనే శబ్దంలో అణగి ఉండే రీతిలో తనను విడచి ఉండని ప్రకారాలుగా వారుంటారు), ఎరి శుడరుమ్ = జ్వలించే స్వభావాన్ని కల అగ్ని, మాల్ వరైయుమ్ = గొప్ప కుల పర్వతాలు, ఎణ్ తిశైయుమ్ = ఎనిమిది దిక్కులు, అణ్డత్తు = బ్రహ్మాండం లోపల ఉండే, ఇరు శుడరుమ్ = సూర్యచంద్రులనే రెండు జ్యోతిస్సులు, తానే ఆయ్ ఇఱై = తనకు ప్రకారాలుగా కల్గిన స్వామి, తనక్కు తానే ఉవమన్ = వేఱొకరు సాటిలేనివాడు కావడంచేత తనకు తానే ఉపమానం.

ఇటువంటి గొప్పతనాన్ని ఇంకొకరు కల్గి ఉంటే కదా ఇతనికి వేఱొక ఉపమానం ఉంటుంది- అని భావం.

అవ :- ఈ రీతిలో లోకాలను అన్నిటినీ శరీరంగా కల సర్వేశ్వరుడు తిరుమలైలో వచ్చి నిలచి ఉండి మనకు సులభుడై, నా మనస్సును పొందిన తరువాత దానిని విడిచి పోలేనివాడైనాడు- అని ఆழ்వార్లు ఈ పాశురంలో అంటున్నారు.

**39. ఇఱైయాయ్ నిలనాకి యెణ్డిశైయుమ్ తానాయ్**
**మఱైయాయ్ మఱైప్పొరుళాయ్ వానాయ్- పిఱై వాయ్‌న్ద**

వెళ్ళుత్తరువి విళఙ్గొలి నీర్ వేఙ్గడత్తాన్
ఉళ్ళత్తినుళ్ళే యుళన్

ఇఱై ఆయ్ = సర్వస్వామిగా అందఱికీ నాయకుడై ఉన్నవాడు, నిలన్ ఆకి= భూమికి అంతర్యామియై, ఎణ్ తిశైయుమ్ తాన్ ఆయ్ = ఎనిమిది దిక్కులలో ఉండే అన్ని వస్తువులలో వ్యాపించి ఉండేవాడై, మఱై ఆయ్ = వేదాలకు ప్రవర్తకుడై (వేదార్థప్రతిపాద్యుడై), వాన్ ఆయ్ = నిత్యవిభూతి నిర్వాహకుడై, పిఱై వాయ్న్ద= (చంద్రమండల పర్యంతం ఉన్నతమై) చంద్రమండలాన్ని సమీపించినది, వెళ్ళమ్ అరువి విళఙ్గు = పుష్కలమైన నీటిని కల కొండవాగులతో ప్రకాశించేదై, ఒలి నీర్ = ధ్వనించే జలప్రదేశాలను కల, వేఙ్గడత్తాన్ = శ్రీవేంకటాచలంలో వేంచేసి ఉండే స్వామికి, ఉళ్ళత్తిన్ ఉళ్ళే ఉళన్ = నా మనస్సు లోపలనే ఉన్నాడు.

నా మనస్సును పొందిన తర్వాత "సర్వస్వామిగా, భూమ్యాదులకు అంతర్యామిగా ఉన్నది అంతా అసత్సమం". అనే రీతిలో నా మనస్సులో అత్యంతప్రావణ్యాన్ని కలవాడై స్థిరంగా నిలచి ఉన్నాడు- అని భావం.

అవ :- "ఓ మనసా! గడచిన పాశురంలో చెప్పిన రీతిలో సర్వస్వామిగా ఉండేవాడు మన వద్దకు వచ్చి ప్రవేశించిన తరువాత మనకు ఏం కొఱత ?" అని అంటూ ఇందులో తమ మనస్సును సంబోధిస్తూ ఆ*ழ*్వార్లు పల్కుతున్నారు.

40. ఉళన్ కణ్డాయ్ నన్నెఞ్జే ! ఉత్తమ నెన్జుమ్
ఉళన్ కణ్డాయ్ ఉళ్ళువారుళ్ళత్తు ఉళన్ కణ్డాయ్
విణ్ణొడుఙ్గ క్కోడుయరుమ్ వీఙ్గరువి వేఙ్గడత్తాన్
మణ్ణొడుఙ్గత్తానళన్ద మణ్

నల్ నెఞ్జే = ("భగవానుడు ఉన్నాడు" అని అంటే కాదనకుండా ఉన్నాడని అంగీకరించి, అతని సత్తను కల్గిన దానినిగా చేసిన) ఓ మంచి మనసా!, విణ్ ఒడుఙ్గ = పైలోకాలు అన్నీ ఒక మూలలో ఒదిగి ఉండేటట్లు, కోడు = శిఖరాలను, ఉయరుమ్ = ఉన్నతంగా కల్గినది, వీఙ్గు అరువి = నిండు నీటితో ఉండే కొండవాగులను కల్గినది అయిన, వేఙ్గడత్తాన్ = వేంకటాచలంలో వేంచేసి ఉండేవాడు, మణ్ = భూమి విస్తీర్ణాన్ని అంతటిని, ఒడుఙ్గ = (తన శ్రీపాదంలోని



ఒక మూలలో) ఒదిగి ఉండేటట్లు, తాన్ అళన్ద = తాను కొలిచినవాడైన, మన్ = రాజు, ఉళన్ కణ్డాయ్ = (మనలను రక్షించినందువల్ల) సత్తను పొంది ఉన్నాడు సుమా!, ఉత్తమన్ = పురుషోత్తముడైన ఆ స్వామి, ఎన్జుమ్ ఉళన్ కణ్డాయ్ = అన్ని కాలాలలోను (మనలను రక్షించడంలో బద్ధదీక్షను కలవాడై) ఉన్నాడుసుమా!, ఉళ్ళువార్ ఉళ్ళత్తు = తలచేవారి హృదయంలో, ఉళన్ కణ్డాయ్ = నిత్యవాసం చేస్తున్నాడు సుమా!,

ఇక్కడ స్వామి భూమిని ఒక పాదంతో కొలిచినట్లు చెప్పడం పై లోకాలను వేఱొక శ్రీపాదంతో కొలిచినదానికి కూడా ఉపలక్షణం. పై లోకాలను, క్రింది లోకాలను కొలువడంవంటి అతిమానుష లీలలను చేయడం అంతా నేను అనుకూలుడుగా లేని సమయంలోకూడా నన్ను పొందడం కోసం ప్రయత్నించడమే - అని ఆ*ழ*్వార్ల భావం. అందువల్ల పడరాని పాట్లను పడి, మనకు తనపట్ల అప్రతిషేధాన్ని కల్గించి, మన మనస్సులో స్వామి ప్రవేశించి నిలచిన తర్వాత మనకేమి కొఱత- అని తమ మనస్సుతో అంటున్నారని భావం. ఇంద్రుడు తాను కోల్పోయిన లోకాలను ఇతనిద్వారా పొందడంవల్ల, మహాబలిదగ్గరనుండి కొల్లగొట్టి ఇతడు ఇంద్రునకు లోకాలను ఇవ్వడంవల్ల, వారంతా లోకాలను సొత్తుగా కల స్వామి పదవాచ్యులుకారని, ఇతడే సర్వస్వామి అని స్ఫురిస్తున్నది)

అవ :- "మణ్ణొడుఙ్గ త్తాన్ అళన్ద మణ్" అని అంటూ త్రివిక్రమావతారంలోని అతిమానుషలీలను ప్రస్తావం చేయగానే, అందులోనే ఆ*ழ*్వార్ల మనస్సు అభినివేశాన్ని పొంది, ఆ లీలనుగూర్చి విస్తృతంగా పల్కుతూ ఇందులో ఆనందిస్తున్నారు. ముదలా*ழ*్వార్లు పరత్వపరం అయిన వేదంవలె పరత్వంలోను, పరత్వంలో సాటి వచ్చే త్రివిక్రమావతారం లోను చాలా అభినివేశాన్ని కలవారుకదా!

41. మన్ను మణిముడి నీణ్డు అణ్డమ్ పోయెణ్డిశైయుమ్
తున్ను పొ*ழ*ిలనైత్తుమ్ శూ*ழ*్క*ழ*లే- మిన్నై
ఉడైయాక క్కొణ్డు అన్జులకళన్దాన్ కున్జమ్
కుడైయాక ఆకాత్త కో

కున్ఱమ్ కుడై ఆక = గోవర్ధనపర్వతాన్ని గొడుగుగా గ్రహించి, ఆ కాత్త కో= ఆవులను కాచిన స్వామి, అన్ఱు = అపుడు- పూర్వం ఒకానొక సమయంలో, మన్ను మణి ముడి = రత్నాలను కల్గినది, ఉభయవిభూతినాయకత్వానికి తగినది, పొందికగా ఉండేదైన కిరీటం, నీణ్డు = ఉన్నతంగా పెరిగి, అణ్డమ్ పోయ్ = బ్రహ్మాండకటాహభిత్తిని చేరి తాకగా, ఎణ్ తిశైయుమ్ = ఎనిమిది దిక్కులను, తున్ను పొ*ళ*ిల్ అనైత్తుమ్ = జీవులు నిబిడంగా ఉండే భూమండలం అంతా, శూ*ళ్* = వ్యాపించిన, క*ళ*లే = శ్రీపాదమే అయేటట్లు, మిన్నై ఉడై ఆక కొణ్డు ఉలకు అళన్దాన్ = మేఘమండలాన్ని దాటి పెరగడంవల్ల మెఱపును పీతాంబరంగా అలంకరించుకొని మహాబలి దానోదకాన్ని ఇవ్వగా లోకాలను కొలిచాడు.

మహాబలివల్ల ఇంద్రునకు ఆపద కల్గినపుడు ఆ మహాబలి దగ్గరనుండి లోకాలను గ్రహించి, కొలిచి, ఇంద్రునకు ఇచ్చి, అతని మనోరథపూర్తిని చేసినవాడు, ఆ ఇంద్రునివల్లనే పశువులకు ఆపద కల్గినపుడు చేతికి దొరికిన ఒక కొండను గొడుగుగా చేసి, ఇంద్రుడు కురిపించిన శిలావర్షాన్ని అడ్డుకొని, పశువులను కాచిన స్వామి.

అవ :- తనది కాని లోకాన్ని తనదిగా అభిమానించిన మహాబలిదగ్గర నుండి లోకాలను తిరిగి సంపాదించి, ఇంద్రుని రక్షించిన వృత్తాంతాన్ని గత పాశురంలో ప్రస్తావించారు. ఇందులో, రేపల్లె అనే ఊరికి ఏర్పడిన విరోధులను పోగొట్టి రక్షించిన వృత్తాంతాన్ని, ఒక భక్తునకు అతని తండ్రే విరోధి అయినపుడు ఆ విరోధిని నిరసించి, రక్షించిన వృత్తాంతాన్ని ప్రస్తావిస్తూ ఆనందిస్తున్నారు. లోకానికి మొత్తానికి కానీ, ఒక ఊరుకు మాత్రం కానీ, ఒక వ్యక్తికి కానీ - ఎవరికైనా సరే ఆపదవస్తే రక్షించగల్గినవాడితడే- అని భావం.

**42. కోవలనాయ్ అనిరైకళ్ మేయ్త్తు క్కు*ళ*లూతి**
**మావలనాయ్ క్కీణ్డ మణివణ్ణన్ - మేవి**
**అరియురువ మాకి ఇరణియనతాకమ్**
**తెరి యుకిరాల్ కీణ్డాన్ శినమ్**

కోవలన్ ఆయ్ = (రేపల్లెను రక్షించడం కోసం) గోపాలుడై అవతరించి, ఆ నిరైకళ్ = గోవులమందను, మేయ్త్తు =గడ్డి నీరు ఉండే చోట్లకు తోలుకొనిపోయి) మేపి, కు*ళ*ల్ ఊది = (పశువులను ఒక చోటుకు చేర్చడంకోసం) పిల్లనగ్రోవిని ఊది, మా = అశ్వరూపాన్ని ధరించి, తనను బాధించడానికై వచ్చిన కేశి అనే అసురుని, వలన్ ఆయ్ కీణ్డ = సమర్థుడై, అతని నోటిని చీల్చినవాడు, మణి వణ్ణన్ = ఈవిధంగా విరోధినిరసనం చేయడంవల్ల కల్గిన ఆనందంచేత నీలరత్నంవలె చల్లని, నల్లని వర్ణాన్ని కల రూపసౌందర్యాన్ని కలవాడు, మేవి అరి ఉరువమ్ ఆకి = పొందికగా ఉండే నృసింహరూపాన్ని కలవాడై, ఇరణియనదు ఆకమ్ = హిరణ్యకశిపుని కఠినమైన వక్షస్సును, ఉకిరాల్ =నఖాలతో, కీణ్డాన్ = చీల్చినవాడైన భగవానునియొక్క, శినమ్ = కోపాన్ని, తెరి = (ఓ మనసా !) తెలిసికో.



మహాబలిపట్ల, కేశిపట్ల చూపించని కోపాన్ని భగవదపచారాధిక్యంచేత హిరణ్యునిపట్ల స్వామి పొందాడు. ఆ కోపమే మనకు రక్ష- అని భావం. "కొణ్డ శీ*ఱ్ఱ* మొన్ఱుణ్డుళతఱిత్తు ఉన్నడియనేనుమ్ వన్దు అడియిణై అడైన్దేన్" (పెరియతిరు- 5-8-3) అని కదా తిరుమఙ్గై ఆ*ళ్*వార్ల సూక్తి.

అవ :- గత పాశురంలో పల్కిన రీతిలోనే "తన భక్తులను రక్షించడం మాత్రమే కాకుండా, తన సంకల్పంతో లోకాలను అన్నిటినీ రక్షించేవాడితడే"- అని ఇందులో అంటున్నారు.

**43. శినమా మతకళి*ఱ్ఱి*న్ తిణ్మరుప్పై చ్చాయ్త్తు**
**పునమేయ పూమి యతనై- తనమాక**
**ప్పేరలకత్తుళ్ళొడుక్కుమ్ పేరార మార్వనార్**
**ఓరకలతుళ్ళ తులకు**

శినమ్ మా మతమ్ = చాలా గొప్ప కోపాన్ని, తగిన రూపాన్ని కల్గినదై, మదం కల్గించడంవల్ల దారిలో కన్పించినదానిని అంతా చంపే, కళి*ఱ్ఱి*న్ = కువలయాపీడం అనే కంసుని ఏనుగుయొక్క, తిణ్ మరుప్పై = బలిష్ఠమైన దంతాలను, శాయ్త్తు = అరటిబోదెలను విఱిచినట్లు అనాయాసంగా విఱిచి, పునమ్ మేయ = చక్కని క్షేత్రాలతో కూడిన, పూమి అతనై = భూమిని, తనమ్ ఆక = నిధిగా తలచి, పేర్ ఆకత్తుళ్ ఒడుక్కుమ్ = విస్తృతిని కల్గిన ఉదరంలో

అణచి, రక్షించినవాడు, పేర్ ఆరమ్ మార్వనార్ = గొప్ప గొప్ప హారాలను అలంకరించుకొన్న వక్షఃస్థలాన్ని కలవాడైన భగవానునియొక్క, ఓర్ అకలత్తు = సంకల్పరూపం అయిన జ్ఞానంయొక్క ఒక భాగంలో, ఉలకు ఉళ్ళతు= లోకం అంతా నిలచి ఉన్నది.

లేక, అటువంటి భగవానుని సాటి లేని, అంతు లేని సంకల్పరూపజ్ఞానంతో లోకం సత్తను పొందుతున్నది-అని, లేక, **'అకలమ్'** అనే దానికి హృదయమనే అర్థాన్ని చెప్పి, దానిద్వారా హృదయంనుండి పుట్టే సంకల్పరూపజ్ఞానం లక్షింపబడుతున్నదని కూడా చెప్పవచ్చు.

అవ :- "ఓ మనసా! ఉభయవిభూతిని కలవాడైన సర్వేశ్వరుని శ్రీచరణాలను ఆశ్రయించాలని చూడు"- అని ఇందులో ఆழ்వార్లు అంటున్నారు.

**44. ఉలకము మూழிయు మాழிయుమ్ ఒణ్ కేழ்**
**అలర్ కతిరుమ్ శెన్దీయు మావాన్- పల కతిర్కళ్**
**పారిత్త పైమ్బొన్ ముడియా నడియిణైక్కే**
**పూరిత్తెన్ నెఞ్జే ! పురి**

ఎన్ నెఞ్జే = ఓ నా మనసా !, ఉలకముమ్ = అన్ని లోకాలు, ఊழிయుమ్= ప్రళయకాలం, ఆழிయుమ్ = సముద్రాలు, ఒణ్ కేழ் అలర్ కతిరుమ్ = అందమైన వర్ణం, వికసించే కిరణాలు, ఆవాన్ = అనే ఈ వస్తువులు అన్నీ తనకు ప్రకారాలుగా అయేటట్లు ఉన్నవాడు, పల కదిర్కళ్ పారిత్త = పలు కిరణాలు వెలువరిస్తున్న, పై పొన్ ముడియాన్ = అందమైన బంగారు కిరీటాన్ని కలవాడైన భగవానుని, అడి ఇణైక్కే = శ్రీపాదపద్మయుగ్మాన్ని, పూరిత్తు పురి = పరిపూర్ణం అయిన ఆభిముఖ్యాన్ని కల్గినదానివై ఆశ్రయించు.

భగవానుని కిరీటం మొదలైనవి ఎంత ఉన్నతమైనవి అయినా, వాటిపట్ల దృష్టిని పెట్టకుండా, నీ స్వరూపానికి తగినట్లుగా చంటిబిడ్డ తల్లిస్తన్యాన్ని ఆశపడినట్లుగా, స్వామి శ్రీచరణాలనే ఆశపడి ఆశ్రయించు.

అవ :- "ఈ విధంగా ఉభయవిభూతులను కలవాడనే గొప్పతనాన్ని కలవాడై **"పల కతిర్కళ్ పారిత్త పైమ్బొన్ ముడియాన్"** అనే రీతిలో పరమపదాన్ని తగిన



నివాసస్థానంగా కల్గి, పట్టాభిషిక్తుడైనవాడు చాలా తక్కువవారమైన మనకు సులభుడు అవుతాడా?" - అని అంటే, మన కోసమేకదా తిరుమలకు వచ్చి, ఆశ్రయించడానికి సులభుడు అయ్యాడు- అని ఇందులో అంటున్నారు.

**45. పురిన్దు మతవేழம్ మాప్పిడియోడూడి**
**తిరిన్దు శినత్తాల్ పొరుతు - విరిన్ద శీర్**
**వెణ్కోట్టు ముత్తుతిర్క్కుమ్ వేఙ్గడమే మేలొరునాళ్**
**మణ్ కోట్టు క్కొణ్డాన్ మలై**

మతమ్ వేழమ్ = (తిరుమలైలో) మదించిన ఒక ఏనుగు, మా పిడి యోడు= చక్కని తన పెంటి ఏనుగుతో, పురిన్దు = సంగమించి, ఊడి = ఆ తరువాత ప్రణయకలహం ఆడి, తిరిన్దు = (దానివల్ల పెంటి ఏనుగు దానిని తఱుమగా) ఇక్కడ అక్కడా సంచరించి, శినత్తాల్ పొరుతు = కోపంవల్ల మణిశిలాఫలకాలపై తన తొండంతో మోదగా, విరిన్ద శీర్ = వీరలక్ష్మిని కల ఆ ఏనుగుయొక్క, వెణ్ కోడు = తెల్లని దంతాలనుండి, ముత్తు = ముత్యాలు, ఉదిర్క్కుమ్ = బయటకు చిందే, వేఙ్గడమే = తిరుమలైయే, మేల్ ఒరు నాళ్ = పూర్వం ఒకానొక సమయంలో, (వరాహరూపియై), మణ్ = భూమిని, కోడు = తన కోఱదంతం పై, కొణ్డాన్ = ఎత్తికొని వచ్చిన స్వామియొక్క, మలై =పర్వతం.

తిరుమలైలో శ్రీనివాసునిరూపంలో భగవానుడు అవతరించడానికి ముందు దానిని వరాహస్వామి తన నివాసంగా చేసికొన్న స్థానం అనే విషయం ప్రసిద్ధం కదా! ఆ వృత్తాంతం ఇందులో తెలుపబడింది. ఈ విధంగా మనకోసం తిరుమలైలో సులభుడై వేంచేసి ఉన్నపుడు మనం మనకోసం ప్రయత్నించవలసిన పని లేదు - అని భావం.

అవ :- ఈ రీతిలో తిరుమలైకు వచ్చి వేంచేసి ఉన్నవాడు, ఏదో ఒక ప్రయోజనాన్ని పొంది వెడలిపోవాలని తలచేవారికోసంకూడా తన శరీరాన్ని శ్రమించుకొని కార్యాన్ని సఫలం చేసి, ఫలాన్ని అనుగ్రహించేవాడుసుమా! - అని అంటున్నారు.

**46.** **మలై ముకడు మేల్ వైత్తు వాశుకియై చ్చుఱ్ఱి**
**తలైముకడు తానొరుకై పఱ్ఱి- అలైముక**
**ట్టణ్డమ్ పోయ్ నీర్ తెఱిప్ప అన్ఱు కడల్ కడైన్దాన్**
**పిణ్డమాయ్ నిన్ఱ పిరాన్**

పిణ్డమ్ ఆయ్ నిన్ఱ పిరాన్ = మట్టిముద్ద అనే పిండం, మట్టికుండ, బాన, చట్టి, ప్రమిద- మొదలైన వానికి ఉపాదానకారణంగా అయే రీతిలోనే, స్థూలంగా మనం చూచే అన్ని లోకాలకు ఉపాదాన కారణంగా ఉండే స్వామి, అన్ఱు = పూర్వం ఒకానొక సమయంలో, ముకడు మలై = శిఖరాలను కల మందర పర్వతాన్ని, మేల్ వైత్తు = (కూర్మరూపి యైన తన వీపుపై), పెట్టుకొని, వాశుకియై శుఱ్ఱి = దానికి వాసుకి అనే సర్పాన్ని, తాడుగా చుట్టి, తలై ముకడు= దాని ప్రధాన శిఖరాన్ని, తాన్ ఒరు కై పఱ్ఱి = తన ఒక చేతితో పట్టుకొని, అలై ముకట్టు నీర్ = అలలపై ఉండే తుంపురులు, అణ్డమ్ పోయ్ తెఱిప్ప = అండభిత్తిపై చేరి చిందే రీతిలో, కడల్ కడైన్దాన్ = సముద్రాన్ని చిలికాడు.

ఇందులో **"సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయమ్"** అనే ఛాందోగ్య శ్రుతిలో ప్రతిపాదింపబడ్డ సద్విద్య తెలుపబడింది. ఈ విధంగా భగవానుడు సకలజగత్కారణమై ఉన్నా, ప్రయోజనాంతపరులకు సైతం తన శరీరాన్ని శ్రమపెట్టుకొని కార్యాన్ని పూర్తి చేసేవాడు కనుక, అనన్యప్రయోజనులమై మన కార్యాన్ని తన కార్యంగా భావించి తప్పక చేస్తాడు- అని పాశుర భావం.

అవ :- "దేవతలకు కలిగే అనిష్టాలను పోగొట్టి, ఇష్టప్రాపణాన్ని చేసేటట్లే, మాకు కూడా అనిష్టనివారణాన్ని, ఇష్టప్రాపణాన్ని చేసేవాడవు నీవే"- అని స్వామిని సంబోధిస్తూ పల్కుతున్నారు.

**47.** **నిన్ఱ పెరుమానే! నీరేఱ్ఱు ఉలకెల్లామ్**
**శెన్ఱ పెరుమానే శెఙ్గణ్ణా ! అన్ఱు**
**తురకవాయ్ కీణ్డ తుఴాయ్ ముడియాయ్ నఙ్గళ్**
**నరకవాయ్ కీణ్డాయుమ్ నీ**



నీర్ ఏఱ్ఱు నిన్ఱ పెరుమానే = (నాల్గు చేతులతో నాల్గు పురుషార్థాలను ఇవ్వడంలో అలవాటుపడ్డ మహోదారమైన, దీర్ఘమైన శ్రీహస్తాలను కలవాడవైనా) మహాబలివద్ద దానజలం పరిగ్రహించి నిలచిన ఓ స్వామీ!, ఉలకు ఎల్లామ్ శెన్ఱ పెరుమానే = అన్ని లోకాలను కొలిచిన స్వామీ!, శెమ్ కణ్ణా = ఎఱ్ఱని తామరల వంటి కన్నులను కలవాడా!, అన్ఱు = పూర్వ ఒకసమయంలో, తురకమ్ = అశ్వరూపాన్ని పొంది, నిన్ను బాధించాలని వచ్చిన కేశి అనే అసురుని, వాయ్ = నోటిని, కీణ్డ = చీల్చిన, తుఴాయ్ ముడియాయ్ = తులసీమాలను అలంకరించు కొన్న కిరీటాన్ని కలవాడా !, నఙ్గళ్ = మాయొక్క, నరకమ్ వాయ్= సంసారనరక మార్గాన్ని, కీణ్డాయుమ్ నీ = చీల్చినవాడవుకూడా నీవేకదా!

ఇక్కడ **"నరకవాయ్ కీణ్డాయుమ్ నీ"** అని అంటూ పల్కడం అనిష్ట నివారణానికి, ఇష్టప్రాపణానికి కూడా ఉపలక్షణం. దేవతలకు, రేపల్లెలోని గోపాలురకు అనిష్టనివృత్తిని, ఇష్టప్రాప్తిని కల్గించినట్లే మాకుకూడా ఆ రెండిటిని చేస్తాడు- అని పాశుర సారార్థం.

అవ :- భగవానుడు లోకాలను కొలువడం మొదలైన లీలలను చేసినట్లు గడచిన పాశురంలో ఆఴ్వార్లు పల్కగానే, స్థూణానిఖననన్యాయంలో ఆఴ్వార్ల మనోభావాన్ని స్థిరంగా తెలిసికోదలచిన స్వామి "మీరు చెప్పేవిషయాలేవీ మాకు తెలియవే!'' అని అన్నాడు. అపుడు ఆఴ్వార్లు, "స్వామీ! ఆవిధంగా అయితే వీటిని, ఇంకా ఇంకా ఈ పలు చేష్టలను చేసినవారెవరు మఱి ? చెప్పు'' అని ఈ పాశురంలో చమత్కారంగా ప్రశ్నిస్తున్నారు.

**48.** **నీయన్ఱే నీరేఱ్ఱు ఉలక మడి యళన్దాయ్**
**నీయన్ఱే నిన్ఱు నిరై మేయ్త్తాయ్- నీయన్ఱే**
**మావా యురమ్ పిళన్దు మామరుతి నూడు పోయ్**
**తేవాశురమ్ పొరుతాయ్ శెఱ్ఱు**

నీర్ ఏఱ్ఱు = మహాబలిదగ్గరకు యాచకుడవై పోయి, దానజలాన్ని నీ శ్రీకరంలో గ్రహించి, ఉలకమ్ = లోకాలను, అడి అళన్దాయ్ నీ అన్ఱే = శ్రీచరణంతో కొలిచినవాడవు నీవే కదా!, నిన్ఱు = (శ్రీకృష్ణుడవై అవతరించి,

లేగదూడలను, గోవులను రక్షించడంలో) స్థిరంగా నిలచి, నిరై = (చేతిలో బెత్తాన్ని ధరించి) పశుసమూహాలను, మేయ్‌త్తాయ్ నీ అన్ఱే = (వాటి కడుపు నిండేటట్లుగా) మేపినవాడవు నీవేకదా!, మా = (అసురావేశాన్ని పొంది) అశ్వరూపాన్ని ధరించి నిన్ను మింగి వేయాలని వచ్చిన కేశి అనే అసురుని, వాయ్ ఉరమ్ = నోటి బలిమిని, పిళన్దు = చీల్చి, మా మరుతిన్ ఊడు పోయ్ = అసురులచే ఆవేశింపబడ్డ పెద్ద జంట మద్దిచెట్ల నడుమ అవి సమూలంగా కూలిపోయేటట్లు రోటిని ఈడ్చుకొంటూ దోగాడుతూ పోయి, దేవాశురమ్= దేవాసురుల సంగ్రామంలో, శెఱ్ఱు = దుష్టులైన అసురులను వధించి, పొరున్దాయ్ నీ అన్ఱే = యుద్ధాన్ని చేసినవాడవు నీవేకదా!

వీటిని అన్నిటినీ నీవు చేయక పోతే, మఱి ఎవరు చేశారు? అనే విషయాన్ని నీవే అనుగ్రహించాలి స్వామీ - అని భావం.

అవ :- "ఇంతమాత్రమేనా నీవు చేసినవి! భక్తులకోసం నీవు చేసిన లీలలు ఎన్నో ఉన్నాయి కదా!" అని ఇందులో ఆఴ్వార్లు అంటున్నారు.

**49. శెఱ్ఱతువుమ్ శేరా విరణియనై శెన్ఱేఱ్ఱు**
**పెఱ్ఱతువుమ్ మానిలమ్ పిన్నైక్కాయ్- ముఱ్ఱల్**
**మురియేఱ్ఱిన్ మున్నిన్ఱు మొయ్‌మ్బొఴిత్తాయ్ మూరి**
**చ్చురియేఴు శఙ్గినాయ్ శూఴ్‌న్దు**

పిన్నైక్కాయ్ = నప్పిన్నైప్పిరాట్టిని వివాహమాడడం కోసం, ముఱ్ఱల్ = బలిమిని కల్గినవై, మురి = (ఇక్కడకు అక్కడకు) పరుగెత్తే, ఏఱ్ఱిన్ = (ఏడు) ఎద్దుల, మున్ నిన్ఱు = ఎదరుగా (ఏజంకూ గొంకూ లేకుండా) నిలచి, శూఴ్‌న్ద= (వాటిని వధించే రీతిని) విచారించి, మొయ్‌మ్బు ఒఴిత్తాయ్ = (వాటి) బలాన్ని నశింపజేసినవాడా!, మూరి = పెద్దదిగాను, లోపల ఎక్కువ అవకాశాన్ని కల్గినది గాను, శురి ఏఴు = లోపల పురులను కల్గినదైన, శఙ్గినాయ్ = పాంచజన్యం అనే శంఖాన్ని చేతిలో శ్రీకరంలో ధరించినవాడా!, శేరా ఇరణియనై = నిన్ను ఆశ్రయించి ఉజ్జీవించలేనివాడు, నీ భక్తుడైన ప్రహ్లాదుని పట్ల సహనం లేనివాడైన, దుష్టుడైన హిరణ్యకశిపుని, శెఱ్ఱతువుమ్ = ఏజంకు లేకుండా సంహరించినది కూడా, నీ



అన్ఱే = నీవేకదా!, శెన్ఱు = (మహాబలి దగ్గరకు) పోయి, మా నిలమ్ = (అరుదైన దానంగా) విశాలమైన భూమి, ఏఱ్ఱు = యాచించి, పెఱ్ఱతువుమ్ (నీ అన్ఱే)= దానంగా పొందినదికూడా నీవే కదా!

"మూరి" అనే పదానికి సముద్రం అని అర్థం చెప్పి, సముద్రాన్ని జన్మ స్థానంగా కల శంఖం అయిన శ్రీపాంచజన్యం - అనే అర్థాన్ని ఇక్కడ గ్రహించవచ్చు. ఈ రీతిలో దాసుడైన ప్రహ్లాదుని కోసం హిరణ్యకశిపుని సంహరించి, ఇంద్రుని కోసం భూమిని యాచించి పొంది, నప్పిన్నై కోసం ఏడు ఎద్దులను వధించి, దేవతలకోసం పాంచజన్యాన్ని ఎత్తి ఊది -ఈవిధంగా నీవు చేసిన లీలలు అనేకం కదా! - అని తాత్పర్యం. గడచిన పాశురానికి ఈ పాశురం శేషం కనుక, "నీయన్ఱే" అనేపదాన్ని ఇక్కడకూడా అనువర్తింపజేసికోవాలి. పాంచ జన్యం లోపల గొప్ప అవకాశాన్ని (ఖాళీని) కల్గినది కనుక, అది వెలువరించే పెద్ద ధ్వనితో శత్రువులను నిర్జించావు - అనిభావం.

అవ :- ఈవిధంగా భగవానుని ఆశ్రితరక్షణం ప్రస్తావించగానే, పరమ భక్తులలో ఒకడైన శ్రీగజేంద్రాఴ్వాన్‌యొక్క విరోధిని పోగొట్టి అతనిని పక్షపాతంతో రక్షించిన రీతిని ఇందులో ఆఴ్వార్లు అనుసంధిస్తున్నారు.

**50. శూఴ్‌న్ద తుఴాయలఙ్గల్ శోతి మణిముడి మాల్**
**తాఴ్‌న్ద వరువి త్తడవరైవాయ్-ఆఴ్‌న్ద**
**మణినీర్‌చ్చునై వళర్‌న్ద మాముతలై కొన్ఱాన్**
**అణినీల వణ్ణత్తవన్**

శూఴ్‌న్దు = (శరీరంలోని అలంకారాలు అన్నిటిలో ప్రథమాలంకారంగా) చుట్టబడి ఉండే, తుఴాయ్ అలఙ్గల్ = తులసీమాలను కల్గినవాడై, శోది = ("ఇతడే పరమపురుషుడు" అనే సంగతిని వ్యక్తం చేసే గొప్ప) తేజస్సును కల, మణి ముడి= రత్నాలు పొదగబడ్డ కిరీటాన్ని ధరించినవాడై, అణి నీలమ్ వణ్ణత్తవన్= దర్శించగానే అన్ని తాపాలను హరంచేటట్లున్న, అందమైన, నీలవర్ణాన్ని కలవాడైన, మాల్ = సర్వేశ్వరుడు, తాఴ్‌న్ద తడ వరై నాయ్ =భూమివరకు పారే

కొండవాగులను, కొండ చరియలను కల్గిన పర్వతం నడుమన ఉండే, ఆழ్న్ద మణి నీర్ శునై = లోతైన, మణివలె స్వచ్ఛంగా అందమైన నీటిని కల సరస్సులో, వళర్న్ద = (భయం లేకుండా) వృద్ధి చెందిన, మా ముతలై = పెద్ద మొసలిని, కొన్ఱాన్ = వధించాడు.

"ఏనుగును కూడా మింగే బలాన్ని కల, వృద్ధి చెందిన ఒక అల్ప నీటి జంతువు" అని మొసలిని గూర్చి అనుకోకుండా, భక్తుడైన గజేంద్రుని విషయంలో చేసిన విషయంలో చేసిన అపచారాన్ని చూచి, గొప్ప కోపంతో దానిని వధించాడు- అని భావం. **"అణినీల వణ్ణత్తవన్"** అని అనే ప్రయోగానికి భక్తుల విరోధులను పోగొట్టడంవల్ల కల్గిన ఆనందంతో స్వామి తిరుమేని నీలమణివలె అందమైన ఉజ్జ్వలమైన వర్ణాన్ని పొందినది- అనికూడా భావాన్ని గ్రహించవచ్చు.

అవ :- ఈ విధంగా శ్రీగజేంద్రుని ఆపదను పోగొట్టిన భగవానుడే భక్తులకు అందరికీ అపుడపుడు వచ్చే ఆపదలను తీర్చి, చాలా గొప్ప పురుషార్థం అయిన పరమపదాన్ని ఇస్తాడు - అని అంటున్నారు.

**51. అవనే యరువరైయాల్ ఆనిరైకళ్ కాత్తాన్**
**అవనే యణి మరుతమ్ శాయ్త్తాన్- అవనే**
**కలఙ్గా ప్పెరునకరమ్ కాట్టువాన్ కణ్డీర్**
**ఇలఙ్గాపుర మెరిత్తా నెయ్తు**

అరు వరైయాల్ = ఎవరికీ కదపడానికి సాధ్యం కాని గోవర్ధనపర్వతంతో, ఆ నిరైకళ్ = (ఇంద్రుడు కురిపించిన శిలావర్షంలో చిక్కుకొని, బాధపడే) గో సమూహాలను, కాత్తాన్ = (బాధపడకుండా) రక్షించినవాడు, అవనే కణ్డీర్ = అతడే సుమండీ! ఎయ్దు = (సీతాదేవిని తిరిగి పొందడం కోసం) వింటితో బాణాలను వర్షించి, ఇలఙ్గా పురమ్ = బ్రహ్మాదిదేవతలకు ప్రవేశించడానికి, కదపడానికి వీలు కాని లంకాపట్టణాన్ని, ఎరిత్తాన్ = మండించి, భస్మీపటలం చేసినవాడు, అవనే = అతడే సుమండీ, కలఙ్గా ప్పెరు నకరమ్ = ఏ వికారం లేని పరమపదం అనే గొప్ప నగరాన్ని, కాట్టువాన్ కణ్డీర్ = **"నీ కణ్డుకొళ్"** అని అంటూ అకించనులం అయిన మనకు అనుగ్రహించేవాడుకూడా అతడే సుమండీ!



అతడే సాక్షాత్తు తానుగా పరమపదాన్ని అనుగ్రహిస్తే దర్శించడానికి సాధ్యం తప్ప, తమ స్వప్రయత్నంతో అది ఎవరికీ దర్శించడానికి సాధ్యం కాదని భావం. **"అవనే, అవనే"** అనిఅంటూ మాటిమాటికి పల్కడం వల్ల అనిష్ట నివృత్తి, ఇష్టప్రాప్తి- అన్నీ భగవానుని వల్లనే సమకూడుతాయి తప్ప, జీవుని వల్ల ఏమీ సాధ్యం కాదనే భావం తెలుపబడింది.

అవ :- గడచిన పాశురంలో ప్రస్తావింపబడ్డ మృతసంజీవిని అయిన శ్రీరామ చేష్టితంలో అభినివేశాన్ని పొంది, మళ్ళీ దానిని వివరంగా పల్కి, భగవానుని ఉపాయభావాన్ని ఇందులో స్థిరీకరిస్తున్నారు.

**52. ఎయ్తాన్ మరామరమ్ ఏழு మిరామనాయ్**
**ఎయ్తాన్ అమ్మాన్ మఱియై యేన్దిழைక్కాయ్- ఎయ్తతువుమ్**
**తెన్నిలఙ్గై క్కోన్ వీழ చ్చెన్ఱు కుఱళురువాయ్**
**మున్నిలమ్ కైక్కొణ్డాన్ ముయన్ఱు**

ఇరామన్ ఆయ్ = శ్రీరాముడై అవతరించి, మరామరమ్ ఏழుమ్ = ఏడు సాలవృక్షాలను, ఎయ్దాన్ = బాణాలను ప్రయోగించి, తొలిచాడు, ఏన్దు ఇழైక్కు ఆయ్ = పలు ఆభరణాలను ధరించిన సీతాదేవికోసం, అ మాన్ మఱియై = అటువంటి మారీచుడనే మాయామృగశాబాన్ని లక్ష్యం చేసికొని, ఎయ్దాన్ = (అవలీలగా) బాణాన్ని ప్రయోగించాడు, ఎయ్తతువుమ్ = బాణాలను (చక్కగా) ప్రయోగించినది కూడా ఎందుకోసం? అంటే, తెన్ ఇలఙ్గై కోన్ వీழ = దక్షిణదిశలో అందంగా ఉండే లంకానగరానికి ప్రభువైన రావణుడు నశించడంకోసం, మున్= పూర్వం ఒకానొక సమయంలో, కుఱళ్ ఉరు ఆయ్ = వామనరూపియై, శెన్ఱు = మహాబలిదగ్గరకు పోయి, ముయన్ఱు = (రూపసౌందర్యాన్ని చూపించడం, ముద్దు ముద్దు మాటలను పల్కడం, లోకాలను కొలవడం - మొదలైన) ప్రయత్నాలను చేసి, నిలమ్ కై క్కొణ్డాన్= భూమిని పరిగ్రహించాడు.

స్వామి తన సొత్తును రక్షించడంకోసం చేసిన పనులకు ఒక అవధి ఉన్నదా!- అని ఆழ్వార్లు ఇందులో అభినివిష్టు లవుతున్నారు. ఈ పాశురంలో సహజమైన ఉపాయ భూతుడైన భగవానుడు చేతనలాభం కోసం చేసే గొప్ప ప్రయత్నం తెలుపబడింది.

పూర్వం ఒకానొక సమయంలో వామనుడై అవతరించి మహాబలి యాగ భూమికి పోయి, తన రూపసౌందర్యాన్ని ప్రదర్శించడం, మధురభాషణాలను పల్కడం, చిన్న పాదాన్ని పెద్ద పాదంగా చేయడం, లోకాలను కొలువడం మొదలైన గొప్ప లీలలను చేసి, తనదైన భూమిని తాను పొందాడు. స్వామి తన సొత్తును రక్షించడం కోసంగా ఈవిధంగా చేసిన లీలలకు ఒక అవధి ఉన్నదా? - అని ఆழ్వార్లు ఇందులో గొప్ప అభినివేశాన్ని పొందుతున్నారు.

అవ :- "మనలను పొందడంకోసం పూర్వం తెల్పిన రీతిలో గొప్ప ప్రయత్నం చేయడంతో మాత్రమే నిలువకుండా, ఇంకా అరుదైన ఎన్నో ప్రయత్నాలు అతడు చేసేటపుడు, అతనినే స్వయంప్రయోజనంగా అనుభవించడానికి నీవల్ల వీలయే ప్రయత్నాలను అన్నిటినీ చేయవద్దా!" అని ఇందులో తమ మనస్సుతో ఆழ్వార్లు అంటున్నారు.

**53. ముయన్ఱు తొழு నెఞ్జే ! మూరినీర్ వేలై**
**ఇయన్ఱ మరత్తాలిలైయిన్ మేలాల్ - పయిన్ఱఙ్గోర్**
**మణ్ణలఙ్గొళ్ వెళ్ళత్తు మాయ క్కుழవియాయ్**
**తణ్ణలఙ్గల్ మాలైయాన్ తాళ్**

మూరి నీర్ వేలై =అలలు లేచే నీటిని కల సముద్రంలో, ఇయన్ఱు = పొందికగా ఉండే, ఆల మరత్తు ఇలైయిన్ మేలాల్ = మఱ్ఱిచెట్టు ఆకుపై, పయిన్ఱు= చిరకాలం శయనించి ఉండి, అఙ్గు = అక్కడే, మణ్ = భూమికి (భూమిలోని జీవులకు) నలమ్ = మంచిని (భోగ్యంగాను, భోగోపకరణాలుగాను, భోగ స్థానాలుగాను ఉండే వాటిని అన్నిటినీ కల భూమియొక్క ఆ గొప్పతనాలను అన్నిటినీ) కొళ్ = అపహరించిన, వెళ్ళత్తు = ప్రళయసముద్రంలో, ఓర్ మాయన్ కుழవి ఆయ్ = (చిన్న తన బొజ్జలో పెద్దదైన భూమిని అంతటినీ పెట్టుకొని రక్షించిన) అద్వితీయఅఘటిత ఘటనాసామర్థ్యాన్ని కల, ఆశ్చర్యకరమైన పాలు కారే శిశువై, తణ్ అలఙ్గల్ మాలైయాన్ = ఆ సన్నివేశంలోకూడా చల్లనిదై, అల్లల్లాడే మాలచే అలంకరింపబడ్డవాడైన భగవానుని, తాళ్ = శ్రీచరణాలను, నెఞ్జే = ఓమనసా!, ముయన్ఱు తొழு = ప్రయత్నించి, నమస్కరించు,



మనకోసం ఈ విధంగా అరుదైన ప్రయత్నాన్ని చేసేవాని శ్రీచరణాలను, "వస్తే రానీ, పోతే పోనీ" అని అలక్ష్యం చేయకుండా, గొప్ప ఉత్సాహంతో నీవు ఆశ్రయించవద్దా! ఓ మనసా! - అని భావం.

అవ :- వటదళశాయియైన శ్రీకృష్ణుని అద్భుతలీలను అనుభవించగానే, దానివలెనే పలు ఆశ్చర్యకరలీలలను చేసిన శ్రీకృష్ణుని అరుదైన లీలలను ఇందులో ఆழ్వార్లు ప్రస్తావిస్తున్నారు.

**54. తాళాల్ శకడమ్ ఉత్తైత్తు ప్పకడున్ది**
**కీళా మరుతిడైపోయ్ క్కేழలాయ్-మీళాతు**
**మణ్ణకలమ్ కీణ్డు అఙ్గోర్ మాతుకన్ద మార్వఱ్కు**
**పెణ్ణకలమ్ కాతల్ పెరితు**

శకడమ్ = అసురావేశాన్ని పొంది తనపైకి వచ్చిన శకటాన్ని (బండిని), తాళాల్ = శ్రీపాదాలతో, ఉదైత్తు = (యశోద దగ్గర పాలను తాగడానికి సమయం మించి పోయింది- అనే మిషతో తన్ని) భగ్నం చేసినవాడు, పకడు = (కంసుడు చేసిన ధనుర్యాగానికి శ్రీకృష్ణుడు వచ్చినపుడు నగరం లోపలకు వచ్చే వాకిలిలో తనను వధించడంకోసం నిలుపబడ్డ) కువలయాపీడం అనే ఏనుగును, ఉన్ది = తన శ్రీహస్తంతో మోది, కింద పడతోసినవాడు, కీళా = మధ్యలో ఏమాత్రం సందు లేని, మరుదు ఇడై పోయ్ = మద్దిచెట్ల నడుమ దోగాడుతూ పోయి, కేழల్ ఆయ్ = వరాహమూర్తియై, మీళాదు = ఆ రూపానికి తగిన లీలను చేయడంలో ఏమాత్రం వెనుకంజ వేయకుండా వెడలి, అకలమ్ మణ్ కీణ్డు = (ఆ ప్రళయజలంలో మునిగి అండభిత్తికి అంటుకొని ఉన్న) సాటి లేని వైశాల్యాన్ని కల్గిన భూమిని తన దంతంతో గుచ్చి ఎత్తి, ఓర్ మాదు ఉకన్ద మార్వఱ్కు = **"నారీణామ్ ఉత్తమా వధూః"** అన్నట్లు సాటి లేని లక్ష్మీదేవి **"అకలకిల్లేన్"** అన్నట్లు క్షణంకూడా విడువలేని రీతిలో అభిలషించే వక్షఃస్థలాన్ని కల్గిన స్వామికి, పెణ్ అకలమ్ = భూదేవియొక్క అంతు లేని భోగ్యతను కల తిరుమేనిలో, కాతల్ = ఆశ, పెరితు = చాలా పెద్దది.

(అందువల్లనే కదా ఆమె శరీరం అయిన భూమిని తన గొప్పతనాన్ని గమనించకుండా, దానికి ఏమాత్రం తగని వరాహరూపాన్ని సైతం ధరించి ఎత్తాడు - అని భావం. **"కిడన్దిరున్దు నిన్ఱు అళన్దు కేழలాయ్ క్కీழప్పుక్కు ఇడన్దిడుమ్ తన్నుళ్ కరక్కుమ్ ఉమిழుమ్ తడమ్ పెరున్తోళా లారత్తழువుమ్ పారెన్నుమ్ మడన్దైయై మాల్శెయ్కిన్దముల్ ఆర్కాణ్బారే"** (తిరువాయ్-2-8-7) అనేరీతిలో భూదేవిపట్ల పలురీతులలో అభినివేశాన్ని పొందేటట్లుగా చాలా గొప్ప ప్రేమను కలవాడని కూడా భావం. **"అకలమ్"** - తిరుమేని, **"పెణ్ణకలమ్"** - స్త్రీ విషయంలో - అనికూడా అర్థం. ఈ పదం ప్రకృతంలో **"కేழలాయ్ మణ్ణకలమ్ నీణ్డు"** అనే సందర్భంలో చెప్పబడ్డ భూదేవిని లక్షిస్తున్నది. లేక, **"మాదు ఉకన్ద"** అని చెప్పబడ్డ పురుషకార స్వరూపిణి అయిన లక్ష్మీదేవిని లక్షిస్తున్నది - అనికూడా చెప్పవచ్చు. ఆ లక్ష్మీదేవి భగవానుని అభిమానించేటట్లే, ఇతడు కూడా ఆమెపట్ల గొప్ప ప్రేమను కల్గిఉన్నాడు - అనిభావం. దీనికి అనుగుణంగా **"అస్యా దేవ్యా మనస్తస్మిన్ తస్య చాస్యాం ప్రతిష్ఠితమ్"** (రామా-సుందర-15-52) (ఈ సీతా దేవి మనస్సు ఆ రామచంద్రునిలో, అతని మనస్సు ఈ సీతాదేవిలో స్థిరంగా నిలచిఉన్నది) ఇత్యాది ప్రమాణాలు స్మరణీయాలు.

**"మాదు ఉకన్దమార్ వఱ్కు పెణ్ణకలమ్ కాదల్ పెరిదు"** - ఆమె ఆనందం. ఇతని గొప్ప ప్రేమ అనికూడా అర్థం. **"ఊర్ధ్వం మాసాన్నజీవిష్యే"** (రామా-సుందర-38-67) (శ్రీరాముని వీడి ఒక్క మాసం కూడా నేను జీవించి ఉండలేను) అని సీతాదేవి, **"చిరం జీవతి వైదేహీ యది మాసం ధరిష్యతి, న జీవేయం క్షణమపి వినాతామసితే క్షణామ్"** - వైదేహి ఒక నెలకాలం జీవించి ఉండగల్గితే చాలా కాలం జీవించినదే కాగలదు. ఆమెను విడిచి నేను క్షణంకూడా జీవించలేను- అని శ్రీరాముడు పల్కినందున ఆమె ప్రేమకంటే ఇతని ప్రేమ గొప్పది - అని స్ఫురిస్తున్నది కదా! ఈ విధంగా పల్కిన శ్రీరాముడు తరువాత జీవించియే ఉన్నాడు కదా! మఱి, అతని పల్కినమాట ఏవిధంగా పొసగుతుంది? - అని అంటే ఆమెను పొందడం కోసం అతడు జీవించి ఉన్నా, జీవచ్ఛవంగానే ఉన్నాడు కనుక అతడు పల్కిన మాట పొసగడంలో లోటులేదు.



అవ :- ఈ విధంగా భూదేవి విషయంలో గొప్ప అనురాగాన్ని కల్గిన భగవానుని అందాన్ని ఇందులో వర్ణిస్తున్నారు.

**55. పెరియ వరైమార్విల్ పేరారమ్ పూణ్డు**
**కరియ ముకిలిడైమిన్ పోల-తిరియుఙ్గాల్**
**పాణొడుఙ్గ వణ్డఱైయుమ్ పఙ్గయమే మఱ్ఱవన్దన్**
**నీణెడుఙ్గణ్ కాట్టుమ్ నిఱమ్**

పెరియ వరై మార్బిల్ = హారాలతో పరిచ్ఛేదించడానికి వీలు కాని పెద్ద పర్వతంవలె విస్తరించి ఉన్న వక్షఃస్థలంలో, పేర్ ఆరమ్ పూణ్డు = రెండుగా మడచి అలంకరించవలసినట్లున్న పెద్ద హారాన్ని అలంకరించుకొని, తిరియుఙ్గాల్ = సంచరిస్తే, కరియ ముకిలిడై మిన్ పోల్ = నీటిని గ్రసించిన కాలమేఘంలో మెఱుపుతీగ వ్యాపించినట్లుగా, నల్లని తిరుమేనిలో తెల్లని హారం ప్రకాశిస్తుంది, మఱ్ఱు = అంతేకాక, అవన్తన్ = ఆస్వామి యొక్క, నీళ్ నెడు కణ్ = ఆ స్వామియొక్క **"కరియ వాకి పుడై పరన్దు"** అనే రీతిలోని విశాలమైన తిరునేత్రాల యొక్క, నిఱమ్ = వర్ణాన్ని (కాంతిని), పాణ్ ఒడుఙ్గ వణ్డు అఱైయుమ్ పైమ్ కమలమ్ కాట్టుమ్ = పాశురాలు అనే పేరును కల్గినవి అన్నీ సిగ్గుపడి సంకోచించేటట్లుగా, తుమ్మెదలు శబ్దించే తామరపూలను దర్శింపజేస్తున్నవి.

**"నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా"** అని, **"తస్య యథా కప్యాసం పుండరీక మేవమక్షిణీ'** అని వేదం భగవానుని ఆభరణశోభలోను, తిరునేత్ర సౌందర్యంలో అభినివేశాన్ని ప్రకటించినట్లే, వీరుకూడా వాటితో తమ అభినివేశాన్ని వ్యక్తం చేశారు. పాటలను పాడడమే వృత్తిగా కల్గిన పాణర్ జాతి అంతా లజ్జించి పరుగు తీసేటట్లుగా గొప్ప మధురంగా ఝుంకారం చేసే తుమ్మెదలను కల్గిన తామరపూవే భగవానుని తిరునేత్రాల వర్ణాన్ని సూచిస్తుంది. **"పాణ్"** - పాణ జాతి - అని అర్థం. లేక, పాట అనికూడా చెప్పవచ్చు.

అవ :- "భగవానుని సౌందర్యసముద్రంలో తలమునకలు వేయడం తప్ప, నాకు దానిని పరిచ్ఛేదించడం సాధ్యం కాని పని. దీనికి కారణం- ఆ అందం

**'తిరువుక్కు-మ్ తిరు'** అయిన సంపద్రూపుని అందం కావడమే''- అని ఇందులో అంటున్నారు.

**56. నిఱమ్ వెళితు శెయ్తు పశితు కరితెన్ఱు**
**ఇఱైయురువమ్ యా మఱియో మెణ్ణిల్- నిఱైవుడైయ**
**నామఙ్ఞై తానుమ్ నలమ్ పుకழ వల్లళే**
**పూమఙ్ఞైకేళ్వన్ పొలివు**

ఇఱై = సర్వేశ్వరుని, ఉరువమ్ = దివ్యమంగళరూపం, నిఱమ్ = రంగులో, వెళితు = తెల్లగా ఉంటుందా (లేక), శెయ్దు = ఎఱ్ఱగా ఉంటుందా (లేక), పశిదు = పచ్చగా ఉంటుందా (లేక), కరితు = నల్లగా ఉంటుందా, ఎన్ఱు = ఏవిధంగా ఉంటుందని, ఎణ్ణిల్ = విచారిస్తే, యామ్ అఱియోమ్ = (ఆ విషయంగూర్చి కొంచెంకూడా) తెలియలేము. (ఈ విషయం అటు ఉండనీ), నిఱైవు ఉడైయ = జ్ఞానశక్తులో పూర్ణతను కల, నా మఙ్ఞై తానుమ్ = సరస్వతీదేవి సైతం, పూ మఙ్ఞై కేళ్వన్ = తామరపూవులో నివసించే లక్ష్మీదేవికి ప్రభువైన స్వామియొక్క, పొలివు = పూర్ణతను, నలమ్ పుకழ వల్లళే = చక్కగా కీర్తించగల శక్తిని కల్గినదా? (కల్గినది కాదు)

ఐశ్వర్యాలకు అన్నిటికీ అధిదేవత అయిన లక్ష్మీదేవికి నాథుడై ఉండేవాని మహిమను లెక్కించడం ఎవరికీ సాధ్యం కాదని భావం. **"అప్రమేయం హి తత్తేజః యస్య సా జనకాత్మజా"** అనే మారీచుని వాక్యంకూడా ఈ అర్థాన్నే కదా తెలుపుతున్నది.

అవ :- "ఇటువంటి గొప్పతనాన్ని కలవానిని మహిమను అనుసంధించి, అతని శ్రీచరణాలను ఆశ్రయించడమే మనకు గొప్పతనం''- అని అంటూ తమ మనస్సును ఇందులో ఆழ్వార్లు ఉద్బోధిస్తున్నారు.

**57. పొలిన్దిరుణ్డ కార్వానిల్ మిన్నేపోల్ తోన్ఱి**
**మలిన్దు తిరు విరున్ద మార్వన్- పొలిన్ద**
**కరుడన్ మేల్ కొణ్డ కరియాన్కழలే**
**తెరుడన్మేల్ కణ్డాయ్ తెళి**



తిరు = లక్ష్మీదేవి, పొలిన్దు ఇరుణ్డ కార్ వానిల్ =నిబిడంగా ఉండే, చీకటిని కల, వర్షాకాలమేఘం నడుమ, మిన్నే పోల్ తోన్ఱి = మెఱుపువలె ప్రకాశించి, మలిన్దు ఇరున్ద మార్వన్ = గొప్పతనంతో వెలిగే వక్షఃస్థలాన్ని కలవాడై, పొలిన్ద కరుడన్ మేల్ కొణ్డ = వేదస్వరూపి, సకలవిధకైంకర్యాలను చేసేవాడు, పచ్చని బంగారు పర్వతంవలె తిరుమేని వైభవాన్ని కలవాడైన గరుడునిపై అధిరోహించిన, కరియాన్= నల్లని తిరుమేనిని కలవాని, కழలే =శ్రీపాదాలే, తెరుళ్ తన్ మేల్= జ్ఞానానికి పరిణతదశ అయిన భక్తికి విషయం అని, తెళి కణ్డాయ్ = (ఓమనసా!) తెలిసికో.

నల్లని తిరుమేనిని కల స్వామియొక్క శ్రీచరణాలను భక్తితో దర్శించి అనుభవించు- అని చెప్పవచ్చు. లేక, నల్లని తిరుమేనిని కల శ్రీచరణాలలో కల భక్తినే మన సంపదలన్నిటిలో గొప్ప సంపద సుమా! - అని కూడా చెప్పవచ్చు. ఈ నిర్వాహానికి అనుగుణంగా, **"శేముషీ భక్తిరూపా"** అనే భగవద్రామానుజుల సూక్త్యనుసారం జ్ఞానవిశేషం అయిన సూక్తినే **"తెరుళ్"** అనే పదం తెలుపుతున్నదని చెప్పాలి. లేక, నల్లని తిరుమేనిని కలవాని శ్రీచరణాలే గొప్పగా అనుసంధించ దగినవానిలో మేలైనవి - అని తెలిసికో - అని కూడా భావం. ఈ భావంలో **"తెరుళ్"** అనే పదానికి ఇక 'అనుసంధించు' -అని అర్థం.) **"ముయన్ఱు తొ ழునెఞ్జే"** అనే పాశురం నుండి **"నెఞ్జే"** అనేపదానికి ఇక్కడ అనువర్తింపజేసికోవాలి.

అవ :- "ఇటువంటి ఐశ్వర్యాన్ని కలవాడు భౌతికనేత్రాలతో దర్శించేటట్లుగా తిరుమలకు వచ్చి నిలచి ఉన్నాడు'' అని అంటున్నారు.

**58. తెళిన్ద శిలాతలత్తిన్ మేలిరున్ద మన్ది**
**అళిన్ద కడువనైయే నోక్కి-విళఙ్గియ**
**వెణ్మతియమ్ తా వెన్నుమ్ వేఙ్గడమే మేలొరునాళ్**
**మణ్మతియిల్ కొణ్డుకన్దాన్ వాழ్వు**

తెళిన్ద = స్వచ్ఛమైన, శిలా తలత్తిన్ మేల్ ఇరున్ద మన్ది = స్ఫటికశిలలపై ఉండే ఆడవానరం, అళిన్ద కడువనై నోక్కి = "ఈమె నన్ను కోరి ఆజ్ఞాపించి ఏదైనా పనిలో ఎపుడు వినియోగించుకొంటుందో!" అని ఆ సమయాన్ని ఎదురు

చూచే ప్రేమను కల మగకోతిని చూచి, విళఙ్గియ వెణ్ మదియుమ్ తా ఎన్నుమ్ వేఙ్గడమ్ = ప్రకాశించే తెల్లని చంద్రుని నాకోసం తీసికొని రా - అని చెప్పే రీతిలో ఉండే శ్రీవేంకటాద్రి, మేల్ ఒరు నాళ్ = పూర్వ ఒకానొక సమయంలో, మణ్ = భూమిని, మదియిన్ = తన బుద్ధిచాతుర్యంతో, కొణ్డు = (మహాబలిదగ్గర నుండి) గ్రహించి, ఉకన్దాన్ = మనస్సులో సంతోషించిన సర్వేశ్వరుడు, వా*ళ్*వు= నివసించే చోటు.

దేవేంద్రుని కోసం ఇంతగా పాట్లు పడినవాడు, తిరుమలలో ఆడకోతికి చంద్రుని తెచ్చి ఇచ్చే మగకోతివలె, పురుషకారభూత అయిన పిరాట్టికోసం జీవులను అవశ్యం ఉద్ధరిస్తాడు- అని ఇక్కడి ధ్వన్యర్థం. ఈ విధంగా ఈ పాశురంలో తిరుమలలోని ఒక సహజసుందరదృశ్యాన్ని వర్ణించడంద్వారా, తిరుమలేశుని ప్రేమపారతంత్ర్యం, లక్ష్మీదేవియొక్క పురుషకారకృత్యం వ్యర్థం కావని తెలుపబడినట్లయింది.

అవ :- "ఇటువంటి పురుషకారభూత అయిన లక్ష్మీదేవితో కూడిన, ఉపాయభూతుడైన భగవానుని శ్రీచరణాలను ఆశ్రయించడం" - అనే ఉజ్జీవన ప్రకారాన్ని తెలిసికొన్నాను"- అని అంటున్నారు.

**59. వా*ళ్*ుమ్ వకై యఱిన్దేన్ మైపోల్ నెడువరైవాయ్**
**తా*ళ్*ు మరువిపోల్ తార్ కిడప్ప- శూ*ళ్*ుమ్**
**తిరుమామణి వణ్ణన్ శెఙ్గణ్మాల్ ఎఙ్గళ్**
**పెరుమా నడి శేర ప్పె*ఱ్ఱు***

మై పోల్ నెడు వరై వాయ్ = కాటుకవలె దట్టమైన నల్లని రంగును కల గొప్ప పర్వతంయొక్క శిఖరంలో, తా*ళ్*ుమ్ = రెండు వైపుల జారి, ప్రవహించే, అరువి పోల్ = కొండవాగులవలె, తార్ కిడప్ప = హారంచేత అలంకరింపబడగా, (ఆ అందంలో అభినివేశాన్ని పొంది), శూ*ళ్*ుమ్ = ఒక క్షణం కూడా విడిచి ఉండలేక, ఆలింగనం చేసికొని ఉండే, తిరు = పిరాట్టిని కల్గినవాడు, మా మణి వణ్ణన్ = నీలమణివంటి వర్ణాన్ని కలవాడు, శెమ్ కణ్ మాల్ = ఎఱ్ఱని తిరునేత్రాలను కల మహాత్ముడు అయిన, ఎఙ్గళ్ పెరుమాన్ = మన స్వామి



యొక్క, అడి = శ్రీచరణాలను, శేర పె*ఱ్ఱు* = సమీపించి, ఆశ్రయించినందువల్ల, వా*ళ్*ుమ్ వకై అఱిన్దేన్ = ఉజ్జీవించే రీతిని తెలిసికొన్నాను.

"ధ్యాయతో విషయాన్ పుంసః .... బుద్ధి నాశాత్ ప్రణశ్యతి" అని గీతలో చెప్పిన రీతిలో లౌకికవిషయాలలో ప్రావణ్యాన్ని పొంది నశించిపోకుండా, ఈ మహావిషయాన్ని ఆశ్రయించి ఉజ్జీవించే విధానాన్ని గ్రహించాను.

అవ :- "మీరు ఉజ్జీవనప్రకారాన్ని తెలిసికొన్నవారైతే, ఆ ఉజ్జీవనానికి అవరోధాలుగా ఉన్నవి. అన్నీ మఱి ఏమయ్యాయి? అని అంటే, విరోధులను నిరసించడాన్ని స్వభావంగా కల భగవానునకే అది బాధ్యత" - అని అంటున్నారు.

**60. పె*ఱ్ఱ*మ్ పిణై మరుతమ్ పేయ్ములై మాచ్చకడమ్**
**ము*ఱ్ఱ* క్కాత్తూడు పోయుణ్డుదైత్తు-క*ఱ్ఱు***
**క్కుణిలై విళఙ్గనిక్కు క్కొణ్డెఱిన్దాన్ వె*ఱ్ఱి***
**ప్పణిలమ్ వాయ్వైత్తుకన్దాన్ పణ్డు**

పె*ఱ్ఱ*మ్ = పశువులను, ము*ఱ్ఱ* కాత్తు = ఏ ఒక్కటీ తప్పిపోకుండా అన్నిటినీ రక్షించినవాడై, పిణై మరుతమ్ ఊడు పోయ్ = మద్దిచెట్ల జంట నడుమలో దోగాడుతూ పోయినవాడై, పేయ్ ములై ఉణ్డు = పూతన స్తన్యాన్ని ఆరగించినవాడై, మా శకడమ్ ఉదైత్తు = గొప్పదైన, అసురావిష్టమైన శకటాన్ని భగ్నం చేసినవాడై, క*ఱ్ఱు* కుణిలై కొణ్డు = లేగదూడ అనే విసరే కర్రను గ్రహించి, విళమ్ కనిక్కు ఎఱిన్దాన్ = అసురావేశాన్ని కల వెలగపండుపై విసరికొట్టినవాడైన భగవానుడు, పణ్డు = పూర్వం ఒకానొక సమయంలో, వె*ఱ్ఱి* పణిలమ్ = జయాన్ని స్వభావ సిద్ధంగా కల్గిన పాంచజన్యాన్ని, వాయ్ వైత్తు = నోటిలో పెట్టుకొని ఊది, ఉకన్దాన్= ఆ ధ్వనితో "స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్" అనే రీతిలో శత్రువులను నిరసించగలిగానుకదా- అని ఆనందించాడు.

ఈ విధంగా విరోధినిరసనాన్ని స్వభావంగా కలవాడు కనుక, నా విరోధు లను తీర్చడం అతనికే భారం- అని భావం. "అరవ మడల్ వే*ళ్*మ్" అనే ముదల్ తిరువన్దాది పాశురంలో-54) వలె ఇందులో కూడా యథాసంఖ్యాలంకార ప్రక్రియలో పదాలను అన్వయించాలి. దీనికి తమిళంలో "నిఱైనిరైయణి" అని

పేరు. "పణ్డు" - అసురులతో, రాక్షసులతో యుద్ధం జరిగినపుడు - అనికూడా అర్థం. లేక, భారత యుద్ధకాలంలో - అని అర్థం.

అవ :- "నా ఆటంకాలను పోగొట్టడంతో ఊరుకోకుండా, నా మనస్సులో ప్రవేశించడంకోసం పరమపదంలో నుండి, క్షీరాబ్ధికి, తిరుమలై మొదలైన దివ్య తిరుపతులకు వేంచేసి, చిరకాలం అక్కడ నిత్యవాసం చేస్తున్నాడు"- అని అంటున్నారు.

61. పణ్డెల్లామ్ వేఙ్గడమ్ పాఱ్కడల్ వైకున్దమ్
కొణ్డఙ్గుఱైవార్క్కు క్కోయిల్‌పోల్- వణ్డు
వళఙ్గిళరుమ్ నీళ్ శోలై వణ్ పూఙ్గడికై
ఇళఙ్గుమరన్ఱన్ విణ్ణకర్

వైకున్దమ్ = ("విగతా కుంఠా" అనే వ్యుత్పత్తినిబట్టి భగవదనుభవానికి ఏ ఆటంకం లేనిది కనుక శ్రీవైకుంఠం అనబడే) పరమపదాన్ని, కొణ్డు = తన వాసస్థానంగా గ్రహించి, అఙ్గు = అక్కడ, ఉఱైవాఱ్కు = నిత్యవాసం చేసే భగవానునకు, పాల్ కడల్ = క్షీరాబ్ధి, వేఙ్గడమ్ = తిరుమలై, వణ్డు వళమ్ కిళరుమ్ నీళ్ శోలై = తుమ్మెదల గుంపు మిక్కిలిగా ఉండే, విశాలమైన తోటలను కల్గినదై, వణ్ = అందమైనదై, పూ = భోగ్యమైన, కడికై = ఘటికాచల పర్వతం, ఇళ కుమరన్ తన్ విణ్ణవర్ = "యువా కుమారః" అన్నట్లు బాల్యంతో కూడిన యౌవనాన్ని కల భగవానుడు "నాది" అని అభిమానించే తిరువిణ్ణగర్ అనే దివ్యదేశం - అనే ఈ దివ్యతిరుపతులు అన్నీ, పణ్డు ఎల్లామ్ = నన్ను అనుగ్రహించడానికి పూర్వం, కోయిల్ పోల్ = స్వామికి వాసస్థానాలుగా ఉండి ఉన్నాయి కాబోలు!,

ఇపుడుమాత్రం, నా మనస్సు ఒక్కటే అతనికి నిత్యవాసస్థానం - అని భావం. తిరుచ్చన్దవిరుత్తప్రబంధంలోని- "నిన్ఱదుమ్ ఓర్ వెఱ్పకత్తు" (65) అనే పాశురభావార్థంతో ఈ పాశురానికి గల సామ్యాన్ని ఇక్కడ స్మరించడం తగినది.

అవ :- భగవానుడు తమ మనస్సును చేరిన తర్వాత కూడా, ఇంకా పలువురు భక్తులను రక్షించడానికి తగిన చోట్లు అని దివ్యదేశాలను చాలా ఎక్కువగా ఆదరిస్తున్నాడు- అని ఇందులో ఆళ్వార్లు అంటున్నారు.



62. విణ్ణకరమ్ వెంఃకా విరితిరైనీర్ వేఙ్గడమ్
మణ్ణకరమ్ మామాడ వేళుక్కై- మణ్ణకత్త
తెన్‌కుడన్దై తేనార్ తిరువరఙ్గమ్ తెన్‌కోట్టి
తన్ కుడఙ్గై నీరేఱ్ఱాన్ తాళ్వు

విణ్ణకరమ్ = "ఒప్పిల్ అప్పన్ సన్నిధి" అని పేరు పొందిన తిరువిణ్ణకర్ అనే దివ్యదేశం, వెంఃకా = తిరువెంఃకా అనే దివ్యదేశం, విరి తిరై నీర్ వేఙ్గడమ్ = విస్తరించి, అలలతో ఎగసిపడే నీటి సమృద్ధిని పొందికగా కల తిరుమలై, మణ్ నకరమ్ = భూమిలో ఇదే నిజమైన నగరం అనదగినట్లున్న, మా మాడమ్ వేళుక్కై= పెద్ద పెద్ద మేడలను కల్గిన తిరువేళుక్కై అనే దివ్యదేశం, మణ్ అకత్త తెన్ కుడన్దై= భూమికి నాయకమణిగా భాసించే అందమైన తిరుక్కుడన్దై అనే దివ్యదేశం, తేన్ ఆర్ తిరు అరఙ్గమ్ = తేనెప్రవహించే తోటలచే చుట్టబడి ఉండే శ్రీరంగనగరం, తెన్ కోట్టి = దక్షిణదిశలోని తిరుక్కోట్టియూర్ అనే దివ్యదేశం- అనే ఈ తిరుపతులు, తన్ కుడఙ్గై = తన అఱచేతితో, నీర్ ఏఱ్ఱాన్ = మహాబలిదగ్గర దానజలాన్ని పరిగ్రహించిన స్వామి, తాళ్వు = సౌలభ్యగుణంతో వేంచేసి ఉండే చోట్లు.

తనచేతిలో మహాబలి చేసిన దానజలాన్ని పరిగ్రహించి, తన సొత్తును పొందడానికి తాను యాచకుడయ్యాడు. ఈ ఆత్మలను పొందడానికి యాచకుడై, విభవావతారాలవలె ఒక సమయంలో అవతార పరిసమాప్తిని చేయకుండా, ఎల్లప్పుడు సహాయపడే రీతిలో సౌలభ్యం, సౌశీల్యం మొదలైన ఆశ్రయణోచిత గుణాలను స్వామి వ్యక్తం చేస్తూ వేంచేసి ఉండే దివ్యదేశాలు. "తన్ కుడఙ్గై నీరే న్ తాళ్వు"- అనే ప్రయోగం మహాబలివద్దకు యాచకుడై పోయేటపుడు చూపిన సౌలభ్యం, సామ్యం మొదలైన గుణాలన్నీ ఈ దివ్యదేశాలలో ప్రకాశిస్తాయి - అని తెలుపుతున్నది. ఈ ఉద్దేశ్యంతోనే విభవావతారాలను ఒకకాలంలో ప్రవహించి ఎండిపోయే అడవి వాగులుగా, అర్చావతారాలు వాటిలో తేటబడిన మడుగులు గాను చెప్పబడ్డాయి. గత పాశురంలోను, ఈ పాశురంలోను పరత్వమే ప్రకాశించే పరమపదం కంటే, చేతనులను ఉజ్జీవింపచేయడంకోసం సౌలభ్యంతో కూడి వేంచేసి ఉండే దివ్యతిరుపతులే చాలా ఉద్దేశ్యాలు- అని తెలుపబడింది.

అవ :- త్రివిక్రమావతారంలోని సౌలభ్యగుణం దివ్యతిరుపతులలో ప్రకాశిస్తుంది- అని గత పాశురంలో అన్నారు. "శంకరనారాయణావతారం" అనే విశిష్టమైన విభవావతారంలో దర్శింపజేసిన సౌశీల్యాన్ని తిరుమలైలో వ్యక్తం చేస్తూ ఉన్నాడు- అని ఈ పాశురంలో అంటున్నారు.

**63. తాళ్ శడైయుమ్ నీణ్ముడియుమ్ ఒణ్ మழுవుమ్ శక్కరముమ్**
**శూழரవుమ్ పొన్నాణుమ్ తోన్ఱుమాల్- శూழుమ్**
**తిరణ్డరువి పాయుమ్ తిరుమలైమేల్ ఎన్దైక్కు**
**ఇరణ్డురువు మొన్ఱా యిశైన్దు**

తాழ் శడైయుమ్ = వేలాడేటట్లుగా కట్టిన జటలు, నీళ్ ముడియుమ్ = ఉన్నతమైన కిరీటం, ఒణ్ మழுవుమ్ =అందమైన పరశువు అనే ఆయుధం, శక్కరముమ్ = శ్రీసుదర్శనం అనే ఆయుదం, శూழ் అరవుమ్ = చుట్టూ అలంకరించుకొన్న నాగాభరణాలు, పొన్ నాణుమ్ = బంగారు మొలనూలు- అనే ఈ రీతిలో, ఇరణ్డు ఉరువుమ్ = ఒకదానితో ఇంకొకటి అపూర్వమైన కలయికతో ఉండే (శంకర- నారాయణుని) రెండు రూపాలు, శూழుమ్ తిరణ్డు అరువి పాయుమ్ తిరుమలైమేల్ ఎన్దైక్కు = నాల్గు వైపుల గుంపులు గుంపులుగా కొండవాగులు ప్రవహించే తిరుమలపై వేంచేసి ఉండే తండ్రికి, ఒన్ఱు ఆయ్ ఇశైన్దు తోన్ఱుమ్ = ఒకే రూపంగా పోసగి ప్రకాశిస్తున్నవి, ఆల్ = ఆశ్చర్యం!.

**"బహుధా విజాయతే", "బహూని మే వ్యతీతాని"** అనే రీతిలో భగవానుడు ఎత్తిన పలు జన్మలలో నరుడు కలిసిన సింహరూపంలె, హరుడు కలిసిన హరిరూపంతో అవతరించిన శంకరనారాయణావతారం అనే ఒక అవతారం శాస్త్రాలలో చెప్పబడింది. హరుని రూపంకూడా తన రూపమే అని, అయినా అది అప్రధానమైనదని చూపడం కోసమే ప్రధానం అయిన కుడివైపు అంతా సర్వేశ్వరుడైన హరిరూపానికి చెందిన లక్షణాలతోను, అప్రధానం అయిన ఎడమవైపు అంతా ఆ హరిని ఉద్దేశించి తపస్సును చేసే హరునకు చెందిన లక్షణాలతోను ఆవిర్భవించిన అవతారమే శంకరనారాయణావతారం. ఈ విధంగా సిద్ధరూపాన్ని, సాధకరూపాన్ని ఒకే ఆకారంలో చూపినట్లే, **"మన్ది పాయ్ వడవేఙ్గడ మామలై వానవర్కళ్ శన్ది శెయ్య నిన్ఱాన్"** అనే రీతిలో వానరాలకు, నిత్యసూరులకు సమానంగా దర్శనాన్ని అనుగ్రహించే సౌశీల్యాన్ని ప్రదర్శిస్తూ తిరుమలైలో వేంచేసి ఉన్నాడు - అని ఈ పాశురంలో అంటున్నారు. ఈ పాశురాన్ని చూచి కొందఱు శ్రీవేంకటేశ్వరునకు శంకరనారాయణ రూపం ఉన్నదా? అనే సందేహాన్ని పొందవచ్చు. శ్రీవేంకటేశ్వరుని తిరుమేనిలో ఉన్నతమైన కిరీటం, సుదర్శనం, బంగారు మొలనూలు ఉన్నాయే తప్ప, వేలాడే జటలు, పరశువు, నాగాభరణాలు లేవు. గత పాశురంలో పలు దివ్యదేశాలను ప్రస్తావించి, ఇవి అన్నీ త్రివిక్రముడు తన సౌశీల్యాన్ని ప్రదర్శించే చోట్లు- అని అన్నందున ఆ దివ్యదేశాలలో భగవానుడు త్రివిక్రమరూపిగా ఉన్నాడు - అని అర్థం కాదు. త్రివిక్రమావతారంలో చూపిన సౌశీల్యగుణాన్ని ఆ దివ్యదేశాలు అన్నిటిలో ప్రదర్శిస్తున్నాడు - అనే అర్థమే స్ఫురిస్తుంది. అదే రీతిలో, "తిరుమలైలోని తండ్రికి శంకరనారాయణరూపంకూడా పొసగి ఉన్నది' అని అంటే, శంకరనారాయణావతారంలో చూపిన సౌశీల్యం శ్రీవేంకటేశ్వరునకు కూడా ఉన్నది- అనే అర్థం వస్తుంది. అందువల్ల, ఈ పాశురాన్ని గ్రహించి శివ-విష్ణు సామ్యవాదాన్ని చేయడంలో ఎంతమాత్రం సామజస్యం లేదు. **"మామలరాన్ వార్ శడైయాన్ ఎన్ఱు ఇవర్కట్కు ఎణ్ణత్తాన్ ఆమో ఇమై' (97)** అనే ఈ ప్రబంధంలోని పాశురంలో బ్రహ్మ, రుద్రుడు మొదలైనవారికి శ్రియః పతిని కొంచెం కూడా మనస్సుతో భావించడానికి కూడా వీలు కాదు- అని ఘోషించిన ఈ ఆழ்వార్లు "హరి- హరుడు ఒకరే" అనే అబద్ధసిద్ధాంతాన్ని ఆదరించారు అనడం ఎంత హాస్యాస్పదమో ప్రమాణతంత్రులైన ఆస్తికులేకాక, హేతువాదులు సైతం సులభంగా గమనించగలరు. అనంతార్యగుంఫితమైన శ్రీవేంకటాచలేతిహాసమాలవంటి గ్రంథాల్లో తిరుమలలోని స్వామి శ్రియఃపతియే అనే సత్యం ఘంటాపథంగా, సప్రమాణంగా నిరూపింపబడిన తర్వాతకూడా ఇటువంటి భ్రమజనకాలు, ప్రతారకాలైన సామ్యవాదాలు ఈనాటికీ కొనసాగడం చాలా ఆశ్చర్యకరం, హాస్యాస్పదం కూడా. ఈ కలియుగంలో భగవానుడు చేసే మాయలలో ఇది కూడా ఒకటి- అని అనుకోవడం తప్ప, ఇంకొక కారణం కన్పించదు. అందువల్ల, ఈ పాశురంలో ఆழ்వార్లు శంకర నారాయణావతారంలో కన్పించే సౌశీల్యం తిరుమలైలోని శ్రీవేంకటేశ్వరునిలో కూడా ప్రకాశిస్తున్నది అనే విషయాన్నే ప్రస్తావించారని చెప్పడం యుక్తి యుక్తం, సత్యం కూడా.

అవ :- శంకరనారాయణావతారంలోని సౌశీల్యాన్ని ఆళ్వార్లు గత పాశురంలో అనుభవించారు. క్షుద్రపురుషార్థాలను ఆశించిన దేవతలకుకూడా తన శరీరాన్ని శ్రమ పెట్టుకొని అయినా, సముద్రాన్ని చిలికి, వారు కోరిన అమృతాన్ని ఇచ్చినవాని సౌశీల్యాన్ని అనుసంధిస్తూ, "అయ్యో! అయ్యో!" అని కడుపు మోదుకొంటున్నారు.

**64.** ఇశైన్ద అరవముమ్ వెఱ్పుమ్ కడలుమ్
పశైన్దఙ్గముతు పడుప్ప-అశైన్దు
కడైన్ద వరుత్తమో కచ్చి వెంహావిల్
కిడన్దిరున్దు నిన్ఱతువు మఙ్గు

ఇశైన్ద = కవ్వానికి చుట్టే దారంగా చేసికోవడానికి యోగ్యతను కల, అరవముమ్ = వాసుకి అనే సర్పం, (ఇశైన్ద) = కవ్వంగా నిలుపడానికి యోగ్యతను కల, వెఱ్పుమ్ = మందరపర్వతం, (ఇశైన్ద= బానగా చేయడానికి తగిన యోగ్యతను కల), కడలుమ్ =సముద్రం- అనే ఈ మూడింటిని, పశైన్దు = ఒకదానితో ఇంకొకటి సంబంధించేటట్లుగా చేసి, అఙ్గు = ఆ సముద్రంలో, అముదు = అమృతం, పడుప్ప= పుట్టేటట్లు, ఇశైన్దు = శ్రమపడి, కడైన్ద వరుత్తమో = చిలికినందువల్ల కల్గిన ఆయాసంవల్లనా!, కచ్చి = కాంచీపురంలోని, వెంహావిల్ = తిరువెంహాలో, కిడన్దు= పరుండి, అఙ్గు = ఆ కాంచీపురంలోని (**"తిరుప్పాడకమ్"** అనే దివ్యదేశంలో, ఇరున్దు = వేంచేసి ఉండి (కూర్చుని ఉండి), (**"తిరువూరకమ్"** అనే చోట) నిన్ఱతువుమ్ = నిలిచి ఉన్నాడు.

చాలా శ్రమపడినవారు ఆశ్రమ తీరడంకోసం కొంచెంసేపు పరుండి, కొంచెంసేపు కూర్చుని, మఱి కొంచెంసేపు నిలుచుని ఉండేటట్లే భగవానుడుకూడా సముద్రమథనసమయంలో తనకు కల్గిన అలసట తీరడంకోసం కాంచీనగరంలోని వెంహాలో పరుండి, పాడకమ్‌లో కూర్చుని, ఊరకమ్‌లో నిలుచుని ఉన్నాడు కాబోలు! అని తమ భక్త్యతిశయంవల్ల ఆళ్వార్లు తలుస్తున్నారు. **"తాళాల్ ఉలకమళన్ద అశైవేకొల్ వాళా కిడన్దరుళుమ్ మామయిలై మావల్లిక్కేణియాన్ ఐన్ద లైవాయ్ నాకత్తణై"** (నాన్ముకన్ తిరు-35) అని, **"నడన్దకాల్గళ్ నొన్దవో నడుఙ్గ ఞాలమ్ ఏనమాయ్ ఇడన్దమెయ్ కులుఙ్గవో విలఙ్గుమాల్ వరైచ్చురమ్, కడన్దకాల్ పరన్దకావిరిక్కరైక్కుడన్దైయుళ్ కిడన్దవాఱు"** - (తిరుచ్చంద - 61) అని, **"కొడియార్ మాడక్కోళూరకత్తుమ్ పుళిఙ్గుడియుమ్ మడియాదిన్నే నీ తుయిల్ మేవి మకిళ్న్దదుదాన్, అడియార్‌లల్ తవిర్త్త అశైవో అన్ఱేల్ ఇప్పడి తాన్ నీణ్డు తావియ అశైవో పణియాయే"** (తిరువాయ్-8-3-5) అని భగవానుని పట్ల అభినివేశాన్ని పొంది, అస్థానే భయశంకతో ఆళ్వార్లు అందఱు పల్కడం వారి స్వభావం కదా!



అవ :- "అమృతాన్ని చిలికిన శ్రమ ఒకటేనా? భక్తులకోసం ఇంకా ఎన్నో అవతారాలలో అతడు పడిన ఆయాసాలు ఎన్నో కదా!" అని ఆళ్వార్లు ఈ పాశురంలో అంటున్నారు.

**65.** అఙ్గఱ్కిడరిన్ఱి అన్ది ప్పొళుదత్తు
మఙ్గ విరణియనతాకత్తై-పొఙ్గి
అరియురువమాయ్ ప్పిళన్ద అమ్మానవనే
కరియురువమ్ కొమ్బొశిత్తాన్ కాయ్‌న్దు

అఙ్గఱ్కు = కుఱ్ఱవాడైన ప్రహ్లాదునకు, ఇడర్ ఇన్ఱి = ఏ బాధ కలుగకుండేటట్లు, అన్ది పొళుదత్తు = సాయంసమయంలో, ఇరణియనదు = హిరణ్యుని, ఆకత్తై= వక్షస్సుగా, మఙ్గ = నశించిపోయేటట్లుగా, అరి ఉరువమ్ ఆయ్ పొఙ్గి = నరసింహరూపిగా విజృంభించి, పిళన్ద = చీల్చిన, అమ్మాన్ అవనే = ఆ స్వామే, కాయ్‌న్దు= కోపించి, కరి ఉరువమ్ = నల్లని రూపాన్ని కల్గిన ఏనుగు కువలయాపీడంయొక్క, కొమ్బు = దంతాన్ని, ఒశిత్తాన్ = విఱిచివేశాడు.

**"కరి"** అనే పదాన్ని సంస్కృత శబ్దంగా గ్రహించి, ఆ రూపాన్ని ధరించి మీదకు వచ్చిన అసురుని దంతాన్ని విఱిచివేసి, అతనిని సంహరించాడనికూడా చెప్పవచ్చు. ఈ విధంగా, దాసులకోసం అతడు చేసిన అతిమానుషలీలలను కొన్నిటిని ఇందులో ఆళ్వార్లు అనుగ్రహించారు.

అవ :- తాను ఒక రూపాన్ని ధరించి వచ్చి మేల్కొని ఉన్నపుడు విరోధులను నిరసించాడు- అన్నది ఒక గొప్పతనమా ?- గమనిక లేకుండా కన్నులు మూసికొని

ఉన్న స్థితిలో కూడా తనవద్దకు వచ్చిన మధుకైటభులనే విరోధులను తన వేడి ఊపిరితో సంహరించినవానికి ! - అని ఇందులో అంటున్నారు.

66. కాయ్న్దిరుళై మా్ౕఱి క్కదిరిలకు మామణికళ్
ఏయ్న్ద పణక్కతిర్మేల్ వెవ్వుయిర్ప్ప-వాయ్న్ద
మదుకైడ బరుమ్ వయిఱురుకి మాణ్డార్
అదు కేడవర్క్కిఱుతి యాఙ్గు

కాయ్న్దు = కోపించి, (కాంతి స్వల్పంగా ఉంటే చీకటితో చేరి ఉంటుంది. గొప్ప కాంతి కనుక చీకటితో ఏ మాత్రం కలిసి ఉండకపోవడమే కాకుండా, చీకటిపై కోపించి, దానిని నశింప జేసే కిరణాలు కోపించి - అని ప్రకృతభావం.), ఇరుళై మా్ౕఱి = చీకటిని పోగొట్టి, కతిర్ ఇలకు = కాంతిని విరజిమ్మే, మా మణికళ్= గొప్ప రత్నాలు, ఏయ్న్ద= పొందికగా ఉండే, పణమ్ = ఆదిశేషుని పడగలయొక్క, కతిర్మేల్ = కాంతికి (తేజస్సుకు) తోడు, (భగవానుడు), వెవ్వుయిర్ప్ప= పెద్ద వేడి ఊపిరిని విడువగా, వాయ్న్ద = అపుడు తనను సమీపించిన(విరోధులైన), మదుకైడబరుమ్ = మధుకైటభులు అనే అసురులు, వయిఱు ఉరుకి మాణ్డానర్ = కడుపులు కఱగి, నశించిపోయారు. అవర్క్కు = ఆ మధుకైటభులకు, ఆఙ్గు = అపుడు, అదు కేడు ఇఱుతి = ఆ విధంగా సమీపించడమే నైచ్యానికి, నాశానికి కారణం అయినది.

అనుకూలురు సత్తను పొందడానికి, ఉజ్జీవించడానికి చోటు అయిన పరమ పదంలో ప్రతికూలించి వచ్చిన మధుకైటభులకు ఆవిధంగా దరిచేరడం నాశానికి కారణం అయింది. అందువల్ల తేజస్సు ఉన్న చోట చీకటి నశించిపోయేటట్లుగా, అప్రతిమాన తేజోరూపుడైన భగవానుడున్నచోటికి వచ్చినట్లయితే భగవానుని శత్రువులు నశించిపోతారు- అని తెలుపబడింది. **“ఎన్టుమ్ ఎన్ పిళ్ళైక్కు త్తీమైకళ్ శెయ్వార్కళ్ అఙ్గనమ్ ఆవర్కళే”** అనే పెరియాళ్వార్లు (3-3-7)వలె వీరుకూడా నిర్భరత్వాన్ని, నిర్భయత్వాన్ని పొందుతున్నారు.

అవ :- హిరణ్యాకశిపుడు, మధుకైటభులు నశించిన వృత్తాంతాలను అనుసంధించిన తర్వాత క్షీరాబ్ధిలో స్వామి శయనించి ఉన్న అందాన్ని ఇందులో ఆళ్వార్లు అనుభవిస్తున్నారు.



67. అఙ్గు మలరుమ్ కువియు మాలున్దివాయ్
ఓఙ్గు కమలత్తినొణ్ పోదు- ఆఙ్కై
త్తికిరి శుడరెన్టుమ్ వెణ్ శఙ్గమ్ వానిల్
పకరు మతి యెన్టుమ్ పార్త్తు

మాల్ = సర్వేశ్వరునియొక్క, ఉన్ది వాయ్ = తిరునాభిలో, ఓఙ్గి = ఉన్నతంగా వృద్ధి చెందిన, ఒణ్ కమలత్తిన్ పోదు = అందమైన తామరపూవు, కై = ఆ స్వామి కుడిచేతిలో, ఆమ్ = ఉండే, తికిరి = సుదర్శనాన్ని, శుడర్ ఎన్టుమ్ = సూర్యుడని, (కై ఆమ్)- ఎడమచేతిలో ఉండే, వెణ్ శఙ్గమ్ = తెల్లని శంఖాన్ని, వానిల్ పకరుమ్ మతి ఎన్టుమ్ = ఆకాశంలో ప్రకాశించే చంద్రుడు అని, పార్త్తు = భావించి, ఆఙ్గు = ఒకే కాలంలో, మలరుమ్ కువియుమ్ = వికసిస్తున్నది, ముడుచు కొంటున్నది.

లోకంలో తామరపూవు చంద్రుని చూసే ముడుచుకొంటుంది. కాని, ఈ తామరపూవు అయితే, **“శన్దిరమణ్డలమ్ పోల్ దామోదరన్ కైయిల్”** (నాచ్చియార్ తిరు-1-4) అనేరీతిలో భగవానుని ఎడమచేతిలో ఉండే, ఆకాశంలో ప్రకాశించే చంద్రుని వంటి తెల్లని పాంచజన్యాన్ని శంఖమని భావించి ముడుచుకుంటున్నది. లోకంలో తామర గొ, సూర్యుని చూడగానే వికసిస్తుంది. ఈ తామర పూవు, భఘవానుని కుడిచేతిలోని సుదర్శనుడనే కూర్చుని చూచి వికసిస్తుంది. ఈ రీతిలో ఒకే సమయంలో భగవానుని రెండు చేతులలోను శంఖచక్రాలు చంద్ర సూర్యుల వలె వెల్గుతున్నందున భగవానుని నాభీకమలం ఒకేకాలంలో వికసిస్తూ, ముడుచు కుంటూ ఆశ్చర్యంగా కన్పిస్తున్నది - అని భావం. ఈవిధంగా ఒకే సమయంలో భగవానుని రెండు శ్రీహస్తాలలో గల శంఖచక్రాలు చంద్రసూర్యులవలె ప్రకాశించినందువల్ల తిరునాభీకమలం ఒకే సమయంలో వికసించే, ముడుచుకొనే ఆశ్చర్యం దర్శింపబడుతున్నదని భావం. **“పకరుమ్”** - అనే పదానికి “చెప్పబడే” అనే అర్థాన్ని చెప్పి, “ప్రసిద్ధిని పొందిన”- అనే భావాన్ని గ్రహించవచ్చు. ఈ విధంగా పాశురంలో భగవానుని నిద్రాకాలిక సౌందర్యం అనుభవింపబడింది.

అవ :- ఇటువంటి భగవానుని అందాన్ని అనుభవించడానికి క్షీరాబ్ధికి వెళ్ళవలసిన పని లేదు. తిరుమలైలోనే అనుభవించవచ్చునే! అని ఇక పలు

పాశురాలలో తిరుమలైలోని అందాన్ని, తిరుమలేశుని సౌందర్యాన్ని అనుభవించడం ఆళ్వార్లు ఈ పాశురం నుండి ప్రారంభిస్తున్నారు.

68. పార్త్త కడువన్ శునైనీర్ నిళల్క్కణ్డు
పేర్త్తోర్ కడువనెన ప్పేర్న్దు -కార్త్త
కళఙ్గనిక్కు క్కైనీట్టుమ్ వేఙ్గడమే మేనాళ్
విళఙ్గనిక్కు క్కన్టెఱిన్దాన్ వెఱ్పు

శునై నీర్ = తిరుమలైలోని కొండవాగులలో గల నీటిలో, పార్త్త = తొంగి చూచిన, కడువన్ = మగ కోతి, నిళల్ కణ్డు = ఆ నీటిలో ప్రతిబింబించిన తన నీడను చూచి, పేర్త్తు ఓర్ కడువన్ ఎన = (తనకు ప్రత్యర్థిఅయిన) ఇంకొక మగకోతి ఉన్నదని భ్రమించి, పేర్న్దు = భయంతో ఆ చోటును వదలి వెళ్ళిపోవాలని ముందడుగు వేయాలని ప్రయత్నించి, జాతి ప్రయుక్తమైన సహజచాపల్యంవల్ల, కార్త్త కళఙ్గనిక్కు = నల్లని కళాపండ్లకోసం, కై నీట్టుమ్ = చేతులను చాచే, వేఙ్గడమే = వేంకటాచలమే, మేల్ నాళ్ = పూర్వం ఒకానొక సమయంలో, విళమ్ కనిక్కు = (అసురావేశాన్ని కల్గిన) వెలగపండ్లను రాలగొట్టడంకోసం, కన్టు ఎఱిన్దాన్= వత్సాసురుని విసరే కర్రగా చేసికొని విసరికొట్టిన భగవానుని, వెఱ్పు= నివాసం అయిన పర్వతం.

వెలగ పండ్లను సంపాదించాలనే చాపల్యంతో లేగదూడను విసరే కర్రగా చేసికొని విసరిన అతని మౌగ్ధ్యం వంటిదే- నల్లని కళాపండ్లకోసం చేతులు చాచే ఈ వానరాల చేష్ట- అని హార్దభావం. ఈ విధంగా తిరుమలైలోని తిర్యక్కుల చేష్టలుకూడా భగవానుని అందమైన దివ్యలీలలకు స్మారకాలై, మనలను ఆనందంలో తలమునకలు వేయిస్తున్నవని దీని తాత్పర్యం.

అవ :- ఇటువంటి శ్రీవేంకటేశ్వరుని అంతు లేని బాల్యచేష్టితాలను దర్శించిన ఆళ్వార్లు భక్తిపరాకాష్ఠను పొంది, తాము పురుషులమనే భావనను కూడా విస్మరించి, ఒక నాయకీభావాన్ని పొందారు. ఆ నాయకి మాటలాడే మాటలను, చేష్టలను, ఆమె తల్లి తన పల్కులద్వారా ఇందులో తెలుపుతున్నది. ముదలాళ్వార్ల పాశురాలలో ఇది ఒక్కటే అన్యాపదేశప్రక్రియలో నాయికాభావనలో పల్కిన



పాశురం. "కఙ్గులుమ్ పకలుమ్" (తిరువాయ్-7-2), "తివళుమ్ వెణ్ మదిపోల్" (పెరియతిరు-2-7)ఇత్యాదిగా ఈ ఆళ్వార్లకు అనంతర కాలీయులైన ఆళ్వార్లు మాతృభావనలో పాడిన పాశురాలకు అన్నిటికీ దారి చూపినది- ఈ పాశురం అనే చెప్పాలి.

69. వెఱ్పెన్టు వేఙ్గడమ్ పాడుమ్ వియన్ తుళాయ్
కఱ్పెన్టు శూడుమ్ కరుఙ్గుళల్మేల్ - మఱ్పొన్ఱ
నీణ్డ తోళ్ మాల్ కిడన్ద నీళ్ కడల్ నీరాడువాన్
పూణ్డ నాళెల్లామ్ పుకుమ్

వెఱ్పు ఎన్టు = (నా కూతురు) ఏదైనా ఒక పర్వతాన్నిగూర్చి ప్రస్తావించి పల్కితే, వేఙ్గడమ్ = తిరుమలనుగూర్చి, పాడుమ్ = కీర్తిస్తుంది, కఱ్పు ఎన్టు = పాతివ్రత్యానికి తగినది అని, వియన్ తుళాయ్ = ఆశ్చర్యపడతగిన, తులసిని, కరు కుళల్ మేల్ = నల్లని తన కేశపాశంపై, శూడుమ్ = అలంకరించు కొంటున్నది, మల్ = మల్లులు, పొన్ఱ = నశించేటట్లు, నీణ్డ తోళ్ = దీర్ఘమైన బాహువులను కల, మాల్ = సర్వేశ్వరుడు, కిడన్ద = పరుండి ఉండే, నీళ్ కడల్ = విశాలమైన సాగరంలో, నీరాడువాన్ = తీర్థమాడడంకోసం (స్నానం చేయడం కోసం) పూణ్డ నాళ్ ఎల్లామ్ = ప్రతిప్రభాతంలోను, పుకుమ్ = బయలుదేరి ప్రవేశిస్తున్నది.

"మాల్" - సర్వేశ్వరుడని, భక్తులపట్ల అంతు లేని వ్యామోహాన్ని కలవాడని అర్థం. "పూణ్డ నాళ్ ఎల్లామ్"- సూర్యుని రథంలో గుఱ్ఱాలను పూన్చిన దినాలు అన్నీ -అని అర్థం చెప్పి, పొద్దు పొడిచిన ప్రతి ఉదయంలోను అనే భావాన్ని గ్రహించాలి- అని శ్రీ ప్రభ. అణ్ణాస్వామివారి దివ్యార్థదీపికా వివరణం. ఈ పాశురంలోని "పాడుమ్, శూడుమ్, పుకుమ్"- అనే క్రియాపదాలను విధ్యర్థకరూపాలుగా గ్రహించి లోకులను ఉద్దేశించి ఆళ్వార్లు- ఏదైనా ఒక కొండ పేరు ప్రస్తావనకు వస్తే అపుడు మీరు నిష్ఫలం అయిన ఏదో కొండ పేరును చెప్పకుండా, స్వామి వేంచేసి ఉండే తిరుమలైకొండ పేరును సార్థకం అయేటట్లు పాడండి; ఏదైనా ఒక పూవును అలంకరించుకోవాలని అనుకుంటే, అపుడు "ఇదే

మన స్వరూపానికి తగినది"- అని ప్రాప్తశేషి అయిన అతడు అభిలషించే తులసిని మీ కేశంలో అలంకరించుకోండి; కన్పించిన ఏదో పూవును పెట్టుకొని ప్రయోజనం లేదు. ఏదైనా ఒక తీర్థంలో ప్రవేశించి ప్రాతఃస్నానాన్ని చేయాలి అని మీరు అనుకుంటే, విరోధినిరసనాన్ని సహజంగా కల్గిన స్వామి పరుండి ఉండే క్షీరాబ్దిలో స్నానం చేయండి" అని ఉపదేశిస్తున్నారనికూడా వ్యాఖ్యానం చేయబడింది. అయితే, మనం దరి చేరడానికి సాధ్యం కాని క్షీరాబ్దిలో స్నానం చేయమని ఆழ்వార్లు అంటున్నారేమి? - అని అంటే, ఇక్కడ క్షీరాబ్ది అనే పదం భగవత్సంబంధాన్నికల తీర్థాలకు అన్నిటికీ ఉపలక్షణం- అని గ్రహించాలి. ఈ ఉపలక్షణ ప్రక్రియలోని క్లేశాన్నిబట్టి, పూర్వం తెల్పిన రీతిలో **"పాడుమ్, శూడుమ్, పుకుమ్"** అనే క్రియారూపాలను సమాపకక్రియలుగా గ్రహించడంలోని క్లేశాన్నిబట్టి మొదట నిర్వహించినరీతిలో మాతృవచనంగా గ్రహించడంలోనే అధికస్వారస్యం ఉన్నది కనుక, పెరియవాచ్చాన్‌పిళ్ళై తమ వ్యాఖ్యలో ఆ అర్థ నిర్వాహాన్నే ముందుగా గ్రహించారు.

అవ :- గడచిన పాశురంలో తెల్పిన రీతిలోనే భగవానుని ఆశ్రయించి నట్లయితే, దానికి కొన్ని యోగ్యతలు కావాలికదా! - అని అంటే, "తిర్యక్కులు సైతం తనను ఆశ్రయించేటట్లుగా వేంచేసి ఉన్నవాడై, వాటి దేహయాత్ర అంతా తన సమాశ్రయణానికి వీలుగా గ్రహించేవాడు కనుక ఏయోగ్యత ప్రత్యేకంగా ఆవశ్యకం కాదు- అని ఇందులో అంటున్నారు.

**70.** **పుకు మదత్తాల్ వాయ్‌పూశి క్కీழ் తాழ்న్దు అరువి**
**ఉకు మదత్తాల్ కాల్ కழுవి క్కైయాల్- మికు మదత్తేన్**
**విణ్డ మలర్ కొణ్డు విఱల్ వేఙ్గడవనైయే**
**కణ్డు వణఙ్గుమ్ కళిఱు**

కళిఱు = (తిరుమలలో ఉండే) ఏనుగు, పుకు మదత్తాల్ వాయ్ పూశి = తన మస్తకంనుండి, కర్ణాలనుండి నోటిలోనికి వచ్చే మదజలంతో నోటిని పుక్కిలించి, ఆచమనం చేసి, కీழ் తాழ்న్దు అరువి ఉకు మదత్తాల్ = పైనుండి క్రిందవరకు కొండవాగులవలె ప్రవహించే మదజలంతో, కాల్ కழுవి = కాళ్ళను



కడుగుకొని, క్కైయాల్ = తొండంతో, మికు మదమ్ తేన్ = మిక్కిలి మదాన్ని కల్గించే తేనెను కల్గినది, విణ్డ = వికసించినది అయిన, మలర్ కొణ్డు = పుష్పాలను సేకరించి, కొనివచ్చి, విఱల్ వేఙ్గడవనైయే = గొప్ప సామర్థ్యాన్ని కలవాడైన తిరుమలేశుని, కణ్డు వణఙ్గుమ్= సేవించి, నమస్కరిస్తున్నది.

ఈ విధంగా జ్ఞానంతో కలుగదగిన ఆశ్రయణాన్ని దేశవాసాన్ని పురస్కరించుకొని భగవానుడు తిర్యక్కులకుకూడా అనుగ్రహిస్తున్నాడు కనుక, అతనిని ఆశ్రయించడానికి వేఱే యోగ్యత కావాలేమో! - అనే సంశయం పడనక్కరలేదని ఇందులో తెలుపబడింది.

**(విఱల్‌వేఙ్గడవనైయే)** - శాస్త్రవిధులకు లక్ష్యంకాని తిర్యక్కులకు తనపట్ల భక్తిని, జ్ఞానాన్ని కల్గించ గల్గిన మహాబలాన్ని కల వేంకటేశ్వరుడని అర్థం.

అవ :- విరోధినిరసనాన్నే స్వభావంగా కలవాడు నిత్యవాసం చేసే తిరుమలైలో వానరాలు కూడా (తిర్యక్కులు కూడా) ఆ విరోధినిరసనస్వభావాన్నే కల్గి ఉన్నాయి- అని ఇందులో అంటున్నారు.

**71.** **కళిఱు ముకిల్ కుత్తక్కైయెడుత్తోడి**
**ఒళిఱు మఱుప్పొశిక్కై యాళి- పిళిఱి**
**విழ కొన్ఱు నిన్ఱదిరుమ్ వేఙ్గడమే మేనాళ్**
**కుழக్కన్ఱు కొణ్డెఱిన్దాన్ కున్ఱు**

కళిఱు = ఏనుగు, కై ఎడుత్తు ఓడి = తన తొండాన్ని ఎత్తి, వేగంగా పరుగెత్తి, ముకిల్ = "మదలియానైపోల్ ఎழுన్ద" అని అన్నట్లు ఆకాశంలో పైకి వచ్చిన) మేఘాలను, కుత్త = తనకు ప్రత్యర్థి అయిన వేఱొక గజం - అని భావించి గుద్దగా, యాళి = దీనిని చూచిన శరభమృగం, ఒళిఱు మఱుప్పు = ఆ ఏనుగుయొక్క ప్రకాశించే దంతాన్ని, ఒశి = విఱిచే, కై = తొండాన్ని కల్గినదై, పిళిఱి విழ కొన్ఱు = ఆ ఏనుగు నోరు తెఱచి ఘీంకరిస్తూ కిందపడేటట్లు దానిని చంపి, నిన్ఱు అతిరుమ్ = అక్కడే నిలచి ఉండి, గొప్ప గర్జనను చేసే, వేఙ్గడమే = వేంకటాచలమే, మేల్ నాళ్ = పూర్వం ఒకానొక సమయంలో, కుழ కన్ఱు కొణ్డు=

లేగదూడలను విసరే కర్రగా తీసికొని, ఎఱిన్దాన్ = వెలగపండ్లపై విసరి కొట్టిన స్వామియొక్క, కున్టు = నివాసమైన పర్వతం

తనకు స్వభావ సిద్ధమైన శత్రునిరసనాన్ని చేసి ఆనందించే స్వామి వేంచేసి ఉండే తిరుమలైలోని తిర్యక్కులు కూడా, తమ సహజశత్రువులను నిరసించి ఆనందిస్తున్నాయి - అని భావం. పరమాత్మ నివసించే కొండపై నివసించే జీవరాసులు కూడా ఒక దానిని ఇంకొకటి బాధిస్తాయా?- అని అంటే, "అగ్నీషోమీయయాగంలో హింసింపబడే మృగానికి స్వర్గం అనే ఉత్కృష్టమైన గతి ప్రాప్తించడంవల్ల, అది హింస కాదు'' - అని నిష్కర్షింపబడినట్లే, ఈ దేశవాససంబంధంచేత ఇక్కడ ఇది కూడా హింస కాదు- అని నిర్ణయించడంలో విప్రతిపత్తి ఏమీ లేదు.

అవ:- **"అయర్వఱుమ్ అమరర్‌కళ్ అదిపతి"** అయిన సర్వేశ్వరుని చూచి ఆనందించడం వేంకటాచలంలోనే కదా!'' అని ఇందులో అంటున్నారు.

**72. కున్టొన్టినాయ కుఱమకళిర్ కోల్ వళైక్కై**
**శెన్టు విళైయాడుమ్ తీజ్గ*ఴై* పోయ్- వెన్టు**
**విళఙ్గు మదికోళ్ విడుక్కుమ్ వేఙ్గడమే మేలై**
**ఇళఙ్గుమరర్ కోమానిడమ్**

కున్టు ఒన్టినాయ్ = ఆ తిరుమలై ఒక్కటి తప్ప ఇంక వేఱొక చోటును తెలియనివారై, శెన్టు = తిరుమలై పర్వతం పైకి వెళ్ళి, విళైయాడుమ్ = క్రీడించే, కుఱ మకళిర్ = కోయకాంతలు, కోల్ వళై కై = అందమైన వలయాలను (గాజులను) అలంకరించుకొన్న చేతులతో (వంచబడ్డ), తీమ్ క*ఴై* = అందమైన వెదుళ్ళు, పోయ్ = చంద్రమండలంవరకు పోయి, వెన్టు = రాహువును జయించి (అడ్డుకొని), విళఙ్గు మది కోళ్ విడుక్కుమ్ = ప్రకాశించే చంద్రుని గ్రహణాన్ని విడిపించే, వేఙ్గడమే = తిరుమలైయే, మేలై= = పైలోకంలో ఉండే, ఇళ కుమరర్ కోమాన్ = నిత్యయువకులైన నిత్యసూరులకునాథుడైన భగవానుని, ఇడమ్ = దివ్యదేశం.



అన్ని లోకాలకు పైన గల పరమపదంలో ఎల్లప్పుడూ భగవానుని అనుభవించడంవల్ల అతనివలె ఇరవైనాల్గు సంవత్సరాల వయస్సు నిండినవారై ఉండే నిత్యసూరులకు స్వామి నివసించే దేశంకదా ఇది. ఇది ఇంత ఉన్నతంగా ఉండడంలో ఆశ్చర్యం ఏమీ లేదని భావం. **"మేలే"** - అన్ని లోకాలకుపైన ఉండే పరమపదంలో - అని భావం. లేక, జీవులందఱిలో గొప్పవారైన, నిత్యయౌవనులు- అని నిత్యసూరులకు విశేషణంగా కూడా దీనిని చేయవచ్చు. ఈ విధంగా **"అయర్వఱు అమరర్‌కళ్ అదిపతి"**ని తిరుమలైలో దర్శించి, ఆనందించవచ్చు- అని తెల్పినట్లయింది.

అవ :- "తిరుమలైలో నిలచి ఉన్నవాడై, మనస్సును ఆకర్షించే లీలలను కలవాడైన భగవానుని శ్రీచరణాలను స్తుతించడమే జిహ్వా ఉన్నందుకు తగిన ఫలం''- అని ఇందులో అంటున్నారు.

**73. ఇడమ్ వలమే*ఴ్* పూణ్డ ఇరవిత్తేరోట్టి**
**వడముక వేఙ్గడత్తు మన్నుమ్- కుడనయన్ద**
**కూత్తనాయ్ నిన్ఱాన్ కురైక*ఴ*లే కూఱువదే**
**నాత్తన్నాల్ ఉళ్ళ నలమ్**

ఇడమ్ వలమ్ = ఎడమవైపు, కుడివైపు ఏ*ఴ్* పూణ్డ = ఏడు గుఱ్ఱాలను కట్టిన, ఇరవి తేర్ = సూర్యుని రథాన్ని, ఓట్టి = అంతర్యామిగా ఉండి నడపి, వడ ముకమ్ వేఙ్గడత్తు మన్నుమ్ = ఉత్తర దిక్కులో ఉండే వేంకటాచలంలో నిత్యవాసాన్ని చేసేవాడు, కుడమ్ నయత్త కూత్తన్ ఆయ్ నిన్ఱాన్ = (ఆశతో) కుంభనృత్యాన్ని ఆడిన శ్రీకృష్ణుడై అవతరించినవాడైన భగవానుని, కురై క*ఴ*ల్ కూఱువదే = ఆభరణధ్వని పొందికగా ఉండే శ్రీచరణాలను స్తుతించడమే, నా తన్నాల్ ఉళ్ళ నలమ్ = జిహ్వావల్ల పొందదగిన ఫలం.

**"ఏ*ఴ్* పూణ్డ ఇరవిత్తేర్ ఇడమ్ వలమ్ పూట్టి"**, **"సప్త యుంజంతి రథమేకచక్రమ్"** (ఒక చక్రాన్ని కల రథానికి ఏడు గుఱ్ఱాలు పూన్చబడ్డాయి) అని వేదంలో, **"హయాశ్చ సప్త ఛందాంసి తేషాం నామాని మే శ్రుణు, గాయత్రీ చ బృహత్యుష్ణిక్ జగతీ త్రిష్టుభేవ చ, అనుష్టుప్ పంక్తి రిత్యుక్తాః ఛందాసి హరయో**

రవేః" (సూర్యుని రథానికి గల ఏడు గుఱ్ఱాలు ఏడు ఛందస్సులే. వాటిని పేర్లను చెబుతున్నాను.. విను. (1) గాయత్రి, (2) బృహతి, (3) ఉష్ణిక్, (4) జగతీ, (5)త్రిష్టుప్, (6) అనుష్టుప్, (7) పంక్తి అనిచెప్పబడే ఏడు ఛందస్సులే సూర్యుని రథాలు) అని ఉపబృంహణాలలోను, **"కారార్ పురవి ఏழ్ పూణ్డతనియాழి త్తేరార్ నిఱైకతిరోన్"** అని శిఱియ తిరుమడల్‌లోను చెప్పబడింది.

అవ :- "భగవానునిపట్ల అనురాగాన్ని కలవారిలో యశోదాదేవివలె అనురాగాన్ని కలవారెవ్వరూ లేరు" - అని ఇందులో అంటున్నారు.

**74.** **నలమే వలిదుకొల్ నఞ్జూట్టువన్ పేయ్**
**నిలమే పురణ్డు పోయ్ వీழ- శలమేతాన్**
**వెఙ్గొఙ్గై యుణ్డానై మీట్టాయ్చ్చి యూట్టువాన్**
**తన్ కొఙ్గై వాయ్ వైత్తాళ్ శార్న్దు**

శలమే = వంచనగానే, నఞ్జు = విషాన్ని, ఊట్టు = తాగించాలని వచ్చిన,వన్ పేయ్ = క్రూరమైన పూతన, నిలమే = భూమిలో, పురణ్డు పోయ్ వీழ = శవంగా దొర్లి కిందపడేటట్లుగా, తాన్ శలమే = తానుకూడా వంచనతోనే, వెమ్ కొఙ్గై = విషం నిండి ఉన్నందున క్రూరత్వం నిండిన ఆమెయొక్క స్తన్యాన్ని, ఉణ్డానై = ఆరగించిన శ్రీకృష్ణుని, ఆయ్చ్చి = యశోదాదేవి, మీట్టు =ఆ పూతనదగ్గరనుండి మళ్ళించి, ఊట్టువాన్ = తన స్తన్యాన్ని తాగించడంకోసం, శార్న్దు = దగ్గరకు వచ్చి, తన్ కొఙ్గై = తన స్తన్యాన్ని, వాయ్ వైత్తాన్ = అతని నోటిలో తాగడంకోసం పెట్టింది, నలమే వలిదు కొల్ = ఆమె ఆ ప్రేమ చాలా బలమైనది కాబోలు !

స్త్రీ సహజమైన అయిన భయంకంటే తల్లికి తగిన అనురాగమే బలీయమైనది కాబోలు! "ఇతనికి పాలిస్తే పూతన ప్రాణాలు పోయినట్లుగానే, నా ప్రాణాలుకూడా పోతే ఏంచేయాలి ?- అని భయపడి పాలివ్వడానికి జంకేటట్లు చేసే జ్ఞానంకంటే, తననుగూర్చి పట్టించుకోకుండా బిడ్డనుగూర్చే ఆలోచించేటట్లు చేసే ఆమె ప్రేమాంధ్యమే బలమైనది కాబోలు! - అని ఆழ్వార్లు విస్మితులవు తున్నారు.



**"ఎన్నొరువర్ మెయ్యెన్బర్"** అని అంటూ పొయ్‌కై ఆழ్వార్లు పల్కినట్లే యశోదకే సొంతం అయినది, నమ్మ శక్యం కానిది, యశోదకు ఉండే ఈ ప్రేమాతిశయం.

అవ :- ఈ రీతిలో విరోధులను నిరసించడమే స్వభావంగా కలవాడైన శ్రీకృష్ణుడు ఎంతో ఆదరంతో వేంచేసి ఉండే తిరుమలైయొక్క గొప్పతనాన్ని ఇందులో ఆழ్వార్లు అనుభవిస్తున్నారు.

**75.** **శార్న్ద కడు తేయ్‌ప్ప త్తడావియ కోట్టుచ్చివాయ్**
**ఊర్న్దియఱ్గుమ్ వెణ్‌మదియి నొణ్ ముయలై- శేర్న్దు**
**శినవేఙ్గై పార్క్కుమ్ తిరుమలైయే ఆయన్**
**పునవేఙ్గై నాఱుమ్ పొరుప్పు**

తడావియ = విస్తృతిని కల్గిన, కోడు = (తిరుమలై) పర్వతశిఖరాల, ఉచ్చివాయ్= అగ్రభాగంలోకి, అకడు తేయ్‌ప్ప = తన ఉదరంలోని కింది భాగం స్పృశించేటట్లుగా, శార్న్దు = చేరి, ఊర్న్దు ఇయఱ్గుమ్ = మెల్లగా పాకుతూ సంచరించే, వెణ్ మదియిన్= తెల్లని కాంతిని కల్గిన చంద్రునిలో ఉండే, ఒణ్ ముయలై = అందమైన కుందేలును, శినమ్ వేఙ్గై = కోపాన్ని కల వేఙ్గై పులి, శేర్న్దు = దాని దగ్గరకు వచ్చి, పార్క్కుమ్ = (దానిని పట్టుకోకుండా, విడిచివెళ్ళి పోకుండా) ఎప్పుడూ చూచిన రీతిలోనే నిలచి ఉండే, తిరుమలైయే = వేంకటాచలమే, అయన్ = గోపాలుడై అవతరించిన స్వామియొక్క, పునమ్ వేఙ్గై నాఱుమ్ = స్వస్థానంలో పెఱిగి, సమృద్ధం అయిన వేఙ్గై వృక్షాల పరిమళం గుబాళించే, పొరుప్పు = పర్వతం.

నిజమైన కుందేలు లేదు కనుక, అంతపైకి పులి ఎక్కలేదు కనుక, కుందేలును పులి పట్టుకోలేకపోయింది. అయినా, మాంసంలో సహజంగా తనకు ఉన్న ఆశచేత పులి విడిచి పోలేదు. ఇటువంటి అద్భుతసన్నివేశంతో భాసించే తిరుమలైయే ముందు పల్కిన పూతనాసంహారకుడైన శ్రీకృష్ణుడు తనకు తగిన నివాసస్థం అని అభిమానించిన, స్వస్థానంలో ఏపుగా పెరిగిన వేఙ్గైవృక్షాల సువాసనతో నిండినదైన పర్వతం. అరణ్యప్రాంతాలలో నివసించే గోపాల జాతికి అరణ్యంలో వృక్షాల

పరిమళం చాలా భోగ్యంగా ఉంటుంది కనుక, గోపాలుడైన శ్రీకృష్ణుడు ఈ ప్రదేశంలో తిరుమలేశునిగా నిత్యవాసం చేస్తున్నాడని తాత్పర్యం.

అవ :- సర్వేశ్వరుడు తన సుకుమారమైన దివ్యదేహాన్ని పట్టించుకోకుండా, మన కార్యాన్ని పూర్తి చేయడంకోసం ఈ సంసారమండలానికి వచ్చి, శ్రీకృష్ణుడై అవతరించడంతో తృప్తిపడకుండా, పలు పలు చోట్ల అర్చారూపిగా నివాసాన్ని ఏర్పరచుకొని వేంచేసి ఉన్నాడు. ఆ విధంగా అతడు ఉన్నపుడు అతనిని ఉపాయంగా ఆశ్రయించి, సుఖంగా ఉజ్జీవించకుండా, మన శరీరాన్ని శ్రమింప జేసికొని, కఠిన తపస్సును చేయవద్దు - అని లోకులను ఉద్దేశించి ఇందులో అంటున్నారు.

76. పొరుప్పిడైయే నిన్ఱుమ్ పునల్ కుళిత్తుమ్ ఐన్దు
నెరుప్పిడైయే నిఱ్కవుమ్ నీర్ వేణ్డా- విరుప్పుడైయ
వెంగికావే శేర్న్దానై మెయ్మ్మలర్ తూయ్ క్కైతొழுదాల్
అంగికావే తీవినైకళాయ్న్దు

నీర్ = (ఓ లోకులారా !) మీరు, పొరుప్పు ఇడైయే = పర్వతం నడుమన, నిన్ఱుమ్ = నిలచి ఉండి, పునల్ = జలప్రదేశాలలో, కుళిత్తుమ్ = మునుగుతూ, ఐన్దు నెరుప్పు ఇడైయే = పంచాగ్నుల నడుమ, నిఱ్కవుమ్ = నిలచి ఉంటూ తపస్సు చేయవలసిన, వేణ్డా = అక్కర లేదు, విరుప్పు ఉడైయ = (అందఱిచేత) అభిలషించదగినదిగా ఉండే, వెంగికా = తిరువెంగికా అనే దివ్యక్షేత్రానికి, శేర్న్దానై= వచ్చి, శయనించి ఉండే స్వామిని, మెయ్ = ఏ ప్రయోజనాన్ని ఆశించకుండా, మలర్ తూయ్ = పుష్పాలను సమర్పించి, కై తొழுతాల్ = నమస్కరించ గల్గినట్లయితే, తీ వినైకళ్ = పాపాలు అన్నీ, ఆయ్న్దు = (మనకు ఇక్కడ చోటు లేదు అని) పరిశీలించి, తెలిసికొని, అంగికావే = సంకోచించి తొలగిపోవా! (తొలగిపోతాయి).

పరిశీలించి చూడడానికి పాపాలకు చైతన్యం ఉన్నదా అని అంటే **"వృష్టి ప్రతీక్షాః శాలయః"** (సస్యక్షేత్రాలు వర్షంకోసం ఎదురుచూస్తున్నాయి) అనే రీతిలో చేతనసమాధిలో చెప్పిన సూక్తి ఇది. భగవన్నిగ్రహరూపాలైన పాపాలు అతడు



"క్షమించాను" అని అంటే తీరిపోతాయని భావం. ఈ విధంగా ప్రాప్తశేషి విషయంలో స్వరూపప్రాప్తమైన సులభమైన, అరుదైన కార్యాలను చేయవలసిన అక్కఱ లేనేలేదని తెలుపబడింది.

అవ :- "సర్వేశ్వరుని ఆశ్రయించగానే అతని నిగ్రహరూపాలైన పాపాలు అన్నీ తమకు తామే విడిచి పోతాయి" - అని గత పాశురంలో అన్నారు. ఇక, ఈ పాశురంలో, అధికమైన జ్ఞానశక్తులను కల బ్రహ్మ మొదలైనవారుసైతం జరుగబోయేది ఏదో తెలియక, తమకు తామే ఆపదను కొనితెచ్చుకొన్నపుడు, తాను ముందుండి వారి పత్తును పోగొట్టి, వారిని రక్షించగల సర్వేశ్వరుడే మనకు రక్షకుడు - అని అంటున్నారు. ఈ పాశురంలో అనుసంధింపబడ్డ అపూర్వమైన ఇతిహాసాన్ని **"ఆమే యమరర్క్కఱియ"** (ముదల్ తిరు-45) అనే పాశురంలో సరోయాగి, **"కొణ్డు కుడఙ్గాల్ మేల్"** (నాన్ముకన్- 44) అనే పాశురంలో భక్తిసారులు అనుసంధించారు. తత్త్వద్రష్టలైన ఆழ்వార్లు కల్పాంతరాలలో జరిగిన వృత్తాంతాలనుసైతం దర్శించి పలుకగలవారనే విషయానికి ఇటువంటి పాశురాలు నిదర్శనం.

77. ఆయ్న్ద వరుమఱైయోన్ నాన్ ముకత్తోన్ నన్గుఅఙ్గిల్
వాయ్న్ద కుழవియాయ్ వాళరక్కన్- ఏయ్న్ద
ముడిప్పోదు మూన్ఱేழ்ఎణ్ణినాన్ ఆర్న్ద
అడిప్పోతు నఙ్గట్కరణ్

ఆయ్న్ద = పరిశీలించి అభ్యసింపబడ్డ, అరు మఱైయోన్ = అపూర్వమైన వేదాలను కలవాడైన, నాన్ ముకత్తోన్ = చతుర్ముఖబ్రహ్మయొక్క, నన్ కుఅఙ్గిల్= అందమైన ఒడిలో, వాయ్న్ద = చేరిన, కుழవి ఆయ్ = చిన్నశిశువై ఉండి, వాళ్ అరక్కన్ = ఆయుధాన్ని కల రావణునియొక్క, ఓయ్న్ద = ఖండించదగిన, పోదు ముడి = వరుసలుగా ఉండే శిరస్సులను, మూన్ఱు ఏழு ఎన్ఱు ఎణ్ణినాన్ = మూడు, ఏడు-పది అని (తన ఒడిలో) లెక్కించి చూపినవానియొక్క, అడి పోదు= శ్రీపాదపద్మాలు, నఙ్గట్కు= మనకు, ఆర్న్ద అరన్ = కొఱత లేని ఉపాయం.

**"ఆర్న్ద అడిప్పోదు"** అనే ప్రయోగం భగవానుని శ్రీచరణాల భోగ్యతను తెలుపు తున్నదని అప్పిళ్ళై అనే ఆచార్యుల నిర్వాహం. అధికజ్ఞానశక్తులను కల బ్రహ్మాదులనుకూడా రక్షించగలవాడే మనకు రక్షకం- అని ఇందులో చెప్పబడి నట్లయింది.

**(ఆర్న్ద)** - బ్రహ్మను హెచ్చరించి, "మానవులు తప్ప మిగిలిన వారివల్ల మరణంలేదు'' - అని హిరణ్యా కశిపుడు అడిగిన వరాన్ని అంగీకరింపజేసి, మానవుడై తాను అవతరించి, అతనిని వధించే అవకాశాన్ని పొంది - ఈవిధంగా తాను తలచిన కార్యాన్ని నిర్వహించ గల్గిన భగవానుని సామర్థ్యంలోని పూర్తిని ఈ పదం తెల్పుతున్నది.

అవ :- "భగవానుడు మనకు ఉపాయం అయినపుడు మన పుట్టుక, శీలం, జ్ఞానం- మొదలైనవానిలోని అధమత్వాన్ని చూచి వెనుకంజవేయకుండా రక్షిస్తాడు, అటువంటి అతని తిరునామాలను పల్కు''- అని తమ మనస్సుకు ఆళ్వార్లు ఇందులో ఉపదేశిస్తున్నారు.

**78. అరణామ్ నమక్కెన్ఱుమ్ ఆழிవలవన్
మురనాళ్ వలమ్ శుழிన్ద మొయ్మ్బన్- శరణామేల్
ఏదు కది యేదు నిలై యేతు పిఱప్పెన్నాదే
ఓదు కది మాయనైయే యోర్త్తు**

ఆழி = శ్రీసుదర్శనాన్ని, వలవన్ = కుడివైపున శ్రీహస్తంలో కలవాడు, మురన్= మురాసురుని, నాళ్ = దీర్ఘాయుస్సువల్ల కల్గిన, వలమ్ = బలాన్ని, శుழிన్ద = పోగొట్టిన, మొయ్మ్బన్ = సామర్థ్యాన్ని కలవాడు, అయిన స్వామి, శరణమ్ ఆమ్ ఏల్ = రక్షకుడుగా అయినట్లయితే, కతి ఏదు నిలై ఏదు పిఱప్పు ఏదు ఎణ్ణాతే = మనయొక్క జ్ఞానం ఏది ? శీలం ఏది ? జన్మ ఏది ? అని వీటి హెచ్చుతగ్గులను గమనించి వెనుకకు తగ్గడం చేయకుండా, నమక్కు ఎన్ఱుమ్ అరణ్ ఆమ్ = మనకు అన్ని కాలాలలోను రక్షకుడై ఉండేవాడు, మాయనైయే = (ఓ మనసా!) ఆశ్చర్యాన్ని కల్గించే చేష్టితాలను కలవాడైన ఆ స్వామినే, కతి = ఉపాయంగా, ఓర్త్తు = నిశ్చయించుకొని, ఓదు = అతని తిరునామాలను అనుసంధించు.



మన నైచ్యాన్ని చూచి వెనుకంజవేయకుండా రక్షకత్వానికి తగిన, ఆశ్చర్య కరాలైన గుణాలను, లీలలను కల సర్వేశ్వరునే ఉపాయంగా నిశ్చయించుకొని, కాలక్షేపానికి తగినట్లు అతని తిరునామాలకు పల్కు - అని భావం. ఎనభైయవ పాశురంలో **"తేర్పడువాన్తాన్ ముయలుమ్ నెఞ్జు"** అని చెప్పబడ్డ మనస్సును ఉద్దేశించియే ఉపదేశిస్తున్నారు - అని గ్రహించాలి.

**"ఓదు కతి మాతవనై ఓర్త్తు"** అనే పాఠానుసారం -శ్రియఃపతినే ఉపాయంగా నిశ్చయించుకొని, అతని తిరునామాలను పల్కు - అని అర్థం. పురుషకార సంబంధాన్ని అనుసంధించి నిర్భయంగా ఉండమని అంటున్నారు. ఈ రీతిలో దివ్యదంపతులు తల్లితండ్రియై మనలను రక్షించేవారై ఉన్నపుడు మన తక్కువదనాన్ని భావించి కలత చెందకుండా, దివ్యదంపతులనే రక్షకులుగా నిశ్చయించుకొని, ధైర్యంగా ఉండడమే మనం చేయదగిన పని- అని ఇందులో తెలుపబడి నట్లయింది.

అవ :- "అనాదికాలంగా మనం కొండలు కొండలుగా పాపాలను ఎన్నిటినో చేసినపుడు, వాటిని పోగొట్టడానికి అనంతకాలం ఆవశ్యకం కదా''- అని అంటే, శుభాశ్రయమైన దివ్యమంగళవిగ్రహంతో కూడిన అతనిని అనుసంధించి, శబ్దాది విషయాలలో సంగాన్ని మనం విడచినట్లయితే, మన పాపాలు వెంటనే పరుగెత్తి పోతాయి. పాపఫలాలైన జన్మలుకూడా తొలగిపోతాయి - అని ఇందులో అంటున్నారు.

**79. ఓర్త్త మనత్తరాయ్ ఐన్దడక్కి యారాయ్న్దు
పేర్త్తాల్ పిఱప్పేழுమ్ పేర్క్కలామ్- కార్త్త
విరైయార్ నఱున్దుழாయ్ వీజ్గోద మేని
నిరైయార మార్వనైయే నిన్ఱు**

కార్త్త = పచ్చని వర్ణాన్ని కల్గినదై, విరై ఆర్= పరిమళం నిండినదైన, నఱు తుழாయ్ = అందమైన తులసీమాలను అలంకరించుకొన్నవాడు, వీజ్గు ఓదమ్ మేని= నిద్రించిన (ప్రశాంతమైన) సముద్రంవంటి తిరుమేనిని కలవాడు, నిరై ఆరమ్ మార్వనైయే = పేటలుగా కూర్చబడ్డ హారాలతో అలంకరింపబడిన వక్షః

స్థలాన్ని కలవాడు అయిన స్వామిని, నిన్ఱు = స్థిరంగా నిలచి, ఓర్త్త మనత్తార్ ఆయ్ = (అతనిని నామాలను) అనుసంధించే మనస్సును కలవారై, ఐన్దు అడక్కి = పంచేంద్రియాలను నియంత్రించి, ఆరాయ్న్దు= సంసారంలోని నైచ్యాన్ని విచారించి, పేర్త్తాల్ = అందులోనుండి మనస్సును నివర్తింప జేసికొంటే, పిఱప్పు ఏழுమ్ = ఒకదానివెంట ఇంకొకటిగా వచ్చే జన్మ పరంపరలను, పేర్క్కలామ్ = సులభంగా పోగొట్టుకోవచ్చు.

ఈ విధంగా ఇంద్రియాలతో కూడిన మనస్సును సవాసనగా శబ్దాది విషయాల నుండి విస్తరింపజేస్తే, జన్మకారణమైన పాపాలు తొలగిపోతాయి. కనుక, ఉపాయం తెలిసినవారు, పెద్దగోడను కూడా అవలీలగా కూలదోసేటట్లు, పలు జన్మలను సైతం చటుక్కున తొలగించుకోవచ్చు. **"పిఱప్పు ఏழுమ్"** (ఏడు జన్మలను) అనే ప్రయోగం ఉపలక్షణం. **"పునరపి జననం పునరపి మరణం పునరపి జననీజఠరే శయనమ్"** (మరణం తరువాత పుట్టుక, మళ్ళీ మరణం, మళ్ళీ తల్లిగర్భంలో శయనించడం) అనేరీతిలో ఒకదాని తరువాత ఇంకొకటిగా నిరంతరంగా కలిగే పలుజన్మలను ఈ ప్రయోగం లక్షిస్తుంది. **"పేర్క్కలామ్"** అనే ప్రయోగం త్వరగా, సులభంగా పోగొట్టుకోవచ్చు అనే అర్థాన్ని తెల్పుతుంది.

ఈ పాశురంలో - అనాది కాలంగా పేరుకు పోయిన పాపాలను పోగొట్టు కోవాలంటే అనంతకాలం కావద్దా? అని భయపడవద్దు. భగవానుని దివ్యమంగళ విగ్రహాన్ని ఆశ్రయించినబలంవల్ల ఇంద్రియ నిగ్రహాన్ని పొంది, లౌకికవిషయాల లోని రుచి, వాసనలను పోగొట్టుకొని, తద్ద్వారా పాపాలు నశించడంవల్ల, పాపఫలాలుగా సంభవించే జన్మపరంపరలను పోగొట్టుకోవచ్చునని తెలుప బడింది.

అవ :- "ఈవిధంగా ఇంద్రియాలను జయించి, సంసారనైచ్యాన్ని అనుసంధించి, శబ్దాదిలౌకికవిషయాలలోని రుచి - వాసనలను పోగొట్టుకొని, సంసారసంబంధాన్ని మీరు లేకుండా చేసికొన్నారా?" అని అంటే - "నేను దీనికోసం ఏ ప్రయత్నాన్ని చేయలేదు. నా పాపాలను అతడు పోగొట్టినపుడే, విరోధినిరసనాన్ని సహజంగా కల్గిన అతనిని పొందగలను - అని నాకంటే ముందుగా నా మనస్సు తానే అతని విషయంలో అభినివేశాన్ని పొందింది" - అని అంటున్నారు.



**80. నిన్ఱెదిరాయ నిరైమణి త్తేర్ వాణన్ తోళ్**
**ఒన్ఱియ ఈరైఞ్ఞూఱుడన్ తుణియ- వెన్ఱిలఙ్గుమ్**
**ఆర్ పడువాన్ నేమి యరవణైయాన్ శేవడిక్కే**
**నేర్ పడువాన్ తాన్ ముయలుమ్ నెఞ్జు**

నిన్ఱు = జంకకుండాఎదురుగా వచ్చి నిలచి, ఎదిర్ ఆయ్ = శత్రువై పోరాడడానికి వచ్చినవాడు, నిరై మణి తేర్ = చక్కగా పొదిగిన రత్నాలను కల తేరుపై ఎక్కి వచ్చినవాడు అయిన, వాణన్ ఒన్ఱియ ఈర్ ఊఞ్ఞూఱు తోళ్ = బాణాసురుని ఆధారంగా పెరిగిన వేయి బాహువులను, ఉడన్ = ఒకే సమయంలో, తుణియ = ఖండించి, కింద పడేటట్లుగా చేసిన, వెన్ఱు = జయాన్ని పొంది, ఇలఙ్గుమ్ = దానివల్ల వెలిగే, ఆర్ పడు = పదునైన, వాన్ =బలమైన, నేమి = శ్రీసుదర్శనాన్ని కలవాడై, అరవు అణైయాన్= శేషశాయి అయిన భగవానుని, శే అడిక్కే = ఎఱ్ఱని శ్రీచరణాలలో, నేర్ పడువాన్ = చేరడంకోసం, నెఞ్జు = నామనస్సు, తాన్ = స్వయంగా, ముయలుమ్ = ఉత్సాహపడుతున్నది.

నా ప్రయత్నాన్ని ఎదురుచూడకుండా నా విరోధులను పోగొట్టి, నా మనస్సు నాకంటే ముందడుగు వేసి తానే స్వయంగా తన విషయంలో అభినివేశాన్ని పొందేటట్లు భగవానుడు చేశాడు - అని భావం.

అవ :- సంసారుల మనస్సువలె, నా మనస్సు శబ్దాదివిషయాలలో లగ్నం కాకుండా భగవానునిపట్ల తానే అభినివేశాన్ని పొందింది- అని గత పాశురంలో తమ మనస్సును ఆழ்వార్లు కీర్తించారు. మఱుక్షణంలో భగవద్విషయంలోని గౌరవాన్ని అనుసంధించగానే, "ఇంతటి మహనీయవిషయంలో నా మనస్సు ఇపుడేకదా అక్షరాభ్యాసాన్ని చేయడం ఆరంభించింది!" అని తోచి, "స్వామి ఇంతటి మహనీయుడు కనుక తెలియడానికి సులభుడు కాకపోయినా, వెనుకంజను ఏమాత్రం వేయకుండా నీవు ఆస్వామినే అనుసంధించాలి సుమా!" అని పాశురంలోని ప్రథమార్ధంలో తమ మనస్సుకు ఉపదేశించి, ఉత్తరార్ధంలో "అతనిని

ఈ మనస్సు అనుసంధించకుండా జంకడం ఎందుకో?'' అని తమను తామే ఇందులో ప్రశ్నించుకొంటున్నారు.

**81. నెఞ్జాల్ నినైప్పరియనేలుమ్ నిలై ప్పెఱ్ఱన్**
**నెఞ్జమే! పేశాయ్ నినైక్కుఙ్గాల్ - నెఞ్జత్తు**
**ప్పేరాదు నిఱ్కుమ్ పెరుమానై యెన్కొలో**
**ఓరాదు నిఱ్పదుణర్వు**

ఎన్ నెఞ్జమే = నాకు వశం అయిన ఓ మనసా!, నెఞ్జాల్ నినైప్పు అరియన్ ఏలుమ్ = భగవానుడు మనస్సుతో భావించడానికి వీలు కానివాడు కాకపోయినా, (అతని ఆ గొప్పతనాన్నిగూర్చి భావించి జంకకుండా, అతని సౌలభ్యాన్నే గణించి) నిలై ప్పెఱ్ఱు = కాలు ఊని నిలచి, పేశాయ్ = అతనినిగూర్చి పలుకు, నినైక్కుఙ్కాల్ = మనం ఒకసారి తలచినా, నెఞ్జత్తు = నా మనస్సులో, పేరాదు నిఱ్కుమ్ = విడచిపోలేక నిలకడగా నిలచి ఉండే, పెరుమానై = భగవానుని, ఉణర్వు = నా మనస్సు, ఓరాదు నిఱ్పదు ఎన్కొలో = తలచకుండా వ్యర్థంగా ఉండడం ఎందుకో కదా!,

**(ఎన్కొలో ఓరాదు నిఱ్పదు ఉణర్వు) - "ఒణ్ తామరైయాళ్కేళ్వన్ ఒరువనైయే నోక్కు ముణర్వు"** (ముదల్ తిరు-67) అనేరీతిలో అతనిని తెలియడం కోసమే ఉన్నది, అతనిని తెలియక పోతే సత్తను పొందని - అసత్కల్పంగా చెప్పదగిన జ్ఞానం కలిగే చోటు (ఇంద్రియమైన) మనస్సు - అని అర్థం. భగవానుని నా మనస్సు స్మరించకుండా ఉండడం ఎందుకో? కంటికి ఎదురుగా ప్రవహించే అమృత ప్రవాహాన్ని తాగకుండా, ఇనుమును కాచి, తాగాలని అనుకోవచ్చునా? అతృప్తా మృతమై, సులభుడైన అతనిని విడచి, భోగ్యత లేనివారు, ఆరాధనకు అనర్హులైన దేవతాంతరాలను ఆశ్రయించవచ్చునని అను కుంటున్నదా? నదీజలం ప్రవహిస్తూ ఉండగా, కంఠానికి అడ్డుపడే ఇసుకను మింగాలని భావించవచ్చునా? పానీయసదృశుడైన అతనిని విడచి, శబ్దాది విషయాలను అనుభవించాలని అనుకోవచ్చునా? ఈ మనస్సుకు నేను ఇంతగా ఉపదేశించిన తరువాతకూడా దేనినో తలచి అతని స్మరించకుండా ఉన్నది? - అని తమ ఆర్త్యతిశయంవల్ల మనస్సుపట్ల గల అతిశంకతో తమను తామే ఆళ్వార్లు ఇందులో ప్రశ్నించుకొంటున్నారు. ఈ పాశురంలో, మనస్సుతో పరిచ్ఛేదించడానికి సాధ్యం కాని భగవానుని గొప్పతనం ప్రతిపాదింపబడింది.



అవ :- "ఈ మనస్సును గర్హించి ఏం ప్రయోజనం? ఎవరివల్ల ఏవిధంగానూ పరిచ్ఛేదించడానికి సాధ్యం కానివాడై, విడువలేనట్లు సాటి లేని భోగ్యతను కలవాడై ఉండే భగవానుని దరి చేరి, దర్శించి ఆనందించడానికి దారి ఉన్నదా?'' - అని ఇందులో అంటున్నారు.

**82. ఉణరిలుణర్వరియన్ ఉళ్ళమ్ పుకున్దు**
**పుణరిలుమ్ కాణ్బరియ నుణ్మై- ఇణరణైయ**
**క్కొఙ్గణైన్దు వణ్డఱైయుమ్ తణ్డుழాయ్ క్కోమానై**
**ఎఙ్గణైన్దు క్కాణ్డు మిని**

ఉణరిల్ = (ఆ భగవానుని స్వప్రయత్నంతో మనకు మనమే) తెలిసికోవాలని చూచినా, ఉణర్వు అరియన్ = అతడు తెలియడానికి అంతు చిక్కనివాడు, (అతడే స్వయంగా), ఉళ్ళమ్ పుకున్దు పుణరిలుమ్ = మనస్సులో వచ్చి ప్రవేశించి ఆలింగనం చేసికొన్నా(కలిసినా), ఉణ్మై కాణ్బు అరియన్ = యథాతథంగా తెలియడానికి అరుదైనవాడు, ఇని = ఇక ఈ విధంగా ఉన్న తరువాత, ఇణర్ అణైయ = పూలగుత్తులు వేలాడగా, కొఙ్గు = తేనెలో, వణ్డు = తుమ్మెదలు, అణైన్దు = వచ్చి సమీపించి (ఆ మధువును) ఆస్వాదించి, అఱైయుమ్= ఝుంకారం చేసే, తణ్ = చల్లని, తుழాయ్ = తులసీమాలను అలంకరించుకొన్న, కోమానై = ఆ సర్వేశ్వరుని, ఇని = ఇక ఈ స్థితిలో, ఎఙ్గు = ఎక్కడ, అణైన్దు = దరి చేరి, కాణ్డుమ్ = చూడగలం?

ఈవిధంగా తెలియడానికి సాధ్యం కానివాడై, విడువడానికి వీలు కాని భోగ్యతను కలవాడై అతడున్నపుడు, అతనిని ఏకాలంలో ఏదేశంలో సమీపించి ఆశ్రయించి దర్శించడానికి వీలున్నది? అనంతకాలంలోను, నేరుగా సాక్షాత్కారంతో పరమపదంలోను కూడా అతనిని పరిచ్ఛేదించి తెలియడానికి వీలుకాదని తాత్పర్యం.

అవ :- "ఈ రీతిలో భగవానుడు ఎవరికీ దర్శించడానికి, భావించడానికి వీలు కానివాడై ఉంటే, అతనిని ఆ విధంగానే ఉండనివ్వండి. ఇపుడు మొట్టమొదట నా హృదయంలో ప్రవేశించి నివసిస్తున్నాడు. ఇది నాకు చాలు''- అని ఇందులో అంటున్నారు.

**83.** ఇని యవన్ మాయన్ ఎన వురైప్పరేలుమ్
ఇని యవన్ కాణ్బరియనేలుమ్- ఇనియవన్
కళ్ళత్తాల్ మణ్ కొణ్డు విణ్ కడన్ద పైఙ్గழలాన్
ఉళ్ళత్తినుళ్ళే యుళన్

ఇని = ఇపుడు, అవన్ = ఆ సర్వేశ్వరుడు, మాయన్ = తెలియడానికి సాధ్యం కాని ఆశ్చర్యభూతుడు, ఎన = అని, ఉరైప్పర్ ఏలుమ్ = చెప్పేవారై ఉన్నా, ఇని = ఇపుడు, అవన్ = ఆ స్వామి, కాణ్బు అరియన్ ఏలుమ్ = అనుభవించడానికి (దర్శించడానికి) వీలు కానివాడైనా, కళ్ళత్తాల్ = వంచనతో (మహాబలి దగ్గరకు పోయి), మణ్ కొణ్డు = మూడడుగుల నేలను గ్రహించి, విణ్ కడన్ద పై కழలాన్ అవన్ = ఆకాశం మొదలైన పైలోకాలను ఆక్రమించిన విశాలమైన శ్రీచరణాలను కలవాడైన ఆ స్వామి, ఇని = ఇపుడు, ఉళ్ళత్తిన్ ఉళ్ళే ఉళన్ = నా హృదయంలోపల (వేఱొక చోటు ఏదీ తెలియకుండా) స్థిరప్రతిష్ఠగా నిలచి ఉన్నాడు.

ఈ అరుదైన ఫలమే నాకు చాలు- అని భావం. నా హృదయంలో చోటు చేసికొని నిలచి ఉన్న తర్వాతే అతడు తన సత్తను పొందాడు. ఇక, ఇతని సౌలభ్యాన్ని తెలియనివారు ఏమైనా చెప్పనివ్వండి. నాకు ఈ అలభ్యలాభమే చాలు- అని ఆழ్వార్ల హృదయం. లోకాలను, కొలువడం మొదలైన పలుపాట్లను పడి, మనస్సును అభినివిష్టం చేసి, ఇపుడు వేఱొక విషయాన్ని తెలియనివాడై, నా హృదయంలోపల స్థిరంగా ఉన్నాడు. పొమ్మని పల్కినా పోని రీతిలో ఉన్నాడని భావం.

అవ :- "భగవానుడు మీ మనస్సులో నిలచి ఉండి, సత్తను పొందాడు- అని అన్నారు. ఆ తరువాత అయినా మీరు భగవానుని పూర్తిగా దర్శించ



గలిగారా?''- అని ప్రశ్నించగా, "అనంతమైన వేదంచేత మాత్రమే తెలియదగిన మహిమను కలవాడైన అతనిని తెలియడానికి ఎవరికీ సాధ్యం కాదు. అతనిని దర్శించినట్లు చెప్పే నావంటివారుకూడా ఏదో ఒక విధంగా దర్శించి కీర్తిస్తున్నారే తప్ప, అతనిని పూర్ణంగా దర్శించడం ఎవరికీ వీలు కాని పని''- అని ఇందులో అంటున్నారు.

**84.** ఉళనాయ నాన్ మఱైయినుట్పొరుళై ఉళ్ళ
త్తుళనాక త్తేర్న్దుణర్వరేలుమ్- ఉళనాయ
వణ్ణామరై నెడుఙ్గణ్ మాయవనై యావరే
కణ్డారుకప్పర్ కవి

నాల్ మఱైయిన్ = నాల్గు వేదాలయొక్క, ఉళ్ పొరుళ్ = అంతరార్థంగా, ఉళనాయవనై = ఉండే ఆ స్వామిని, ఉళ్ళత్తు ఉళన్ ఆక = మన మనస్సులో పొందికగా నిలచి ఉన్నవానినిగా, తేర్న్దు = తెలిసికొని, ఉణర్వర్ ఏలుమ్ = కొందఱు జ్ఞానులు తెలియాలని ఆశపడినవారైనా, వణ్ తామరై = అందమైన తామరపూవువంటి, నెడు కణ్ = విశాలమైన నేత్రాలను కల, మాయవన్ = ఆశ్చర్యభూతుడై, ఉళనాయవనై = ఉండే ఆ స్వామిని, కణ్డార్ యావరే = పూర్ణంగా దర్శించిన వారెవరు? (ఎవరూ లేరు), కవి ఉకప్పర్ = వారికి చేతనైనంతగా స్తోత్రకవిత్వాన్ని ఆనందంతో నోరార పల్కి, ఆనందిస్తున్నారు. అంతే.

భగవానుని మహిమలోని పలు కోటి అంశాలలోని ఒక అంశాన్ని ఏదో ఒక విధంగా తమ స్వరూపం ప్రకాశించడం కోసంగా వాచికకైంకర్యం చేసికోవాలని ఆశించి, **"కణ్డేన్"** అని అంటూ కవిత్వాన్ని చెప్పారే తప్ప, అతని స్వరూపరూపగుణ విభూతులలో దేనినీ పూర్ణంగా దర్శించినవారెవరూ లేరు- అని భావం. **"ఉట్పొరుళై", "మాయవనై"**- అనే ప్రయోగాలలోగల ద్వితీయావిభక్తి ప్రత్యయాలను **"ఉళనాయ"** అనే పదాలతో చేర్చి అర్థాన్ని గ్రహించాలి.)

అవ :- "కొందఱికి భగవానుడు తెలిసికోవడానికి సాధ్యం కానివాడై ఉన్నా, **"వాழ்త్తు వార్ పలరాక"** (తిరువాయ్-3-1-7) అనే రీతిలో లీలావిభూతిలో ఉండేవారు అందఱూ ఒకే సమూహంగా కలసి, తమతమ సర్వేంద్రియాలను

ఏకం చేసి స్తుతిస్తే, ఇతని పూర్తిగా స్తుతించగలరా?''- అని అంటే, "ఆ విధంగా స్తుతించినా, అవధిని దర్శించడానికి వీలు కాని రీతిలో కదా భగవానుని మహిమను ఉన్నది''- అని అంటున్నారు. **"యాను మేత్తి ఏழులకుమ్ ముఱ్ఱుమ్ ఏత్తి పిన్నైయుమ్ తానుమ్ ఏఱ్ఱిలుమ్ తన్నై ఏత్త ఏత్త ఎఙ్గెయ్‌దుమ్"** అనే తిరువాయ్‌మొழి పాశురార్థం (4-3-70) ఈ సందర్భంలో సంవాదంగా గ్రాహ్యం.

**85.** కవియినార్ కై పునైన్దు కణ్ణార్ కழల్ పోయ్
శెవియినార్ కేళ్‌వియరాయ్ చ్చేర్‌న్దార్- పువియినార్
**పోఱ్ఱి యురైక్క ప్పాలియుమే పిన్నైక్కా**
**ఏఱ్ఱుయిరై యట్టా నెழిల్**

కవియినార్ = స్తోత్రకవిత్వాన్ని పాడేవారై, కై పునైన్దు = అంజలిని చేసి, కణ్ తమ నేత్రాలు, అమ్ కழల్ పోయ్ = (అతని) శోభను కల శ్రీచరణాలలో చేరి, నిలచి, కవియిన్ ఆర్ కేళ్వియర్ ఆయ్ = చెవి నిండుగా ఆ భగవానుని గుణచేష్టితాలను గూర్చిన శ్రుతమైన జ్ఞానాన్ని కలవారై, శేర్‌న్దార్ = వచ్చి సేవించినవారైన, పువియినార్= భూమిలో ఉండే అందఱు, పోఱ్ఱి ఉరైక్క = (ఒక్కటిగా కలిసి) కీర్తించి పాడినా, పిఱ్ఱైక్కాయ్ ఏఱు ఉయిరై అట్టాన్ ఎழిల్ పొలియుమ్ = నప్పిన్నై ప్పిరాట్టికోసం ఏడు ఎద్దుల ప్రాణాలను హరించిన భగవానుని అందంలోని గొప్పతనం పూర్తిగా చెప్పబడినది అవుతుందా? (కానే కాదు).

నప్పిన్నై ప్పిరాట్టియొక్క కడగంటి చూపులకు వశుడై, ఆమెను పొందడంకోసం అవరోధంగా ఉండే ఏడు ఎద్దుల ప్రాణాలను ఒక్కసారి హరించిన ఆ లీల ఒక్కటిని అయినా, అతడు ఆ నీళాదేవి కలిసి వివాహమాడిన ఆ ఒక్క సన్నివేశంలోని అందం అయినా; పరిచ్ఛేదించి తెలియడానికి గాని, పలుకడానికి కాని సాధ్యమా? - అని భావం.

అవ :- భగవానుని స్వరూపరూపగుణచేష్టితాలలోని ఏకదేశాన్నికూడా పరిచ్ఛేదించి తెలిసి పలుకడానికి వీలు కానిది అయినా, వాటిని విడిచి నిలువ లేని స్థితిని పొంది, దర్శించి ఆనందించాలి- అని ఆశపడేవారికి అతని



రూపసౌందర్యానికి ఒక రీతిలో ఉపమానం అయిన మేఘాలు అతని అందాన్ని చూపుతున్నవి- అని అంటున్నారు. **"నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా"** అని వేదపురుషుడు, **"నీల ముణ్ణ మిన్నన్న మేని ప్పెరుమాన్"** (తిరువిరుత్తమ్-29) అని వేదాన్ని ద్రావిడీకరించిన నమ్మాழ్వార్లు భగవానుని తిరుమేనికి మెఱపుతోకూడిన మేఘాన్నే ఉపమానంగా చెప్పారుకదా !

**86.** ఎழిల్ కొణ్డు మిన్నుక్కొడి యెడుత్తు వేక
**త్తొழిల్ కొణ్డు తాన్ ముழఙ్గి త్తోన్ఱుమ్- ఎழిల్ కొణ్డ**
నీర్‌మేగ మన్న నెడుమాల్ నిఱమ్పోల
కార్వానమ్ కాట్టుమ్ కలన్దు

ఎழిల్ కొణ్డ మిన్ కొడి ఎడుత్తు = అందమైన మెఱపుతీగను ధ్వజంగా గ్రహించి (తీసికొని), వేగమ్ తొழిల్ కొణ్డు = లోకాలను ఉజ్జీవింపచేయడంకోసం వేగంగా సంచరించడం- అనే వ్యాపారాన్ని కల్గినదై, ముழఙ్గి తోన్ఱుమ్ = గర్జిస్తూ సాక్షాత్కరించే, కార్ వానమ్ = వర్షకాలంలోని మేఘం, ఎழిల్ కొణ్డ = అందాన్ని కల, నీర్ మేకమ్ అన్న= కాలమేఘంవలె, నెడు మాల్ నిఱమ్ పోల్ కలన్దు కాట్టుమ్ = భగవానుని దివ్యవర్ణాన్ని పొందిన చూపుతుంది.

ఆ సర్వేశ్వరుని వర్ణంవలె మొదటి రెండు పాదాలలో చెప్పబడ్డ గొప్పతనాలను కల వర్షాకాల మేఘం పొందికగా ప్రకాశిస్తున్నది. అందుచేత, గత పాశురంలో చెప్పబడ్డ రీతిలో అతని అందాన్ని ఎవరికి అయినా పరిచ్ఛేదించి దర్శించి పలుకరానిదే అయినా, దానిని చూడకుండా నిలువలేని మనవంటివారికి మేఘాలు అతని రూపసౌందర్యాన్ని దర్శింపజేస్తున్నాయి- అని అంటున్నారు.

అవ :- ఈ విధంగా భగవానుని ఒక ఉపమానంలో దర్శించి, తృప్తిపొందే వారు కానందున, ఆழ్వార్లు అతని సహజసౌందర్యాన్ని ఇంకా రెండు ఉపమానాలతో దర్శించి, ఆనందించాలని ఇందులో ప్రయత్నిస్తున్నారు.

**87.** కలన్దు మణియిమైక్కుమ్ కణ్ణా! నిన్ మేని
మలర్‌న్దు మరతకమే కాట్టుమ్ - నలన్దికழుమ్
కొన్దిన్‌వాయ్ వణ్డఱైయుమ్ తణ్డుழాయ్ క్కోమానై
అన్దివాన్ కాట్టు మదు

కణ్ణా = శ్రీకృష్ణా !, మణి కలన్దు = శ్రీకౌస్తుభమణితో కలసి, ఇమైక్కుమ్ = ప్రకాశించే, నిన్ మేని = నీ తిరుమేనిని, మరతకమ్ = మరతకరత్నం, మలర్న్దు= కాంతి విస్తృతిని కల్గినదై, కాట్టుమ్ = స్పష్టంగా దర్శింపజేస్తున్నది, నిలమ్ తికఴుమ్ = అందంగా వెలిగే, కొన్దిన్ వాయ్ = గుత్తులలో, వణ్డు అఱైయుమ్ = తుమ్మెదలు ఝుంకారం చేసే, తణ్ తుఴాయ్ = చల్లని తులసీమాలను అలంకరించుకొన్న, కోమాన్ = సర్వేశ్వరుడవైన నీ తిరుమేనిని, అన్ది వాన్ అదు కాట్టుమ్ = సాయంసమయంలోని ఆకాశం దర్శింపజేస్తున్నది.

సహజంగానే మణివర్ణుడవై ఉండే నీ తిరుమేనిలో శ్రీకౌస్తుభమణి కూడా చేరి, ప్రకాశించడంవల్ల మరతకమణే వాటికి తగిన ఉపమానంగా ఉన్నది. తులసి పచ్చదనం, తుమ్మెదల నల్లదనం, కన్నులు, కాళ్ళు, శ్రీహస్తాలు- మొదలైన అవయవాలలోని ఎఱ్ఱదనం - అన్నీ కలసి తిరుమేనిని సాయంసమయంలోని వర్ణాలన్నీ కూడిన సాయంకాలపు ఆకాశం దర్శింపజేస్తున్నది. **“వాన్”** అనే పదం ఆకాశాన్ని కాని, మేఘాన్ని కాని తెలుపుతుంది. **“నెడు మాల్ నిఱమ్ పోల్ కార్ వానమ్ కాట్టుమ్”** అనే గతపాశురంలోని సూక్తివలె, ఇక్కడకూడా **“పోల”** అనే పదాన్ని కలుపుకొని, “దానివలె దర్శింపజేస్తుంది’’- అనే అర్థాన్ని చెప్పవచ్చు. ఈ రీతిలో పరిచ్ఛేదించి తెలిసికోలేని భగవానుని కొన్ని ఉపమానాలలో దర్శించి కొంత ఊఱటను చెందవచ్చు- అని ఆఴ్వార్ల హార్దభావం.

అవ :- భగవద్విషయంలో తమ అభినివేశాన్ని ఆఴ్వార్లు గత పాశురంలో తెలిపారు. సంసారులు ఐహికవిషయాలలో నిమగ్నులై, సంశయంతోనే జీవించడాన్ని చూచి, “అయ్యో! ఈ విధంగా సంశయంతో నశించిపోకుండా, అందఱు ఆశ్రయించదగిన భగవద్విషయాన్ని స్థిరంగా ఆశ్రయించి, మీరు దుఃఖాలను పోగొట్టుకోవడానికి ప్రయత్నించండి’’- అని అంటున్నారు.

**88.** **అదు నన్ఱిదు తీదెన్ఱు ఐయప్పడాతే**
**మదునిన్ఱ తణ్డుఴాయ్ మార్వన్ -పొదు నిన్ఱ**
**పొన్నఙ్గఴలే తొఴుమిన్ ముఴు వినైకళ్**
**మున్నఙ్గఴలుమ్ ముడిన్దు**



అదు నన్ఱు ఇదు తీదు ఎన్ఱు ఐయమ్ పడాతే = అది మంచిదా? ఇది చెడ్డదా? అని సందేహపడకుండా, మదు నిన్ఱ తణ్ తుఴాయ్ మార్వన్ = తేనెనిండిన, చల్లని తులసీమాలను వక్షఃస్థలంలో అలంకరించుకొన్న స్వామియొక్క, పొదు నిన్ఱ = (శ్రీచరణాలను చేరడంలో) అందఱికీ సమానంగా ఉండే, పొన్ అమ్ కఴలే = అభిలషణీయాలైన అందమైన శ్రీచరణాలనే, తొఴుమిన్ = నమస్కరించండి, (ఆవిధంగా నమస్కరిస్తే), మున్నమ్ = ముందుగానే, ముఴు వినైకళ్ = అన్నిపాపాలు, ముడిన్దు = రూపు మాసి, కఴలుమ్ = విడిచి తొలగిపోతాయి.

పూర్వం తెలుపబడ్డ సంశయానికి కారణమై, మిమ్ములను ఈ నాటివరకు ఈ భగవద్విషయాన్ని ఆశ్రయించనీయకుండా అడ్డుకొన్న సకలదురితాలు, మిమ్ములను విడిచిన తర్వాత వేఱెవ్వరివద్దకూడ తమ వీర్యాన్ని చూపలేనట్లుగా సమూలంగా నశించి, ఆశ్రయించడం ప్రారంభించిన ఆ క్షణంలోనే మిమ్ములను విడిచి, తొలగిపోతాయి. ఈవిధంగా విలక్షణ పురుషార్థమైన భగవద్విషయాన్ని ఆశ్రయించి ఉజ్జీవించడానికి ప్రయత్నించండి- అని సంసారుల అనర్థాన్ని చూచి ఆఴ్వార్లు పరోపదేశాన్ని ఇందులో చేశారు.

అవ :- “ప్రత్యక్షం ఒక్కటే ప్రమాణంగా భావించి, తగని ఐహికవిషయాలలో మీరు నిమగ్నులైతే, చక్కని ఆ భగవద్విషయాన్ని ప్రత్యక్షంగా దర్శించి తిరుమలైలో అనుభవించవచ్చునే! రండి! మీ సిద్ధాంతానికి ఇది అనుకూలమే కదా!’’ అని ఆహ్వానిస్తూ అంటున్నారు.

**89.** **ముడిన్ద పొఴుదిల్ కుఱవాణర్ ఏనమ్**
**పడిన్దుఴు శాల్ పైన్దినైకళ్ విత్త- తడిన్దెఴున్ద**
**వేయ్ఙ్గఴై పోయ్ విణ్ తిఱక్కుమ్ వేఙ్గడమే మేలొరునాళ్**
**తీఙ్గుఴల్ వాయ్ వైత్తాన్ శిలమ్బు**

ముడిన్ద పొఴుదిల్ కుఱై వాణర్ = మరణాన్ని పొందే స్థితిలోవలె చాలా వృద్ధులైన కోయ ప్రభువులు, (ఇక ఏపనిని చేయలేక), ఏనమ్ పడిన్దు ఉఴు శాల్= అడవిపందులు (తమ మదంతో వెదుళ్ళు సమూలంగా కూలి కిందపడే

టట్లుగా గట్టిగా అదిమి కాళ్ళతో దున్నిన క్షేత్రాలలో, పై తినైకళ్ విత్త = కొత్తవి అయిన "తినై" అనే సస్యబీజాలను విత్తగా, తడిన్దు= ఆ సస్యం కోసి పడవేసిన తరువాతకూడా, ఎழுన్ద=(క్షేత్రసారంవల్ల), ఉన్నతంగా ఎదిగిన, వేయ్జ్కழை= వెదురుగడలు, పోయ్ = వృద్ధి చెంది పైకి పోయి, విణ్ తిఱుక్కుమ్ = ఆకాశాన్ని తాకే, వేజ్గడమే = శ్రీవేంకటాచలమే, మేల్ ఒరునాళ్ = పూర్వం ఒకానొక సమయంలో, తీమ్ కుழల్ = తీయని పిల్లనగ్రోవిని, వాయ్ వైత్తాన్= నోటిలో పెట్టుకొని ఊదిన శ్రీకృష్ణుని, శిలమ్బు =నివాసం అయిన పర్వతం.

ఇటువంటి స్వామి వేంచేసి ఉండే పర్వతంలో ఖండింపబడ్డ వెదురుగడలు ఆకాశాన్ని తాకేటట్లుగా పెరగడంలో ఏ ఆశ్చర్యం లేదని ఇక్కడి హార్దభావం. తిరుమలైలోని జలసమృద్ధివల్ల నఱుకబడ్డ రెల్లువంటి కలుపుకూడా ఆకాశంవరకు భగవద్భాగవతమంగళాశాసన ప్రవృత్తి కోసం వృద్ధిచెందుతున్నది- అని స్వాపదేశం. ఇటువంటి తిరుమలైలోని భగవద్విషయంయొక్క మహిమను ప్రత్యక్షంగా దర్శించి, ఉజ్జీవించండి - అనే పరోపదేశం గడచిన పాశురంతో దీనిని కలుపు కొన్నపుడు తాత్పర్యార్థంగా భాసిస్తుంది. తిరుమలైలో కోయిలు, వెదుళ్ళు, శ్రీవేంకటేశ్వరుడు - అనే ఏమీ తేడా లేకుండా అన్నీ, ఆழ்వార్లకు ఉద్దేశ్యాలే - అని దీనివల్ల తెలుపబడినట్లయింది.

అవ :- తిరుమలైలోని వెదుళ్ళవలెనే శ్రీవేంకటేశ్వరుడుకూడా ఉద్దేశ్యభూతుడు కనుక, ఆ వెదుళ్ళవలె ఉన్నతంగా పెరిగిన త్రివిక్రమవృత్తాంతాన్నిగుర్చి ఇందులో ఆழ்వార్లు ప్రస్తుతిస్తున్నారు. గత పాశురంలో ప్రస్తావింపబడ్డ సిద్ధోపాయనిష్ఠను ప్రబంధంలోని ఇక మిగిలిన పాశురాలద్వారా వివరించే క్రమంలో "రక్షకుని గొప్ప రక్షణాభినివేశం రక్ష్యవస్తువు యొక్క పరిమితిలో ఉండేది కాదు" అనే అర్థాన్ని ఈ పాశురంలో తెలుపుతున్నారు.

**90. శిలమ్బుమ్ శెఱి కழలుమ్ శెన్ఱిశైప్ప విణ్ణాఱు**
**అలమ్బియ శేవడిపోయ్ అణ్డమ్- పులమ్బియ తోళ్**
**ఎణ్డిశైయుమ్ శూழ இడమ్బోదాదెన్గొలో**
**వణ్డుழாయ్ మాలళన్ద మణ్**



శిలమ్బుమ్ = (శ్రీపాదాలలో అలంకరింపబడ్డ) నూపురాలు, శెఱి కழలుమ్= దట్టంగా అలంకరించుకొన్న వీరకడియాలు, శెన్ఱు ఇశైప్ప = అంతటా ధ్వనించగా, విణ్ ఆఱు = ఆకాశగంగలో, అలమ్బియ = కడుగబడిన, శే అడి = ఎఱ్ఱని అందమైన శ్రీచరణాలు, అణ్డమ్ పోయ్= అండభిత్తివరకు వృద్ధి చెందిపోయి నపుడు, పులమ్బియ= (అందఱిచేత) స్తుతించదగిన, తోళ్ = బాహువులు, ఎణ్ తిశైయుమ్ = ఎనిమిది దిక్కులలో వ్యాపించగా, ఇడమ్ పోదాదు = చోటు చాల లేదు, వణ్ తుழாయ్ మాల్= అందమైన తులసీమాలను అలంకరించుకొన్న స్వామి, అళన్ద = కొలిచిన, మణ్ = భూమి, ఎన్ కొల్ = ఎంత పెద్దది!

స్వామి శ్రీపాదంతో పోల్చినపుడు చాలా చిన్నదే - అని భావం. కొలవాలని ప్రారంభించినవాడు కొలువడానికి తగినదానిని సృష్టించికదా కొలవాలి! ఆవిధంగా కాకుండా, చిన్నదానిని సృష్టించి, పెద్దకాలితో కొలువవచ్చునో! అని భావం. దీనివల్ల రక్షకుని అభినివేశం రక్షింపబడే విషయం యొక్క పరిమితిని మించి ఉంటుంది - అనే అర్థం సూచింపబడింది.

**(వణ్తుழாయ్మాల్ అళన్ద మణ్ ఇడమ్ పోదాదు ఎన్గొలో?)** - పూర్వం పల్కిన రీతిలో బాహువులు ఎనిమిది దిక్కులలోను వ్యాపించినపుడు స్వామి కొలిచిన భూమిలో అతడు నిలచి కొలువడానికి తగిన చోటులేకుండా పోయింది- అనే అర్థాన్ని అప్పిళ్ళై తమవ్యాఖ్యలో తెలిపారు.

అవ :- భక్తుల హస్తస్పర్శను కల ద్రవ్యమే ధారకంగా ఉండే స్వామి తీరును, వారిచే కట్టుబడి కొట్టబడే రీతిలో ఉండే అతని భక్తపారతంత్ర్యాన్ని ఇందులో ఆழ்వార్లు అనుభవిస్తున్నారు.

**91. మణ్ణుణ్డు పేయ్చ్చి ములై యుణ్డు మాற்றా తాయ్**
**వెణ్ణెయ్ విழுఙ్గ వెకుణ్డు ఆయ్చ్చి- కణ్ణి**
**క్కయిற்றినాల్ కట్ట త్తాన్ కట్టుణ్డిరున్దాన్**
**వయిற்றినోడాற்றా మకన్**

వయిற்றినోడు ఆற்றా మకన్ = అనుకూల- ప్రతికూల భేదం లేకుండా భూమిలో ఉండే అందరినీ కడుపులోపల పెట్టుకొన్నా, ఆ కడుపుతో తృప్తిచెందని

బాలుడైన శ్రీకృష్ణుడు, (లేక, చిన్నతనంలో మన్ను తిన్న కడుపుతో తృప్తి చెందని బాలుడైన శ్రీకృష్ణుడు), మణ్ ఉణ్డు = లోకాలను అన్నిటినీ ఆరగించినా, ఆయ్చ్చి= పూతనయొక్క, ములై = (విషాన్ని పూసిన) స్తన్యాన్ని, ఉణ్డుమ్ =ఆరగించినా, ఆ*ఱ్ఱా* తాయ్ = తృప్తిన చెందనివాడై, వెణ్ణెయ్ = వెన్నను, విళఙ్గ = (దొంగిలించి) మింగినపుడు, ఆయ్చ్చి =గోపిక అయిన యశోద, వెకుణ్డు = కోపించి, కణ్ణి కయి*ఱ్ఱి*నాల్ = పలు మూడులను కల దారంతో, కట్ట= కట్టగా, తాన్ = సర్వేశ్వరుడైన తాను, కట్టుణ్డు = కట్టుబడి, ఇరున్దాన్ = (దానికి ఏ పరిహారం చేయలేనివాడై) మిన్నకుండిపోయాడు.

ఎంతపెట్టినా నిండని కడుపును స్వామి కల్గి ఉన్నందున, ఆతని కడుపుకు ఎరను **"వయి*ఱ్ఱై* వెణ్ణానుక్కు ఇట్టాలో"** అని పిళ్ళై ఉఅఙ్గా విల్లిదాసర్ చమత్కారంగా అన్నారని ఐతిహ్యం. అంటే, చాకలివాని బానవంటి ఈ పొట్టను చాకలివానికి పంపడమే తగినది- అని ఈ సరసోక్తి భావం.

అవ :- "ఓ మనసా! భక్తుల విరోధులను నిరసించడమే స్వభావంగా కలవానినే పూర్ణంగా తలుచుకో!" - అని ఇందులో అంటున్నారు.

**92.** మకనొరువర్క్కల్లాద మామేని మాయన్
మకనామవన్ మకన్దన్ కాదల్- మకనై
శిఱై శెయ్ద వాణన్‌తోళ్ శె*ఱ్ఱా*న్ క*ఴ*లే
నిఱైశెయ్‌దెన్నెఞ్జే ! నినై

ఎన్ నెఞ్జే = నామనసా!, ఒరువర్క్కు మకన్ అల్లాద = (కర్మమూలంగా) ఎవరికీ పుత్రుడుగా జన్మించనివాడు, మా మేని = (కృపావశం చేత అవతరించినందున ప్రకాశించే) గొప్ప దివ్యమంగళవిగ్రహాన్ని కలవాడు, మాయన్= ఆశ్చర్యకరచేష్టితుడైన శ్రీకృష్ణుడు, మకన్ ఆమ్ = (దేవకీ వసుదేవులకు) కుమారుడైన పుట్టాడట, అవన్ మకన్ తన్ = అతని కుమారుడైన ప్రద్యుమ్నుని, కాతల్ మకనై = గారాల బిడ్డ అయిన అనిరుద్దుని, శిఱై శెయ్ద = చెఱలో పెట్టిన, వాణన్ = బాణాసురుని, తోళ్ = (వేయి) బాహువులను, శె*ఱ్ఱా*న్ = ఖండించిన స్వామియొక్క, క*ఴ*లే = శ్రీచరణాలే, నిఱై శెయ్దు = పరిపూర్ణంగా,



నినై = ధ్యానించు. (ప్రాప్యంగా, ప్రాపకంగా, ధారకపోషకభోగ్యాలుగా భావించు- అని భావం.)

అవ :- "మనసా! లోకులను ఉజ్జీవింపజేయడంకోసం అతడు పడే పాట్లను తెలిసినవారు ఈలోకంలో ఎవరూ లేకపోయినా, నీవు అతనిని నీలోనే పదిలంగా ఉంచుకో" - అని తమ మనస్సుతో ఆ*ఴ్వా*ర్లు అంటున్నారు.

**93.** నినైత్తుకిలార్ తెళివార్ నీణ్డ తిరుమాల్
అనైత్తులకు ముళ్ళొడుక్కి యాల్ మేల్- కనైత్తులవు
వెళ్ళత్తోర్ పిళ్ళైయాయ్ మెళ్ళ త్తుయిన్ఱానై
ఉళ్ళత్తే వై నెఞ్జే! యుయ్‌త్తు

నెఞ్జే = ఓ మనసా!, నీణ్డ = (లోకాలను కొలువడంకోసం) పెరిగిన, తిరుమాల్= శ్రియఃపతి, కనైత్తు ఉలవు వెళ్ళత్తు = ఘోషిస్తూ అంతటా వ్యాపించిన ప్రళయజలప్రవాహంలో, ఓర్ పిళ్ళై ఆయ్ = సాటి లేని చిన్న బాలుడై, అనైత్తు ఉలకుమ్ = లోకాలను అన్నిటినీ, ఉళ్ ఒడుక్కి = ఉదరం లోపల పెట్టుకొని, ఆల్ మేల్ = లేత మఱ్ఱి ఆకుపై, మెళ్ళ తుయిన్ఱానై = మెల్లగా శయనించినవాడైన స్వామిని, ఉలకిల్ = ఈ లోకంలో, నినైత్తు = (ఆ స్వామిని రక్షకునిగా) అనుసంధించి, ఆర్ తెళివార్ = తెలివిని పొందినవారెవరైనా ఉన్నారా? (ఎవరూ లేరే !), ఉయ్‌త్తు = (కనీసం నీవైనా)అతనిని తీసికొని వచ్చి, ఉళ్ళత్తే వై= నీలో నిలుపుకో.

"అశక్తం అయిన ఈ మనస్సు సర్వశక్తి అయిన అతనిని కొనివచ్చి తన లోపల నిలుపుకోగలదా?" అని అంటే, లోపల ప్రవేశించడానికి చోటు చూచి ప్రవేశించి నిలచిఉండే అతని రక్షణప్రయత్నాన్ని అనాదికాలంగా మనం చేసే స్వప్రయత్నంతో అడ్డుపెట్టకుండా ఉంటే, తానే స్వయంగా మన లోపలకు ప్రవేశిస్తాడు. ఆ అప్రతిషేధమే అతనిని కొనివచ్చి మనస్సులోపల ప్రవేశించేటట్లు చేస్తుంది - అనిభావం. **"నెఞ్జే! ఉళ్ళత్తు వై"** అని ఆ*ఴ్వా*ర్లు అన్నారే! మన మనస్సులోకూడా నిలచి ఉండే ఒక చోటున్నదా! అని అంటే, మనసులో పెట్టుకో- అని దీని అర్థం. ఈ పాశురం ద్వారా నిర్హేతుకకృపతో అనాదికాలంగా జీవులను

ఉజ్జీవింపచేయడం కోసం పడరానిపాట్లు పడే భగవానుడు స్వప్రవృత్తినివృత్తి అనే అప్రతిషేధాన్నే ఆలంబనంగా చేసికొని భక్తుల మనస్సులో ప్రవేశిస్తాడని తెలుపబడింది.

అవ :- ఈ విధంగా తాము అనుసంధించగానే, గొప్ప అభినివేశంతో భగవానుడు తమ మనస్సులో ప్రవేశించి, గొప్ప ప్రేమతో పలు రీతులలో తమకు పరిచర్య చేయడం ఆరంభించాడు- అని అంటున్నారు.

**94.** ఉయ్‌త్తుణర్ వెన్నుమ్ ఒళికొళ్ విళక్కే*ఱ్ఱి*
వైత్తవనై నాడి వలైప్పడుత్తేన్- మెత్తెనవే
నిన్ఱానిరున్దాన్ కిడన్దా నెన్నెఞ్జత్తు
పొన్ఱామై మాయన్ పుకున్దు

ఉణర్వు ఎన్నుమ్ = సిద్ధోపాయజ్ఞానమనే, ఒళి కొళ్ విళక్కు = ప్రకాశవంత మైన అయిన దీపాన్ని, ఏ*ఱ్ఱి* = వెలిగించి, అవనై ఉయ్‌త్తు వైత్తు = ఆ స్వామిని అన్వేషించి, నిలుపుకొని, నాడి = పరిశీలించి, అనుసంధించి, వలై ప్పడుత్తేన్ = స్వాధీనం చేసికొన్నాను, మాయన్ = ఆశ్చర్యభూతుడైన ఆ స్వామి, పొన్ఱామై = నిరంతరం, ఎన్ నెఞ్జత్తు = నా హృదయంలో, పుకున్దు = వచ్చి ప్రవేశించి, మెత్తెన= మెల్లగా, నిన్ఱాన్ = (మొదట) నిలచి ఉన్నాడు, ఇరున్దాన్ = తరువాత కూర్చున్నాడు, కిడన్దాన్ = (ఆ తరువాత)శయనించాడు.

సర్వేశ్వరుడైనవాడు అతిహీనుణ్ణి అయిన తమ మనస్సులో ఆశతో ప్రవేశించి, చూపే వ్యామోహాన్ని చూచి ఆ*ళ్వా*ర్లు విస్మితులవుతున్నారు. ఆశాలేశాన్ని కలవారి మనస్సులో ప్రవేశించిన తరువాత అతడు అందులో చూపించే వ్యామోహానికి ఒక అంతు లేదు- అని దీనివల్ల తెలుపబడినట్లయింది. **"పొన్ఱామై ఎన్ఱాన్ ఇరున్దాన్ కిడన్దాన్"** అని అన్వయించి, నిరంతరం నా మనస్సులో ప్రవేశించి నిలువడం, కూర్చొనివుండడం, పరుండి ఉండడం చేశాడు - అనే అర్థం చెప్పవచ్చు.

అవ :- తమపట్ల సులభుడై ఉండే తీరును చూడగానే, శ్రీప్రహ్లాదా*ళ్వా*న్‌కు స్వామి సులభుడైన తీరు ఆ*ళ్వా*ర్లకు స్మరణకు రాగా, ఆ విధంగా సహాయపడిన వాని శ్రీచరణాలనే మంగళాశాసనం చేయమని తమ మనస్సును ఉద్బోధిస్తున్నారు.



**95.** **పుగున్దిలఙ్గుమ్ అన్ది ప్పొ*ళ్ళు*దత్తు అరియా**
**యికళ*్ళ్*న్ద విరణియనదాగమ్- శుకిర్న్దెఙ్గుమ్**
**శిన్ద ప్పిళన్ద తిరుమాల్‌తిరువడియే**
**వన్దిత్తెన్నెఞ్జమే! వా*ళ్*త్తు**

అన్ది పుకున్దు = సాయంవేళ వచ్చి చేరి, ఇలఙ్గుమ్ పొ*ళ్ళు*దత్తు = ప్రకాశించే సమయంలో, అరి ఆయ్ = నరసింహమూర్తిగా అవతరించి, ఇక*ళ్*న్ద ఇరణి యనదు ఆకమ్ = తనను మనస్సులో పూర్తిగా నిందిస్తూ ఉండే హిరణ్యకశిపుని శరీరాన్ని, కతిర్న్దు = పలు ఖండాలుగా చీల్చి, ఎఙ్గుమ్ శిన్ద = అంతటా చిందిపడేటట్లు, పిళన్ద = బ్రద్దలు చేసిన, తిరుమాల్ = శ్రియఃపతియొక్క, తిరు అడియే = శ్రీచరణాలే, ఎన్ నెఞ్జమే = ఓనమసా !, వన్దిత్తు వా*ళ్*త్తు = శిరస్సుతో నమస్కరించి, నోరార స్తుతించు.

నమస్కరించి, మంగళాశాసనం చేయడానికి శేషిత్వ- ప్రాప్యత్వాలను కల ఒక మిథునమే విషయం- అని **"తిరుమాల్ తిరువడి"** అనడం ద్వారా తెలుప బడింది.

అవ :- "ఈ విధంగా క్రూరుడైన అసురుని చీల్చినవాడు, నిత్యసూరులు నమస్కరించేటపుడు వారి కిరీటాల ఒరపిడిని సైతం సహించలేక శ్రీపాదాలు కాయలు కాచే సౌకుమార్యాన్ని కలవాడుకదా''- అని అంటున్నారు.

**96.** **వా*ళ్*త్తియ వాయరాయ్ వానోర్ మణిమకుడమ్**
**తా*ళ్*త్తి వణఙ్గ త్త*ళ్ళు*మ్బామే- కే*ళ్*త్త**
**అడిత్తామరై మలర్‌మేల్ మఙ్గై మణాళన్**
**అడిత్తామరైయా మలర్**

కే*ళ్*త్త అడి = తగిన నాళాన్ని (కాడను) కల్గిన, తామరై మలర్ మేల్ = తామరపూవులో వేంచేసి ఉండే, మఙ్గై = లక్ష్మీదేవికి, మణాళన్ = నాథుడు అయిన స్వామియొక్క, అడి ఆమ్ తామరై అలర్ = శ్రీచరణాలనే తామర పూవులను, వానోర్ = నిత్యసూరులు, వా*ళ్*త్తియ వాయర్ ఆయ్ = నోరార కీర్తించేవారై,

మణి మకుడమ్ = మణులను పొదిగిన కిరీటాలను, తా*ఴ్*త్తి = తాకించి, వణఙ్గ= నమస్కరించి నందువల్ల, త*ఴ*ుమ్బు ఆమే (ఆ శ్రీచరణాలకు) కాయలు కాచవా!

నిత్యసూరుల కిరీటస్పర్శను సైతం సహించలేని స్వామి పాదాల సౌకుమార్యానికి ఆశ్చర్యపడుతున్నారని, లేక, అంటి సుకుమారం అయిన స్వామి పాదాలు నిత్యసూరుల కిరీటస్పర్శవల్ల కాయలు కాచవా! అని అస్థానే భయశంకను పొందుతున్నారని చెప్పవచ్చు. ఈ అర్థాలు రెండు **"ఆమే!"** అనే పదంలోని కాకుస్వరభేద ప్రయుక్తాలు. **"వానోర్'** అనే పదానికి రాబోయే పాశురంలోవలె బ్రహ్మాదులనే అర్థాన్ని కూడా చెప్పుకోవచ్చు. **"అడిత్తామరైయామ్మలర్"** (పాదపద్మలనే పూలు) అనికూడా పదవిభాగాన్ని చేయవచ్చు. **"కే*ఴ్*"**అనే పదాన్ని తామరపూవును విశేషణం చేయవచ్చు. లేక, గొప్పతనమనే అర్థాన్ని చెప్పవచ్చు.

అవ :- ఈ విధంగా శ్రియఃపతియై, **"అయర్వఱు అమరర్కళ్ అదిపతి"**గా ఉండేవానిని వశీకరించుకొని, అతని కృపతో అతనిని పొందితే పొందవచ్చు తప్ప, తమ స్వప్రయత్నంతో బ్రహ్మాదిదేవతలకుకూడా భగవానుని తెలియడం వీలు కాదు- అని ఇందులో అంటున్నారు.

**97. అలరెడుత్త వున్దియాన్ ఆఙ్గె*ఴి*లాయ**
**మలరెడుత్త మామేని మాయన్- అలరెడుత్త**
**వణ్ణత్తాన్ మామలరాన్ వార్శడైయా నెన్ఱు ఇవర్క**
**ట్కెణ్ణత్తానామో విమై**

అలర్ ఎడుత్త ఉన్దియాన్ = తామరపూవు వృద్ధి చెందే నాభిని కలవాడు, ఎ*ఴి*లాయ మలర్ ఎడుత్త = అందమైన అగిసె (కాటుక) పూవువంటి, మా మేని= నల్లని తిరుమేనిని కలవాడైన, మాయన్ = ఆశ్చర్యభూతుడైన భగవానుని, అలర్ ఎడుత్త వణ్ణత్తాన్ = "కాంచి'' పూవు వంటి వర్ణాన్ని కలవాడైన ఇంద్రుడు, మా మలరాన్= తామరపూవులో పుట్టిన బ్రహ్మ, వార్ శడైయాన్ = వేలాడే జటలను కల శివుడు, ఎన్ఱు ఇవర్ కట్కు = అనే వీరికి, ఇమై = క్షణకాలం అయినా, ఎణ్ణత్తాన్ ఆమో= మనస్సుతో భావించడానికి అయినా సాధ్యమా! (సాధ్యం కాదు)



**"ఇమై"** అనే పదాన్ని క్రియాపదంగా గ్రహించి, "వీరిని విచారించి చూడు'' అనే అర్థాన్ని చెప్పవచ్చు. **"ఆఙ్గ ఎ*ఴి*లాయ"** అన్నపుడు పూవులలో అందమే రూపొందినట్లుండే అగిసెపూవు- అనే అర్థాన్ని చెప్పవచ్చు. లేక, **"మాయన్ ఆఙ్గ"**అని అన్వయించి "ఆ ఆశ్చర్యభూతుని విషయంలో కొంచెం అయినా భావించడానికి వీలున్నదా!'' అనే అర్థాన్ని చెప్పవచ్చు. ఈ పాశురంలో సిద్ధోపాయం అయిన భగవానుడు తానే తనను దర్శింపజేస్తే దర్శించవచ్చు తప్ప, ఎంతగా స్వప్రయత్నం చేసినా దర్శించలేరని చెప్పబడింది.

అవ :- "తననే ఉపాయంగా ఆశ్రయించిన మనకు విరోధి అయిన సంసారాను వృత్తిని తీర్చి స్వామి అనుగ్రహిస్తాడు'' - అని ఇందులో అంటున్నారు.

**98. ఇమఞ్జూ*ఴ్* మలైయుమ్ ఇరువిశుమ్బుమ్ కా*ఱ్ఱు*మ్**
**అమఞ్జూ*ఴ్*న్దఱ విళఙ్గి త్తోన్ఱుమ్ -నమఞ్జూ*ఴ్***
**నరకత్తు నమ్మై నణుగామల్ కాప్పాన్**
**తురకత్తై వాయ్ పిళన్దాన్ తొట్టు**

ఇమమ్ శూ*ఴ్* మలైయుమ్ = మంచుతో ఆవరింపబడి ఉండే హిమాలయ పర్వతం, ఇరు విశుమ్బుమ్ = గొప్ప ఆకాశం, కా*ఱ్ఱు*మ్ = వాయువు, అమమ్ శూ*ఴ్*న్దు = విస్తీర్ణం (బృహత్త్వం) చేత, ఔన్నత్యంచేత, వేగంచేత అందరినీ అధఃకరించి (తక్కువ చేసి) అంతటా వ్యాపించి, అఱ విళఙ్గి తోన్ఱుమ్ = చాలా గొప్పగా ప్రకాశించి, కంటికి ఎదురుగా వచ్చి ప్రత్యక్షం అయిన, తురకత్తు = గుఱ్ఱం రూపాన్ని గ్రహించి వచ్చిన కేశి అనే అసురుని, తొట్టు = శ్రీహస్తంతో పట్టుకొని, వాయ్ పిళన్దాయ్ = (అతని) నోటిని చీల్చిన స్వామి, నమ్మై = మనలను, నమనుమ్ శూ*ఴ్* నరకత్తు నణుకామల్ కాప్పాన్ = యముని నాయకునిగా కల్గిన నరకంలో పడకుండా రక్షిస్తాడు.

ఆశ్రిత విరోధి అయిన కేశి అనే అశ్వరూపాన్ని ధరించి వచ్చిన అసురుని చేతితో పట్టి, అతని నోటిని చీల్చి, వధించిన శ్రీకృష్ణుడుకదా ఇతడు! ఇతడు మనలను నరకంలోకి పోకుండా రక్షిస్తాడన్నది వివరించాలా? అని భావం. **"అన్ఱు తురకవాయ్ కీణ్డ తు*ఴా*య్ ముడియాయ్ నఙ్గళ్ నరకవాయ్ కీణ్డానుమ్ నీ"**

**(47)** అని అంటూ ఇంతకుముందే ఈ సంగతిని ఈ ఆఴ్వార్లు ఈ ప్రబంధంలో ప్రస్తావించారు.

అవ :- "భక్తుల విరోధులను పోగొట్టే స్వభావాన్ని కల భగవానుని శ్రీచరణాలే గొప్ప ప్రాపకంగా, ప్రాప్యంగా కూడా ఉన్నందున అవే మనకు గొప్ప ఆశ్రయణీయ వస్తువు"- అని ఇందులో అంటున్నారు.

**99. తొట్ట పడై యెట్టుమ్ తోలాద వెన్ఱియాన్**
**అట్టపుయకరత్తా నన్నాన్ఱు- కుట్టత్తు**
**క్కోళ్ముదలై తుఞ్జ క్కుఱిత్తెఱిన్ద శక్కరత్తాన్**
**తాళ్ ముదలే నఙ్గట్కు చ్చార్వు**

తొట్ట = పట్టి ఎత్తిన, పడై ఎట్టుమ్ = ఎనిమిది దివ్యాయుధాలను, తోలాద= అపజయం లేకుండా, వెన్ఱియాన్ = జయాన్నే సదా కలవాడు, అట్ట పుయకరత్తాన్= కాంచీనగరంలోని **'అట్టపుయకరమ్'**అనే దివ్యదేశంలో వేంచేసి ఉన్నవాడు, అన్నాన్ఱు= పూర్వం ఒకానొక సమయంలో, కుఱిత్తు = నీటి మడుగులో, కోళ్ ముదలై తుఞ్జ = బలాన్ని కల మొసలి నశించేటట్లుగా, కురిత్తు ఎఱిన్ద శక్కరత్తాన్= గుఱి తప్పకుండా విసరిన శ్రీసుదర్శనచక్రాన్ని కల పరమప్రాప్యుడైన స్వామి, తాళ్ ముదలే = శ్రీచరణమూలమే, నఙ్గట్కు = అనన్యభోగ్యత్వాన్ని స్వరూపంగా కల మనకు, శార్వు= ఆశ్రయణీయం.

**"తాళ్ ముదలే"** అనే పదంలోని ఏకారం ఉపాయాంతర - ఉపేయాంతర నైరపేక్ష్యాన్ని సూచిస్తుంది. ఏకారం ద్వారా భగవానుడొక్కడే నిరుపాధిక ప్రాప్యుడని, మిగిలినవారు అంతా అతని సంబంధాన్నిబట్టే ప్రాప్యులవుతున్నారని, బిడ్డ తల్లి స్తన్యంలో నోరు పెట్టినట్లు, శేషిపట్ల శేషభూతుడు ఆశ్రయించే రేవు శ్రీచరణాలే అని తెలుపబడింది. ఈ అర్థాన్నే **"శార్వే తవ నెఱిక్కు త్తామోతరన్ తాళ్కళ్"** అని నమ్మాఴ్వార్లు తిరువాయ్మొఴిలో **(10-4-1)** తెలిపారు. ఏతావతా- ఈ పాశురం ద్వారా చక్రధారి అయిన స్వామియొక్క పాదమూలమే మనకు ప్రాప్యంగా, ప్రాపకంగా ఆశ్రయణీయం - అనే సకలశాస్త్ర సిద్ధాంతసారం ప్రతిపాదింపబడింది.



అవ :- గత పాశురంలో ఆశ్రయణీయుడుగా చెప్పబడ్డ భగవానుని ఆశ్రయించే లక్ష్మీదేవే మనకు సదా ఆశ్రయణీయురాలు - అని అనుగ్రహించి, ఈ దివ్యప్రబంధాన్ని ఈపాశురంతో నిగమిస్తున్నారు.

**100. శార్వునమక్కెన్ఱుమ్ శక్కరత్తాన్ తణ్డుఴాయ్**
**త్తార్ వాఴ్ వరైమార్బన్ తాన్ ముయఙ్గుమ్- కారార్న్ద**
**వానమరు మిన్నిమైక్కుమ్ వణ్డామరై నెడుఙ్గణ్**
**తేనమరుమ్ పూమేల్ తిరు**

శక్కరత్తాన్ = శ్రీసుదర్శనాన్ని శ్రీకరంలో కల్గినవాడు, తణ్ తుఴాయ్ తార్ వాఴ్ = చల్లని తులసీమాల వెలిగే, వరై మార్బన్ తాన్ = పర్వతంవంటి దృఢమైన వక్షస్సును కలవాడైన అయిన భగవానునిచే, ముయఙ్గుమ్ = సంశ్లేషింప బడినదై, కార్ ఆర్న్ద వాన్ = మేఘాలు నిబిడంగా (దట్టంగా) ఉండే ఆకాశంలో, అమరుమ్ = స్థిరంగా నిలచి ఉండే, మిన్ = మెఱుపువలె, ఇమైక్కుమ్= మెఱిసేది, వణ్ తామరై = అందమైన తామరపూవువంటి, నెడు = పెద్ద, కణ్ = తిరునేత్రాలను కల్గినదై, తేన్ అమరుమ్ పూ మేల్ తిరు = తేనె నిండిన తామరపూవులో నివసించే లక్ష్మీదేవి, నమక్కు ఎన్ఱుమ్ శార్వు = మనకు సదా ఆశ్రయణీయురాలు.

మనలను చల్లగా కటాక్షించి, కరుణతో సంస్కరించేది లక్ష్మీదేవి - అనే అర్థాన్ని ఇందులో తెలిపారు. **"వణ్"** అనే పదం **"ఉదారామ్"** అనే శ్రీసూక్త ప్రయోగార్థాన్ని తెలుపుతున్నది. తేనె నిండిన తామరపూవుపై ఆ తామరపూవులోని సౌగంధ్యం, వర్ణం, అందులో ఉండే తేనెలోని భోగ్యత - అన్నీ రూపొందినట్లుండే వేంచేసి ఉండే లక్ష్మీదేవి మనకు ఆశ్రయణీయ- అని భావం. దీనివల్ల తన అందంతో, భోగ్యంతో సర్వేశ్వరుని మనస్సు మార్చి, మనలను అతనితో కలుపుతున్నది - అని కూడా అర్థతః తెలుపబడింది. కరుణాసముద్రుడైన సర్వేశ్వరునిపట్లకూడా తీరని అపరాధాన్ని చేసి, సముద్రం కుతకుత లాడేటట్లుగా, అతనికి కోపాన్ని తెప్పించే పలు పాపాలను చేసే మనకు ఆపద కల్గినపుడు, లేనపుడు-అనే తేడా లేకుండా సర్వదా లక్ష్మీదేవి ఆశ్రయణీయురాలు. **"అవన్ ఉపాయమా మిడత్తిల్ తాన్ పురుషకారభూతై యాయిరుక్కుమ్; అవన్ ప్రాప్య**

నామిడత్తిల్ తాన్ ప్రాప్యైయాయ్, కైంకర్యవర్ధకైయాయిరుక్కుమ్” అనే ముముక్షుప్పడి సూత్రం. (166) దానికి శ్రీవరవరమునులు అనుగ్రహించిన వ్యాఖ్యానం ఇక్కడ అనుసంధేయాలు. ఈవిధంగా **“తిరుక్కణ్డేన్”** అని లక్ష్మీకటాక్షంతో ప్రబంధాన్ని ఆరంభించినందువల్ల తదనుగుణంగా **“తిరు నమక్కు ఎన్ఱుమ్ శార్వు”** అని లక్ష్మీదేవే మనకు సదా ఆశ్రయణీయ- అని నిర్ణయించి ప్రబంధాన్ని ఆఴ్వార్లు పూర్తిచేశారు. ఈ మూడు ప్రబంధాలకు శ్రీపెరియవాచ్చాన్పిళ్ళై వ్యాఖ్యానం, అప్పిళ్ళై టీక ఉన్నవి. ఈరెండిటిని ఆధారంగా చేసికొని శ్రీసుదర్శన తమిళమాస పత్రికాధిపతి ఉవే శ్రీమాన్ ఎస్.కృష్ణస్వామి అయ్యంగార్ స్వామివారు ద్రావిడంలో రచించిన వివరణాన్ని కృతజ్ఞతాపూర్వకంగా అనుసరిస్తూ ఈ భావప్రకాశికా టీక వ్రాయబడింది.

**పేయాఴ్వార్ తిరువడికళే శరణమ్**

**మూన్ఱామ్ తిరువన్దాది భావప్రకాశికా వివరణం సంపూర్ణం**





# పాశుర సూచిక

| పాశురం | అన్దాది | పా.సంఖ్య |
|---|---|---|
| అజ్గిఴ్కు | 3 | 65 |
| అడి మూన్ఱిల్ | 2 | 5 |
| అడియాల్ మున్ | 2 | 92 |
| అడియుమ్ | 1 | 17 |
| అడి వణ్ణమ్ | 3 | 5 |
| అడుత్త | 1 | 80 |
| అడైన్దతరవణైమేల్ | 3 | 25 |
| అడైన్ద వరు వినైయోడు | 1 | 59 |
| అత్తియూరాన్ | 2 | 96 |
| అతు నన్ఱితు | 3 | 88 |
| అన్ఱతు | 2 | 9 |
| అన్బాఴియానై | 1 | 72 |
| అన్ఱివ్వులకమ్ | 3 | 34 |
| అన్బే తకళియా | 2 | 1 |
| అముతెన్ఱుమ్ | 2 | 85 |
| అయ నిన్ఱ | 1 | 57 |
| అరణామ్ | 3 | 75 |
| అరన్ నారణన్ | 1 | 5 |
| అరవ మడల్ | 1 | 54 |
| అరియ పులన్ | 1 | 50 |
| అరియ తెళితాకుమ్ | 2 | 22 |
| అరుళ్ పురిన్ద | 2 | 59 |
| అరుళాతొఴియుమే | 3 | 19 |
| అలరెడుత్త | 3 | 97 |
| అవనే యరవరైయాల్ | 3 | 51 |
| అవన్ కణ్డాయ్ | 2 | 24 |
| అవన్ తమర్ | 1 | 55 |
| అవరవర్ తామ్ తామ్ | 1 | 14 |
| అవరివరెన్ఱిల్లై యరవణై | 2 | 12 |
| అవఴ్కుడిమై | 3 | 37 |
| అఴకన్ఱే | 3 | 9 |
| అఴైప్పన్ తిరుమాలై | 2 | 50 |
| అటిన్దైన్దుమ్ | 1 | 6 |
| అటియుమ్ | 1 | 22 |
| అటివెన్నుమ్ | 3 | 12 |
| ఆజ్గు మలరుమ్ | 3 | 67 |
| ఆమే యమరర్క్కు | 1 | 45 |
| ఆయ్న్ద వరుమఱైయోన్ | 3 | 77 |
| ఆయ్న్దురైప్పన్ | 2 | 73 |
| ఆరే తుయర్ | 3 | 27 |
| ఆళమర్ వెన్ఱి | 1 | 81 |
| ఆటియ వన్బిల్ | 1 | 35 |
| ఇశైన్ద వరముమ్ | 3 | 64 |
| ఇడఙ్గై వలమ్బురి | 2 | 71 |
| ఇడన్దతు పూమి | 1 | 39 |
| ఇడమ్ వలమేఴ్ | 3 | 73 |
| ఇడరార్ పడువార్ | 1 | 78 |
| ఇతు కణ్డాయ్ | 2 | 66 |
| ఇన్ఱానటికిన్ఱే నల్లేన్ | 2 | 87 |
| ఇనితెన్బర్ | 2 | 35 |
| ఇని యవన్ | 3 | 83 |
| ఇని యార్ | 1 | 87 |
| ఇన్ఱే కఴల్ కణ్డేన్ | 3 | 2 |
| ఇమమ్ శూఴ్ | 3 | 98 |
| ఇమైయాత | 1 | 32 |
| ఇయల్వాక | 1 | 13 |
| ఇరున్దణ్ కమలత్తు | 2 | 37 |
| ఇవై యవన్ | 3 | 31 |